# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
VEEKSHANAM, TELUGU MONTHLY
సంపుటి : 14 సంచిక : 7 హైదరాబాద్ 180 జులై 2016 పేజీలు : 68 రు. 20

- కేంద్రంలో, రాష్ట్రాల్లో రెండేళ్ల పాలన
- మల్లన్నసాగర్‌లో మునిగేదెవరు?
- సిద్దేశ్వరం కోసం రైతుల ఆందోళన
- తెలంగాణ జిల్లాల పునర్వ్యవస్థీకరణ
- సర్కారీ స్కూళ్ల మూసివేత - హేతుబద్ధత
- మాలేగావ్ - బలిపశువులుగా ముస్లింలు
- సామ్రాజ్యవాదంపై లెనిన్ రచనకు వందేళ్లు

# ఆర్‌ఎస్ రావు స్మారకోపన్యాసం - 2016



'వ్యవసాయ సమస్యపై మరోచూపు -
భారత వ్యవసాయ మార్పుల రాజకీయార్థశాస్త్రం'

వక్త: ప్రొ. డి. నరసింహారెడ్డి

17 జూన్, 2016,
దొడ్డి కొమురయ్య హోల్,
హైదరాబాద్

ఆర్.ఎన్. రావు మిత్రులు





ప్రొ. డి. నరిసింహారెడ్డ



ప్రొ. వి.ఎస్. ప్రసాద్



డా. ముదునూరి భారతి



180 ISSN 2231-6892

# వీక్షణం
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

జూలై 2016
సంపుటి : 14
సంచిక : 7

ఎడిటోరియల్ కలెక్టివ్ : బి.ఎస్. రాజు, ఎ. నర్సింహారెడ్డి, బి. రామకృష్ణ, వై. భాస్కర్, కె. బాల్‌రెడ్డి, ఎ. రాజేంద్రబాబు, బైరెడ్డి సతీష్, వై. రామచంద్రం, ఎన్. వేణుగోపాల్

| వ్యవస్థాపక సంపాదకులు: | సంపాదకులు: | సహాయ సంపాదకులు: | కంపోజింగ్: | సర్క్యులేషన్ మేనేజర్: |
|---|---|---|---|---|
| వి. హనుమంతరావు | ఎన్. వేణుగోపాల్ | వై. రామచంద్రం | సి. రాజశేఖర్ | ఎస్. వెంకటేష్ |

❖ పాఠకుల వీక్షణం 4
❖ సంపాదకీయం ◆ ఇటు హిందూ మతోన్మాదం, అటు విదేశీ దాస్యం 5
❖ సంపాదకీయ వ్యాఖ్యలు ◆ 'స్వయం పాలన' తెలంగాణ ప్రజలదా? కాంట్రాక్టర్లదా? ◆ సామాజిక సమస్యా? శాంతి భద్రతల సమస్యా? 6
◆ ప్రపంచానికి అమెరికా సేవలు వెలకట్టలేనివా!? 7
❖ కొత్త పుస్తకాలు / సి.డి.లు 8
❖ వర్తమాన చరిత్ర–రాజకీయార్థిక దృష్టి – కాంట్రాక్టర్ల చేత, కాంట్రాక్టర్ల కొరకు, కాంట్రాక్టర్ల వలన! 9
❖ ప్రాంతీయం – రెండేళ్ల 'స్వ'పరిపాలనలో తెలంగాణ – జి. వెంకటేశ్వర్లు 11
❖ " – చంద్రబాబునాయుడు రెండేళ్ల పాలన – బెజవాడ కృష్ణ 15
❖ దేశీయం – మోడీ రెండేళ్ల పాలన – ఎ. నర్సింహా రెడ్డి 17
❖ " – అంతరాలు పెరిగితే అంతే సంగతులు – వి. హనుమంతరావు 21
❖ ప్రాంతీయం – సాదాబైనామాల మంచీ చెడూ – డా. పల్లా త్రినాధ రావు 22
❖ " – మల్లన్నసాగర్‌లో మునిగేదెవరు? – బి. రామకృష్ణ 24
❖ " – అసహనానికి కూడా హద్దుండాలి! – పిట్టల రవిందర్ 26
❖ " – జిల్లాల పునర్వ్యవస్థీకరణ – బైరెడ్డి సతీష్ 28
❖ " – ఆదివాసి స్వయం పాలిత జిల్లాల ఆవశ్యకత – వాసం ఆనంద్ కుమార్ 30
❖ " – విద్రోహంపై ఎక్కుపెట్టిన సిద్ధేశ్వరం అలుగు – కె. నాగేశ్వరాచారి 32
❖ " – సిద్ధేశ్వరం అలుగు రాయలసీమ రైతుల హక్కు – కె. సుభాషిణి 33
❖ " – హేతుబద్ధీకరణలో హేతుబద్ధత ఎక్కడ? – వికసిత 37
❖ " – సర్కారీ స్కూళ్ల మూసివేత – ఎం.కె. కుమార్ 39
❖ దేశీయం – తేలిపోతున్న గుజరాత్ మారణకాండ కేసులు – షేక్ కరీముల్లా 41
❖ " – మాలేగావ్ – బలిపశువులుగా ముస్లింలు – ఏంపెల్లి భాస్కర్ 43
❖ " – విప్లవోద్యమాన్ని అణచడానికి మిషన్ 2016 – సంజయ్ కశ్యప్ 45
❖ ప్రాంతీయం – ఒక ప్రేక్షకుడి మదిలోని కొన్ని ప్రశ్నలు – కె. సురేష్ 49
❖ దేశీయం – తాత్విక ఆయుధాలు అత్యవసరం – డా. కత్తి పద్మారావు 52
❖ అంతర్జాతీయం – ఉగ్రవాదంలో కొత్తకోణం – రాజేంద్రబాబు అర్విణి 55
❖ చరిత్ర – సామ్రాజ్యవాదంపై లెనిన్ రచనకు వందేళ్లు – పి. ప్రసాదు 57
❖ ఈనెల – వై. రామచంద్రం, విక్రమ్ సుందర్ 63
❖ ఇరుగు–పొరుగు – వై. రామచంద్రం 64
❖ భూగోళం – సి. రాజశేఖర్ 65
❖ అసహజ మరణాలు – ఎస్. వెంకటేష్ 66

'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం VEEKSHANAM
మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ద్వారా డబ్బులు పంపేవారు మాత్రమే బ్యాంక్ స్లిప్‌లపై 'VEEKSHANAM' అని రాసి వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి.
ఇతర బ్యాంకులలో వేసేవారు ANDB 000/0139 నెంబర్ రాసి వేయవచ్చు.



**పి. మధు** *(జననం 3-8-1971 మరణం 3-5-2015)* **స్మృతిలో... పి. మద్దులేటి రెడ్డి (రిటైర్డ్ టీచర్, నంద్యాల, కర్నూల్) వీక్షణంకు రు. 5,000 విరాళంగా అందించారు.**

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2016 జూన్ నెలలో వచ్చిన విరాళాలు - సతీష్ బైరెడ్డి, నల్గొండ - రు. 5,000; సుధాకర్ శర్మ, హైదరాబాద్ - రు. 1,000; శ్రేయోభిలాషులు, హైదరాబాద్ - రు. 13,000. మిత్రులకు కృతజ్ఞతలు- సం.**

తెలుగు జాతికి వీక్షణం మాసపత్రిక ఒక కరదీపిక. కేవలం రాజకీయార్థిక, సామాజిక కోణాలకే పరిమితం కాకుండా అంతర్జాతీయ అంశాలెన్నిటినో వీక్షణం అందించి అత్యంత ఆదరణ పొందుతుంది. భారత స్వాతంత్ర్య పోరాట సమరం నుంచి నేటి వరకు ఎన్నో పత్రికలు వచ్చాయి. ఎన్నో కాలగర్భంలో కలసిపోయాయి. ఈ సమకాలీన పత్రికల్లో తెలుగు జాతిలో చైతన్యజ్వాల రగిలించిన పత్రికగా వీక్షణం గుర్తింపు పొందింది. ప్రధానంగా ఆంధ్రప్రదేశ్ విభజన సమయంలో వీక్షణం అత్యంత విలువైన నిజాయితీతో కూడిన వ్యాసాలు అందించింది. విభజన తర్వాత అవశేషాంధ్ర, రాయలసీమ ప్రాంతాలపై కొద్దోగొప్పో వ్యాసాలు వచ్చినప్పటికీ, విభజనలో నష్టపోయిన అనేక అంశాలను ఇంకా వెలుగులోకి తీసుకురావాల్సిన బాధ్యత వీక్షణంపై ఉంది. విద్య, ఉద్యోగ, ఉపాధి, ఆర్థిక, వైద్య, ఆరోగ్య మౌలిక, పారిశ్రామిక, సామాజిక రంగాల్లో వెనుకబడిన ఉత్తరాంధ్ర, రాయలసీమ ప్రాంతాల ప్రజానీకం హక్కుల్ని వినిపించే వేదికగా తగిన పాత్ర పోషించాలి. ఇప్పటికీ ఉత్తరాంధ్రను వివిధ రూపాల్లో దోచుకుంటున్న కోస్తా జిల్లాలకు చెందిన పెట్టుబడిదారీ వర్గాలు కొనసాగిస్తున్న దాష్టీకాలను వెలుగులోకి తీసుకొచ్చే వ్యాసాలు రావాల్సి ఉంది. కేవలం ఆదివాసుల సమస్యలేకాక మైదాన ప్రాంతాల్లోని సామాన్య, మధ్యతరగతి ప్రజానీక గళాన్ని విన్పించే విధంగా వీక్షణం బాధ్యత తీసుకోవాలి.

**- *తలగాపు వెంకటరమణ*, కన్వీనర్,**
ఉత్తరాంధ్ర పారిశ్రామిక ప్రగతి సాధన సమితి

వీక్షణం ఏప్రిల్ సంచికలో భీమా కొరేగావ్ స్మారక స్థూపం సంబంధించి రాసిన వ్యాసం చాలా వివరణాత్మకంగా ఉంది. ఆ చరిత్రకు సంబంధించిన పలు విషయాలు స్పష్టంగా అర్థం అయ్యేలా ఉన్నాయి. బ్రిటిష్ వారు పీష్వాలతో జరిపిన చివరి యుద్ధాల్లో ముఖ్యమైన, నిర్ణయాత్మక యుద్ధంగా పేరెన్నికగన్న భీమా కొరేగావ్ యుద్ధం తర్వాత పీష్వాలు ఓడిపోయి, బ్రిటిష్ వాళ్ల పాలన స్థిరపడింది. యుద్ధంలో బ్రిటిష్ వాళ్ల తరపున పోరాడిన సైన్యంలో ప్రధానంగా మహర్‌లు పాల్గొన్నారు. చనిపోయిన సైనికుల స్మారకంగా స్థూపం నిర్మించగా, ప్రతి సంవత్సరం జనవరి 1న సైన్యాధికారులు, సైన్యం - ముఖ్యంగా మహర్ రెజిమెంటుకి చెందిన వాళ్లు సమావేశమై అభివాదం తెలిపే ఆనవాయితీ ఉంది. అంబేద్కర్ స్వయంగా మొదటి సారి 1928లో స్థూపాన్ని సందర్శించడం జరిగింది. అప్పటికి మొదటి ప్రపంచ యుద్ధం ముగిసి పదేళ్లు గడిచింది. మొదటి ప్రపంచ యుద్ధం ముగియగానే మహర్ తదితర అంటరాని కులాల వాళ్లను సైన్యంలో చేర్చుకోవడం ఆపుచేశారు. దీనిని నిరసిస్తూ, యథావిధిగా సైన్యం, పోలీసు తదితర రక్షణ రంగాల్లో చేర్చుకొమ్మని విజ్ఞప్తి చేస్తూ, ఆందోళన చేపట్టడంలో భాగంగానే అంబేద్కర్ పీష్వాలపై గెలుపులో మహర్ సైనికుల పాత్రను శ్లాఘిస్తూ దానికి కృతజ్ఞతగా వ్యవహరించమని బ్రిటిష్ పాలకులను కోరారు. ఈ చారిత్రక నేపథ్యాన్ని కృష్ణ ఆదిత్య సరిగ్గానే వివరించారు.

ఆ కాలంలో భూస్వామ్య, బ్రాహ్మణీయ కులవ్యవస్థ పీడన, దోపిడీకి గురవుతున్న ప్రజానీకం, ముఖ్యంగా అంటరానికులాల ప్రజల నుండి ప్రభుత్వ ఉద్యోగాల్లో - పోలీసు, సైన్యం - నియామకం అనేది ఆర్థిక పరిస్థితి స్థిరత్వానికి, సామాజిక హోదా పెరడగానికి ఉపయోగపడిందనేది ఒక చారిత్రక వాస్తవం. అది నేటికీ వర్తిస్తుంది. అందుకే రిజర్వేషన్‌ల పరిరక్షణ తదితర అంశాలపై పోరాడడం సమాజ మార్పుకి కృషి చేసే ప్రజాస్వామిక, విప్లవ శక్తులందరి బాధ్యత. అంబేద్కర్ కూడా ఆ సందర్భాన్ని ఆర్థిక విద్యా రంగంలో ఉన్నతికై ఉపయోగపడుతుందనే దృష్టితోనే బ్రిటిష్ సైన్యంలో మహర్ భాగస్వామ్యంపై విశ్లేషించారు. మహర్ తదితర అస్పృశ్య కులాల వారు సైన్యంలో పనిచేయడమనేది మహారాష్ట్రలో - దేశంలోని ఇతర ప్రాంతాల్లో కూడా దాదాపు ఇదే పరిస్థితి ఉండి ఉంటుంది - మొఘలుల పాలనలోనూ, శివాజీ మరాఠాల, పీష్వాల పాలనలోనూ అమలులో ఉన్నది. బ్రిటిష్ వాళ్లు ఇదే పరంపరను మరింత పకడ్బందీగా అమలు చేశారు. తర్వాత కాలంలో తమ సైన్యాన్ని వివిధ ప్రాంతాల, సమూహాల పేర్లతో ఏర్పాటు చేశారు. సిర్ రెజిమెంటు, రాజ్‌పుత్, మద్రాస్, మరాఠా, మహర్ తదితర రెజిమెంట్లుగా వ్యవహరించడం జరిగింది. అదే పరిస్థితి ఇప్పటికీ కొనసాగుతుంది. 'స్వాతంత్ర్యం' తర్వాత కూడా విభజించు, పాలించు అనే బ్రిటిష్ పాలనా విధానాన్ని ప్రస్తుత అన్ని పార్టీల ప్రభుత్వాలు అక్షరాలా పాటిస్తున్నాయి.

అయితే ఏ యుద్ధమైనా పాలకుల ఇష్ట ప్రకారం, అవసరం రీత్యా మాత్రమే నిర్వహింపబడుతుంది తప్ప పాల్గొనే సైనిక సమూహాల భావాలకు ఎలాంటి విలువ ఉండదు. ఈ వాస్తవ దృష్టితో చూసినపుడు భీమా కొరేగావ్ యుద్ధానికి, అందులో పాల్గొని చనిపోయిన సైనికుల్ని అమరులుగా కీర్తించడం అనే అంశం, కేవలం బ్రిటిష్ పాలకులకు సంబంధించినదే అయినప్పటికీ, అంబేద్కర్‌తో సహా దళిత ప్రజానీకం ఆ సైనికుల శౌర్యాన్ని కొనియాడుతూ, దాన్ని పీష్వాల అమానుష, బ్రాహ్మణీయ పాలనతో పోల్చడం అంటే, చారిత్రక సంఘటనలను తమకు అనుకూలమైన మేరకు ముక్కలు, ముక్కలుగా, ఏరుకుని అన్వయించుకుని తమ తక్షణ, సమకాలీన లక్ష్యాలను సాధించడానికి ఉపయోగించుకోవడమనే పరిమిత అవకాశవాద దృష్టే తప్ప మరేమి కాదని అనడానికి సందేహం అక్కరలేదు. ఈ మధ్య గత మూడు నాలుగు సంవత్సరాలుగా 'లార్డ్ బుద్ధ' అనే టివి ఛానల్‌వారు మహారాష్ట్రలోని వివిధ జిల్లాలలో భీమా కొరేగావ్ అమరుల స్థూప నిర్మాణం పేరుతో దాని ప్రతికృతి నిర్మించి పెద్ద ఎత్తున సాంస్కృతిక, ఉపన్యాస కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. తాము సాధించిన హక్కుల రక్షణ కోసం సదా సన్నద్ధంగా ఉండవలసిన

*(మిగతా 61వ పేజీలో...)*

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ - సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ - డి. విజయభాస్కర్; ఖమ్మం - సి.ఎచ్. గిరిజ; మెదక్ - ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ - మహమ్మద్ ఇక్బాల్; నిజామాబాద్ - ఎం. నర్సయ్య; రంగారెడ్డి - వి. శంకరయ్య;
**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ - కె. నాగేశ్వరాచారి; చిత్తూరు - పలమనేరు బాలాజి; కడప - కొండ్రాయుడు; కర్నూలు - జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి - కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం - ఆర్. శ్రీలత; విశాఖపట్నం - పి.వి. రమణ
(ఈ సంచికలోని వరంగల్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్న వారు ఎస్. వెంకటేశ్)

# ఇటు హిందూ మతోన్మాదం, అటు విదేశీ దాస్యం



రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్ తన తొంభై సంవత్సరాల జీవితంలో సంపూర్ణంగా నిరంతరాయంగా అంటిపెట్టుకున్న విలువ ఒక ద్వంద్వ ప్రవృత్తి. ఒకవైపు సాంస్కృతిక జాతీయవాదం అనే తప్పుడు భావంతో తానే దేశీయ శక్తిననీ, మిగిలినవారందరూ విదేశీ మానసపుత్రులనీ ఇల్లెక్కి ప్రచారం చేస్తూ ఉండడం, మరొకవైపు వాస్తవికంగా ఆధిపత్య శక్తులకు, అవి విదేశీ శక్తులైనా సరే దాస్యం చేయడం ఆ ద్వంద్వ ప్రవృత్తిలో కీలక అంశం. తమది సాంస్కృతిక సంస్థ అని చెప్పుకోవడం ఒకవైపు, ముక్కుపచ్చలారని పసిపిల్లల దగ్గరి నుంచి యువజనుల దాకా ఆకర్షించి ప్రతిరోజూ సైనికక్రీడలలో, మారణాయుధాల వినియోగంలో శిక్షణ ఇవ్వడం మరొకవైపు ఈ ద్వంద్వ ప్రవృత్తిలో భాగం. ఆ ద్వంద్వ ప్రవృత్తి ప్రచారకుడిగా జీవితం ప్రారంభించి, మతోన్మాద హింసకు ఆజ్యంపోసి, వేలాది మంది ఊచకోతలకు కారకుడై ప్రధాని పదవి దాకా ఎదిగిన నరేంద్ర మోడీ ఆ ద్వంద్వ ప్రవృత్తికి మూర్తీభవ రూపం. దేశంలోనూ, అంతర్జాతీయంగానూ మోడీ ప్రభుత్వం, సంఘ్ పరివార్ భావజాలం ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ పాల్గొన్న నాలుగైదు ఘటనలు ఈ ద్వంద్వ ప్రవృత్తికి అద్దం పడుతున్నాయి. ఇస్లాం విదేశీ మతం అని, ఆ మతాన్ని అవలంబించేవారందరూ విదేశీయులని, కనుక వారికి ఈ దేశ పౌరులకు ఉండే హక్కులు ఉండవని బహిరంగంగానూ, ప్రచ్ఛన్నంగానూ ప్రచారం చేస్తూ ముస్లింల పట్ల సమాజంలో ద్వేషం నింపడం ఒకవైపు, అమెరికాకు జీహుజూర్ జోహుకుం అంటూ దేశ స్వావలంబనను, సార్వభౌమాధికారాన్ని, స్వయంసమృద్ధి ఆకాంక్షలను భగ్నం చేసే విధానాలు చేపట్టడం మరొకవైపు ఏకకాలంలో సాగిస్తున్నారంటే ఈ పాలకుల వంచనాశక్తి ఎంత విస్తారమైనదో తెలుస్తుంది.

పాలకుల దుర్మార్గాన్ని, ద్వంద్వ ప్రవృత్తిని ఎత్తిచూపే ఇటీవలి ఘటనల్లో చెప్పుకోదగినవి మాలేగావ్ పేలుళ్ల కేసులో, గుల్బర్ హత్యాకాండ కేసులో ప్రభుత్వం, న్యాయస్థానాలు అనుసరించిన వైఖరి, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులపై అనేక వ్యాపార రంగాల్లో ఉండిన ఆంక్షలను ఎత్తివేస్తూ, తామే ఇదివరకు ప్రతిపక్షంగా వ్యతిరేకించిన విధానాలనే అమలు లోకి తేవడం, అమెరికా బంటుగా అణుపదార్థాల సరఫరాదారుల కూటమిలో చేరడానికి ఉవ్విళ్లూరడం. ఈ వైఖరులలో ప్రతి ఒక్కటీ భారత సమాజానికి హానికరమైనవి, దేశ ఐక్యతకు, మత సామరస్యానికి విచ్ఛిన్నకరమైనవి, భారత ఆర్థిక వ్యవస్థకు భంగకరమైనవి. ఒక్కమాటలో చెప్పాలంటే ఈ చర్యలతోనే చూసినా ఈ ప్రభుత్వాన్ని దేశీయ, లౌకిక, ప్రజా ప్రభుత్వమని అనడానికి వీలులేదు.

మహారాష్ట్ర లోని మాలేగావ్‌లో 2006 లో జరిగిన బాంబు పేలుళ్లలో 37 మంది మరణించారు. ఆ పేలుళ్ల వెనుక హిందూ తీవ్రవాద సంస్థలు ఉండవచ్చునని అనుమానాలు ఉన్నప్పటికీ రాష్ట్ర పోలీసుల ఆంటీ టెర్రరిజం స్క్వాడ్ (ఎటిఎస్) స్టూడెంట్ ఇస్లామిక్ మూవ్ మెంట్ ఆఫ్ ఇండియా కారణమని ప్రకటించి తొమ్మిది మందిని అరెస్టు చేసింది. ఆతర్వాత కేసు సిబిఐ చేతికి వెళ్లింది. ఈలోగా 2007లో అనుకోకుండా పోలీసుల చేతికి చిక్కిన అభినవ భారత్ కార్యకర్త స్వామి అసీమానంద్ విచారణలో హైదరాబాద్ మక్కామసీదు బాంబు పేలుళ్ల తో పాటు మాలేగావ్ పేలుళ్లు తమ పనే అని ఒప్పుకున్నాడు. ఆ తర్వాత 2011లో కేసును సిబిఐ నుంచి జాతీయ పరిశోధనా సంస్థ (ఎన్ఐఎ) కు అప్పగించారు. తర్వాత రెండు సంవత్సరాలకు ఈ కేసులో అప్పటికే ఎనిమిది సంవత్సరాలుగా జైలులో ఉన్న తొమ్మిది మంది ముస్లింల మీద నేరారోపణకు ఆధారాలు లేవని ఎన్ఐఎ ప్రకటించింది. ఈ నిర్ధారణ తర్వాత రెండు సంవత్సరాలకు ఆ తొమ్మిది మందిలో ఒకరు చనిపోగా, మిగిలిన ఎనిమిది మందిని విడుదల చేశారు. ఏ నేరమూ చేయకుండానే, కేవలం ఒక పోలీసు విభాగపు అనుమానం మీద, ముస్లింలైనందువల్ల మాత్రమే, వారందరూ పది సంవత్సరాలు జైలులో గడిపారు. మరొకపక్క ఈ మాలేగావ్‌లోనే 2008లో మరో పేలుళ్లు జరిగి ఏడుగురు చనిపోయారు. ఆ పేలుళ్ల విస్ఫోటక పదార్థాలున్న మోటర్ సైకిల్ సాధ్వి ప్రజ్ఞాసింగ్ అనే హిందూ తీవ్రవాద సంస్థ నాయకురాలిదని, అప్పటికి సైనికాధికారిగా పనిచేస్తుండిన కర్నల్ ప్రసాద్ పురోహిత్ హస్తం కూడ ఉన్నదని హేమంత్ కర్కారే అనే ఎటిఎస్ అధికారి తేల్చి వారిని అరెస్టు చేశాడు. ఈ కేసు కూడ ఎన్ఐఎకు చేరింది. నిందితుల గురించి తీవ్రమైన పరిశోధన జరపనక్కర్లేదని పైనుంచి ఆదేశాలు వచ్చాయని స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్ రోహిణి శాలియా ప్రకటించారు. చివరికి మే 14న సమర్పించిన చార్జిషీట్‌లో ఎన్ఐఎ ఈ అనుమానితుల మీద నేరారోపణలు ఉపసంహరించుకుంది. అంటే సాక్ష్యాధారాలు స్పష్టంగా దొరికినా హిందువులైతే విచారణే లేకుండా బైటపడవచ్చు.

అలాగే 2002 ఫిబ్రవరి 28న అహ్మదాబాదులో మాజీ పార్లమెంటు సభ్యుడు ఎహసాన్ జాఫ్రీ ఉంటున్న ఇంటి ప్రాంగణంపై దాడి చేసి 69 మందిని సజీవదహనం చేసిన, ఊచకోత కోసిన హిందూ కార్యకర్తల మీద పద్నాలుగు సంవత్సరాల విచారణ తర్వాత న్యాయస్థానం స్వల్పమైన శిక్షలతో సరిపెట్టింది. తమ మీద దుండగులు దాడి జరుపుతున్నప్పుడు జాఫ్రీ స్వయంగా ముఖ్యమంత్రి మోడీకి ఫిర్యాదు చేశాడనే దగ్గరి నుంచి ఈ నేరం తీగలాగితే డొంకంతా కదులుతుంది గాని న్యాయస్థానం ఆ తీగ లాగడానికే ప్రయత్నించలేదు. ఇది ఇవాళ ఆధిపత్యంలో ఉన్న సంఘ్ పరివార్ భావజాలపు ప్రభావం.

దేశప్రజల మధ్య ఇటువంటి చిచ్చు రగిలిస్తున్న సంఘ్ పరివార్ శక్తులు మరిన్ని మరిన్ని రంగాలలోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడిని అనుమతించడం, అణ్వాయుధ శక్తిగా ఎదగడానికి ఉవ్విళ్లూరడం ద్వారా తాము సామ్రాజ్యవాద దళారీలమని స్పష్టంగా చూపుకుంటున్నారు. ఇటు దేశంలో మతవిద్వేషాలకు ఆజ్యం పోయడం, అటు అంతర్జాతీయ ఇస్లామోఫోబియా రెచ్చగొడుతున్న అమెరికన్ పాలకవర్గాలతో అంటకాగడం మోడీ పాలనలో దేశాన్ని అంతర్యుద్ధంలోకీ, సామ్రాజ్యవాద యుద్ధాలలోకీ ఈడ్చుడానికి జరుగుతున్న ప్రయత్నం. ఈ ప్రమాదాన్ని గుర్తించి విశాల ప్రజారాశుల ఐక్యతను, చైతన్యపూర్వక ప్రతిఘటనను సంఘటితం చేయడం ఇవాళ ప్రజాస్వామిక శక్తుల కర్తవ్యం.

వీ

# 'స్వయం పాలన' తెలంగాణ ప్రజలదా? కాంట్రాక్టర్లదా?

పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఎంతగా తనను తాను ప్రాతినిధ్య పాలన అని చెప్పుకున్నప్పటికీ ప్రజలకు అర్థవంతమైన, నిజమైన ప్రాతినిధ్యం దొరుకుతుందా అని రాజనీతిశాస్త్రంలో చర్చ జరుగుతూనే ఉంది. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమంలో స్వయం పాలన అనే నినాదం పెద్ద ఎత్తునే వెలువడింది గాని ఆంధ్రప్రదేశ్ ను పాలించిన పాలకవర్గ ముఠా స్థానంలో తెలంగాణ నుంచి మరొక పాలకవర్గ ముఠాకే అధికారం దక్కుతుంది తప్ప నిజంగా తెలంగాణ ప్రజల స్వయం పాలన సాధ్యమవుతుందా అని ప్రశ్నలు కూడ వచ్చాయి. శాసనసభ్యులు ప్రజాప్రతినిధులుగా తమ బాధ్యత నెరవేర్చనప్పుడు, ప్రభుత్వ విధాన నిర్ణయాలు ప్రజా రంగంలో పారదర్శకంగా చర్చకు రానప్పుడు, స్వయం పాలన నిజం కావడానికి అవకాశం లేదు. అసలు ఇవాళ పాలనను, విధానాలను నిర్ణయిస్తున్నది స్వప్రయోజనశక్తులు. కాంట్రాక్టర్లు, రియల్ ఎస్టేట్ వ్యాపారులు, ఫైనాన్స్ వ్యాపారులు, విద్యా వ్యాపారులు, వైద్య వ్యాపారులు వాళ్ల ప్రయోజనాలకు తగినట్టుగా ప్రభుత్వ నాయకులతో, అధికారులతో విధానాలు రూపొందించి అమలు చేయిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ లో ఈ స్వార్థప్రయోజనాల పాలన సాగడం మొదలై దశాబ్దాలయింది. ఆ స్వప్రయోజన శక్తులలో అత్యధికులు కోస్తా, రాయలసీమలకు చెందినవాళ్లు గనుక తెలంగాణ ఉద్యమంలో స్వయంపాలన ఒక ఆకర్షక నినాదమయింది. కాని తెలంగాణ ఏర్పడి రెండు సంవత్సరాలు గడిచినా ఆ స్వప్రయోజనశక్తుల ప్రాబల్య6 ఎంతమాత్రం తగ్గలేదు. ఇవాళ్టికీ ఆ కాంట్రాక్టర్ల రాజ్యమే నడుస్తున్నది. కాకపోతే సబ్ కాంట్రాక్టర్లుగా, పాత స్వప్రయోజనశక్తులకు దళారీలుగా, సహాయకులుగా, సమర్థకులుగా కొందరు తెలంగాణకు చెందినవారు చేరి ఉండవచ్చు. తెలంగాణ ప్రజల ప్రయోజనాల ఊసు, తెలంగాణ ప్రజల స్వయం పాలన మాత్రం ఏర్పడలేదు. తెలంగాణ ప్రభుత్వం ప్రతిపాదిస్తున్న శ్రీ కొమరవెల్లి మల్లన్న సాగర్ ఈ పరిణామానికి ప్రబలమైన ఉదాహరణగా నిలుస్తుంది. ఆ ప్రాజెక్టు నిర్మాణం సాంకేతికంగా సాధ్యమైనదీ, ఉచితమైనదీ కాదు. అది జరిగే పని కాదు. జరిగినా దానివల్ల తెలంగాణ ప్రజలకు ఒరగబోయే మేలు లేదు. పైగా తెలంగాణలో పద్నాలుగు ఊళ్లు, ఇరవైవేల ఎకరాలు, వేలాది మంది ప్రజల జీవితాలు ముంచి రానున్న ప్రాజెక్టు అది. సరిగ్గా జలయజ్ఞం లాగ అది కేవలం కాంట్రాక్టర్ల కోసం తయారవుతున్న ప్రాజెక్టు. ఇంకా విచిత్రంగా ఆ కాంట్రాక్టర్లు కూడ ఇంత కాలం తెలంగాణవాదులు విమర్శించిన ఆంధ్ర కాంట్రాక్టర్లే. ఈ ప్రాజెక్టుతో పాటు అభివృద్ధి ప్రాజెక్టుల పేరు మీద రాష్ట్ర వ్యాప్తంగా కనీసం నాలుగైదు లక్షల ఎకరాలు ప్రజల నుంచి గుంజుకోవడానికి, ప్రజలను నిర్వాసితులను చేయడానికి పథకాలు సిద్ధమవుతున్నాయి. ఆ నిర్వాసిత ప్రజలకు పునరావాసం, పునఃస్థిరీకరణ బాధ్యత నుంచి కూడ తప్పించుకుంటున్న ప్రభుత్వం ముష్టి నష్టపరిహారం వారి ముఖాన కొట్టి, వారిని బిచ్చగాళ్లుగా మార్చి, కాంట్రాక్టర్లకు, పారిశ్రామికవేత్తలకు, వ్యాపారవేత్తలకు, బహుళ జాతి సంస్థలకు, దేశదేశాల సంపన్నులకు ఆ భూమి పందారం చేయదలచుకున్నది. తెలంగాణ ప్రజలు కోరుకున్న, ఉద్యమించిన స్వయంపాలన ఎక్కడ అమలవుతున్నట్టు? వీ



# సామాజిక సమస్యా? శాంతి భద్రతల సమస్యా?

కాపులకు విద్య, ఉద్యోగ అవకాశాలలో రిజర్వేషన్ కల్పించేలా వెనుకబడిన కులాల జాబితాలో చేర్చాలనే ఆందోళన క్రమక్రమంగా శాంతి భద్రతల చర్చగా, చట్టబద్ధ పాలన చర్చగా మారుతున్నది. తెలుగు దేశం పార్టీ 2014 ఎన్నికల ప్రణాళికలో వాగ్దానం చేసినట్టుగా కాపులకు వెనుకబడిన తరగతిగా గుర్తింపు ఇచ్చి ఉన్నా, లేదా కాపుల స్థితిని అధ్యయనం చేయడానికి ప్రయత్నాలు ప్రారంభించినా సమస్య ఇంత దూరం వచ్చి ఉండేది కాదు. కాపులు సామాజికవర్గంగానే వెనుకబడిన కులంగా గుర్తించవలసిన స్థితిలో ఉన్నారా, వారి సామాజిక, ఆర్థిక స్థితి ఏమిటి, గతంలో వారికి వెనుకబడిన కులంగా ఉన్న గుర్తింపు ఎందుకు, ఎలా రద్దయింది, మళ్లీ పునరుద్ధరించాలంటే ఏమి చేయవలసి ఉంటుంది అనే ప్రశ్నలకు వివరమైన అధ్యయనం, పరిశోధన, చర్చ, సంప్రదింపులు అవసరం కావచ్చు. కాని అంత గంభీరమైన సమస్యను, దానికి అవసరమైన ముందస్తు పరిశీలన ఏమీ చేయకుండానే ఎన్నికల వాగ్దానంగా ప్రకటించడం తెలుగు దేశం పార్టీ మొదటి తప్పు. ఆ వాగ్దానాన్ని రెండు సంవత్సరాలు గడిచినా నెరవేర్చకపోవడం మరొక తప్పు. ఇలా తన తప్పులకు మరొకరిని నిందించడం ఇంకొక తప్పు. అంటే ప్రస్తుత సమస్యలో అధికారపక్షంపైనే ఎక్కువ బాధ్యత ఉంది. కాని ఆ బాధ్యతను ప్రభుత్వం విస్మరించిన కారణంగానే కాపులలో అసంతృప్తి రగులుతూ వచ్చింది. ముద్రగడ పద్మనాభం అనే నాయకుడు, ఆయనకు అలవాటైన విచిత్ర ప్రవర్తన ఆ అసంతృప్తితో పోలిస్తే యాదృచ్ఛికమైనవే. కల్లోల జలాలలో చేపలు పట్టడం అని నుడికారం చెప్పినట్టు, మొదట అధికార పక్షం కల్లోల జలాలకు అవకాశం కల్పించింది గనుక అందులో చేపలు పట్టేవారు తప్పనిసరిగా తలెత్తుతారు. అయితే ఆందోళనకారులు కూడ ఒక పార్లమెంటరీ రాజకీయ పక్షానికి ప్రాతినిధ్యం వహిస్తున్నప్పుడు, తమ ఉద్యమాన్ని హింసా మార్గంలోకి తీసుకుపోవాలనే ఉద్దేశంతో లేనప్పుడు జనవరి 31 తుని హింసాకాండ వంటి వాటికి అవకాశం ఇచ్చి ఉండగూడదు. హింసాకాండ తర్వాత అధికారపక్షం దాన్ని శాంతి భద్రతల సమస్యగా మార్చడానికి అవకాశం దొరికింది. అసలు సామాజిక సమస్య పక్కకు పోయి, రైలు దహనం అనే నేరానికి బాధ్యులైనవారిని నిర్బంధంలోకి తీసుకోవాలా లేదా, చట్టబద్ధంగా విచారించాలా లేదా అనే చర్చ మొదలయింది. నిజానికి పార్లమెంటరీ రాజకీయ పక్షాలన్నీ హింసకు పాల్పడుతున్నవే. ప్రత్యర్థి రాజకీయ పక్షపు హింసను అత్యవసరమైతే తప్ప చూసీ చూడకుండా పోవడమే అధికారపక్షాలు అమలు చేస్తున్న నీతి. లేదా, ప్రతిపక్షపు హింసను మాత్రం ప్రత్యేకంగా పట్టించుకుని కక్ష సాధింపు ధోరణికి పాల్పడాలని అధికార పక్షం అనుకున్నా, ఆ ప్రతిపక్షం అధికారంలోకి రాగానే తమ కార్యకర్తల మీద ఉన్న పాత హింసల కేసులన్నీ ఉపసంహరించుకున్న చరిత్ర కూడ ఉంది. ప్రస్తుత సందర్భంలో మాత్రం తెలుగు దేశం కక్ష సాధించదలచింది. అరెస్టయిన వారిని విడుదల చేయకపోతే ఆత్మహత్య చేసుకుంటానని బెదిరించి, అరెస్టయి, ఆస్పత్రిలో దీక్షకు దిగి, వారిని విడుదల చేసిన తర్వాతనే దీక్ష ఉపసంహరించిన పద్మనాభం శాంతి భద్రతల నిర్వహణలో కొత్త సంప్రదాయానికి నాంది పలికారు. ఈ హక్కు రాజకీయ నాయకులకేనా, ప్రజలకు కూడా అనుమతిస్తారా తేలవలసి ఉంది. వీ

# ప్రపంచానికి అమెరికా సేవలు వెలకట్టలేనివా!?

**మో**డీ జూన్ 8న అమెరికా పార్లమెంట్ ఉభయ సభలనుద్దేశించి చేసిన ప్రసంగంలో ఆద్యంతం అమెరికా భజనే ప్రతిధ్వనించింది. అమెరికా ప్రజాస్వామ్యానికి దేవాలయమని, మానవాళికి అమెరికా సేవలు వెలకట్ట లేనివని పొగడడం చరిత్రకు వక్రభాష్యం చెప్పడమే. రెండో ప్రపంచ యుద్ధం నాటి నుంచి నేటి వరకు అమెరికా మానవాళికి సేవ చేసిందా? మానవాళి వినాశనానికి పలు యుద్ధాలు చేసిందా? దాని మేకవన్నె పులివేషం ప్రపంచ ప్రజలందరికీ బాగా తెలిసిందే. మోడీ ఇంతగా అమెరికా ముందు సాగిలపడడం మనదేశ ప్రయోజనాలకు, జాతి ఆత్మగౌరవానికి భంగకరం. ఈ పర్యటనలో కుదుర్చుకున్న ఒప్పందాలు వివాదస్పదమైనవీ, ప్రమాదకరమైనవీ. ఈ ఒప్పందాలు అమెరికా ఆయుధ కంపెనీల వ్యాపారానికి మనదేశాన్ని మార్కెట్‌గా మార్చడం మాత్రమే. న్యూక్లియర్ సప్లయర్స్ గ్రూప్ (ఎన్ఎస్‌జి) లో భారత సభ్యత్వం పొందడానికి అమెరికా తోడ్పడనుంది. అయితే ఎన్ఎస్‌జిలో 48 సభ్య దేశాలున్నాయి. అవన్నీ ఏకగ్రీవంగా అంగీకరిస్తేనే భారత్‌కు సభ్యత్వం లభిస్తుంది. ఈ వాస్తవాలను కప్పిపుచ్చి, ప్రజల్ని మాయ చేయడానికి కార్పొరేట్ మీడియా గోబెల్స్ ప్రచారానికి పూనుకుంది. చైనా, రష్యాల వ్యూహాత్మక మైత్రిని దెబ్బతీసేందుకు చైనాను లక్ష్యంగా చేసుకున్న అమెరికా ప్రపంచాధిపత్యానికి మోడీ వత్తాసుగా మారడం ఆసియాలో శాంతికి భంగకరం. ముంబైలో ఉగ్రదాడికి రూపకల్పన చేసిన డేవిడ్ హెడ్లీని అమెరికాలోనే అట్టి పెట్టకుండా భారతదేశానికి ఎందుకు అప్పగించలేదు? ప్రపంచ పెత్తనానికి నిత్యం ప్రయత్నించే అమెరికా మానవీయ కోణం ఏపాటిదో మోడీకి అర్థంకాలేదా? ఒకవేళ అర్థమైనప్పటికీ తన ఆశ్రిత వర్గ ప్రయోజనం కోసం అమెరికాను పొగిడారా? అలా చేయడమంటే కొరివితో తల గోక్కున్నట్లు కాదా?

రెండో ప్రపంచ యుద్ధం ముగిసిన వెంటనే హిరోషిమా, నాగసాకిలపై అణుబాంబులను ప్రయోగించి లక్షలాది మంది అమాయకుల ప్రాణాలను అమెరికా బలిగొన్నది. అమెరికాలో నేటికీ జాతివివక్ష, తుపాకి సంస్కృతి విరాజిల్లుతోంది. వియత్నాంపై యుద్ధానికి పూనుకుని, చావుదెబ్బ తిని వెనుతిరిగింది. 2003లో ఇరాక్ వద్ద రసాయనిక ఆయుధాలున్నాయని కుట్రపూరితంగా ఆ దేశంపై దాడి జరిపి దేశాధ్యక్షుడు సద్దాం హుస్సేన్‌ని హతమార్చింది. లక్షలాది మంది అమాయకులు ప్రాణాలు కోల్పోయారు. అనేక తృతీయ ప్రపంచ దేశాలలో తమకు లొంగని ప్రభుత్వాలను కూల్చి కీలుబొమ్మ ప్రభుత్వాలను ఏర్పాటు చేసిన చరిత్ర దాని సొంతం. ఇరాక్‌లో పదేళ్ల క్రితం రగిల్చిన చిచ్చు ఇంకా మండుతూనే ఉంది. ఆఫ్ఘనిస్థాన్‌లోనూ లక్షలాది మంది ప్రజలు ప్రాణాలు కోల్పోవడానికి అమెరికా కారణమైంది. తాజాగా సిరియాలో అంతర్యుద్ధానికి ఆజ్యం పోసింది. సిరియాలో లక్షలాది అమాయకులు ప్రాణాలు కోల్పోయారు. గతంలో ఇరాక్, ఇరాన్‌ల మధ్య యుద్ధం జరిగినప్పుడు రెండు దేశాలకూ ఆయుధాలు అమ్ముకుని సొమ్ము చేసుకుంది. అరవై సంవత్సరాలకు పైగా క్యూబాపైన ఆంక్షలు విధించి తీవ్ర ఇబ్బందులలోకి నెట్టింది. ఇరాన్, రష్యా దేశాలపైన కూడా ఆంక్షలు విధించింది. లాటిన్ అమెరికాలో ప్రజామద్దతుతో అధికారం చేపట్టిన నేతలను దించడానికి కుట్రలు పన్నింది. కొన్ని దేశాల నేతలను హత్య చేయించింది. చైనా దక్షిణ సముద్రం ప్రాంతంలో దక్షిణ కొరియాతో కలిసి సైనిక స్థావరాన్ని ఏర్పాటు చేసుకుని విన్యాసాలు నిర్వహిస్తోంది. తమ దేశాలలో నెలకొల్పిన అమెరికా సైనిక స్థావరాలను ఎత్తివేయాలని ప్రజలు ఆందోళన చేస్తున్నారు. అమెరికా ఒక యుద్ధ పిపాసి, ఆయుధ బేహారి.

**– ఎ. నరసింహారెడ్డి** వీ





❖ **బువ్వ కుండ** – దీర్ఘ కవిత – అన్నవరం దేవేందర్ సాహితీ సోపతి – 36 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: ఎదునూరి రాజేశ్వరి, ఫ్లాట్ నం. 406, మారుతి హెవెన్స్, భగత్‌నగర్, కరీంనగర్ – 505001; తెలంగాణ; అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో



❖ **చానళ్ల హోరు – భాష తీరు** – తెలుగు టీవీ జర్నలిజం తీరు తెన్నులు – 180 పేజీలు, 1/8 డెమీ, రు. 65, ప్రతులకు: నాగసూరి వేణుగోపాల్, 517, విల్లా హైట్స్, బ్రహ్మణవాడి, బేగంపేట, హైదరాబాద్ – 500 016; సెల్: 9440732392;



❖ **సమాచారం బాట – సంచలనాల వేట** – తెలుగు టీవీ జర్నలిజం తీరు తెన్నులు – 216 పేజీలు, 1/8 డెమీ, రు. 125, ప్రతులకు: ఎన్.కె. పబ్లికేషన్స్, 24-8-1, సమీర రెసిడెన్సీ, విజయనగరం – 535 001; సెల్: 9440343479



❖ **అరుణ కిరణాలు** – ప్రజల పాటలు – అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య ప్రచురణ – 190 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు: పోరండ్ల శ్రీనివాస్, రామనర్సయ్య భవన్, క్రీస్తు రాజపురం, విజయవాడ-8; సెల్: 8106073661; అన్ని పుస్తక కేంద్రాలలో



❖ **సిగ్గుపడుతున్న స్వర్గం** – పికినిక్ ముచ్చట్లు – రాస భూమయ్య – స్వేచ్ఛ-సాహిత్య, సామాజిక సేవా సంస్థ ప్రచురణ – 82 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు: రాస భూమయ్య, గ్రా. యెఖీన్‌పూర్, మం. కోరుట్ల, కరీంనగర్ జిల్లా – 505 462; సెల్: 9440244962, 7382851046



❖ **మోడీ రెండేళ్ల పాలన వైఫల్యాల పుట్ట** – తెలంగాణ ప్రజా ఫ్రంట్ ప్రచురణ – 56 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు: ఎచ్ఐజి బ్లాక్-4, ఫ్లాట్ నం. 6, బాగ్ లింగంపల్లి, హైదరాబాద్-20; సెల్: 9849996300



❖ **కెసిఆర్ ప్రభుత్వ నిరంకుశ విధానాలు** – వాయిస్ ఆఫ్ న్యూ డెమోక్రసీ – 44, పేజీలు, 1/8 డెమీ, రు. 20



❖ **కార్పొరేట్ల సేవలో మోడీ సర్కారు** – వాయిస్ ఆఫ్ న్యూ డెమోక్రసీ – 80, పేజీలు, 1/8 డెమీ, రు. 30

పై రెండు పుస్తక ప్రతులకు: వాయిస్ ఆఫ్ న్యూ డెమోక్రసీ, మార్క్స్ భవన్, 658, విద్యానగర్, 7వ లైన్, హైదరాబాద్ – 500044; నవ తెలంగాణ బుక్‌హౌస్; నవోదయ బుక్‌హౌస్; విశాలాంధ్ర బుక్‌హౌస్



❖ **గ్రీన్‌హంట్ ఆపరేషన్** (ప్రజలపై యుద్ధం) – వికల్ప్ – శ్రామికవర్గ ప్రచురణ – 32 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు: వరవరరావు, ఫ్లాట్ నం. 419, హిమసాయి హైట్స్, స్ట్రీట్ నం. 6, జవహర్ నగర్, గాంధీనగర్, హైదరాబాద్ – 500020; అన్ని ప్రముఖ పుస్తక షాపులలో



❖ **జయమ్(?)** – 'మహాభారతమ్' మూల కథకు నవలా రూపం – నాయుని కృష్ణమూర్తి – విజయవాణి ప్రింటర్స్ – 425 పేజీలు, 1/8 డెమీ, రు. 250, ప్రతులకు: సాహితి ప్రచురణలు, 29-13-53, కాళేశ్వరరావు రోడ్, సూర్యారావుపేట, విజయవాడ-520002; ఫోన్: 0866 2436643; ఇమెయిల్: sahithi.vja@gmail.com



❖ **సూర్యోదయం కుట్రకాదు** (కుట్రకేసుల సమాచారం) – ఎడిటర్: చెరుకూరి సత్యనారాయణ – తరిమెల నాగిరెడ్డి మెమోరియల్ కమిటీ ప్రచురణ – 576 పేజీలు, 1/8 డెమీ, రు. 90, ప్రతులకు: మైత్రీ బుక్‌హౌస్, జలీల్ వీధి, కారల్‌మార్క్స్ రోడ్, విజయవాడ – 520002; సెల్: 9848631604



❖ **ప్రవక్త** – ఖలీల్ జిబ్రాన్ 'ది ప్రాఫెట్'కు తెలుగు అనువాదం – డా. ఎస్. జతిన్‌కుమార్ – 91 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: రంగవల్లి ప్రచురణలు, 405, గ్రీన్‌కోర్టు అపార్ట్‌మెంట్స్, రాఘవరెడ్డి గార్డెన్స్ ఎదురుగా, నిజాంపేట్ రోడ్, హైదరాబాద్ – 500085; ఫోన్: 9703841989, 040-23890842



❖ **జుమ్మేకి రాత్‌మే** – కథలు – పెద్దింటి అశోక్ కుమార్ – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 203 పేజీలు, 1/8 డెమీ, రు. 140



❖ **ద్రవాధునికత** – డా. పాపినేని శివశంకర్ – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 102 పేజీలు, 1/8 డెమీ, రు. 70



❖ **శ్రమకావ్యం** – డా. సుద్దాల అశోక్‌తేజ – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 170 పేజీలు, 1/8 డెమీ, రు. 125



❖ **కులవ్యవస్థ నిర్మాణం – వేదాలు** – సత్య బత్తుల – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 143 పేజీలు, 1/8 డెమీ, రు. 100

పై నాలుగు ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, బండ్లగూడ (నాగోల్) జిఎస్ఐ (పోస్ట్), హైదరాబాద్ – 068; ఫోన్: 24224453 / 54;

ఇమెయిల్: navachethanaph@gmail.com

# కాంట్రాక్టర్ల చేత, కాంట్రాక్టర్ల కొరకు, కాంట్రాక్టర్ల వలన!

**భూ**స్వాముల, రాజుల మధ్యయుగాలు అంతరించి, ప్రాతినిధ్య ప్రజాస్వామ్యపు ఆధునికయుగం ప్రవేశించిందని, అంతకు ముందరి 'రాజు చేత, రాజు కొరకు, రాజు వలన' నడిచే పాలన స్థానంలో 'ప్రజల చేత, ప్రజల కొరకు, ప్రజల వలన' జరిగే పాలన వచ్చిందని పాఠ్య పుస్తకాలు చెపుతాయి. ఈ అవగాహన స్థూలంగా యూరపియన్, అమెరికన్ ఆధునిక సమాజాలకు వర్తిస్తుందేమో గాని భారత సమాజానికి వర్తిస్తుందా అనుమానమే. ఇక్కడి సమాజం అసలు రాచరిక, భూస్వామ్య లక్షణాలు వదులుకున్నదా అని సందేహించడానికే ఎన్నో అవకాశాలున్నాయి. రాజులు లేరు గదా అని ప్రశ్నిస్తే మరి ప్రజల పాలన కూడ లేదు గదా అని ఎదురుప్రశ్న వేయవచ్చు. ప్రజాస్వామ్యం, ప్రాతినిధ్య పాలన అంటే ప్రజలు ఐదేళ్లకొకసారి పాలకులకు వోటువేసే ఐదు నిమిషాల ప్రక్రియ మాత్రమే అనే అర్థం చలామణీలో ఉంది. మిగిలిన ఐదు సంవత్సరాలూ ప్రజల పేరు మీద అభివృద్ధి పథకాలు, సంక్షేమ పథకాలు, వాగ్దానాలు, నిధులు, భారీ అంకెలు, వంది మాగధ స్తోత్రాలు సాగిపోతుంటాయి. ప్రజలతో ఎక్కడా సంబంధం లేదు, ప్రజల ప్రమేయం లేదు. అంటే రాజుల పాలనకూ ప్రజల పాలనకూ మధ్య దారిలో ఎక్కడో ఈ సమాజం ఆగిపోయింది.

ఈ మధ్యంతర స్థితిలో ఎవరి ప్రయోజనాల పరిరక్షణకు పాలన సాగుతున్నదో అర్థం చేసుకోవాలంటే ప్రజల శ్రమ ద్వారా, ప్రజలు చెల్లించిన పన్నుల ద్వారా రూపొందుతున్న సంపదను ఖర్చుపెట్టే అధికారం వచ్చిన ప్రభుత్వం ఆ సంపదను ఎక్కడ ఏ రూపాలలో ఖర్చు చేస్తున్నదో చూడాలి. సమాజపు మిగులు ఎవరి బొక్కసాలకు చేరుతున్నదో చూడాలి. ప్రభుత్వం వైపు నుంచి జరిగే పనులన్నీ ఇవాళ మధ్య దళారీల ద్వారానే జరుగుతున్నాయి. వాళ్లను కాంట్రాక్టర్లు లేదా గుత్తేదార్లు అంటారు. మారుమూల కుగ్రామంలో రోడ్డు వేసే పని నుంచి రాజధానిలో రాష్ట్రపతి భవనం మరమ్మత్తుల పని దాకా, ఊరి చెరువు తూము బాగు చేయించడం నుంచి లక్షలాది ఎకరాలకు నీరు పారే ప్రాజెక్టులు కట్టడమూ కాలువలు తవ్వడమూ దాకా, పల్లెటూరి అంగన్ వాడి లో పిల్లల మధ్యాహ్న భోజన సరుకుల దగ్గరి నుంచి అంతర్జాతీయ సమావేశాల నిర్వహణ దాకా దేశంలో అన్ని పనులూ ఇవాళ కాంట్రాక్టర్ల ద్వారానే జరుగుతున్నాయి. ఒక ప్రభుత్వ కార్యాలయానికి ఏడాదికి కావలసినవి ఆ కార్యాలయ అధికారులో, ఉద్యోగులో నేరుగా మార్కెట్లో కొనుక్కోరు. అవి కొనిపెట్టే కాంట్రాక్టు కోసం టెండర్లు పిలుస్తారు. రూపాయికి దొరికే పెన్సిల్ ఇరవై ఐదు రూపాయలకు ఇచ్చినా సరే కాంట్రాక్టర్ ద్వారానే కొనుక్కుంటారు. ఇటువంటి చిన్నస్థాయి నుంచి వేల కోట్ల రూపాయలు ఖర్చయ్యే ప్రాజెక్టుల వంటి పెద్దస్థాయి పనుల దాకా అన్ని పనులూ కాంట్రాక్టర్లు చేయవలసిందే. ఆ పనులు చేయడానికే ఏర్పడిన ప్రభుత్వ శాఖలూ, సిబ్బందీ ఉన్నప్పటికీ పాలకులు కాంట్రాక్టర్ల చేతనే పనులు చేయిస్తున్నారు. అలా దేశ సంపదలో అత్యధిక భాగం ఈ కాంట్రాక్టర్ల చేతికే అందుతున్నది. చాల సందర్భాలలో రాజకీయ నాయకులే కాంట్రాక్టర్లుగా, కాంట్రాక్టర్లే రాయకీయ నాయకులుగా ఉన్న స్థితి ఉంది. వాళ్లే నేర ప్రపంచ నాయకులు కూడ అవుతారు. ఒక్కమాటలో చెప్పాలంటే మన పాలన 'కాంట్రాక్టర్ల చేత, కాంట్రాక్టర్ల కొరకు, కాంట్రాక్టర్ల వలన' జరుగుతున్నది.

ఈ కాంట్రాక్టర్ల పద్ధతి భారత చరిత్రలో ఎప్పుడు మొదలయిందో చెప్పడం కష్టమే. రాజులు తమకు పన్నులు వసూలు చేసి పెట్టడానికీ, తమకు సైన్యం సమకూర్చడానికీ స్థానిక, గ్రామీణ, ప్రాంతీయ పెద్దలకు ఇచ్చిన అధికారం కాంట్రాక్టర్ వ్యవస్థకు బీజరూపం కావచ్చు. కాని దేశంలో చాల విషయాల లాగే, కాంట్రాక్టర్ వ్యవస్థ కూడ బ్రిటిష్ పాలనా కాలంలో బలపడి, స్థిరీకరణ పొందింది. తొలిదశలో ఈస్టిండియా కంపెనీ ఈ దేశం నుంచి కొనుక్కుపోయే సరుకులు సమీకరించడానికి కాంట్రాక్టర్ వ్యవస్థను నిర్మించింది. అయితే ఇలా సరుకులు కొనుగోలు చేసి ఇంగ్లండ్ కు పంపించడానికి నియమితులైన ఈస్టిండియా కంపెనీ ఉద్యోగులు, కాంట్రాక్టర్లు కలిసి మోసం చేస్తున్నారని, అవినీతికి పాల్పడుతున్నారని 1793లో అప్పటి గవర్నర్ జనరల్ కార్న్‌వాలిస్ గుర్తించాడు. అప్పటికి ఇరవై సంవత్సరాల కింద 1774లో ఈస్టిండియా కంపెనీ కలకత్తాలో ఏర్పాటు చేసిన బోర్డ్ ఆఫ్ ట్రేడ్ ఉద్యోగులు యూరపియన్, భారతీయ కాంట్రాక్టర్ల ద్వారా ఇంగ్లండ్‌కు పంపే సరుకులు, వస్తువులు కొనేవారు. ఆ కాంట్రాక్టర్లు ఎక్కువ ధర వసూలు చేస్తూ, నాసిరకం వస్తువులు పంపుతున్నారని కార్న్‌వాలిస్ రాశాడు. ఈ కాంట్రాక్టర్ల అక్రమాలను పరీక్షించి అడ్డుకోవలసిన బోర్డ్ సభ్యులు కూడ లంచగొండులై కాంట్రాక్టర్ల దగ్గర లంచాలు, కమిషన్లు తీసుకుని, వారు చెప్పిన ధరకు, వారు ఇచ్చిన సరుకులు కొంటున్నారని రాశాడు. "కలకత్తా గిడ్డంగి అవినీతికీ, అక్రమానికీ నిలయం అయిపోయింది" అన్నాడు. ఆ అవినీతిని సంస్కరించడంలో భాగంగా కాంట్రాక్టు పద్ధతే రద్దు చేసి, ఈస్టిండియా కంపెనీ ఉద్యోగులే నేరుగా కొనుగోళ్లు జరిపే వ్యవస్థ సృష్టించాడు.

కాని, తర్వాత కాలంలో కేవలం ఇంగ్లండ్ కు అవసరమైన వస్తువుల కొనుగోలు మాత్రమే కాక రహదారులు, భవనాల నిర్మాణం, నిర్వహణ, నీటి పారుదల కోసం ఆనకట్టల నిర్మాణం, జలాశయాల తవ్వకం, కాలువల తవ్వకం, రైలు మార్గాల నిర్మాణం వంటి ఎన్నో పనులను ఈస్టిండియా కంపెనీ, బ్రిటిష్ ప్రభుత్వం నిర్వహించవలసి వచ్చింది. ఆ పనులకు ప్రభుత్వ యంత్రాంగం సరిపోక కొంత, కాంట్రాక్టర్ల పద్ధతే అధికారులకూ పాలకులకూ లాభదాయకంగా ఉండడం వల్ల కొంత, మళ్లీ కాంట్రాక్టర్ల పద్ధతి పెరిగింది. గవర్నర్ జనరల్ డల్హౌసీ, ఇంజనీరు ఆర్థర్ కాటన్‌ల కృషితో 1855లో సైనిక బోర్డు అధీనంలో ప్రజా పనుల శాఖ (పబ్లిక్ వర్క్స్ డిపార్ట్‌మెంట్ – పిడబ్ల్యుడి) ఏర్పాటయినప్పటికీ, అది నేరుగా కొన్ని నిర్మాణాలు చేసినప్పటికీ కాంట్రాక్టర్ల పాత్ర పెరుగుతూనే వచ్చింది.

రెండో ప్రపంచ యుద్ధకాలంలో ఇబ్బడి ముబ్బడిగా డబ్బు చేసుకున్న కాంట్రాక్టర్లు వలసానంతర ప్రభుత్వ నిర్వాహకులలో ప్రధాన వర్గం అయ్యారు. రహదారుల నిర్మాణం, నీటి పారుదల ప్రాజెక్టులు, కాలువల నిర్మాణం, ప్రభుత్వ రంగ సంస్థల నిర్మాణం, ప్రభుత్వ భవనాల నిర్మాణం, వాటన్నిటి నిర్వహణ దగ్గరి నుంచి ప్రభుత్వ కార్యాలయాలకు అవసరమైన పరికరాల కొనుగోళ్ల దాకా ప్రతి పెద్దపనికీ చిన్నపనికీ ప్రభుత్వం కాంట్రాక్టర్ల మీద ఆధారపడడం పెరిగిపోయింది. మొదటి పంచవర్ష ప్రణాళికలో మొత్తం ప్రభుత్వ పెట్టుబడి వ్యయంలో సగం నిర్మాణ కార్యక్రమాలకే ఖర్చు కాగా దానిలో అధిక భాగం కంట్రాక్టర్ల ద్వారానే

జరిగింది. గత ఆరు, ఏడు దశాబ్దాలలో అభివృద్ధి వ్యయం పేరు మీద జరిగిన కేటాయింపుల్లో కనీసం 40 శాతం నిర్మాణపనులకే వెచ్చించారని ఒక అంచనా. 2011-12 ఒక్క సంవత్సరంలోనే నిర్మాణ రంగంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వెచ్చించిన నిధులు రు. 8,02,100 కోట్లు అంటే 1947 నుంచి ఇప్పటివరకూ ఈ వ్యయం కోట్ల కోట్ల రూపాయలు అయి ఉంటుంది. 2015-16 ఒక్క సంవత్సరంలోనే దేశంలోని అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు అభివృద్ధి వ్యయం కింద కేటాయించిన మొత్తం 15,83,700 కోట్లు అని రిజర్వ్ బ్యాంక్ అంచనా వేసింది. ఇంతింత భారీ అంకెల అభివృద్ధి నిధులన్నీ కూడ ఆయా ప్రభుత్వ శాఖల నుంచి కాంట్రాక్టర్ల ద్వారా మాత్రమే ఖర్చవుతాయి. పేరుకు అనేక ప్రభుత్వ రంగ నిర్మాణ సంస్థలు ఉన్నప్పటికీ, అవి కూడ పనులను మొత్తంగానో, పనుల్లో కొంత భాగాన్నో కాంట్రాక్టర్లకు ఇవ్వడం మొదలుపెట్టాయి. అలా ప్రభుత్వం నిర్మాణ, అభివృద్ధి రంగాలకు కేటాయిస్తున్న మొత్తాల్లో సగం కన్న ఎక్కువ కాంట్రాక్టర్లకే చేరుతుంది. అందులో సగమైనా వారి లాభంగా మారుతుంది. ఇలా దేశంలో ఉత్పత్తి అవుతున్న సంపదలో పది నుంచి ఇరవై శాతం కాంట్రాక్టర్లకే చేరుతున్నది.

ఆర్థికవ్యవస్థలో మిగులును సొంతం చేసుకోవడానికి పాలకవర్గాలకు ఉన్న ఒకానొక మార్గం కాంట్రాక్టులు. ఒక్కొక్క కాంట్రాక్టు రంగంలో ఒక్కొక్క రకమైన నైపుణ్యం, సాధన సంపత్తి, మానవవనరులు, ముడిసరుకులు, రవాణా సదుపాయాలు అవసరమవుతాయి గనుక ఈ సంపద కొల్లగొట్టే మార్గం అన్ని పనుల్లోనూ ఒకే రకంగా ఉండదు. అమలులో ఉన్న పద్ధతి ప్రకారం ప్రభుత్వం ఏ పనినైనా కాంట్రాక్టుకు ఇచ్చే ముందే ఆ పని ఏమిటో, తాను ఆ పని ఏ నాణ్యతతో, ఏ ముడిసరుకులతో, ఏ పద్ధతిలో జరగాలని కోరుకుంటున్నదో నిర్ణయిస్తుంది. ఆ పనికి కనీస వ్యయం ఎంత కావచ్చునో తన అధికారుల చేత, సంస్థలోని నిపుణుల చేత అంచనా వేయిస్తుంది. ఈ వ్యయానికి క్షేత్రస్థాయి పర్యవేక్షణ వ్యయాన్ని, పనిచేసేవారికి అదనంగా అయ్యే ఖర్చులను, వారు తమ శ్రమకు కోరుకోగల ప్రతిఫలాన్ని (లాభాన్ని) కలుపుతుంది. అలా తయారైన మొత్తం ప్రాజెక్టు అంచనా వ్యయాన్ని సూచిస్తూ ఆ పని చేయడానికి ఆసక్తి చూపే కాంట్రాక్టర్లకు ఏ కనీస సామర్థ్య అర్హతలు, ఏ సాధన సంపత్తి ఉండాలో ముందస్తు షరతులు ప్రకటిస్తుంది. వాటినే టెండర్ ప్రకటనలు అంటారు. ఆ ప్రకటనకు జవాబుగా వివిధ కాంట్రాక్టర్లు తాము ఆ ప్రకటిత వ్యయం కన్న కొంత తక్కువకో ఎక్కువకో ఆ పని చేయగలమని దరఖాస్తు చేస్తారు. ఈ దరఖాస్తులు సాధారణంగా రహస్యంగా, ఒకరు ప్రతిపాదించిన వ్యయం మరొకరికి తెలియకుండా ఉంచుతారు. ఆ పనిపై నిర్ణయాధికారం ఉన్న ప్రభుత్వాధికారులు నిర్ణీత సమయానికి ఆ రహస్య దరఖాస్తులను తెరిచి ఆ కాంట్రాక్టర్ల పట్ల ఎటువంటి రాగద్వేషాలు చూపకుండా వారిలో సాంకేతిక అర్హతలు, ఆర్థిక సామర్థ్యం ఉన్నవారి జాబితా తయారు చేస్తారు. సాధారణంగా ఈ జాబితాలో మొదట ఉండేవారిని టి1 (టెక్నికల్1) అంటారు. ఆ తర్వాత ఈ పనికోసం ఆయా కాంట్రాక్టర్లు ప్రతిపాదించిన వ్యయాన్ని బట్టి అతి తక్కువ వ్యయం నుంచి ఎక్కువ వ్యయం వరకు జాబితా తయారు చేస్తారు. అతి తక్కువ రాబడి కోరిన కాంట్రాక్టర్ ఈ జాబితాలో మొదటి స్థానంలో ఉంటారు గనుక ఎల్1 (లోయెస్ట్ బిడ్డర్) అంటారు. ఈ ఎల్1 కు టి జాబితాలో కూడ సముచిత స్థానం ఉంటే కాంట్రాక్టు అప్పగిస్తారు. ఇది కాంపిటీటివ్ (పోటీ) బిడ్డింగ్ పద్ధతి. ఇది కాకుండా, పని తొందరగా కావాలనే పేరుతో అధికారులు తమ జాబితాలో ఉన్నవారికి, తమ ఇష్టం వచ్చినవారికి ఇచ్చే నామినేషన్ పద్ధతి ఉంది. లేదా అర్హులైన, గత అనుభవం ఉన్న కాంట్రాక్టర్లతో చర్చించి అందరికీ కొంత కొంత పని, లేదా ఒక్కరికే మొత్తం పని ఇచ్చే నెగోషియేటెడ్ కాంట్రాక్ట్ పద్ధతి ఉంది. లేదా ఆ పని చేస్తామని తామే ముందుకు వచ్చిన వారి వ్యయాన్ని ప్రకటించి, దానితో మరెవరైనా పోటీ పడతారా అని ప్రశ్నించి, మొదటి వారికి పని అప్పగించే స్విస్ ఛాలెంజ్ అనే పద్ధతి ఉంది. కాంట్రాక్టు దొరికిన కాంట్రాక్టర్ తన ఖర్చు పెట్టుకుని పని పూర్తి చేసి ఒకేసారి బిల్లు తీసుకోవడం, పనిని దశలుగా విభజించి అప్పుడప్పుడు బిల్లు తీసుకోవడం, పనికి అవసరమైన ఇంజనీరింగ్ పరికరాలు, ముడిసరుకులు సమకూర్చుకోవడానికి ప్రభుత్వమే ముందస్తు నిధులు సమకూర్చిపెట్టడం, ఈ పని చేయడానికి అవసరమైన నిధులను ద్రవ్య సంస్థలనుంచి వడ్డీకి తెచ్చుకోవడం వంటి పద్ధతులెన్నో ఉన్నాయి.

అయితే ఈ పద్ధతులు, మార్గనిర్దేశక సూత్రాలు అన్నీ కూడ చట్టబద్ధ, పారదర్శక, ప్రజానుకూల పాలన ఉన్నదగ్గర అమలవుతాయేమో గాని భారతదేశంలో మాత్రం కాదు. మొట్టమొదట ఒక పనికి ఎంత ఖర్చవుతుందనే అంచనా వేసే అధికారులు, అధికారిక సంస్థలు ఆ అంచనాను ఎక్కువ చేసి పెంచి చూపుతారు. అలా టెండర్ ప్రకటన నాటికే వంద రూపాయల పని నూటయాభై రూపాయల అంచనాతో తయారవుతుంది. అప్పుడిక కాంట్రాక్టర్లు నూట అరవై నుంచి రెండు వందల దాకా పాడుతారు. లేదా కాంట్రాక్టర్లందరూ తోడు దొంగలుగా కూడబలుక్కుని ఒకే మాటగా రెండు వందలు అని పాడుతారు. అది ఏ రూపాయో, రెండు రూపాయలో తక్కువ పాడిన కాంట్రాక్టర్ కు వస్తుంది. కాని ఆ పనికి అసలు ఖర్చు వందరూపాయలే అని అందరికీ తెలుసు గనుక మిగిలినదానిలో ఎవరి వాటాలు వాళ్లకు సక్రమంగా అందుతాయి. అవసరమైన దానికన్న ఎక్కువ ప్రజాధనాన్ని ఖర్చు చేయడానికి అనుమతించినందుకు రాజకీయ నాయకులకు, అధికారులకు ముడుపులు అందుతాయి. కాంట్రాక్టర్లకు మిగిలే లాభం మాత్రమే కాక, పని నాసిరకంగా చేసీ, నాణ్యత లేని ముడిసరుకులు కొనీ అందులోనూ మిగుల్చుకుంటారు. ఆ నాసిరకం పనుల వల్ల వంతెనలు, భవనాలు ఎన్నోసార్లు కూలిపోయాయి, రహదారులు చెడిపోయాయి. ఇలా వేల కోట్ల రూపాయల ప్రజల సొమ్ము రాజకీయ నాయకులకు, అధికారులకు, కాంట్రాక్టర్లకు అక్రమంగా చేరడానికి రాజమార్గం కాంట్రాక్టు పద్ధతి.

ఆ రాజమార్గంలో కూడ మళ్లీ ఎన్నో అడ్డదార్లున్నాయని ఇటీవలి కాలంలో చాలాసార్లు బైటపడింది. బాలబాలికలకు ప్రభుత్వం ఇచ్చే పోషకాహార పదార్థాల కాంట్రాక్టులలో జరిగిన కోట్లాది రూపాయల అక్రమాల మీద పియుసిఎల్ వేసిన ఒక ప్రజా ప్రయోజన వ్యాజ్యంలో సుప్రీంకోర్టు తీవ్రమైన వ్యాఖ్యలు చేసింది. ఇటువంటి పనులు అసలు కాంట్రాక్టుకు ఇవ్వడమే తప్పని చెప్పింది. అయినా ప్రభుత్వం తన అలవాటు మానుకోలేదు. నేషనల్ హైవేస్ అథారిటీ ఆఫ్ ఇండియా ఉన్నతోద్యోగి సత్యేంద్ర దూబే స్వర్ణచతుర్భుజి రహదారి నిర్మాణంలో కాంట్రాక్టర్ల అక్రమాలను బైటపెడుతూ ప్రధానమంత్రి కార్యాలయానికి ఫిర్యాదు లేఖ రాసినందుకు హత్యకు గురయ్యాడు. అంటే కాంట్రాక్టర్ల ముఠా మాఫియా ముఠాగా కూడ మారిందన్నమాట. చిన్నపిల్లల ఆహార పదార్థాల కొనుగోలులో మహారాష్ట్ర మంత్రి పంకజా ముండే రు. 206 కోట్ల అవినీతికి పాల్పడ్డారని ఆరోపణలు వచ్చినప్పుడు, ఆ శాఖలోని కాంట్రాక్టర్ల అక్రమ లాబీకి కాంట్రాక్టు దక్కనందుకే తన మీద ఆరోపణలు చేస్తున్నారని మంత్రి ఎదురుదాడి చేశారు. ఈ ఆరోపణలు, ప్రత్యారోపణలు ప్రజాధనాన్ని స్వాహా చేయడంలో పాలకుల – కంట్రాక్టర్ల తోడు దొంగతనాన్ని బైటపెడుతున్నాయి. వీ

# రెండేళ్ల 'స్వ'పరిపాలనలో తెలంగాణ

***ప్రత్యేక తెలంగాణ ఉద్యమ కాలంలో ప్రజలు లేవనెత్తిన సమస్యలను తెలంగాణ ప్రభుత్వం రెండేళ్ల పాలన కాలంలో ఏ మేరకు పరిష్కరించిందో విశ్లేషిస్తున్నారు జి. వెంకటేశ్వర్లు***

ఆరు దశాబ్దాల చరిత్ర శిథిలాలపై పునర్నిర్మాణమవుతున్న తెలంగాణ రాష్ట్రం ఏర్పడి రెండేళ్లు గడిచిపోయాయి. ఒక్క సిరా చుక్కతో మొదలై లక్షల మెదళ్ల కదలికతో వేల గొంతులు ఒక్కటై నినదించి సంవత్సరాల సుదీర్ఘ పోరాటం అనంతరం వేల బలిదానాల పునాదిగా ఏర్పడిన రాష్ట్రం దశ దిశ ఈ రెండేళ్ల కాలంలో ఎటువైపుగా సాగుతోంది. వలసవాదుల ఉక్కు సంకెళ్ల నుండి తల్లి తెలంగాణను విడిపించుకోవడానికి పడిన శ్రమ ఫలితం ఎలా ఉంది? వలస పాలనలో ఉమ్మడి రాష్ట్రంలో విద్య, వైద్య, వ్యవసాయ, పారిశ్రామిక సామాజిక రాజకీయ భాషా సంస్కృతి మానవ హక్కుల రంగాలు ఎదుర్కున్న సమస్యలు స్వరాష్ట్రంలో పరిష్కారం దిశగా సాగుతున్నాయా? స్వయం పాలన, ఆత్మగౌరవం పేరుతో అలుపెరగని పోరాటం చేసిన రాష్ట్రంలో వివిధ రంగాల పట్ల ప్రభుత్వ ప్రయాణం ఏ విధంగా ఉందో పరిశీలించే ప్రయత్నమే ఈ వ్యాసం.

**విద్యా రంగం :** ప్రపంచంలోనే ఒక రోల్‌మోడల్‌గా నిలిచే నినాదంతో విద్యా రంగాన్ని ఆకాశానికెత్తిన ప్రభుత్వానికి కామన్ స్కూల్ విధానం ఎలా ప్రవేశపెట్టాలో, కెజి టు పిజి విద్యా విధానం ఎలా ప్రారంభించాలో అర్థం కాక తికమక పడుతోంది. రెండేళ్లు గడిచినా అది ఇంకా ఒక కొలిక్కిల రాలేదు. గత కొంత కాలంగా అంతో ఇంతో మౌళిక సదుపాయాల మెరుగుతో అంతంత మాత్రంగా సాగుతున్న గ్రామీణ విద్యా వ్యవస్థను అనివార్యంగా ప్రజలకు దూరం చేస్తోంది. గ్రామీణ ప్రాంతాల్లో ఉన్న పాఠశాలలను బలోపేతం చేసేది పోయి ఒకవైపు ప్రైవేట్‌కు అండగా ఉంటూనే ప్రభుత్వ పాఠశాలల్లో విద్యార్థుల నమోదు పనితీరుపై ప్రభుత్వమే తీవ్ర ఆరోపణలకు దిగుతోంది. ఆంగ్ల భాషా మోజును సాకుగా చూపి ప్రభుత్వ పాఠశాలల్లో ఆంగ్ల మాధ్యమం ప్రవేశ పెట్టేందుకు సవాలక్ష నిబంధనలతో, ప్రభుత్వం ఏ విధమైన భారం మోయకుండా ఇంగ్లిష్ మీడియానికి నాంది పలికింది. ఒప్పంద పత్రాలు రాసుకుని పాఠశాలలకు అనుమతులిచ్చింది. ఈ పద్ధతి దేశంలో ఎక్కడైనా ఉందా? గ్రామాల్లో చదివే విద్యార్థులంతా ఎస్‌సి, ఎస్‌టి, బిసి, మైనారిటీల పిల్లలే. విద్య ప్రాథమిక హక్కుగా గుర్తించిన తర్వాత గ్రామంలో ఒక్క విద్యార్థి ఉన్నా పాఠశాల నడపాల్సిందే. అందుకు తగిన ఉపాధ్యాయ సిబ్బందిని నియమించాల్సిందే. ఇది కాదని విద్యపై పెట్టుబడిని మానవ వనరుల అభివృద్ధిగా చూడకుండా ఉత్పాదక రంగంగా చూడడంలోనే ప్రభుత్వాలు విద్యా రంగం నుండి తప్పుకో చూస్తున్నాయి. అందులో భాగమే పాఠశాలల కుదింపు. తెలంగాణలో వేలాది పాఠశాలలు తొలగించి, ఉపాధ్యాయుల కుందిపునకు రంగం సిద్ధమైంది. అంతే గాక ఈ రెండేళ్ల కాలంలో అసలే వివిధ ప్రయోగాలతో నూతన విధానాలతో పాఠశాల విద్యా ప్రయోగ శాలగా మారింది. ఈ నేపథ్యంలో ఆయా పాఠశాలల్లో ఉన్న విద్యార్థులను పరోక్షంగా ఖాళీ చేస్తోంది ప్రభుత్వమే. మోడల్ పాఠశాలల పేరుతో కొంత, ఇటీవల నియోజకవర్గానికో పాఠశాల అంటూ ఎస్‌సి, ఎస్‌టి, మైనారిటీ రెసిడెన్సియల్ పేరుతో పాఠశాలలు పెట్టి ఆయా కేటగిరీల పిల్లలను అక్కడి వెళ్లేలా ప్రోత్సహిస్తోంది ప్రభుత్వం కాదా? ఇప్పటికే బిసి, ఎస్‌సి, ఎస్‌టి సంక్షేమ హాస్టళ్లకు తోడు ఇవి కూడా కలవడంతో గ్రామీణ ప్రాంతాల్లోని పాఠశాలల్లో విద్యార్థులు ఎక్కడ చేరతారు. పిల్లలు లేరని సాకుచూపి క్రమంగా పాఠశాలను ఎత్తేసే కార్యక్రమం సునాయాసంగా చేసుకోవచ్చు. దీంతో దిగువ మధ్య తరగతి పిల్లలకు, ఆయా గ్రామాలు విడిచి దూర ప్రాంతాలకు వెళ్లలేని వాళ్లకు విద్య దూరం దూరం చేసినట్లే అవుతుంది. ఇట్లా వివిధ పేర్లతో సమాజాన్ని వర్గాలుగా, కులాలుగా విభజించే సంస్కృతికి ఆజ్యం పోసినట్లు అవుతుంది. ఇదీ ఈ రెండేళ్లలో చిన్నాభిన్నమైన పాఠశాల విద్యా పరిస్థితి. పెట్టే పాఠశాలల్లో సైతం కెజి నుండి పిజి కాకుండా 6వ తరగతి నుండి ప్రారంభిస్తూ డిప్యుటేషన్ టీచర్స్, వాలంటీర్లతో నడపాలని చూడడం ఎంత వరకు సమంజసం. తెలంగాణ ఏర్పడిన తర్వాత కాంట్రాక్టు డిప్యుటేషన్లు ఉండవని అంటూ పర్మినెంట్ ఉద్యోగాలన్న పాలకులు పాత విధానాలనే కొనసాగించడం విచిత్రంగా ఉంది.

వేలకొద్ది ఉద్యోగాలు, లక్షల కొద్ది అవకాశాలు వస్తాయనుకున్న నిరుద్యోగ యువత ఆశలు అడియాశలయ్యాయి. ఈ రెండేళ్లలో కోచింగ్ సెంటర్లు మాత్రం లక్షలాది రూపాయలు దండుకున్నాయి. కాగా తెలంగాణ అకాడమీ ఫర్ స్కిల్ అండ్ నాలెడ్జ్ పేరుతో గ్రాడ్యుయేట్స్‌కు శిక్షణనిస్తామన్న ప్రభుత్వం కనీసం ఉచిత కోచింగ్ సెంటర్లు నడిపే ఆలోచన రూపుదాల్చుకోకపోవడం విచారకరం. ఇంతా జరిగితే స్వరాష్ట్రంలో ఇప్పటి వరకు ఒక్క డిఎస్‌సికి తావులేదు. ఉపాధ్యాయ నియామకాలపై శ్రద్ధలేని ప్రభుత్వం టిఇటి పేరుతో కాలయాపన చేసి ఐఎఎస్, గ్రూప్ 1 లెవల్‌లో టిఇటి పరీక్ష నిర్వహించింది. సంబంధం లేని సబ్జెక్టులతో విద్యార్థులను గందరగోళంలో పడేసి చివరికి 25 శాతం మించి ఉత్తీర్ణత సాధించలేని స్థితికి నెట్టివేసింది. తమ సబ్జెక్టులకు సంబంధం లేని ప్రశ్నలతో టిఇటి పాస్ కాలేక ఒక విద్యార్థిని ఆత్మహత్యకు గురికావడం అతిపెద్ద విషాదం. ఇక యూనివర్శిటీల్లో విసిల నియామకాలకు రాజకీయ రంగు పులమడానికి సిద్ధంగా ఉంది. విద్యా రంగ నిపుణులను కాదని ఐఎఎస్, ఐపిఎస్ అధికారులను వందిమాగధులను విసిలుగా వేసే సంస్కృతికి పునాదులు వేయడం ఈ రెండేళ్ల విద్యా ప్రగతిలో మరో విషాదం.

**వైద్య రంగం:** రాష్ట్రం ఏర్పడిన ఈ రెండేళ్లలో వైద్య రంగంలో వచ్చిన పెనుమార్పు లేమీలేవు. మహబూబ్‌నగర్ మెడికల్ కళాశాల ఏర్పాటు, పిపిపి పద్ధతిలో దయాలసిస్ సెంటర్లు, పిఎచ్‌సి పనివేళల్లో మార్పులు తప్ప మరేవి చెప్పుకోదగ్గవి లేవు. నిజానికి వాగ్దానం చేసిన జిల్లాకో వంద పడకల అసుపత్రి, ఏరియా ఆసుపత్రుల పెంపు వైద్య సిబ్బంది నియామకాలు శూన్యం. పారామెడికల్ సిబ్బంది నియామకం కూడా జరగలేదు. ఉస్మానియా అసుపత్రిని కూల్చి కొత్త నిర్మాణం చేపడతామన్న

ప్రభుత్వ వారసత్వ కట్టడాల కూలిచవేతకు వ్యతిరేకంగా వచ్చిన ప్రజాభిప్రాయంతో ఆ ఆలోచన విరమించుకున్న ప్రభుత్వం అక్కడే ఉన్న 24 ఎకరాల ఖాళీ భూమిలో మరోకొత్త భవనం నిర్మాణం చేయాలన్న ఆలోచన ఈ రెండేళ్ల కాలంలో రాకపోవడం శోచనీయం. అరకొర విభాగాలతో ప్రారంభమైన బీబీనగర్ నిమ్స్ మినహా సరికొత్త ఆసుపత్రుల నిర్మాణం ఎక్కడా చేపట్టలేదు. ఆరోగ్యా శ్రీ పథకానికి కేటాయించిన 700 కోట్లలో సింహభాగం ప్రైవేట్ వైద్య రంగానికి వెళ్లిపోవడం గత ప్రభుత్వాల తీరునే గుర్తు చేస్తుంది. ఉద్యోగులకిచ్చిన హెల్త్ కార్డులు నిరుపయోగంగా ఉన్నాయి. మెడికల్ రీయింబర్స్‌మెంట్ తేదీని పొడిగించుకుంటూ పోతున్న ప్రభుత్వానికి ఇంకా కార్పొరేట్ ఆసుపత్రుల మెడలు వంచి రాష్ట్ర ప్రజలకు వైద్యం అందించే సాహసం చేయకపోవడం ప్రభుత్వం ఆశక్తతను తెలియజేస్తుంది. నగరానికి నాలుగు వైపుల నాలుగు పెద్ద ఆసుపత్రులు ఎన్నాళ్లకు వెలుస్తాయో? ప్రకటిక ఫార్మాసిటి నిర్మాణం ఇంకా ఒక్కడుగు కూడా ముందుకు పడేలదు. ఇదీ ఈ రెండేళ్ల తెలంగాణ వైద్యాభివృద్ధి.

**వ్యవసాయ రంగం:** స్వతంత్ర తెలంగాణలో వ్యవసాయం పండగవుతుందనుకుంటే దురదృష్టవశాత్తు కరువుతో అల్లాడింది. వందలాది మంది రైతులు ఆత్మహత్యలకు పాల్పడ్డారు. రైతు హత్మహత్య లేనిరోజు లేదు. ప్రభుత్వాల కళ్లు తెరిపించేలా చివరికి నగరానికి నడిచివచ్చి శవాలై వేలాడిన దుస్థితి. ఒకవైపు కరువు మరోవైపు వరుస నష్టాలు, అప్పులతో రాష్ట్ర రైతాంగం కుదేలైంది. తీవ్ర దుర్భిక్ష పరిస్థితులున్న అనేక ప్రాంతాలను కరువు ప్రాంతాలుగా ప్రకటించడానికి ప్రభుత్వం వెనుకడుగు వేసింది. రైతు మరణాలను అపహాస్యం చేస్తూ మరణించిన రైతులకు ఆరు లక్షలు ప్రకటించి చేతులు దులుపుకుంది. పశు సంపద కబేళాలకు తరలిపోయింది. పశువులను అమ్ముకోలేక అటు చంపుకోలేక దుక్కిటెద్దులను అద్దెకివ్వడం రైతు దుస్థితికి అద్దం పడుతుంది. గత ప్రభుత్వాలు పట్టించుకోని విత్తన చట్టాన్ని తెలంగాణ రైతాంగం కోసం తీసుకరాలేకపోయింది. బహుళజాతి విత్తన కంపెనీలకు తలొగ్గింది. రైతులకిస్తానన్న లక్ష రూపాయల రుణమాఫీ పూర్తి కాలేదు. వడ్డీ జమకాక, కొత్త రుణాలు లేక వ్యవసాయ పెట్టుబడులకు ప్రైవేట్ వడ్డీ వ్యాపారులను ఆశ్రయించని దుస్థితి తప్పలేదు. కొంత మంది కౌలు రైతులకు తప్ప రాష్ట్ర వ్యాప్తంగా ఉన్న మొత్తం కౌలు రైతులకు గుర్తింపు కార్డులు అందలేవు. ల్యాండ్ రెవెన్యూ యాక్ట్ 91 సెక్షన్ 95 ప్రకారం కౌలు రైతులకు పాసు పుస్తకాలు ఇవ్వడానికి ఈ రెండేళ్ల పాలనలో రెవెన్యూ డిపార్ట్‌మెంట్‌కు తీరికే లేదు. మిషన్ కాకతీయతో నిర్దేశిత లక్ష్యాన్ని చేరుకోలేదు. వ్యవసాయ ఉత్పత్తులు దిగజారిపోతున్నా, కేంద్ర ప్రభుత్వం, ఉత్పత్తి వ్యయాన్ని బట్టి రాష్ట్రాలు పంటల ధరలు నిర్ణయించుకోవాలని ఆదేశాలు ఇచ్చినా ప్రభుత్వం ధర నిర్ణయించకపోగా మద్దతు ధరను కూడా కల్పించే చర్యలు తీసుకోలేదు. పాలీహౌజ్ వ్యవసాయానికి ఇచ్చిన ప్రాధాన్యత, ఎకరానికి 30, 40 లక్షల పెట్టుబడి పెట్టే వ్యవసాయానికి కల్పించే ఇన్సూరెన్స్ రెస్పాన్స్‌ను సామాన్య రైతులు వారి పంటల పట్ల చూపలేకపోయింది. టిఎస్ఐ పాస్‌తో సింగిల్ విండోలతో భూమి, నీరు, విద్యుత్ ఉచిత మౌళిక వసతులు కల్పించి పారిశ్రామిక వేత్తలకు ఇచ్చే సబ్సిడీలను రైతులకిచ్చే సబ్సిడీలను లెక్కవేసుకుంటే తెలంగాణను సీడ్ బౌల్ ఆఫ్ ఇండియాగా తీర్చిదిద్దుతామన్న పాలకుల విశ్వసనీయతను కొలవడానికి ఈ రెండేళ్లు కొలబద్ద చాలదారు దేశ వ్యాప్తంగా 52 శాతం మంది రైతులు అప్పుల్లో ఉంటే తెలంగాణలో 89 శాతం మంది రైతులు అప్పుల్లో కూరుకుపోయినారన్న సంగతి విస్మయపరుస్తుంది. ఈ నేపథ్యంలో మిషన్ కాకతీయతో మెరుగైన ప్రచారమైతే చేసుకోగలిగింది కాని తెలంగాణలో అనుకున్న స్థాయి వ్యవసాయ విస్తరణ, కొత్తగా విత్తన చట్టం రైతులకు ఉచిత విత్తనాలు, ఎరువులు, క్రిమి సంహారక మందులు ఇచ్చి నూతన వ్యవసాయ విధానాన్ని కొత్త ఒరవడిని సృష్టించలేకపోయింది. అంతిమంగా రైతుల ఆత్మహత్యలు ఆపలేకపోయింది.

**నీటిపారుదల రంగం:** రాష్ట్ర ప్రజానీకానికి సాగు, తాగు నీరందించే క్రమంలో చేపట్టిన మిషన్ కాకతీయ, మిషన్ భగీరథ, పొరుగు రాష్ట్రాలతో నీటి ఒప్పందాల ప్రయత్నం అభినందనీయమే. అభిలషనీయమే. ఈ నేపథ్యంలో ముఖ్యమంత్రి స్వయంగా అసెంబ్లీలో పవర్ పాయింట్ ప్రజెంటేషన్ ద్వారా రాష్ట్ర ప్రాజెక్టుల నిర్మాణానికి ప్రభుత్వ వ్యూను చాలా అవగాహనతో ఆకర్షణీయంగా ప్రదర్శించారు. అభినందనీయమైన ఈ ప్రదర్శనలో వివిధ ప్రాజెక్టులను ఈ ఆర్థిక సంవత్సరంలో 25 వేల కోట్లతో పెండింగ్ ప్రాజెక్టు పూర్తి చేసి నీరందిస్తామన్నారు. అది ప్రకటనల రూపంలో కొనసాగుతుంది గాని ఆచరణలో ఇంకా ముందుకు అడుగు పడలేదు. మిషన్ కాకతీయ లక్ష్యం 46 వేల చెరువుల పూడికతీత. ఈ రెండేళ్ల కాలంలో ఒకవంతు చెరువులు కూడా పూర్తి కాలేదు. సాగునీటి పారుదల రంగాన్ని ఉరకలెత్తిస్తున్నట్లు ఉన్నా, ప్రాజెక్టు నిద్రతో ప్రకటిత లక్ష్యాన్ని చేరుకోలేదు. ఇదిలా ఉంటే, వైఎస్ కాలంలో ప్రాజెక్టులు లేకుండా కాల్వలు తవ్వి జలయజ్ఞం ధన యజ్ఞంగా మార్చిన వైనాన్ని తెలంగాణలో మరొకసారి గుర్తుకు తేస్తోంది ప్రభుత్వం. అసంపూర్తి ప్రాజెక్టులకు, ప్రతిపాదిత ప్రాజెక్టులకు రీడిజైనింగ్ పేరుతో ప్రాజెక్టుల వ్యయాన్ని వేల కోట్లకు పెంచి ప్రజా ధనాన్ని కాంట్రాక్టర్లకు దోచి పెట్టడానికి సిద్ధమైంది. ప్రభుత్వాలు మారినా దాంతోపాటే దోపిడీ కూడా రూపం మార్చుకుంది. స్వయంగా ఇప్పటికి గత ప్రాజెక్టుల ముంపు బాధితుల బాధలను కళ్లారా చూసిన నాయకులకు రీడిజైన్ పేరుతో అధిక సామర్థ్యంతో నిర్మించే రిజర్వాయర్లు, ప్రాజెక్టుల ముంపు బాధితుల గోడు పట్టకపోవడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. మల్లన్న సాగర్ బాధితులు 2013 భూసుకరణ చట్టం ప్రకారం పరిహారం అడిగితే ప్రాజెక్టు వ్యతిరేకులుగా చిత్రించి వారిని ఆందోళనకు గురి చేయడం, పక్క జిల్లాల రైతులను ఎగదోయడం ఎంత వరకు సమంజసం. వాళ్లు పాలకులనుకునే బంగారు తెలంగాణలో భాగస్వాములు కారా? ఇది అన్యాయమన్న వారిపై ఎదురుదాడి చేసి పిడికెడు మంది కోసం ప్రాజెక్టు ఆపాలా అని అనడం వింతగా ఉంది. స్వార్జిత తెలంగాణలో రెండేళ్లకే పోరాడేవాళ్లు అభివృద్ధి నిరోధకులుగా కనిపించడం ఆశ్చర్యం కలిగిస్తుంది. పిడికెడు మందితో ప్రారంభమైన పోరాటం ప్రజా కలలను నిజం చేసిందని చెప్పుకునే పాలకులకు పోరాటమెప్పుడూ పిడికెడు మందితోనే ప్రారంభమవుతుందన్న సత్యాన్ని మరిచిపోతే ఎలా!

**పారిశ్రామిక రంగం:** రాష్ట్రం 16 వేల కోట్ల మిగులు నిల్వతో ఏర్పడింది. చిన్న రాష్ట్రం గనుక వేగంగా అభివృద్ధి జరుగుతుందనుకుంటే ఈ రెండేళ్లలో వేల కోట్ల అప్పులతో రాష్ట్రాభివృద్ధి గడపదాటలేదు. ఉమ్మడి రాష్ట్రంలో రోడ్లు, ఫైఓవర్లు, బహుళ అంతస్తుల భవనాలు నిర్మించి దేశాధ్యక్షులను రాష్ట్రానికి రప్పించి హైదరాబాద్‌ను ప్రపంచ పటంలో పెట్టామని పెడబొబ్బలు పెట్టిన నాయకులను తూర్పారబట్టి ఇదేనా అభివృద్ధి అని విమర్శించిన వారే నేడు హైదరాబాద్‌లో స్ట్రాటజిక్ రోడ్ డెవలప్‌మెంట్ ప్రాజెక్టు పేరుతో 5 స్కైవేలు, 11 కారిడార్లు, 60 రహదార్లు సాగర తీరంలో ఆకాశ హర్మ్యాలని చూపుతూ ఇదీ అభివృద్ధి అని చెప్పుకోచూడడం ఎంత వరకు సమంజసం. నగరంలో ఎగిరే జెండా, ఎత్తైన విగ్రహాలు అభివృద్ధి సూచికలా? టి హబ్, టిఎస్ఐ

పాస్‌తో రాష్ట్ర పారిశ్రామిక రంగం శరవేగంతో పరుగెత్తుతున్నట్లు కనిపిస్తున్నా ఆశించిన స్థాయిలో ఉద్యోగాల పరికల్పన జరగలేదు. ఐటి రంగానికి ప్రపంచ స్థాయి రికగ్నేషన్ కోసం, పరిశ్రమల స్థాపన కోసం కొత్త పాలసీలను ప్రవేశపెట్టి నూతన పారిశ్రామిక వేత్తలకు రెడ్ కార్పెట్ పరుస్తున్నారు. ఉమ్మడి రాష్ట్రంలో మూతపడిన అనేక ఫ్యాక్టరీలతో పాటు నిజాం షుగర్స్ ఫ్యాక్టరీ, అజాంజాహి మిల్స్ వంటి ఖాయిలా పడిన పరిశ్రమల పునరుద్ధరణ జరగలేదు. ఆ కార్మికుల ఆకలి పోరాటం ఇంకా కొనసాగుతూనే ఉంది. ఉద్యమ కాలంలో మూతపడిన పరిశ్రమలను తెరిపించి ప్రభుత్వాలే వాటి నిర్వహణ బాధ్యతను తీసుకుంటుందని చెప్పి అధికారంలోకి వచ్చి రెండేళ్లయినా సమస్య గుర్తుకు రాకపోవడం విడ్డూరం. కాగా కుటీర, చేతి వృత్తుల అభివృద్ధికి ప్రణాళికలు లేవు. ఇండస్ట్రియల్ పార్కులు, ఒక్‌సైల్ పార్క్‌లు, పారిశ్రామిక కారిడార్ల నిర్మాణాల ప్రారంభోత్సవాలకు ప్రకటనలకే ఈ రెండేళ్లు సరిపోతుంది. తెలంగాణ కార్మిక ప్రపంచానికి ప్రైవేట్ రంగ ఉద్యోగార్థులకు ఈ రెండేళ్ల పాలన బాల్యావస్థను దాటలేదు.

**విద్యుత్ రంగం:** రాష్ట్రావతరణ తర్వాత విద్యుత్ రంగం కొంత మెరుగైంది. ఈ రెండు సంవత్సరాల కాలంలో తీవ్ర కరువు పరిస్థితులు రావడంతో రాష్ట్ర వ్యవసాయ రంగానికి అవసరం అంతగా లేకపోయింది. దాదాపు 42 శాతం విద్యుత్ వినియోగం వ్యవసాయ రంగంలో తగ్గడంతో అటు పరిశ్రమలకు ఇటు గృహావసరాలకు నిరంతర విద్యుత్ సరఫరా అందింది. విద్యుత్ శాఖ సిబ్బంది కృషి అభినందనీయమే. అయితే నూతనంగా చేపట్టిన యాదాద్రి విద్యుత్ ప్లాంట్ ఇంకా భూసేకరణ, ప్రజాభిప్రాయ సేకరణను దాటి ముందుకు పోలేదు. ఒకటి రెండు విద్యుత్ ప్లాంట్స్ ఉత్పత్తి ప్రారంభించాయి. చత్తీస్‌గడ్ విద్యుత్ ఒప్పందం రాష్ట్రానికి పదివేల కోట్ల భారం కాగా ఆ ఒప్పందాన్ని సమీక్షించాలన్న నిపుణుల అభిప్రాయాలు పక్కన పెట్టిందీ ప్రభుత్వం. రానున్న పారిశ్రామిక అవసరాల దృష్ట్యా మరిన్ని విద్యుత్ ప్లాంట్లతో పాటు సోలార్ పవర్ జనరేషన్ కొరకు మరింత కృషి చేయాల్సి ఉంది. అయితే తెలంగాణలో బొగ్గు ఉత్పత్తికి ఓపెన్ కాస్ట్ గనుల విషయంలో ప్రభుత్వం గత హామీలను మరిచిపోయింది. బొగ్గు ఆధారిత విద్యుత్ ప్లాంట్లు క్రమంలో అత్యంత అధునాతన సాంకేతిక పరిజ్ఞానంతో కాలుష్య రహిత ప్లాంట్స్ ఏర్పాటుతో తెలంగాణను విద్యుత్ వెలుగులో నడిపించే బాధ్యత ప్రభుత్వానిదే.

**సామాజిక - రాజకీయ రంగం:** ఏలిన పెద్దలు చెప్పినట్లు గెలిచి నిలిచిన తెలంగాణలో సామాజిక మార్పులేవి ఈ రెండేళ్లలో పెద్దగా జరుగలేదు. రైతుల ఆత్మహత్యలు, స్త్రీలపై దాడులు, అత్యాచారాలు, వేదింపులు ఆగలేదు. ప్రజల అంతర్గత వలసలు, గల్ఫ్ దేశాల వలసలు ఆగిపోలేదు. భూ ఆక్రమణలు, బెదిరింపులు జరుగుతూనే ఉన్నాయి. ఆడపిల్లల అమ్మకాలను కళ్యాణ లక్ష్మిలు అడ్డుకట్ట వేయలేకపోతున్నాయి. పాలమూరు వసల బతుకుల్లో, నల్లగొండ ఫ్లోరైడ్ పీడితుల్లో, కరీంనగర్ బీడి కార్మికుల జీవితాల్లో, ఖమ్మం ఆదివాసి బతుకుల్లో మార్పులేవీ లేవు. పోడు భూముల సాగుదారులపై పిడి యాక్టులు ఆగలేదు. ఈ రెండేళ్లలో మాట్లాడే వారి మూతికి తాళాలు, చేతులకు సంకెళ్లు వేయడమూ ఆగలేదు. కవులు, కళాకారులను, రచయితలను ఉద్యోగాల, సన్మానాల పేరుతో ప్రభుత్వం సంచిలో వేసుకుంది. ఉద్యోగుల ప్రతినిధులను, ప్రజా సంఘాల నాయకులను పదవుల ఎరతో పదిల పరుచుకుంది. ఇప్పుడు తెలంగాణ మాట్లాడే దిక్కులేనిది. బతుకమ్మ, బోనాలు రాష్ట్ర పండుగలకు తాత్కాలిక ఏర్పాట్లకు కోట్ల వితరణ, క్రైస్తవ, ముస్లిం సోదరులకు క్రిస్మస్, రంజాన్ పండుగలకు ప్రభుత్వ పక్షాన ఏర్పాట్లు, నిరుపేదలకు కొత్త బట్టల వితరణ గావిస్తుంది. దీంతోపాటు వివిధ వర్గాలకు ఇచ్చే ఆసరా ఫించన్ వంటి ఉపరితల వితరణతో ఉమ్మడి రాష్ట్రానికి కొత్త రాష్ట్రానికి వచ్చిన జన జీవన ప్రమాణాల్లో వచ్చిన మార్పుగా భావిస్తోంది. దీన్నే గత కొన్ని రోజులుగా మీడియా బద్దలయ్యేటట్లు అటు ఎలక్ట్రానిక్ ఇటు ప్రింట్ మీడియా ప్రచారానికి భారీ వితరణే గావించింది. రెండేళ్లు గడిచినా ఉద్యమ కాలం నాటి కేసులు ఎత్తివేయకపోవడం విచారకరం. రాష్ట్రావతరణ రోజే కోర్టు మెట్లెక్కుతున్న తెలంగాణ బిడ్డల వెతలు ఇంకా తీరలేదు. ఉమ్మడి రాష్ట్ర ముఖ్యమంత్రి రోషయ్య సభలో జై తెలంగాణ అన్న యువకునికి సెలెక్ట్ అయి కూడా కేవలం జై తెలంగాణ అన్నందుకే రాష్ట్రం ఏర్పడిన రెండేళ్లకు కూడా ఉద్యోగం రాకపోవడం చూస్తే సాధారణ తెలంగాణ ప్రజల స్థితి ఎక్కడుందో అర్థం చేసుకోవచ్చు. దళిత సామాజిక వర్గాలకిచ్చే మూడెకరాల భూ పంపిణీ ముక్కుతూ మూలుగుతూనే ఉంది.

పీఠమెక్కిన తొలినాళ్లలో అవినీతి రాజకీయాలను సహించేది లేదని చెప్పిన ముఖ్యమంత్రి ఇప్పటికే తన పోరాటంతో గొప్ప రాజకీయ చతురిడిగా, వ్యూహకర్తగా తెలంగాణ తొలి ముఖ్యమంత్రిగా చరిత్ర సృష్టించుకున్నాడు. అయితే కావలసిన మెజారిటీ ఉన్నా, నీతిమంతమైన రాజకీయాలు నడిపి నూతన రాష్ట్రంలో కొత్త ఒరవడికి నాంది పలికి మరో చరిత్ర రాసుకోవలసింది పోయి, రాజకీయ సుస్థిరత పేరుతో కలుషిత రాజకీయాలకు తెరలేపారు. ఎంఎల్ఎలను చేర్చుకోవడం, ఓట్లకు కోట్ల కేసును నిర్వీర్య పరచడం వంటి మికిలి రాజకీయాలకు పునాది వేశారు. భారత ఫెడరల్ వ్యవస్థలో ఎక్కడా ప్రతిపక్షం లేని అధికార పక్షం ఉండదు. ప్రజా పక్షమైన ప్రతిపక్షం ఉన్నప్పుడే అధికార పక్షం వెలుగు ప్రజలకు కనిపిస్తుంది. అది లేకుండా చేయాలనుకోవడం వివేకమనిపించుకోదు. దీంతో ఈ రెండేళ్లలో మలిన రాజకీయాలకు టిఆర్ఎస్ కూడా అతాను ముక్కే అని నిరూపించుకుంది.

**హక్కుల అణచివేత నిర్బంధాలు:** సభలు సమావేశాలు పోరాటాల ద్వారానే ప్రపంచంలో ఎక్కడైనా ప్రజాహిత సమస్యలు వెలుగులోకి వస్తాయని, పరిష్కార మార్గాలు వెతుక్కుంటాయన్న సంగతి పోరాట నేపథ్యం గల ప్రభుత్వ పెద్దలకు గుర్తుకులేకపోవడం ఆశ్చర్యకరమే. తెలంగాణ వస్తే పౌరహక్కులకు, ప్రజల స్వేచ్ఛా జీవనానికి భంగం కలగదు అనుకున్నవారి భ్రమలు రెండేళ్లలో స్పష్టంగా వీడిపోయాయి. ఎన్‌కౌంటర్లు, నిర్బంధాలు లేని తెలంగాణ కోసం ప్రజలు పోరాడారు. అవి కూడా ఈ రెండేళ్లలో జరిగాయి. ప్రత్యామ్నాయ వేదిక సభ జరగకుండా సుందరయ్య విజ్ఞాన కేంద్రానికి తాళం పడింది. ఆలేరు కాల్పులు మొదలుకొని వివేక్ ఎన్‌కౌంటర్ నుండి వరంగల్ పిడిఎఫ్ సభా నిర్వహణ, ఉస్మానియా యూనివర్సిటీలో బహిరంగ సభదాకా, ప్రభుత్వ అణచివేతను కొనసాగించింది. విద్యుత్ ఉద్యోగులెవరూ ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా జిఆర్‌సికి వెళ్లొద్దన్న సర్క్యులర్ మొదలుకొని ప్రొఫెసర్ కాసీం పై రాజద్రోహ నేరారోపణదాకా, మల్లన్నసాగర్ ముంపు బాధితుల న్యాయపోరాటానికి మద్దతుగా ప్రభుత్వ పనితీరుపై గళమెత్తిన ప్రజాపోరాట నిర్మాత ప్రొఫెసర్ కోదండరాంపై, ఆ పోరాట ఫలితాన్ని అనుభవిస్తున్న తెలంగాణ వ్యతిరేక శక్తులతో నిండిన గులాబి దండు మాటల దాడి నుండి నిన్నటి ఆదిలాబాద్ శోభన్ ఎన్‌కౌంటర్ దాకా ప్రజా హక్కుల హననం కొనసాగుతూనే ఉంది. మాట్లాడే స్వేచ్ఛలేని తెలంగాణ మనకొచ్చిందని పోరాటంలో కీలక భూమికలైన మేధావులు వాపోతున్నారు.

మలిదశ పోరాటం ప్రారంభించి కె.సి.ఆర్. అయినా, తమ ఊపిరిని ఫణంగాపెట్టి ఉద్యమాన్ని భుజాన వేసుకొని ఉవ్వెత్తున పోరాడింది

విద్యార్థులే. తుపాకి తూటాలకు, బాష్పవాయు గోళాలకు ప్రాణాలెదురొడ్డిన విద్యార్థుల వ్యూహరచనే నిరంతర పోరాట జ్వాలై వెలిగింది. అటువంటి ఉస్మానియా, కాకతీయ యూనివర్సిటీలపై రహస్య ఉక్కుపాదం మోపడం ఎంతవరకు సమంజసం. ఒక్క ఉస్మానియాలోనే 42 మంది ఇంటిలిజెన్సీతో అడుగడుగున నిఘా నేత్రాల వలలు పన్ని కాపలా కాయడం ప్రభుత్వ దమన నీతిని స్పష్టం చేస్తుంది. అగ్ని పర్వతాలెప్పుడూ నివురు గప్పుకునే ఉంటాయి. ఆకుపచ్చ క్షేత్రాలెన్ని కప్పినా బద్దలైతే వెల్లువెత్తిన లావా పచ్చని క్షేత్రాన్ని కూడా ముంచెత్తుతుంది. అణచివేత ఎప్పుడూ ఆలోచనను చిదిమేయలేదు.

**భాషా సాంస్కృతిక రంగం:** రాష్ట్రం ఏర్పడిన తర్వాత కొత్తగా జరిపింది 'తెలంగాణ భాషా దినోత్సవం'. నిజానికి కాళోజి నారాయణరావు జయంతిని 'తెలుగు మాండలిక భాషా దినోత్సవం' అని జరుపమని హన్మకొండ సాహితీ మిత్రులతో స్వయంగా తానే చెప్పుకున్న సందర్భం ఉంది. తెలంగాణకోభాష, ఆంధ్రప్రదేశ్‌కోభాష లేదు. రెండూ తెలుగు భాషే. కాకపోతే మన మాండలికానికి పెద్దపీట వేయాలన్న కాళోజి ఆశయాన్ని అర్థం చేసుకోలేని వాళ్లు కొత్త పేరుతో జరుపడం వింతగొల్పింది. ఉమ్మడి రాష్ట్రంలో తెలంగాణ యాస భాష నిర్లక్ష్యానికి గురైనందున ఇప్పటికైనా భాషకు పెద్దపీట వేయలేకపోయింది. 2008లో ప్రాచీన హోదా దక్కించుకున్న తెలుగు భాష పరిశోధన కేంద్రాన్ని హైదరాబాద్‌కు రప్పించడంలో ఉమ్మడి పాలకులు ఎలాగు కృషిచేయలేదు. ఈ రెండేళ్లలో ఆ ప్రయత్నం చేయలేదు సరికదా ఆ కేంద్రం మైసూరులోనే మూలుగుతుంది. పైగా ఆంగ్లభాష పై ఎనలేని ప్రేమను కురిపిస్తోంది. తెలంగాణ ప్రాచీన భాషా సాంస్కృతుల పరిశోధనకు ఉపకరించే ప్రాచీన తెలుగు భాషా పరిశోధన కేంద్రాన్ని హైదరాబాద్‌కు రప్పించాల్సి ఉంది. దీంతో కేంద్ర ప్రభుత్వం నుండి 100 కోట్ల రూపాయలు భాషాభివృద్ధికి వస్తాయన్న సంగతి మరచిపోయింది ఈ ప్రభుత్వం. ఒక జాతి సాంస్కృతిక, అస్తిత్వ వికాసానికి పునాదియైన మాతృభాష పట్ల నిర్లక్ష్యం తగదు. ఈ రెండేళ్లలో ఉద్యమ కళాకారులకు 598 మందికి ఉద్యోగాలిచ్చి జీవనభృతి కల్పించిన మాట వాస్తవమైనా అందులో జానపద వృత్తి కళాకారులకు అవకాశాలు తక్కువ. ఇటీవల జరిగిన రాష్ట్ర అవతరణ ఉత్సవాల్లో ఒక్క దళిత, గిరిజన జానపద రచయిత వృత్తి కళాకారులకు సన్మానం నోచుకోలేదంటే నిజమైన కిందిస్థాయి దళిత జానపద కళాకారుల స్థితి ఏమిటో అర్థమౌతోంది.

సినీ కళారంగం కూడా ఈ రెండేళ్లలో ఆశించిదేమి జరుగలేదు. ఇప్పటివరకు ఆంధ్రా పెట్టుబడిదారుల, కళాకారుల ఆధిపత్యంతో కొనసాగిన సినీ పరిశ్రమ రాష్ట్రావతరణ తర్వాత ఎన్నో ఆశలు పెట్టుకుంది. తెలంగాణ సినీ కార్మికులు కళాకారుల కోసం ఒక ఎఫ్‌డిసి ఏర్పాటు కాలేదు. తెలంగాణ సినీ ప్రపంచానికి అద్భుతమైన ఫిల్మ్ సిటీ నిర్మిస్థామని రాచకొండ ప్రాంతాన్ని పరిశీలించిన ప్రభుత్వ ఆలోచనకు లక్ష నాగళ్లు అడ్డుపడ్డాయా?

**స్త్రీలు:** తెలంగాణ రాష్ట్ర సాధన పోరాటంలో అగ్రభాగాన నిలిచిన, రాణి రుద్రమ, చాకలి అయిలమ్మ, ఆరుట్ల కమలాదేవి వారసత్వానికి తగిన గౌరవం దక్కలేదు. స్థానిక సంస్థల్లో మార్కెట్ కమిటీల్లో 50 శాతం రిజర్వేషన్ ఇచ్చినా వైఫ్/ఆఫ్ రాజకీయాలే ప్రాధాన్యత వహిస్తున్నాయి. జిఎచ్‌ఎంసి ఎన్నికల్లో 50 శాతం రిజర్వేషన్ ఇచ్చి గెలుపొందిన వారికి అధికారిక పదవుల్లో మొండిచేయి చూపడం తెలంగాణ స్త్రీ శక్తికి దక్కిన తొలి బంగారు కంకణం. రాష్ట్రంలో స్త్రీల అక్షరాస్యతా శాతం 57.92 శాతమే. బాలికల అక్షరాస్యత వాళ్ల చదువుల కోసం ప్రత్యేక స్కాలర్‌షిప్‌లు ఏర్పాటు చేయకుండా ఏకంగా పెళ్లికి 51000 కాకుక ఇవ్వాలనుకుంది ప్రభుత్వం. కళ్యాణలక్ష్మి అవసరమే కాని 18 సంవత్సరాల తర్వాత కూడా పెద్ద చదువులు చదువుకోవాలనే కోరికగల ఆడపిల్లలకు మధ్య తరగతి కుటుంబాలు తమ సహజ ధోరణితో ఈ వెసులు బాటుతో వారి చదువులకు స్వస్తి చెప్పే అవకాశం లేకపోలేదు. మహిళల రక్షణకు షీ టీమ్స్ మంచదే అయినా ఇంకా స్త్రీలపై అత్యాచారాలు వేధింపులు ఆగడంలేదు. తెలంగాణ పోరాటంలో ముందు నడిచిన నారిలోకానికి రాష్ట్రం ఏర్పడ్డ రెండేళ్లకు కూడా స్త్రీ శిశు సంక్షేమానికి ఒక మహిళా మంత్రి లేకపోవడం తెలంగాణ వీర వనితల దురదృష్టమే.

**ప్రజా పంపిణి వ్యవస్థ:** స్వతంత్ర తెలంగాణ రెండేళ్ల ప్రజా పంపిణి వ్యవస్థలో నూతన మార్పులేవి చోటుచేసుకోలేదు. పైగా గతంలో ఇచ్చిన వంటనూనె నిలిచిపోయి రెండేళ్లయినా సబ్సిడిపైన (40 రుపాయలు) ఇచ్చే నూనె ప్యాకెట్ నూతన రాష్ట్రంలో వినియోగ దారునికి చేరలేదు. నిత్యావసర వస్తువుల ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. పప్పుల ధర ఆకాశాన్నంటింది. 200 రూపాయలకు కేజి ధర ఉన్న పప్పు ధరను నేలకు దించడానికి ప్రభుత్వం చేసిన ప్రయత్నమేది లేదు. కుటుంబంలో సంఖ్యతో సంబంధం లేకుండా ఆరు కిలోల బియ్యం ఇవ్వడం బాగానే ఉంది. కాని మిగిలిన వాటి సంగతేమిటి? ఇది వరకు సప్లయ్ చేసిన కారం, ఉప్పు, చింతపండు ఎంటుపోయినట్లు. హాస్టళ్లకు, స్కూళ్లకు సన్నబియ్యం సరఫరా ఒక్కటే కనిపిస్తుంది. దాంతోపాటే మెరుగైన కూర, చారు దొరికే పరిస్థితి లేదు. తెలంగాణ పోరాట వారసత్వానికి సన్నబియ్యం ఇవ్వడమే ఎక్కువనుకుంటున్నారా?

తెలంగాణ చరిత్ర పుటల్లో ఇప్పటికి సంపాదించుకున్న కీర్తి బావుట చాలు. ఇంకా ప్రజా ధనాన్ని లక్షలు, కోట్లు వెచ్చించి అత్యంత ఎత్తైన జెండా ఎగరేసి చాటుకోవాల్సిన అవసరం లేదు. లక్షల దళితుల కుటుంబాలలో దీపం పెట్టడం కన్నా ఆకాశమంత ఎత్తు శిలా విగ్రహాన్ని చూసి అంబేద్కర్ ఆనందపడతాడా? అవతరణోత్సవాలకు కోట్ల రూపాయల ప్రజా ధనం వృథా చేసి ప్రచారోత్సవాలుగా మలుచుకోవాల్సిన అవసరం లేదు. ఇంకముందైనా భాషా సంస్కృతుల పట్ల, ప్రజా హక్కుల పట్ల ప్రభుత్వ వైఖరి మారాలి. ఆకాశ హర్మ్యాలతో అతిపెద్ద జెండాలతో, ఊహించనంత ఎత్తైన విగ్రహాలతో రాష్ట్ర ప్రగతి ముందుకెళ్లదు. ప్రభుత్వ పరీక్షల్లో ప్రశ్నలడగడానికి తప్ప. నగర ప్రజలకు గాని, నగరాశ్రితులకు గాని ఇసుమంత ప్రయోజనం లేని ఇటువంటి చర్యలకు స్వస్తి చెప్పి రాష్ట్ర ప్రగతి ప్రయోజనాలపైన మరింత శ్రద్ధ చూపాలి. వ్యక్తిగత ప్రతిష్ట కోసం యజ్ఞ యాగాలకు, పుష్కర ఉత్సవాలకు అధిక ప్రాధాన్యతనిచ్చి శాస్త్రీయ ఆలోచనా ధోరణికి దూరంగా ప్రజలను నెట్టి వేయకుండా జాగ్రత్తపడాలి. తెలంగాణ సబ్బండ వర్ణాల మేలు కలయికతో ఏర్పడింది. అటువంటి ఐక్య సమాజంలో ప్రజలందరిని సమాన స్థాయి అభివృద్ధి పథంలోనికి నడిపించాలి. వర్గ ప్రయోజనాల కోసం ప్రజలను ఇబ్బందులకు గురి చేయకుండా ప్రొఫెసర్ జయశంకర్ సార్ ఆశించిన తెలంగాణ నిర్మాణానికి కృషి జరగాలి. ఆ వైపుగా ప్రభుత్వ భగీరథ ప్రయత్నం మరింతగా ముమ్మరం చేయాలి. కాకుండా ప్రజలను వర్గాలుగా, మతాలుగా, కులాలుగా, వ్యక్తులుగా విడదీసి నిర్మించే తెలంగాణైతే మళ్లీ మరొకసారి మనుషులుగా పోగుపడక తప్పదు.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# చంద్రబాబునాయుడు రెండేళ్ల పాలన

***రాష్ట్ర విభజన తర్వాత రెండు సంవత్సరాల కాలంలో ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన పాలన తీరుతెన్నులను వివరిస్తున్నారు***

**బెజవాడ కృష్ణ**

పాత ఆంధ్రప్రదేశ్‌కు తొమ్మిది సంవత్సరాలు ముఖ్యమంత్రిగా వ్యవహరించిన నారా చంద్రబాబు నాయుడు కొత్త ఆంధ్రప్రదేశ్‌కు ముఖ్యమంత్రిగా రెండు సంవత్సరాలు పూర్తి చేసుకున్నారు. సినిమా నటులు ఒక టేక్ సరిగ్గా నటించక కట్ చెప్పించుకుని, రెండో టేక్ షూటింగ్ జరిగేటప్పుడు, కొత్త తప్పులు చేస్తారేమో గాని, పాత తప్పులైతే చేయరు అని సినిమావాళ్లు అంటారు. కాని చంద్రబాబు నాయుడు మాత్రం రిటేక్‌లోనూ పాత తప్పులే, పాత పద్ధతి పాలనే కొనసాగించ దలచుకున్నట్టున్నారు. తాను పాత పాలనలో తప్పులు చేశానని మధ్యలో పదవిలో లేనప్పుడు ఆయనే ఒప్పుకున్నారు గనుక, తన పాలనలో తప్పులేవో తానే గుర్తించారు గనుక ఈసారి అవి చేయబోరని ఎవరైనా అనుకుని ఉంటే వారి నమ్మకాన్ని ఆయన వమ్ము చేయదలచారు. ఇరవై మూడు జిల్లాల రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఎలా పాలన సాగించారో పదమూడు జిల్లాల రాష్ట్రానికీ అటువంటి పాలననే ఇస్తుండడం చంద్రబాబు నాయుడు ప్రత్యేకత.

తుపాన్‌లు, కరవు, అతివృష్టి, అనావృష్టి, నేరాల పెరుగుదల, ప్రజా ఆందోళనలు, పర్యావరణ విధ్వంసం, రైతుల దుస్థితి, ఆత్మహత్యలు, విద్యా ఉద్యోగావకాశాల కొరత, వైద్య ఆరోగ్య సౌకర్యాల కొరత, కొత్త రాజధాని నిర్మించుకోవలసిన అవసరం వంటి ఎన్నో నిత్యజీవిత ప్రజా సమస్యలతో ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. ఒక కొత్త ప్రభుత్వం ఏదైనా ఈ సమస్యల పరిష్కారం గురించి ఆలోచించాలి. కాని ఆ సమస్యల వైపు ప్రజల దృష్టి మళ్లకుండా చేయడానికి ప్రయత్నించడమే తనపనిగా పాలకులు రెండు సంవత్సరాలుగా పనిచేస్తున్నారు. నామమాత్రంగానైనా సమస్యలు లేవనెత్తే అవకాశం ఉన్న ప్రతిపక్షాలను బలహీన పరచడానికి అతి నీచమైన అవకాశవాద ఎత్తుగడలకు, పార్టీ ఫిరాయింపుల ప్రోత్సాహానికి పాల్పడుతున్నారు. పౌరసమాజాన్ని, ప్రచార సాధనాలను కొని, భయపెట్టి, లోబరచుకుని అసలు సమస్యలు బైటపడకుండా చూసుకుంటున్నారు.

రాష్ట్ర విభజన జరిగి కొత్త ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పుడే దాని భవిష్యత్తు కష్టభరితంగా ఉండబోతుందని కొందరైనా ఊహించారు. కొత్త రాజధాని నిర్మాణం దగ్గరినుంచి పరిష్కరించవలసిన ప్రజాసమస్యలెన్నిటితోనో రాష్ట్రం మొదలయింది. ఆ స్థితిలో ఎన్నికలకు ముందు చేసిన ఆడంబరమైన, ప్రజాకర్షకమైన వాగ్దానాలను అమలు చేయడానికి తెలుగుదేశం పార్టీ కనీస ప్రయత్నాలు కూడ చేయడంలేదు. శ్వేత పత్రాలు, విజన్ 2029, రియల్ ఎస్టేట్ ప్రయోజనాల కోసం రాజధాని నిర్మాణం, దేశదేశాల బహుళ జాతి సంస్థలకు రాష్ట్ర పరిపాలనను, వనరులను, విధానాలను అప్పగించడం వంటి గత పాలనా కాలంలో అమలయిన విధానాలన్నీ యథాతథంగా తిరిగివచ్చాయి. రాజధాని విచారణ కోసం కమిషన్ నియమించి కూడ, ఆ కమిషన్ నివేదికను బుట్టదాఖలు చేసి, ఇష్టారాజ్యం గా రియల్ ఎస్టేట్ రాజధాని నిర్మాణం మొదలయింది. హైదరాబాద్ అనుభవంతో గుణపాఠం తీసుకుని వికేంద్రీకృత అభివృద్ధితో పలు నగరాలను అభివృద్ధి చేయడం కాకుండా మళ్లీ కేంద్రీకరణ ప్రయత్నాలు మొదలయ్యాయి. గతంలో లాగనే వ్యవసాయాభివృద్ధి, ఉపాధికల్పన, పారిశ్రామికీకరణ, ప్రజానుకూల విధానాలు, అణగారిన వర్గాల సంక్షేమం వంటి అంశాలు విస్మరణకు గురయ్యాయి. తీర రహదారి, విజయవాడ మెట్రో, పారిశ్రామిక కారిడార్లు, ఓడరేవులు, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, గనుల తవ్వకాలు వంటి బహుళజాతి సంస్థలకు మేలు చేసే పథకాలే కొనసాగు తున్నాయి. బూటకపు ఎన్‌కౌంటర్లు, పౌరహక్కుల ఉల్లంఘన, ప్రజా స్వామిక హక్కుల అణచివేత, ప్రజా ఉద్యమాల అణచివేత యథావిధిగా సాగుతున్నాయి. రాయలసీమ ప్రజల ప్రయోజనాలను ఖాతరు చేయకుండా, శ్రీ బాగ్ ఒడంబడిక నిబంధనలను పట్టించుకోకుండా రాజధాని నిర్మాణం మాత్రమే కాక అన్ని రంగాలలోను, రియల్ ఎస్టేట్, కార్పొరేట్ రంగాల ప్రయోజనాల కోసమే పనులు జరుగుతున్నాయి.

పోలవరం ప్రాజెక్టు, పట్టిసీమ ప్రాజెక్టు పేర్లతో ప్రజలను మభ్య పెడుతూ బహుళజాతి సంస్థలకు, ఆశ్రితులకు కాంట్రాక్టులు కట్టబెడుతున్నారు. గతంలో ప్రజాందోళనల వల్ల ఆగిపోయిన బాక్సైట్ తవ్వకాలను మళ్లీ కొనసాగించే ప్రయత్నాలు చేస్తున్నారు. పబ్లిక్ – ప్రైవేట్ భాగస్వామ్యం కింద మచిలీపట్నం నౌకాశ్రయం అభివృద్ధి, పద్నాలుగు కొత్త ఓడరేవులు, కాకినాడలో మరొక నౌకాశ్రయం, ప్రైవేటు రంగంలో వాణిజ్య నౌకాశ్రయం, విజయవాడ విమానాశ్రయం అభివృద్ధి, విజయవాడ–కాకినాడ మధ్య గ్రీన్ ఫీల్డ్ విమానాశ్రయం, కుప్పం, నెల్లూరు, కర్నూలు, శ్రీకాకుళంలలో విమానాశ్రయాలు, ఎలక్ట్రానిక్స్ పరిశ్రమల రంగంలోకి మూడు లక్షల కోట్ల రూపాయల పెట్టుబడుల ఆకర్షణ, అణువిద్యుత్ కేంద్రం వంటి భారీ పథకాలను ప్రకటిస్తూ వాటితోనే ఏదో అభివృద్ధి జరిగిపోతుందన్నట్టు ప్రజలను మాయచేస్తున్నారు. ఈ పథకాలన్నీ చాల పెద్ద ఎత్తున విస్థాపనకు, నిర్వాసితత్వానికి, సామాజిక విధ్వంసానికి దారి తీస్తాయనే అంశాన్ని దాచిపెడుతున్నారు.

గతంలో హైదరాబాదులో చేసినట్టుగానే పెట్టుబడిదారుల కోసం వనరుల ప్రలోభాలు, ప్రజల కోసం అబద్ధాల వాగ్దానాల ప్రగల్భాలు ఆకర్షణీయంగా కొనసాగించడానికి విశాఖపట్నంలో ఈసారి భాగస్వామ్య సదస్సు నిర్వహించారు. రు. 4,76,878 కోట్ల పెట్టుబడుల వాగ్దానాలు గుమ్మరించారు. గత అనుభవాలతో చూస్తే ఈ అబద్ధపు అంకెలో పదో వంతు కూడ నిజం కాదని తేటతెల్లమవుతుంది. కాగా, వచ్చే పెట్టుబడులు ఆంధ్రప్రదేశ్ వనరులను ఎంత కొల్లగొడతాయి, ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థకు ఏమి మేలు చేస్తాయి, ఆంధ్రప్రదేశ్ ప్రజలకు, నిరుద్యోగులకు ఏ అభివృద్ధినీ, ఉపాధినీ ఇస్తాయి అనే ప్రశ్నలకు జవాబులే లేవు. గతంలో జరిగిన భాగస్వామ్య సదస్సులు మన వనరులను దేశదేశాల పెట్టుబడిదారులకు, కార్పొరేట్ శక్తులకు దోచిపెట్టడానికే ప్రయత్నించాయి గాని ప్రజలకు వాటివల్ల ఒరిగిందేమీ లేదు.

ఈ రెండు సంవత్సరాల పాలనలో జరిగిన అతి పెద్ద ప్రజా వంచన రాజధానికి సంబంధించినది. రాజధాని నిర్మాణం కోసం ఒక కమిటీనికి కూడ నియమించి దాని సిఫారసులను బుట్టదాఖలు చేసి ప్రత్యేక చట్టం తెచ్చారు. అది ఐదు కోట్ల ప్రజల పాలనా అవసరాలు తీర్చే రాజధానిని ఏర్పాటు చేసే చట్టంగా కాక పిడికెడు మంది రియల్ ఎస్టేట్ వ్యాపారుల ప్రయోజనాలకోసం తయారయింది. కొత్త రాజధాని నిర్మించుకునే అవకాశం వచ్చినప్పుడు పాత గుణపాఠాలేమీ నేర్చుకోకుండా కేంద్రీకృత కాంక్రీటు అరణ్యానికి పథకాలు రచించారు. కృష్ణా నదీ తీరంలో, పుష్కలమైన నీటివసతి ఉన్న జరీబు భూముల వ్యవసాయాన్ని దెబ్బతీసి, ఆ భూములను రియల్ ఎస్టేట్‌గా మార్చి ఎకరాల్లో కొని గజాల్లో అమ్మే దళారులకు అప్పగించడానికి మార్గం సుగమం చేయడం, ప్రభుత్వమే అధికారిక రియల్ ఎస్టేట్ బ్రోకర్‌గా పనిచేయడానికి సిద్ధపడడం ఆ చట్టం లక్ష్యం. భవననిర్మాణాలలో వాటా, నష్ట పరిహారం, వార్షిక ఆదాయం, భవిష్యత్తు ఆదాయం వంటి మాయ మాటలతో కొందరు రైతులను ఆకర్షించి, భూమి సేకరించి, ఆ ప్రాంతంలో భూమి లేని నిరుపేదలకు, వ్యవసాయం మీద, ఇతర సేవావృత్తుల మీద ఆధారపడిన లక్షలాది ప్రజలకు తీరని అన్యాయం చేశారు. ఒక కొత్త రాష్ట్రానికి కొత్త రాజధాని తప్పనిసరి అవసరమే. దేశంలో కొత్తగా ఏర్పడిన చాల రాష్ట్రాలు పాత నగరాల పక్కన కొత్త రాజధాని నగరాలు నిర్మించుకున్నాయి. అదేమీ కొత్త విషయం కాదు. ఒక రాష్ట్ర ముఖ్యమంత్రి అంతవరకూ ఉన్న నగరాలకన్న మెరుగైన రాజధాని నిర్మించాలని అనుకోవడమూ తప్పు కాదు. కాని ఆంధ్రప్రదేశ్ రాజధాని సమస్య అంత సులభమైనది కాదు. ఆ రాష్ట్రంలోని మూడు ప్రధాన ప్రాంతాలలో అప్పటికే రెండు ప్రాంతాల ప్రజలలో వివక్షకు గురవుతున్నామన్న భావన ఉంది. రాయలసీమ ప్రజలలో గతంలో ఆంధ్ర రాష్ట్ర రాజధాని తమకు ఇచ్చినట్టే ఇచ్చి తప్పించారనే మనస్తాపం ఉంది. ఆ మనస్తాపాన్ని బలోపేతం చేసే శ్రీబాగ్ ఒడంబడిక ఉల్లంఘన ఉంది. రాష్ట్రంలో అన్నిరకాలుగానూ మొదటి స్థానంలో ఉన్న విశాఖపట్నం రాజధాని అయితే బాగుండునని ఉత్తరాంధ్ర ప్రజల్లో కోరిక ఉంది. కాని ప్రజా ఆకాంక్షలన్నిటినీ నిర్దాక్షిణ్యంగా తొక్కివేస్తూ తెలుగుదేశం ప్రభుత్వం అమరావతిని రాజధాని చేసింది.

ఈ రెండు సంవత్సరాల పాలనలో మరొక ప్రధానాంశం రాష్ట్రానికి ప్రత్యేక హోదా వివాదం. ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టం 2014 మీద పార్లమెంటులో చర్చ జరిగినప్పుడు, విడిపోయాక ఆంధ్రప్రదేశ్ ఆర్థికంగా దెబ్బతింటుందని, అందువల్ల దానికి అదనపు సౌకర్యాలు, వసతులు, నిధులు సమకూర్చాలని అప్పటి ప్రతిపక్షం భారతీయ జనతా పార్టీ గట్టిగా వాదించింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని ప్రత్యేక ప్రతిపత్తి గల రాష్ట్రంగా గుర్తించాలని కోరింది. ఆ హామీలు ఇవ్వకపోతే తాము బిల్లును వ్యతిరేకిస్తామని, బిల్లు ఓడిపోయేలా వోటింగ్ కోరుతామని కూడ బెదిరించింది. అటువంటి ప్రత్యేక సహాయాల కోసం పట్టు బట్టిన ప్రతిపక్షమే తర్వాత అధికారపక్షం అయింది. కాని ఎన్‌డిఎ ప్రభుత్వం ఆ వాగ్దానాన్ని విస్మరించి ఆంధ్రప్రదేశ్ ప్రజలను మోసం చేయడానికి సిద్ధపడింది. కేంద్ర మంత్రివర్గంలో పదవులు తీసుకుని తెలుగుదేశం పార్టీ ఆ మోసంలో భాగస్వామి అయింది.

మరొక ముఖ్యాంశం పౌరహక్కుల అణచివేత. శాసనసభ సమావేశమైన మొదటిరోజే నల్లమలలో ముగ్గురు సాధారణ జీవితం గడుపుతున్న వ్యక్తులను కాల్చిచంపి ఎన్ కౌంటర్ కథ అల్లారు. సభలు, సమావేశాలు జరుపుకోకుండా నిషేధాజ్ఞలు విధించడం, చివరికి పత్రికాసమావేశాల ముందు సమావేశకర్తలను అరెస్టు చేయడం, లాఠీచార్జీలు, బెదిరింపులు, ఎన్ కౌంటర్లు సర్వసాధారణమైపోయాయి. శేషాచలం అడవుల్లో ఎర్రచందనం అక్రమ రవాణాదారుల పేరుతో ఒకేసారి 20 మంది కూలీలను చంపడం ఆంధ్రప్రదేశ్ రెండేళ్ల పాలనలో దుర్మార్గమైన చర్య. మృతులు కొడవళ్లతో, గొడ్డళ్లతో, తుప్పుపట్టిన రెండు నాటు తుపాకులతో తమ మీద దాడికి దిగితే సకల ఆయుధాలు ఉన్న పోలీసులు ఆత్మరక్షణ కోసం కాల్పులు జరిపారనే అతకని అబద్ధంతో పాలకులు తాము ఏమి చెప్పినా ప్రజలు నమ్ముతారనే మితిమీరిన అహంకారంతో కథ అల్లారు. మరొకవైపు ఇంత దుర్మార్గంగా, అబద్ధాలతో హతమైపోయిన ఆ కూలీలను నియమించిన నిచ్చెనమెట్ల వ్యవస్థలో పైన ఉన్నవారు రాజకీయ, అధికారవర్గాలలోనే ఉన్నారు. ఎర్రచందనం మాఫియా నిధులే అన్ని రాజకీయ పార్టీల బొక్కసాలకు చేరుతున్నాయి.

ఎర్రచందనం మాఫియా చిత్తూరు, కడప జిల్లాలది కాగా, ఇసుక మాఫియా రాష్ట్రమంతటా విస్తరించినది. ఇసుక మాఫియా అక్రమాలను అడ్డుకున్న అధికారికి పాలకులు పురస్కారాలు, ప్రశంసలు ఇవ్వలేదు సరిగదా ఎదురు శిక్ష విధించాలి. విద్యారంగ మాఫియా అగ్రనాయకుడే మంత్రివర్గంలో కీలక వ్యక్తి అయి విద్యారంగ మాఫియా అక్రమాలు విచ్చలవిడిగా జరిగిపోతున్నాయి. విజయవాడలో బైటపడిన కాల్ మనీ కుంభకోణం ప్రభుత్వపు ప్రజావ్యతిరేక నిర్లక్ష్య వైఖరికి నిదర్శనంగా నిలిచింది. ఈ కాల్ మనీ కుంభకోణం రుణగ్రహీతల కుటుంబాల స్త్రీల మీద అత్యాచారాలుగా చివరి అంకానికి చేరినప్పుడు విజయవాడ భగ్గుమన్నది. ఈ గొలుసులో ప్రతి ఒక్క చోట ప్రభుత్వ జోక్యానికి, వడ్డీ వ్యాపారుల, వేధింపుదార్ల ఆట కట్టించడానికి అవకాశం ఇచ్చే చట్టాలు ఉండగా, ఏళ్ల తరబడి ఆ చట్టాలను పక్కనపెట్టి, ఈ వడ్డీవ్యాపార పాపంలో భాగం పంచుకున్న పాలకులు, హఠాత్తుగా మేలుకొన్నట్టు, తామొక్కరే పవిత్రులమన్నట్టు ఇతర పార్టీల మీద ఆరోపణలు సంధించారు. అసలు చర్యలు మాత్రం మరిచారు.

రెండు సంవత్సరాల పాలనలో ప్రతినిత్యం ప్రజలు ఎదుర్కొన్న, ఎదుర్కొంటున్న ఇటువంటి సమస్యల మీద చర్చ జరగకుండా, తాము అమలు చేయలేకపోయిన వాగ్దానాల గురించి చర్చ జరగకుండా, పేదరికం, అవిద్య, అనారోగ్యం, నిరుద్యోగం, ఆత్మగౌరవం, రైతాంగం ఆత్మహత్యలు, పాలకుల వాగ్దానభంగాలు వంటి నిజమైన సమస్యల మీద చర్చ జరగకుండా, పాలకుల నిర్వాకం మీద చర్చ జరగకుండా ప్రజలను పక్కదారి పట్టించడానికి, దృష్టి మళ్లించడానికి అంటే, రొట్టె ఇవ్వలేనప్పుడు సర్కస్ ఇవ్వాలి అని సామెత చెప్పినట్టు, ఈ అసలు సమస్యలు చర్చించడానికి అవకాశం లేని, తీరికలేని ఒక ఉద్వేగ, ఉన్మాద వాతావరణం సృష్టించడానికి ప్రయత్నిస్తున్నారు. గోదావరి పుష్కరాలు, అమరావతి శంకుస్థాపన, ప్రతిపక్షాల మీద దుమ్మెత్తిపోయడం, చౌకబారు వివాదాలకు ప్రధాన స్థానం ఇవ్వడం అనే పక్కదారి ప్రయత్నాలు చేస్తున్నారు. ప్రతిపక్ష అభ్యర్థిగా, తమ అభ్యర్థి మీద గెలిచి శాసనసభకు వచ్చిన వారిని నిస్సిగ్గుగా కొనివేసి తమవాడని చెప్పుకొని ప్రశ్నలు లేకుండా చేసుకోవాలనుకుంటున్నారు. ఆ ప్రతిపక్ష శాసనసభ్యులు కూడ నిస్సిగ్గుగా అభిప్రాయాలు మార్చుకోవడం, అలా మార్చుకోదలచుకుంటే మళ్లీ ప్రజల ఎన్నికకు సిద్ధపడాలని అనుకోకపోవడం, ఈ కప్పల తక్కెడ కొనుగోలు అమ్మకపు రాజకీయాలను స్వయంగా అధికారంలో ఉన్నవారే నిర్వహించడం రెండేళ్ల ఆంధ్రప్రదేశ్ పాలనలో నిరాటంకంగా జరిగిపోతున్న పనులు.

రాష్ట్రం సగం అయిపోయినా, ప్రజల సమస్యలు రెట్టింపు అయినా, పాలకులు మారినట్టనిపించినా, విధానాలు మారని ఆంధ్రప్రదేశ్ 'పెనం మీది నుంచి పొయ్యిలో పడ్డట్టు' అనీ, 'గొర్లను తినేవాడు పోయి బర్లను తినేవాడు వచ్చినట్టు' అనీ పాత తెలుగు సామెతలను గుర్తు చేస్తున్నది.

*(రచయిత పాత్రికేయులు)* వీ

# మోడీ రెండేళ్ల పాలన

***ప్రజలను కులం, మతం పేరుతో విభజిస్తూ, దేశ సంపదను సామ్రాజ్యవాదులకు కట్టబెడుతూ, దోపిడీని ప్రశ్నించే గొంతులను నొక్కేస్తూ, దేశాన్ని హిందూ రాజ్యాంగా మార్చేవైపు ప్రభుత్వ విధానాలు ఉన్నాయని అంటున్నారు ఎ. నర్సింహా రెడ్డి***

కేంద్రంలో నరేంద్రమోడీ అధికార పగ్గాలు చేపట్టి రెండేండ్లు పూర్తి చేసుకున్న సందర్భంగా ప్రభుత్వం ఇటీవల బ్రహ్మాండంగా సంబరాలు చేసుకున్నది. పైగా తన పాలన గురించి విపరీతమైన ప్రగల్భాలు పలుకుతూ ప్రకటనలు గుప్పించింది. కానీ, వాస్తవ పరిస్థితి అందుకు విరుద్ధంగా ఉంది. నరేంద్రమోడీ రెండేళ్ల పాలనలో ఏమున్నది గర్వకారణమని ఒకసారి సింహావలోకనం చేస్తే, అనేక పథకాల పటాటోపం, అదే పనిగా ప్రపంచ దేశాల మెరుపు పర్యటనలు, అమెరికాకు లొంగుబాటు, మాటల మాయజాలం, మితవాద, మతవాదుల దాడులు, మతం పేరిట దేవుడి పేరిట సమాజాన్ని విభజించే ప్రయత్నాలు, పెచ్చుమీరుతున్న అసహనం, ప్రగతిశీల మేధావులపై దాడులు, హత్యలు తప్ప గర్వంగా చెప్పుకోవడానికి ఏమీ లేదనడం అతిశయోక్తి కాదు. ఈ రెండేళ్లలో ప్రజలపై అంతులేని ఆర్థిక భారాలు మోపింది. గొర్రెల మందల్లాగా ప్రజలు ఆమోదిస్తారని కేంద్ర ప్రభుత్వం భావిస్తున్నట్టుగా ఉంది.

2014 ఎన్నికల ప్రచారం సందర్భంగా తమకు అధికారమిస్తే అవినీతి రహిత, ఆత్మహత్యలు లేని భారత్, యువతకు ఉపాధి, స్వచ్ఛమైన పాలన, నిత్యావసర వస్తువుల ధరల నియంత్రణ, విదేశాల్లో దాచిన నల్లధనాన్ని వంద రోజుల్లో వెనక్కి తెచ్చి, ఒక్కో కుటుంబం బ్యాంకు ఖాతాలో రు. 15 లక్షలు వేస్తామన్న మోడీ హామీలు నీటి మూటలయ్యాయి. భారతదేశాన్ని అగ్రరాజ్యాల సరసన నిలుపుతానని ప్రగల్భాలు పలికారు. కాని మాటలకు, చేతలకు పొంతనలేదన్నది రెండు సంవత్సరాల పాలన రుజువు చేసింది. ఆర్థిక, సామాజిక, రాజకీయ రంగాలలో ప్రజానుకూల మార్పులు వస్తాయని ఆశించిన వారికి నిరాశే మిగిలింది. 'మంచిరోజులు వచ్చాయని' వారి వంది మాగధులు, కార్పొరేట్ మీడియా చేస్తున్న గొబెల్ ప్రచారం వట్టి బూటకం. ప్రజలను ప్రత్యేకించి యువకుల్లో ఆశలు రేకెత్తిస్తూ 'మేక్ ఇన్ ఇండియా, 'స్కిల్ ఇండియా', 'డిజిటల్ ఇండియా' అంటూ ఇచ్చిన నినాదాలు ఆచరణలో ఎక్కడా కనిపించడం లేవు.

**ఆచరణకు రాని హామీలు**

కాబట్టి మోడీ రెండేళ్ల పాలనను ప్రజల దృష్టికోణం నుంచి పరిశీలించాల్సి ఉంది ఈ ప్రభుత్వం ఏ దిశగా ప్రయాణిస్తున్నది. కార్పొరేట్ రంగానికి సకల సదుపాయాలు కల్పిస్తూ మెజారిటీ ప్రజలను ఎందుకు నిర్లక్ష్యం చేస్తున్నది? ట్రేడ్ యూనియన్ హక్కులను హరిస్తూ కార్మిక చట్టాలను ఎందుకు సవరిస్తున్నది? రైతులనుండి భూములు బలవంతంగా లాక్కునే ఆర్డినెన్స్ ఎందుకు తెచ్చింది? వ్యాపారుల లాభాలు వృద్ధిలో ఉంటే రైతులు, వినియోగదారులు ఎందుకు నష్టపోతున్నారు? బుల్లెట్ రైళ్లు, స్మార్ట్ సిటీలు కలవారికి కలిగే సదుపాయాలేగాని అట్టడుగునున్నవాడి అన్నార్తి తీర్చవు. కావలసింది పరిశ్రమల స్థాపన, వ్యవసాయ ఆధునికీకరణ, ఉపాధి కల్పన, ధరల నియంత్రణ, సామాజిక శాంతి, సామరస్యం పరిరక్షణ. ఈ ప్రాథమిక విషయాల్లో ప్రభుత్వ సాఫల్యాలను బట్టే ప్రజలు మోడీ పాలనను అంచనా వేస్తారని ప్రత్యేకించి చెప్పాల్సిన పనిలేదు.

విదేశాల్లో అక్రమంగా సంపాదించి దాచిన డబ్బును వంద రోజుల్లో వెనక్కి రప్పిస్తామంటూ ఎన్నికల ముందు చేసిన ఆర్భాటపు ఉపన్యాసాల ఆచరణలో గడపదాటని పరిస్థితి ఏర్పడింది. ఎప్పటికప్పుడు కుంటిసాకులు, మీనమేషాలు లెక్కించడం మినహా మోడీ సర్కారు ఈ విషయంలో చేసింది శూన్యం. అక్రమ సంపద దాచినవారిపై కఠిన చర్యలు తీసుకునే సంగతి ఎలా ఉన్నప్పటికీ వారి మోచేతి నీళ్లకు వెంపర్లాడే పరిస్థితి సర్కారులో నెలకొంది. దేశం దాటి పోతూ ఉంటే కళ్లుండి చూడలేని విధంగా వ్యవహరించిన తీరు వట్టిమాటల డొల్లతనాన్ని బట్టబయలు చేసింది. ప్రపంచ వ్యాప్తంగా కలకలం సృష్టించిన పనామా పత్రాల వ్యవహారాల్లోనూ మోడీ సర్కారుది ఇదే తీరు. విదేశాల్లో వ్యాపార సామ్రాజ్యాలు నిర్మించుకునేందుకు నిబంధనలను తుంగలో తొక్కి నిధులను దేశ సరిహద్దులు దాటించారని తేలినా చర్యలకు వెనకాడడం మోడీ సర్కారు బలహీనతకు, వాగ్దాన భంగానికి నిదర్శనం. పనామా పత్రాల దాటికి కొన్ని దేశాల్లో ప్రభుత్వాలే మారిపోతే, మనదేశంలో మాత్రం ఒక కమిటీతో సరిపెట్టి నిమ్మకు నీరెత్తినట్లు వ్యవహరించడం దేశద్రోహం కాక మరేమౌతుందో అర్థం కాదు.

ఎన్నికల ముందు అధికారంలోకి వస్తే ఉద్యోగాల పంట పండుతుందంటూ సాగిన ప్రచారం అటకెక్కింది. రెండేళ్ల పాలనలో కొత్త ఉద్యోగాల సంగతి ఎలా ఉన్నప్పటికీ ఉన్న ఉద్యోగాలే పోయే పరిస్థితి దాపురించింది. మేక్ ఇన్ ఇండియా మోడీ విదేశీ పర్యటనలకు తప్ప స్వదేశానికి ఒరగబెట్టింది శూన్యం. కొత్త పరిశ్రమలు రాకపోగా ఉన్న దేశీయ పరిశ్రమలు, గనులు మూతపడడం, బిపిఓలు నీరస పడడం తదితర కారణాలతో లక్షలాది మందికి ఉన్న ఉపాధి పోయింది. ఫలితంగా ఏటా రెండు కోట్ల మందికి ఉపాధి కల్పిస్తామన్న హామీ వట్టిమాటగానే మిగిలిపోయింది. అవినీతి రహిత ప్రభుత్వమన్న ఆర్భాటపు ప్రచారమూ గురివింద గింజ సామెతగానే మారింది. బ్యాంకులను దివాలా తీయించిన కింగ్‌ఫిషర్ అధినేత విజయ్ మాల్యా తప్పించుకొని లండన్ పారిపోతుంటే చూసి చూడనట్లుండడం, వ్యాపం కుంభకోణం నుండి మధ్యప్రదేశ్ ప్రభుత్వాన్ని రక్షించే ప్రయత్నాలు, ఐపిఎల్ కుంభకోణంలో కీలక నింధితుడైన లలిత్‌మోడీని దేశ సరిహద్దులు దాటించేంత వరకు సాగిన వ్యవహారాల్లో బిజెపి మంత్రులు, ముఖ్యమంత్రుల పాత్ర బట్టబయలు కావడం బిజెపి ద్వంద్వ ప్రమాణాలకు నిదర్శనం. ప్రణాళికా సంఘాన్ని

రద్దుచేసి నీతి ఆయోగ్ ఏర్పాటు చేసింది. దాని అధికారాలేమిటో స్పష్టతలేదు. 'సహకార సమాఖ్య' అని ప్రవచనాలు చెబుతూ ఆ స్ఫూర్తికి విరుద్ధంగా ప్రజలెన్నుకున్న ప్రభుత్వాలను ఫిరాయింపులు ప్రోత్సహించి కూలదోస్తున్నది. అరుణాచల్‌ప్రదేశ్‌లో ఫలప్రదమైన వ్యూహం ఉత్తరాఖండ్‌లో బెడిసి కొట్టింది. సుప్రీంకోర్టు చేత రాజ్యాంగం గూర్చి పాఠాలు చెప్పించుకుంది.

మోడీ రెండేళ్ల పాలనలో పరిపాలనాపరంగా, సామాజికంగా తిరోగమన విధానాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. తమ గురుపీఠం ఆర్‌ఎస్‌ఎస్ ఆదేశించిన హిందూత్వ ఎజెండాను చాపకింద నీరులా అమలు జరిపేందుకు ప్రభుత్వ అధీన సంస్థల అధిపతులుగా హిందూత్వ వాదులను నియమిస్తోంది. మరోవైపున కరుడుగట్టిన హిందూత్వవాదులు, కొందరు ఎంపిలు, ఎంఎల్ఏలు సైతం మతోద్రేకాలు రెచ్చగొట్టే ప్రకటనలు, చర్యలతో సామాజిక శాంతిని కలుషితం చేస్తున్నారు. మైనారిటీలపై విషం కక్కుతున్నారు. భారతదేశ బహుళత్వానికి ప్రమాదం తెస్తూ చరిత్ర తిరగరాస్తున్నారు. మాలెగాం, సంఝౌతా ఎక్స్‌ప్రెస్, మక్కా మసీద్ పేలుళ్ల కేసులో నిందితులైన హిందూత్వ తీవ్రవాదులపై కేసులు నీరుగార్చుతున్నారు. చట్టం, మోడీ పాలనలో మైనారిటీల విషయంలో వివక్ష చూపుతుందనిపిస్తుంది. చట్టాన్ని సమానంగా, న్యాయంగా అమలు జరపకపోతే మతాల వారిగా సమాజం చీలే ప్రమాదముంది.

**కుదేలవుతున్న ఉత్పత్తి రంగం**

దేశ ఆర్థికరంగం గణనీయంగా వృద్ధి పథంలో దూసుకు పోతోందంటూ సర్కారు ఎన్ని ప్రకటనలు చేస్తున్నప్పటికీ వాస్తవ పరిస్థితులు అందుకు భిన్నంగా కనిపిస్తున్నాయి. ఇందుకు తాజా నిదర్శనం ప్రభుత్వం తాజాగా విడుదల చేసిన 'పారిశ్రామికోత్పత్తి' గణాంకాలే. ప్రజల కొనుగోలు శక్తిలో పెద్ద మార్పులు లేకపోవడంతో పారిశ్రామికోత్పత్తి తీవ్ర ఒత్తిడిలో కొనసాగుతుంది. 2015-16లో పారిశ్రామికోత్పత్తి సూచీ 2.4 శాతానికి పడిపోయింది. ఇంతక్రితం 2014-15లో ఇది 2.8 శాతం వృద్ధిని నమోదు చేసింది. 2015-16 ఆర్థిక సంవత్సరంలో తయారీ రంగం ఉత్పత్తి 2 శాతానికి క్షీణించింది. 2014-15లో ఈ రంగం 2.3 శాతం వృద్ధిని నమోదు చేసుకుంది. 2016 ఏప్రిల్‌లో 22 పరిశ్రమ రంగాల్లో 9 రంగాలు తయారీలో ప్రతికూల వృద్ధిని ఎదుర్కొన్నాయని కేంద్ర గణాంకాల శాఖ జూన్ 9న ఒక నివేదికలో వెల్లడించింది. మొత్తం పారిశ్రామికోత్పత్తి సూచీలో తయారీ రంగం 75 శాతం వాటా కలిగి ఉంది. ఏప్రిల్‌లో ఈ రంగం వృద్ధి రేటు 3.1 శాతానికి పడిపోయింది. గతేడాది ఇదే మాసంలో ఈ విభాగం 3.9 శాతం వృద్ధిని కనబర్చింది. ప్రభుత్వ, ప్రయివేటు పెట్టుబడుల్లో బలహీనత వల్ల క్యాపిటల్ గూడ్స్ వరుసగా పతనాన్ని చవి చూసింది. ఈ రంగం 24.9 శాతం మేర క్షీణించింది.

ఎలక్ట్రిక్ మిషనరీ ఉత్పత్తి ఏకంగా 55.9 శాతం మేర క్షీణించింది. ఇదే క్రమంలో ఆహారోత్పత్తులు, పానియాలు 17.6 శాతం, కమ్యూనికేషన్ రంగాల్లో వృద్ధి 18.7 శాతం మేర తగ్గాయి. ఈ ఏడాది వర్షాలు బాగుంటే తప్ప ఆర్థిక వ్యవస్థ పుంజుకొనే అవకాశాలు లేవని విశ్లేషకులు పేర్కొంటున్నారు. 2014-15లో పెట్టుబడుల పరిస్థితిని గమనించినా ఇదే ధోరణి వ్యక్తమవుతుంది. 2013లో 5.3 లక్షల కోట్ల మేర పెట్టుబడులు పెట్టేందుకు ప్రతిపాదనలు వస్తే 2014-15లో ఇది 23 శాతం పతనం అయ్యింది. ఆ సంవత్సరం కేవలం నాలుగు లక్షల కోట్ల మేర మాత్రమే పెట్టుబడి ప్రతిపాదనలు వచ్చాయి. ఇక 2015-16లో పెట్టుబడులు మరో 23 శాతం తగ్గి 3.11 లక్షల కోట్లకు పరిమితమయ్యాయి. 2016 ఆర్థిక సంవత్సరంలో మొదటి మూడు మాసాల్లో కేవలం రు. 60,130 కోట్ల పెట్టుబడులకు మాత్రమే ప్రతిపాదనలు వచ్చాయి. గ్రామీణ ప్రాంతాల్లో డిమాండ్ పెరిగితేనే పారిశ్రామికోత్పత్తికి మద్దతు లభించనుందని వారు చెబుతున్నారు. తాజా ప్రతికూల పరిణామాలు మోడీ రెండేళ్ల పాలన వృద్ధి రేటుపై ఒత్తిడి పెంచనున్నాయని విమర్శకులు పేర్కొంటున్నారు.

**సంక్షోభంలో వ్యవసాయం**

దేశ వ్యవసాయరంగం గత రెండేళ్లలో వర్షాభావ ప్రేరిత కరువువల్ల, పాలకుల అవగాహన రాహిత్య విధానాల వల్ల తీవ్ర సంక్షోభంలో చిక్కుకుంది. రైతాంగంపై మోడీ ఎంత మొసలికన్నీరు కార్చినా ప్రపంచీకరణ ఆర్థిక విధానాలకు వ్యవసాయరంగం నేటికీ బలౌతూనే ఉన్నది. గత సంవత్సరం వ్యవసాయోత్పత్తి 0.02 శాతానికి దారుణంగా పడిపోయింది. రైతుల ఆత్మహత్యలులేని భారతదేశాన్ని నిర్మిస్తానని మోడీ చేసిన గంభీరోపన్యాసాలకు విలువ లేకుండా పోయింది. ఈ రెండు సంవత్సరాల్లో ఆంధ్రప్రదేశ్, తెలంగాణలో వందలాదిమంది రైతులు ఆర్థిక ఇబ్బందులతో ఆత్మహత్యలు చేసుకోగా, బిజెపి పాలిత రాష్ట్రం మహారాష్ట్రలో గత సంవత్సరకాలంలో మూడు వేలకు పైగా రైతులు ఆత్మహత్యలు చేసుకున్నట్టు వివిధ పత్రికలు వెల్లడించాయి. దేశంలో ప్రతి అర్ధగంటకు ఒక రైతు ఆత్మహత్యకు పాల్పడుతున్నాడు. వ్యవసాయ ఉపకరణాల ధరలు రోజురోజుకు పెరుగుతూనే ఉన్నాయి. అయినా వ్యవసాయ రంగానికి బడ్జెట్ నిధుల్లో, ఎరువుల సబ్సిడీలలో కోత విధించారు.

వ్యవసాయోత్పత్తులకు కనీస మద్దతు ధరను పెంచుతానని, వ్యవసాయ ఖర్చులపై 50 శాతం లాభం వచ్చేలా చేస్తానని చెప్పిన మోడీ ముఖం చాటేశారు. గ్రామీణ ప్రాంతంలో ఉపాధి అవకాశాలు పెంచుతానని ఎన్నికల ముందు హామీలిచ్చిన మోడీ అధికారంలోకి వచ్చి రెండు సంవత్సరాలయినా నేడు ఈ ఊసే లేదు. గిట్టుబాటు ధరలు లేక, అప్పుల భారాన్ని మోయలేక, ప్రభుత్వ చేయూతలేక సతమతమవుతున్న రైతాంగానికి గోటిపై రోకటి పోటన్నట్లు కరువు కాటేసింది. దేశ వ్యాపితంగా 40 కోట్ల మంది ప్రజలు తాగటానికి నీరులేక, పశువులకు మేతలేక, కరువు పనులు లేక అల్లాడుతుంటే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు చీమకుట్టినట్లయినా లేదు. ప్రజల జీవన్మరణ సమస్యగా ఉన్న కరవు పరిస్థితిపై సుప్రీంకోర్టు ఏకంగా 50 గంటలపాటు విచారిస్తే, పార్లమెంటులో చర్చించడానికి కేంద్ర ప్రభుత్వానికి అధికార బిజెపి, ప్రతిపక్ష కాంగ్రెస్ పార్టీలకు సమయమే దొరకలేదు. రైతాంగం గతంలో ఎన్నడూ లేని విధంగా సంక్షోభ సముద్రంలో చిక్కుకుంది. గతంలో కొన్ని రాష్ట్రాలకే పరిమితమైన రైతు ఆత్మహత్యలు ఇప్పుడు దేశవ్యాప్తమైనాయి. ఉపాధి హామీ చట్టాన్ని నీరుగార్చి వ్యవసాయ కార్మికుల పొట్టగొట్టిన ఘనతనూ కేంద్ర సర్కారు మూటగట్టుకుంది.

భారత రైతాంగం ప్రకృతి విపత్తుల వల్ల పంట నష్టపోతున్నప్పుడు తగిన పరిహారం చెల్లించాలని ప్రభుత్వాన్ని చాలకాలంగా డిమాండ్ చేస్తోంది. ఈ క్రమంలో విపరీత ప్రచారంలో ఉన్న మోడీ ప్రభుత్వ పంటల పసల్ భీమా పథకం ఒక పచ్చి దగా. ఈ పథకంలో భాగంగా ప్రీమియంను ప్రభుత్వం చెల్లిస్తున్నట్లయితే రైతులకు ఎంతోకొంత మేలు

జరిగేది. అయితే అలా జరగటం లేదు. ప్రస్తుత భీమా మార్గాన్ని అనుసరించటమంటే భీమా కంపెనీల వ్యాపారాన్ని పెంచటమే. ఈ కంపెనీలు రైతుల దగ్గర నుంచి ప్రీమియంను వసూలు చేసి పంటలు దెబ్బతిన్నప్పుడు చెల్లించాలి. ఈ పంటల భీమా పథకం కార్పొరేట్ కంపెనీలకు తప్ప రైతులకు అనుకూలమైనది కాదు. రైతులను నష్టపరిచైనా కార్పొరేట్ కంపెనీలకు లాభాలను గడించే అవకాశాలను పెంచటానికి మోడీ ప్రభుత్వం ఈ పంటల భీమా పథకాన్ని తీసుకువచ్చింది.

**ప్రజాస్వామ్యం పేరుతో ఫాసిస్టు పాలన**

భారత పార్లమెంటరీ రాజకీయ వ్యవస్థలో రాజ్యాంగం ప్రకారం మతం వ్యక్తిగత అంశంగానే ఉండిపోవాలి. కానీ సామాజిక, రాజకీయ రంగాల్లో మతం ప్రాబల్యం పెరిగింది. హిందూత్వ మతోన్మాదశక్తులు మునుపెన్నడూ లేనంతగా ప్రజాజీవితంలోకి చొచ్చుకురావడం చూస్తున్నాం. ప్రజల దైనందిన జీవితపు అలవాట్లనీ శాసించడం మతం పేరుతో చెలరేగిన ఉన్మాదానికి పరాకాష్ట. ఎవరు ఏం తినాలో, ఏం వినాలో, ఏం చదవాలో, ఏం చూడాలో, ఏం మాట్లాడాలో, ఏం రాయాలో మతోన్మాదశక్తులు చెప్పబూనడం దుస్సాహసం. సృజనశీలురు ఏం రాయాలో, ఏం రాయకూడదో మతం పేరిట చెలరేగిన శక్తులే నిర్ణయించే చోట వ్యక్తి స్వేచ్ఛ ఎండమావి. వ్యక్తీకరణకు సంకెళ్లను విధించడమే. కళాకారుల అభివ్యక్తిని నియంత్రించడమే. ఇది అంతిమంగా ప్రజాస్వామ్య సంస్కృతిని కాలరాయడమే. మోడీ అమలు చేస్తున్నది బూటకపు ప్రజాస్వామ్యం అని చెప్పక తప్పదు.

సుపరిపాలన అన్నది ప్రజాస్వామ్యంలో పాలకుల బాధ్యత. అయితే మోడీ సర్కార్ దానిని విస్మరించింది. జనహితమే పాలకుల పరమావధి కావాలి. కాని వీటికి భిన్నంగా తమ ఇష్టారాజ్యంగా వ్యవహరించే మతోన్మాదశక్తులు రాజ్యం చేయడం ప్రజాస్వామ్య సూత్రాలకు అశనిపాతం. ప్రజల అభీష్టానికి వ్యతిరేకంగా ప్రతి అంశంలో ప్రజల అభిరుచుల్ని, అలవాట్లని, భావాల్ని నియంత్రించాలనుకోవడం నియంతృత్వం. ఇది ప్రజాస్వామ్య నియమాలకే విరుద్ధం. ప్రజాస్వామ్యపు అంతర్గత నియమం స్వేచ్ఛ. కేవలం ప్రజాస్వామ్యం వల్లనే పౌరులు స్వేచ్ఛను అనుభవిస్తారు. ఆ స్వేచ్ఛను కాపాడడమే ప్రజాస్వామ్య సంస్కృతి, అయితే మోడీ పాలనలో ఆ స్వేచ్ఛ ప్రమాదంలో పడింది. ప్రజాస్వామ్యం పేరుతో ఫాసిస్టు పాలన మాత్రమే సాగుతోంది.

**అప్రకటిత ఎమర్జెన్సీ**

వలస పాలనాకాలంలో ఉద్యమకారులపై అమలు చేసిన దేశద్రోహ చట్టాన్ని ఇప్పుడు అధ్యాపకులపై, విద్యార్థులపై ప్రయోగించడం ద్వారా దేశంలో ఎటువంటి పరిస్థితులు నెలకొన్నాయో ఇట్టే తెలిసిపోతుంది. బిజెపి సీనియర్ నేత ఎల్.కె. అద్వానీ గతంలో ఒక వ్యాఖ్య చేశారు. దేశంలో మళ్లీ ఎమర్జెన్సీరోజులు (1975-77) పునరావృతంకావన్న నమ్మకం తనకు కలగడం లేదని ఆయన చేసిన వ్యాఖ్యలు ఇప్పుడు నిజమే అనిపిస్తున్నాయి. తాను ఎవరినీ ఉద్దేశించి అనలేదని అద్వానీ పైకి చెప్పినా.. ఆ వ్యాఖ్య మోడీని ఉద్దేశించే చేసినట్లు శివసేన పేర్కొంది. ఇటీవల ఉపరాష్ట్రపతి హమీద్ అన్సారీ మాట్లాడుతూ, రాజకీయాలు, మతం మధ్య స్పష్టమైన విభజన లేకపోతే భారత ప్రజాస్వామ్యంలో మైనార్టీలకు, దళితులకు, మహిళలకు తగినంత న్యాయం జరగదని స్పష్టం చేశారు. ప్రస్తుత ప్రభుత్వం మతానికి, రాజకీయాలకు మధ్య గల విభజనరేఖను చెరిపేస్తున్నదనే సంకేతం ఉపరాష్ట్రపతి మాటల్లో దాగి ఉంది. ఇవి ప్రభుత్వంపై అమర్యాదకరమైన వ్యాఖ్యలంటూ సంఘపరివార్‌లో అంతర్భాగమైన సుబ్రహ్మణ్యస్వామి ఉలిక్కిపడ్డారు. అయితే ఆర్ఎస్ఎస్ దాని అనుబంధ సంస్థలైన విహెచ్‌పి దానితో పనిచేస్తున్న శ్రీరాంసేన, హిందూసేన, హిందూ మహాసభ తదితర సంస్థలు అనుసరిస్తున్న హిందూత్వ, మతవిద్వేష అజెండాను గురించి మాత్రం ఆయన నోరుమెదపడం లేదు. సామాజిక అశాంతిని రగుల్చుతున్న అర్ఎస్ఎస్, భజరంగ్‌దళ్ శ్రేణుల పట్ల మోడీ సర్కార్ మౌనం వహిస్తుంది. ఎన్నికల్లో ప్రజలకు మోడీ హామి ఇచ్చినట్లుగా మంచి రోజులు ఇంకా రాలేదు. ఇక ముందు వస్తాయన్న భరోసా లేదు. కాబట్టి మోడీ పాలన అన్ని విధాలా వైఫల్యాలపుట్ట అని ప్రత్యేకంగా చెప్పాల్సిన పనిలేదు.

దేశభక్తి పేరుతో, జాతీయవాదం పేరుతో మతతత్వవాదులు సుసంపన్నమైన భారతీయ సమిష్టి సంస్కృతికి, లౌకికవాదానికి తూట్లు పొడుస్తూ, తమ ఫాసిస్టు హిందుత్వ రాజకీయ ఎజెండాను అమలు జరపడానికి నిర్భయంగా, నిస్సిగ్గుగా, దూకుడుగా ముందుకు పోతున్నారు. బీఫ్ తిన్నందుకు, బీఫ్ అమ్మినందుకు, ఉరిశిక్షలు రద్దు చేయాలన్నందుకు హత్యలు, అక్రమ కేసులకు పూనుకుంటున్నారు. ఫలితంగా ఇవాళ ప్రభుత్వ విధానాలను విమర్శించడం, స్వేచ్ఛగా భిన్న అభిప్రాయాలు చెప్పడం నేరమైపోతున్నది. విమర్శించిన వారి కుత్తుకలు కోస్తామని, తలలు నరుకుతామని, నాలుకలు చీలుస్తామని బెదిరిస్తున్నారు. వాల్ పోస్టర్లను అతికించి మరీ బెదిరిస్తున్నారు. విశ్వవిద్యాలయాలలో ఇటీవల చోటు చేసుకున్న సంఘటనలు హిందుత్వ వాదుల అసహనాన్ని తెలియజేస్తున్నాయి.

**ఆదివాసులపై సాయుధ బలగాల దాడులు**

చత్తీస్‌గడ్ రాష్ట్రంలో పోలీసు అక్రమాలను వెలుగులోకి తేవడానికి ప్రయత్నిస్తున్న పౌర హక్కుల కార్యకర్తలపై జర్నలిస్టులపై దాడులు చేస్తున్నారు. అక్రమకేసులు పెట్టి జైళ్లలో పెడుతున్నారు. సోనిసోరి, సోమేర్‌నాగ్, సంతోష్‌యాదవ్, ప్రభాత్‌సింగ్‌లు పోలీసు దాడులకు గురయ్యారు. అంతేకాక అనకాపుతుల్, మాలిని సుబ్రహ్మణ్యం, సోనిసోరి, భేలాభాటియా లాంటి హక్కుల కార్యకర్తలపై దాడి చేసిన ఘటనలు ఉన్నాయి. శాలిని గెరా, ఇషాఖండేల్వాల్ లాంటి హక్కుల కార్యకర్తలను, జర్నలిస్టులను, న్యాయవాదులను, జగదల్‌పూర్, రాయపూర్ బీజాపూర్‌లలో ఉండనీయకుండా నక్సల్స్ పీడిత సంఘర్ష్ సమితి పేరుతో పోలీసులు దాడులు చేయిస్తున్నారు. బస్తర్ ఆదివాసులను మావోయిస్టు లుగా ముద్రవేసి, వారిపై అక్రమ కేసులు బనాయించి సంవత్సరాల తరబడి జైళ్లలో మగ్గేలా చేస్తున్న పోలీసు దుర్మార్గాలకు వ్యతిరేకంగా, ఆదివాసులకు మద్దతుగా నిలిచి లీగల్ ఎయిడ్ అందిస్తున్న జర్నలిస్టు మాలినీ సుబ్రహ్మణ్యం, మహిళా లాయర్లను కూడా ఐజి బెదిరించడంతో వాళ్లు జగదల్‌పూర్ వదిలి వెళ్లిపోయారు. బిజెపి పాలిత చత్తీస్‌గడ్‌లో జర్నలిస్టులపై ఏకపక్ష అరెస్టులు, భౌతిక దాడులు జరుగుతున్నట్లుగా ఎడిటర్స్ గిల్డ్ బృందం గుర్తించింది. ప్రజాస్వామ్యంపై రాజ్యం దాడి బహిరంగంగా కొనసాగుతున్నది. మహిళా జర్నలిస్టులను హక్కుల కార్యకర్తలను, న్యాయవాదులను చత్తీస్‌గడ్ నుండి వెళ్లగొట్టేందుకు బహిరంగంగా బెదిరింపులకు పాల్పడుతున్న వైనం ప్రజాస్వామిక వ్యవస్థను ఖూనీ చేస్తోంది. ప్రజాస్వామ్య హక్కులు, పౌరుల స్వేచ్ఛపై మోడీ సర్కార్ సవారి చేస్తున్నది.

### విశ్వవిద్యాలయాలలో హిందుత్వ దాడులు

మనదేశ విద్యావ్యవస్థను, పరిశోధనా రంగాన్ని మతోన్మాద పూరితం చేసే చర్యలకు పూనుకుంది. ఉన్నత విద్యాసంస్థల అధిపతులుగా ఆర్ఎస్ఎస్ ప్రచారకులనే నియమించే ప్రక్రియ ప్రారంభమయ్యింది. విమర్శనాత్మక ఆలోచనలకు, సచేతన చర్చలకు నిలయమైన విద్యాసంస్థల్లోని ప్రజాస్వామ్య సంస్కృతిపై ఉద్దేశ్యపూర్వకమైన నిర్ణయాత్మకమైన దాడులు జరుగుతున్నాయి. ఉన్నత విద్యాలయాల్లో ఏకీకృత భావజాల వ్యాప్తికై, వాటిని స్వాధీన పరుచుకోవడానికి మితవాద శక్తులు అనుసరిస్తున్న వ్యూహంలో భాగమే జెఎన్‌యు పై దాడి, నిరాధారమైన సాక్ష్యాల ఆధారంగా జెఎన్‌యు విద్యార్థి సంఘం నేత కన్నయ్య కుమార్‌పై దేశద్రోహం కేసు బనాయించింది. ఫిల్మ్ అండ్ టెలివిజన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియాలో అశాంతి, హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయంలో విచారకరమైన రోహిత్ వేముల ఆత్మహత్య, ఐఐటి, మద్రాస్‌లో అంబేద్కర్ – పెరియార్ స్టడీ సర్కిల్ వివాదం, ఐఐటి ఢిల్లీలో డాక్యుమెంటరీ ప్రదర్శనపై ఆందోళన, అలహాబాద్ విశ్వవిద్యాలయ సంఘటన, కొత్తగా జాదవ్‌పూర్ యూనివర్సిటీ నిరసనలు, పైన పేర్కొన్న క్రమబద్ధమైన వ్యూహంలో భాగమే. అనేక విశ్వవిద్యాలయాల్లో రాజకీయ జోక్యానికి అఖిల భారత విద్యార్థి పరిషత్ (ఏబివిపి)ను అర్ఎస్ఎస్ పావుగా వాడుకుంటుంది.

ఉన్నత విద్యాసంస్థలను మతాలయాలుగా మార్చేందుకు అర్ఎస్ఎస్ దాని అనుబంధ సంఘాలు నిరంతరం ప్రయత్నిస్తున్నాయి. ఉన్నత విద్యా సంస్థలలో విధేయులైన వైస్ ఛాన్సలర్, విశ్వవిద్యాలయ కీలక అధికారులు ఎబివిపి చేసే ప్రతి చిన్న ఫిర్యాదుపైనా అత్యుత్సాహాన్ని ప్రదర్శిస్తున్నారు. జెఎన్‌యు విద్యార్థి సంఘ అధ్యక్షునిపై 'దేశద్రోహం' నేరం మోపడం మోడీ ప్రభుత్వ ఫాసిస్టు చర్యలకు ప్రతీక. ఎవరైనా ప్రత్యక్ష హింసకు పురికొల్పితే తప్ప కేవలం మాటలు, ఉపన్యాసాలను నేరపూరితమైనవిగా పరిగణించరాదని భారతీయ కోర్టులు ఎన్నోసార్లు చెప్పాయి. ఆధునిక ప్రజాస్వామ్యంలో భావస్వేచ్ఛను 'దేశద్రోహ' నేరంగా పరిగణించడానికి చట్టంలో స్థానం లేదు. ఆత్మవిమర్శనాపూర్వకంగా ఉండడం, యూనివర్సిటీలలో పాతుకుపోయిన కుల, లింగ, ఇతర అణచివేత పద్ధతులను నిరసించడం, ప్రజాతంత్రీకరణ నిరంతరం సాగే ప్రక్రియ అని గుర్తించడం మోడీ ప్రభుత్వ బాధ్యత.

### కుహనా జాతీయవాదం – దేశభక్తి

మోడీ పాలనలో ఇప్పుడు ప్రజల సమస్యల కంటే ప్రధానంగా జాతీయత, దేశభక్తి... చర్చనీయాంశాలయ్యాయి. ఈ భావనలకు కొలబద్దలేమిటి? అనే ప్రశ్నలకు సరికొత్త సమాధానాలు అన్వేషించాల్సిన చారిత్రక అవసరం. ఆ బాధ్యత మన సామాజిక, రాజకీయ శాస్త్రవేత్తలపై పడింది. భావజాలాల సంఘర్షణ తలెత్తినప్పుడే సామాజిక, రాజకీయ పరిణామాల్లో మేలిమలుపులకు ఆస్కారమేర్పడుతుంది. ఇవాళ దేశం, జాతి ముందు అటువంటి అవకాశం, సందర్భం ఆవిష్కృతమైంది. హిట్లర్ ఊపిరిపోసిన జర్మన్ ఆర్యన్ జాతీయవాదం ప్రాతిపదికలుగానే నేడు దేశంలో హిందూత్వ జాతీయవాద ప్రచారం ఊపందుకొంది. విద్వేషం, విధ్వంసం... అజెండాలుగా మత ఉన్మాదాన్ని అవసరమైతే ప్రజలను మతాల వారిగా, కులాల వారిగా చీల్చి మారణహోమాన్ని ప్రేరేపించడం ద్వారానే హిందూత్వవాదులు దేశంలో అంచలంచెలుగా ఎదిగి నేడు కేంద్రంలో అధికారాన్ని దక్కించుకోగలిగారనే వాస్తవాన్ని గుర్తుంచుకోవాలి. వారి ఏకైక లక్ష్యం హిందు రాష్ట్రం ఏర్పాటన్నది విస్మరించరాదు. 2002లో గోద్రా మారణకాండతో సంబంధం ఉన్న నాటి గుజరాత్ ముఖ్యమంత్రి నరేంద్ర మోడీ నేడు దేశప్రధానిగా ఎదిగాడు. ఇప్పుడు అంది వచ్చిన అవకాశాన్ని, చేతికొచ్చిన అధికారాన్ని సుస్థిరం చేసుకునే కుట్రలో భాగంగానే జాతీయత పేరుతో జాతి వ్యతిరేకత భావాలను ముఖ్యంగా విద్యావంతులైన యువత మదికెక్కించి వారిని హిందూత్వ బ్రిగేడ్‌గా మార్చుకునే దుస్సాహసానికి ఒడిగట్టింది. ఆ క్రమంలోనే మేథోపరమైన యుద్ధాన్ని ప్రారంభించింది. దీనిలో భాగంగానే రచయితలు, హేతువాదులు, అభ్యుదయవాదులను, వామ పక్షీయులను హతమార్చడం, వారి కలాలకు, గళాలకు సంకెళ్లు వేయడం వంటి దుర్మార్గపు చర్యలకు ఒడిగట్టింది.

నిజానికి జాతీయత అనేది దేశసరిహద్దులపై, భౌతిక పరిస్థితులపైనా ముడిపడి ఉండదు. దేశభక్తి అంటే దేశ ప్రజల కష్టసుఖాల్లో పాలుపంచుకోవడం, దేశ సార్వభౌమత్వాన్ని పరిరక్షించుకోవడం. అయితే జాతీయతకు దేశభక్తి రంగుపూసి సామాజిక రుగ్మతల నుంచి, కులం నుంచి రాజ్యం బాధ్యతను తప్పించటానికి ఆర్ఎస్ఎస్ తీవ్రంగా ప్రయత్నం చేస్తుంది. దేశాధికారులు, పాలకులు ఇటువంటి అంశాలపై జాతీయతను దేశభక్తి వరకే ముడిపెట్టి సామాజిక సమస్యలను జాతీయవాదం నుండి బహిష్కరింప జేస్తున్నారు. జాతీయవాదం దేశంలోని పేదరికం, స్వేచ్ఛ, కులం గురించి పట్టించుకోవడం లేదు. కనుక జాతీయవాదంలో కులం, సామాజిక అసమానత, ఆర్థిక అసమానతలు చర్చనీయాంశాలే. రాజ్యమనేది రాజ్యాంగ పరిధిలో జాతీయవాదంపై స్పందించాలి. కేంద్ర ప్రభుత్వం స్వంత ఎజెండాలతో గాకుండా రాజ్యంగానికి లోబడి నడుచుకోవాలి. న్యాయవ్యవస్థలు, పోలీసులు రాజ్యాంగానికి లోబడే పనిచేయాలి. రాజ్యం జాతీయవాదానికి అతీతంగా తనసొంత ఎజెండాతో పనిచేయడం వలన ప్రస్తుత పరిస్థితులు ఏర్పడ్డాయి.

### ముగింపు

మోడీ సర్కారు కార్పొరేటు పెట్టుబడి, వాటి లాభాలకు అనుకూల ప్రభుత్వమని, వారి ప్రయోజనాలను కాపాడడమే దాని ప్రధాన లక్ష్యమని, అందుకు సామాన్య ప్రజలపై పెను ఆర్థిక భారాలను మోపడానికైనా అది సిద్ధమని రెండేళ్ల పాలనలో తేటతెల్లమవుతున్నది. మోడీ ప్రభుత్వానికి రాజ్యాంగం అన్నా, ప్రజలన్నా ఏమాత్రం గౌరవం లేదని ఆయన మంత్రులు, ఎంపిలు చేస్తున్న ప్రకటనలు స్పష్టం చేస్తున్నాయి. మరోవైపు అభివృద్ధి పేరుతో దేశాన్ని హిందు రాష్ట్రంగా మార్చడానికి మోడీని అడ్డం పెట్టుకొని సంఘ్ పరివార్ కుట్రలు చేస్తోంది. అమెరికా యుద్ధోన్మాదానికి, భౌగోళిక రాజకీయ ప్రయోజనాలకి భారత్‌ను ఉపగ్రహంగా మార్చడానికి మోడీ ఉవ్విళ్లూరుతున్నారు. ఈ నేపథ్యంలో బుద్ధిజీవులు, ప్రజాస్వామిక వాదులు, అభ్యుదయకర శక్తులు సంఘటితపడి ప్రజాస్వామ్య మౌలిక సూత్రాల్ని కాపాడుకోవడం ద్వారానే ప్రజాస్వామ్య సంస్కృతి మనుగడ సాగిస్తుంది. ప్రజల విశ్వాసాలకీ, నమ్మకాలకీ విఘాతం కల్పిస్తూ సామాజిక జీవితంలోని సకల అంశాల్ని నియంత్రించే ఫాసిస్టు మతోన్మాద ధోరణిని ఎదుర్కోవాలన్న చైతన్యం ప్రజలకు అందించాలి. ఈ ఎరుక, చైతన్యం సామూహిక శక్తిగా, సంఘటిత శక్తిగా రూపొందడం ప్రజాస్వామ్య సంస్కృతి మనుగడకు అత్యవసరం. అణచివేతను, ఫాసిస్టు పాలనను ఏ సమాజం ఎల్లకాలం భరించలేదని చరిత్ర రుజువు చేసింది.

*(రచయిత ఉపాధ్యాయ నాయకులు, రాజనీతి శాస్త్ర విద్యార్థి)* వీ

# అంతరాలు పెరిగితే అంతే సంగతులు

***కేంద్రంలో మోడీ అధికారానికి వచ్చిన రెండేళ్ల కాలంలో దేశ ఆర్థిక, సామాజిక పరిస్థితులు మరింత దిగజారిపోయాయనీ, పేద, ధనిక వర్గాల మధ్య అంతరాలు అంతకంతకూ పెరిగిపోయాయనీ అంటున్నారు* వి. హనుమంతరావు**

బ్రిటిష్ పాలకులు దేశాధికారాన్ని కాంగ్రెస్ నాయకులకు బదలాయించినప్పటి నుంచి మనలను వదిలిపెట్టకుండా వెంటాడుతున్న రెండు పరిణామాలు పేదరికం, నిరుద్యోగం. పెట్టుబడిదారీ విధానాన్ని పాలకులు పెంచి పోషించినా కొద్దీ ఈ రెండు విధానాలు వేళ్లూనుకొని ఇంతింతై వటుడింతై అసమానతల పెరుగుదలకు కారణమవుతున్నాయి. అశాంతికి దారితీస్తున్నాయి. దానికి మతతత్వవాదుల హింసాకాండ తోడుకావడంతో ప్రధాని మోడీ ఓ టూరిస్టుగా మారిపోయి దేశాల వెంట పడ్డారు. దేశంలో ఉన్నన్నాళ్లు మేక్ ఇన్ ఇండియా, స్వచ్ఛ భారత్, యోగా లాంటి నినాదాలిచ్చి, హిందూ మతతత్వాన్ని రెచ్చగొట్టి, ప్రజల దృష్టిని పక్కదారులు పట్టిస్తున్నారు. మూల కారణమైన పెట్టుబడిదారీ విధానాన్ని దేశంలో కార్పొరేట్లు, విదేశాల నుంచి వచ్చిన, వస్తున్న బహుళజాతి సంస్థలతో మమేకమై, పోలీసు బలగాలతో ప్రజల్లో అశాంతిని అణచివేయాలని ప్రయత్నించగా, వరుసగా ఎన్నికల్లో ప్రజలు రెండు చెంపలు వాయించారు. అయినా ప్రధాని మరోసారి అమెరికా వెళ్లి మన దేశాన్ని మరింత ఊబిలోకి దించి వచ్చారు. దేశంలో ప్రజలు ఒకపక్క తమ నిరసనను తమ ఓటు రూపంలో తెలియపరిచినా, జానెదేవ్ అంటూ దేశం నుంచి తరలిపోయారు.

ఇలా ప్రధాని లీలల గురించి ఎన్ని పేజీలైనా రాయవచ్చు. అందుచేత ఈ ఉపోద్ఘాతాన్ని ఇక్కడకు చాలించి మొదట్లో ఉదహరించిన రెండు పరిణామాల్లో నిరుద్యోగం గురించి విశ్లేషించుకుందాం. నిరుద్యోగ భారతంలో నేటి యువత పీకల దాకా కూరుకుపోయి ఉంది. విదేశాల నుంచి పరిశ్రమలొస్తున్నాయి, ఉద్యోగాలొచ్చేస్తాయి అంటూ యువతను ఊరిస్తున్నారు పాలకులు. నిరుద్యోగులు ఎక్కే గుమ్మం, దిగే గుమ్మం, వారి డిగ్రీ సర్టిఫికెట్లు చిత్తు కాగితాలతో పోటీ కూడా చేయడం లేదు. మీ వద్ద సర్టిఫికెట్లు సరే కాని నైపుణ్యత (స్కిల్స్) లేవని ఇక్కడి పారిశ్రామిక వేత్తలు అంటున్నారు. ఇక్కడ పారిశ్రామిక వేత్తలకు కావాల్సిన నైపుణ్యత లేకపోతే అత్యంతాధునిక టెక్నాలజీతో రానున్న విదేశీ పరిశ్రమలకు మొదలే పనిరాదు. రోబోల యుగంలో ప్రపంచం ముందుకుపోతోంది. కాగా మన యువతకు భవిష్యత్తు నిరుద్యోగం మాత్రమే. వీరిలో కొంత మంది అసాంఘిక, అవాంఛనీయ పరిణామాలకు దిగజారుతున్నారు. నేటి యువతే రేపటి పౌరులు, నాయకులు, అధికారులవుతారు. ఉద్యోగాల్లో ఉన్నవారినే తొలగిస్తున్నారు. పర్మినెంట్ ఉద్యోగాల్లో ఖాళీలను భర్తీ చేయడం లేదు. పనిచేస్తున్న పర్మినెంట్ ఉద్యోగస్థులను తొలగించి కాంట్రాక్టు కార్మికులతో భర్తీ చేస్తున్నారు. ఉత్పత్తి అవుతున్న సరుకులకు డిమాండులేక (డిమాండ్ లేకపోవడానికి కారణం ధరల పెరుగుదలతో, నిరుద్యోగంతో జేబులు ఖాళీ అవుతుంటే సరుకుల కొనుగోలు ఎలా సాధ్యం) ఆ కారణంగా పరిశ్రమలు వాటి పూర్తి ఉత్పత్తి స్థాయిని పూర్తిగా వినియోగించుకోలేక పోతున్నాయి. ఫలితం రిట్రెంచ్‌మెంటు కొత్త ఉద్యోగులకు చోటేది? ఎనిమిది లేబర్ – ఇంటెన్సివ్ పరిశ్రమల్లో 2015లో మొదటి తొమ్మిది నెలల్లో 2013, 2014లో మూడు లక్షల మందికి కొత్తగా ఉద్యోగాలు లభించగా 2015లో అదే కాలంలో 1.55 లక్షల మందికే లభించాయని లేబర్ బ్యూరో లెక్క ఔట్‌లుక్ పత్రిక ప్రకారం 2011లో 9.3 లక్షల మందికి కొత్తగా ఉద్యోగాలు లభించగా, మోడీ పరిపాలనలో 2015లో ఆ సంఖ్య 1.34 లక్షలకు కుంగిపోయింది. ఆర్థిక పరిస్థితి మెల్లగా పుంజుకుంటోందని అంటున్నారు కాని, ఉపాధి కల్పనలో ఆ పెరుగుదల కానరావడం లేదని కేర్ రేటింగ్ నివేదిక 1072 పరిశ్రమల పరిశోధనలో తేలింది. సామాజిక సెక్యూరిటీ మొదలే లేదు. పెట్టుబడులు క్షీణించడం, నిరుద్యోగం జంటకవులనిపిస్తోంది.

నిరుద్యోగం సర్వవ్యాపితం. ఉదాహరణకు మనం నివసిస్తున్న బంగారు తెలంగాణలో నిరుద్యోగం ఏ స్థాయిలో ఉందో చూడండి. కేవలం పోలీస్, ఫైర్, జైళ్లలో ఉద్యోగాల కోసం 3,28,073 దరఖాస్తులు రావడమే దారుణమైతే, ఆ దరఖాస్తుదారులెవరెవరో చూడండి.

**దరఖాస్తుదారుల విద్యార్హతలు – సంఖ్య**

ఇంటర్ – 1,78,917; బి.ఎ. – 21,786; బి.కాం – 31,943; బిఎస్‌సి – 28,810; బిఫార్మా – 1,793; బిఎస్‌సి అగ్రికల్చర్ – 28; బిటెక్ – 19,628; బిబిఎం – 198; బిసిఎ – 125; ఎంఎ – 1454; ఎంఎస్‌సి – 3597; ఎంటెక్ – 1002; ఎంబిఎ – 7508; ఎంసిఎ – 7428; ఎస్‌సి – 71,618; ఎస్‌టి – 58,153; ఒసి – 20,403; బిసి – 58,153

అబ్బ తెలంగాణలో ఎంత బంగారమో! నిరుద్యోగుల పరిస్థితి ఇలా ఉండగా, ప్రపంచీకరణ పుణ్యమా అంటూ వృత్తిదారుల వెన్ను విరిగింది. (ఉదాహరణకు చేనేత). స్వేచ్ఛా మార్కెట్ ప్రపంచీకరణ ముదుబిడ్డ, ఆర్థిక అంతరాలను వేగవంతం చేస్తుంది. ధనిక పేద దేశాల మధ్య అంతరాన్ని పెంచుతుంది. ప్రతీ దేశంలో ఆర్థిక అంతరాలు తీవ్రమవుతాయి. ఆత్మహత్యలు, ఆకలి చావులకు దారితీస్తుంది. నిరుద్యోగం మరింతగా తీవ్రతరమవుతుంది. నేత, గీత, కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, కంసాలి, మత్స్యకారుల వెన్ను విరుస్తుంది. చేనేత కార్మికుల దయనీయ స్థితి గురించి పత్రికల్లో వార్తరాని రోజులేదు. ఇవికాక 93 శాతం మంది పాక్షిక కార్మికులు జనాభా పెరిగినకొద్దీ ఉద్యోగాన్వేషుల సంఖ్య కూడా పెరుగుతుంది. మోడీ పాలనలో 2015 సంవత్సరంలో 1.35 లక్షల మందికే ఉద్యోగాలు లభించాయి. 2008 సంవత్సరం తర్వాత ఇంత తక్కువ మందికి ఉపాధి ఎన్నడూ లభించలేదు.

ఉపాధి హామీ పథకాలతో పాలకులు ఫుట్‌బాల్ ఆడుకుంటున్నారు. మోడీ అధికారంలోకి రాగానే ఈ పథకం దండగమారి పథకం అని విమర్శించారు. మోడీ అధికారంలోకి రాగానే ఈ పథకానికి చేసిన కేటాయింపు తగ్గించారు. ఉపాధి కల్పించకపోగా ఉన్న ఉపాధిని ఊడబెరకడానికి ప్రయత్నించగా దేశం నలుమూలల నుంచీ, ఆర్థిక

# సాదాబైనామాల మంచీ చెడూ

***తెలంగాణ ప్రభుత్వం ప్రవేశపెట్టిన సాదాబైనామాల నిర్ణయం వల్ల ఆదివాసీ షెడ్యూల్డ్ ప్రాంతాల్లో తిష్టవేసిన ఆదివాసేతరులకు లాభం చేకూరే అవకాశం ఉందనీ, ఆదివాసులు తీవ్రంగా నష్టపోయే ప్రమాదం ఉందనీ అంటున్నారు*** **డా. పల్లా త్రినాధ రావు**

'సాదాబైనామా'లపై జరిపిన భూ బదలాయింపుల క్రమబద్ధీకరణ కోసం జారీచేసిన తెలంగాణ ప్రభుత్వ ఉత్తర్వుతో రాష్ట్ర షెడ్యూల్డ్ ప్రాంతంలో గిరిజన భూపరాయీకరణ సమస్య మరింత తీవ్ర రూపం దాల్చనుంది. తెలంగాణలో ఆంధ్ర సెటిలర్స్, స్థానిక గిరిజనేతరుల ఆధీనంలో ఇప్పటికే 55 శాతం గిరిజన భూములు ఉన్నాయి. వాటిని గిరిజనులు రాబట్టుకొనేందుకు ఉద్దేశించిన గిరిజన భూ పరిరక్షణ నిబంధనలు (1/70 రెగ్యులేషన్స్) అమలు కావడం లేదు. 1976 నుంచి మార్చ్ 2015 నాటి వరకూ దాఖలైన కేసులలో సుమారు 60 శాతం కేసులు గిరిజనులకు అనుకూలంగా ఉత్తర్వులు ఇచ్చినప్పటికీ కేవలం వివాదస్పద భూమిలో 51 శాతం మాత్రమే గిరిజనులకు దక్కినట్లుగా తెలంగాణ గిరిజన సంక్షేమ శాఖ రికార్డులు తెలియజేస్తున్నాయి. గిరిజనులకు అనుకూలంగా ఇవ్వబడిన కేసులలో కూడా కేవలం 78 శాతం భూములు భౌతికంగా అప్పగించారు. 1995 నాటి లెక్కలు ప్రకారం వరంగల్‌లో 71.63, ఆదిలాబాద్ 60.68, ఖమ్మంలో 52.79 శాతం భూములు గిరిజనేతర్ల అక్రమణలో ఉన్నాయి. తెలంగాణలో సుమారు 7 లక్షల ఎకరాల భూమి గిరిజనేతర్ల నియంత్రణలో ఉన్నట్లుగా అధికార పూర్వక గణాంకాలు తెలుపుతున్నాయి.

మావోయిస్ట్స్ భూమి ఎజెండాలో ఒకటైన 1/70 రెగ్యులేషన్స్ అమలు అంశం గతంలో ప్రభుత్వం జరిపిన చర్చల్లో ముందుపెట్టింది. తల్గొగ్గిన ప్రభుత్వం భూసంస్కరణల కోసం కోనేరు రంగారావు కమిటీని నియమించింది. గిరిజన భూహక్కుల పరిరక్షణ అలాగే దోపిడీకి గురైన గిరిజనుల భూమి తిరిగి దక్కేందుకు కమిటీ అనేక సిఫార్సులు చేసింది. వాటి అమలు కోసం 2008లో ప్రభుత్వం ఉత్తర్వులు కూడా జారీ చేసింది. అందులో ఒకటి 'సాదా బైనామాల' పై జరిగిన గిరిజనేతరుల భూమి బదలాయింపు విషయంలో షెడ్యూల్డ్ ప్రాంతంలో గిరిజనుల భూమి హక్కు కాపాడడం.

అటువంటి సాదాబైనామాలపై 2014 జూన్ 2కు పూర్వం తెలంగాణలో జరిగిన భూమి అన్యాక్రాంతాలను లేదా భూమి బదలాయింపులను క్రమబద్ధీకరించేందుకు ప్రభుత్వం 153 జి.ఒను జారీచేసింది. గ్రామీణ ప్రాంతాలలో ఐదు ఎకరాల లోపు వ్యవసాయ భూములపై జరిగిన సాదా బైనామాల లావాదేవీలను క్రమబద్ధీ కరించేందుకు జిల్లా కలెక్టర్లకు పట్టాదారు పాస్‌బుక్, టైటిల్ డీడ్స్ చట్టం 1989 కింద అధికారం ఇవ్వబడింది. ఈ చట్టాన్ని సక్షిప్తంగా రికార్డ్ ఆఫ్ రైట్స్ (ఆర్ఒఆర్) చట్టం అంటారు. స్టాంప్ డ్యూటి లేదా రిజిస్ట్రేషన్ ఫీజు చెల్లింపు విషయంలో మినహాయింపు కూడా ప్రభుత్వం ఇచ్చింది. తెలంగాణ సాధారణ రైతులకు ప్రభుత్వ జి.ఒ ప్రయోజనకరంగానే ఉంటుంది. తమ ఆధీనంలో గల భూములకు పట్టాదారు పాస్ పుస్తకాలు, హక్కు పత్రాలు పొందే వెసులుబాటు కల్పించడం ముదావహమే! అయితే ఎటువంటి ఆంక్షలు లేకుండా షెడ్యూల్డ్ ప్రాంతాలకు, గిరిజనేతరులకు సైతం ఈ జి.ఒను వర్తింపజేయడంతో గిరిజన భూమి సమస్య మరింత జటిలం కానుంది. సాదా బైనామాలపై జరిగిన భూ బదలాయింపుకు సంబందించిన భూమి తెలంగాణలో ప్రతీ జిల్లాలో సుమారు లక్ష ఎకరాలకు పైగా ఉంటుందని అంచనా.

ప్రభుత్వ ఉత్తర్వులు (జి.ఒ 153) 1/70 రెగ్యులేషన్స్ అమలుకు

---

శాస్త్రవేత్తల నుంచీ నిరసనలు వెల్లువెత్తగా వెనక్కు తగ్గారు. చేసిన కేటాయింపులు కోత, రాష్ట్రాలకు ఈ పథకం ఆచరణకు నిధులకోత, ఆలస్యంగా నిధుల విడుదల, నిధులను గ్రామీణ స్థాయిలో కార్మికులకు ఆలస్యంగా అందజేయడం ఇవన్నీ ప్రభుత్వం ప్రజల పేరుతో ప్రవేశపెట్టే పథకాలన్నింటికీ షరామామూలే. ఈ పథకం ఎంత అస్తవ్యస్తంగా అమలు పరిచారంటే ఈ పథకం నిధులను రాష్ట్రాలకు వెంటనే విడుదల చేయాలని సుప్రీంకోర్టు ఆదేశించాల్సి వచ్చింది. పథకం అమలులో గుజరాతీ, మధ్యప్రదేశ్ (రెండూ బిజెపి పాలిత రాష్ట్రాలు) రాష్ట్ర ప్రభుత్వాల పట్ల ఆగ్రహాన్ని వ్యక్తం చేసింది. ఆ రెండు రాష్ట్రాలు భారతదేశంలో భాగం కాదా అని ప్రశ్నించింది.

పటేల్, జాట్‌ల ఆందోళనలు, ఆంధ్రప్రదేశ్‌లో కాపుల ఆందోళన, ఎగుమతులు ప్రతి నెల తగ్గుతూ రావడం, వ్యవసాయం యాంత్రీకీకరణ లాంటి పరిణామాలు నిరుద్యోగుల నిస్పృహతను తెలియజేస్తున్నాయి. నూతన ఆర్థిక విధానం పుణ్యమా అంటూ దేశ వృద్ధిరేటు (జిడిపి) ఎంత పెరిగితే నిరుద్యోగిత అంత పెరగడం చూస్తే జిడిపి పెరుగుదలలోని డొల్లతనం బహిర్గతమవుతుంది. వ్యవసాయ కార్మికులు, చిన్న, సన్నకారు రైతులు మోడీ సోదిలోకి కూడా రారు. పోనీ మన దేశంలో ఉపాధి అవకాశాలు తక్కువా అంటే మౌలిక సౌకర్యాల కల్పన, క్షీణిస్తున్న రహదారుల నాణ్యత, మంచినీటి కొరత, గ్రామీణ చెరువుల దుస్థితి ఎంత మందికైనా ఉపాధి కల్పిస్తాయి. గ్రామీణ స్థాయిలో ముఖ్యంగా మహిళలకు ఉపాధి కల్పించవచ్చు. పరిష్కారం? దేశ ఆదాయ పంపిణీ సమానత దిశగా పయనించాల్సి ఉంటుంది. మౌలిక సౌకర్యాల కల్పనకు పెద్దపీట వేయాలి. కార్పొరేట్లకిచ్చే పరోక్ష సబ్సిడీలను రద్దు చేయాలి. వ్యవసాయోత్పత్తుల ఉత్పాదకతకు ప్రాధాన్యమివ్వాలి. విదేశీ పెట్టుబడులకు అర్రులు చాచకుండా దేశంలో ఉత్పత్తి శక్తులకు – రైతులు, కార్మికులు – చేయూతనివ్వాలి. ధరల పెరుగుదలను అరికట్టాలి. ఈ పరిష్కారాలన్నీ ప్రభుత్వానికి రుచించవు. రుచించే దిశలో ప్రజలు కదులుతున్నారు. కాషాయీకరణకు చూపించే జోష్‌లో సగమైనా ఈ పరిష్కారాల పట్ల చూపిస్తే చాలు ఎంతో మార్పు వస్తుంది. మోడీజీ, హోషియార్!

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)* వీ

తూట్లు పొడిచే విధంగా ఉంది. ఇప్పటికే అనేక మోసాలకు గిరిజనేతరులు పాల్పడి గిరిజనుల భూమి కాజేశారు. కోనేరు భూమి కమిటీ సిఫార్సులు సైతం తెలంగాణ ప్రభుత్వ అధికారులు అమలు చేయడం లేదు. 1/70 రెగ్యులేషన్స్ అమలు కోసం గిరిజన సంఘాలు ఇచ్చిన అనేక విజ్ఞాపనలు అధికారులు బుట్టదాఖలు చేశారు. గిరిజనేతరులు తమ ఆధీనం గల భూ అక్రమణలను క్రమబద్ధీకరణ కోసం ప్రస్తుత ఉత్తర్వులను వినియోగించుకుంటున్నారు. గిరిజన ప్రాంతాలలో సాదా బైనామాలపై జరిపిన గిరినేతరుల భూమి బదలాయింపులు హక్కుల నిర్ధారణలో చెల్లనేరవనీ, వాటి ఆధారంగా తీర్పులు ఇవ్వరాదని కోనేరు రంగారావు కమిటీ ఉత్తర్వులు స్పష్టం చేస్తున్నాయి. ఇప్పటికే 1/70 రెగ్యులేషన్స్ అమలు దెబ్బతీసే విధంగా గిరిజనేతరులు సాదా బైనామాలను సృష్టించారని కమిటీ అభిప్రాయపడింది. గిరిజన భూబదలాయింపు 1/78 (సవరణ) రెగ్యులేషన్స్ ప్రకారం గిరిజన ప్రాంతాలలో గిరిజనేతరుల పేర భూమి రిజిస్ట్రేషన్ సంపూర్ణంగా నిషేధించబడింది. షెడ్యూల్డ్ ప్రాంత భూమి భూబదలాయింపుల రిజిస్ట్రేషన్ విషయంలో ప్రభుత్వం 1980లో ప్రత్యేక జి.ఒ జారీ చేసింది. అందువల్ల ఆర్ఒఆర్ చట్టం 1989 కింద జారీచేసిన 153 ఉత్తర్వులు గిరిజన ప్రాంత గిరిజనేతరుల భూ బదలాయింపులకు కూడా వర్తింపజేయడం 1/70 రెగ్యులేషన్స్ అమలును ప్రభుత్వం ఉద్దేశ పూర్వకంగా ఆటంక పర్చడమే. ఆర్ఒఆర్ చట్టం కింద హక్కు పత్రాలు 1/70 రెగ్యులేషన్స్‌కు విరుద్ధంగా ఇవ్వరాదనే నిబంధన ఉన్నప్పటికీ ఆచట్టం కింద రెవెన్యూ అధికారులు జరిపే విచారణ చాలా క్లుప్తంగా ఉంటుంది.

1/70 రెగ్యులేషన్స్ అమలుకు పూర్వమే గిరిజనేతర్ల మధ్య భూమి బదలాయింపులు జరిగినట్లుగా సాదా బైనామాలను సృష్టిస్తే గిరిజనేతర్లకు అధికారులు హక్కుపత్రాలు మంజూరు చేసే అవకాశం లేక పోలేదు. అందువల్లనే అటువంటి సాదా బైనామాలపై (రిజిస్టర్ కాని) జరిపిన గిరిజనేతరుల భూ లావాదేవీలను, గిరిజన భూ హక్కుల విచారణలో పరిగణలోకి తీసుకోకూడదని 'వేముల భాస్కరరావు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి' మధ్య జరిగిన కేసులో రాష్ట్ర హై కోర్టు అభిప్రాయపడింది. 1/70 రెగ్యులేషన్స్ కింద జరిపే విచారణలో గిరిజనేతరులు తమ సాగులో ఉన్న భూమి గిరిజనుల లేదా ప్రభుత్వం లేదా 3-2-1970 దర్మిలా గిరిజనేతరుల నుంచి స్వాధీనం చేసుకోలేదని రుజువు చేసుకోవలసిన చట్టపర బాధ్యత గిరిజనేతరులపై ఉంటుంది. అటువంటి కఠిన నియమాలు ఆర్ఒఆర్ చట్టం కింద లేవు. మరొక విషయం ఇక్కడ గుర్తించుకోవాలి. ఆర్ఒఆర్ చట్టం కింద విచారణ చేసి మండల రెవెన్యూ అధికారి ఉత్తర్వులు ఇస్తే విభేదించు వారు ఆర్.డి.ఓకి అప్పీలు చేసుకోవచ్చు. న్యాయం దొరకక పోతే జాయింట్ కలెక్టర్‌కు పునర్విచారణ కోరవచ్చు.

కానీ తెలంగాణ ప్రభుత్వం ఇచ్చిన ప్రస్తుత జి.ఒ 153 అమలు విషయంలో ఆర్ఒఆర్ చట్టం కింద సాదా బైనామాలను క్రమబద్ధీకరించే అధికారం నేరుగా జిల్లా కలెక్టర్‌కి ఇవ్వడం అంటే ఆర్ఒఆర్ చట్టం కింద ఉన్న అప్పీలు, పునర్విచారణ (రివిజన్) కోరే చట్టపర అవకాశాన్ని కాలరాయడమే. అందువల్ల జి.ఒ 153ను షెడ్యూల్డ్ ప్రాంతంలో గిరిజనేతర్లకు వర్తింపజేయకుండా ప్రభుత్వం చర్యలు తీసుకోవాలి.

బంగారు తెలంగాణ సంకల్పిస్తున్న టి.ఆర్.ఎస్ ప్రభుత్వం ఆదివాసీల హక్కులు కాలరాయడానికి పూనుకోవడం గర్హనీయం. పాలనా పగ్గాలు చేపట్టిన తర్వాత ప్రభుత్వ చర్యలు ఆదివాసీ వ్యతిరేకంగానే ఉంటున్నాయి. షెడ్యూల్డ్ ప్రాంతాలకు ఎటువంటి మినహాయింపు లేకుండా రాష్ట్రంలో అన్ని నియోజక వర్గ పరిధిలో గిరిజనేతరులకు కూడా రెండు పడక గదుల ఇల్లు నిర్మాణానికి శ్రీకారం చుట్టింది. షెడ్యూల్డ్ ప్రాంతాల్లో గిరిజనేతరులకు ఇల్ల నిర్మాణం చేపట్టాలనే పథకం చెల్లనేరదని 1/70కి విరుద్ధమని సుప్రీం కోర్టు ఇప్పటికే స్పష్టం చేసింది. ఇటువంటి చర్యలు షెడ్యూల్డ్ ప్రాంతాలలో 1/70 రెగ్యులేషన్స్ నీరు కార్చే విధంగా ఉండడంతో ఆదివాసీలకు ఆందోళన కల్గిస్తున్నాయి. అందువల్ల ప్రభుత్వ విధానాన్ని ప్రశ్నించాల్సి వస్తుంది.

షెడ్యూల్డ్ ప్రాంతాలలో ఇప్పటికే 'హరితహారం' పేరుతో ఆదివాసీల పోడు అటవీ హక్కును అటవీ అధికారులు కాలరాస్తున్నారు. పోడు సాగు నుంచి ఆదివాసీలను తొలగించవద్దని హై కోర్టు ఉత్తర్వులు ఉన్నప్పటికీ ఏన్కూర్, జూలూర్పాడు, దుమ్ముగూడెం మండలాల్లో ఆదివాసీలను 1200 ఎకరాల అటవీ భూమి నుంచి తొలగించే చర్యలు అటవీ శాఖాధికార్లు చేపట్టారు. అలాగే పినపాక, చంద్రుగొండ మండలాల్లో సుమారు 1300 ఎకరాల అటవీ భూమి నుంచి తొలగించాలని ప్రభుత్వం విఫలయత్నం చేసింది. అడవులలో ఆదివాసీల పశువులు మేత అలాగే కలపేతర అటవీ ఫలసాయ సేకరణ నిరోధించే విధంగా పెద్ద గోతులు తవ్వి అటవీ ప్రవేశాన్ని నిషేధించే విధంగా అటవీ అధికారులు తెలంగాణలో చర్యలు చేపట్టారు. ఇటువంటి చర్యలు అటవీ హక్కుల గుర్తింపు చట్టానికి విరుద్ధం.

ఇక్కడ మరొక ఉదాహరణ. 456 అటవీ హక్కుల దరఖాస్తులపై అటవీ హక్కుల గుర్తింపు చట్టం కింద విచారణచేసి ఖమ్మం జిల్లా కలెక్టర్ అధ్యక్షన గల కమిటీ హక్కు పత్రాల మంజూరుకు నిర్ణయం తీసుకుంది. అందులో 191 దరఖాస్తు అటవీ భూమి విషయంలో పాల్వంచ డివిజన్ అటవీ శాఖాధికార్లు సంతకం చేయడానికి నిరాకరిస్తే ఆవిషయం గిరిజన సంక్షేమ కమిషనరుకు తెలుపుకోవలసిన దుస్థితి భద్రాచలం ఐటిడిఏ ప్రాజెక్టు అధికారికి ఏర్పడింది. అటవీ హక్కుల చట్టం కింద కొత్తగా దరఖాస్తులు తీసుకోవడానికి వీలులేదని ఉన్నత అటవీ శాఖ అధికారుల నుంచి తమకు ఉత్తర్వులు (ఫైల్ 27554/టిజి/అక్టోబర్ 2015)ఉన్నాయని డివిజన్ అటవీ శాఖాధికారులు విస్పష్టంగా చెప్పడం అటవీ హక్కు గుర్తింపు చట్టం2006 తెలంగాణలో ఏ మేరకు అమలవుతుందో అర్థం చేసుకోవచ్చు. తెలంగాణ విభజనతో ఆదివాసీ ఆకాంక్షలు నెరవేరుతాయని ఆశించిన వారికి ప్రభుత్వ చర్యలు మింగుడుపడడం లేదు.

ఆదివాసీల స్వీయ పాలనకు ఉద్దేశించిన షెడ్యూల్డ్ ప్రాంత పంచాయతీ రాజ్ విస్తరణ చట్టం(పెసా) 1996 ప్రభుత్వం ఉద్దేశ పూర్వకంగానే అమలు చేయడం లేదు. 1/70 రెగ్యులేషన్స్ అమలులో భాగంగా గిరిజన భూమి హక్కుల పరిశీలన, విచారణ, ఆదివాసీ అటవీ హక్కుల చట్టం కింద చట్టపరంగా గుర్తించిన గ్రామసభ అధికారాన్ని అమలు కాకుండా ప్రభుత్వం మోకాలడ్డుతుంధి. ఆంధ్ర పెట్టుబడిదారుల, వలస పాలకుల చేతి నుంచి తెలంగాణ ప్రజల స్వీయ పాలనా అధికారం, సాంస్కృతిక ఉనికి హక్కు కోసం పోరాడి సాధించుకున్న తెలంగాణ రాష్ట్రం అదే సిద్ధాంత ఆధారంగా షెడ్యూల్డ్ ప్రాంతంలో రాజ్యాంగం గుర్తించిన ఆదివాసీల స్వీయ పాలనాధికారాన్ని, వారి ఉనికిని గుర్తించకుండా అధికారుల పాలనతో ప్రభుత్వం ఆదివాసీ పాలన హక్కు దెబ్బతీస్తుంధి. ప్రభుత్వ విధానం ఆదివాసీల జీవనాన్ని ఛిద్రం చేస్తున్నది. ప్రస్తుతం 153 జి.ఒ రేపు మరొక ఉత్తర్వులు. ప్రభుత్వ ఆదివాసీ వ్యతిరేక విధానాలు ప్రతిఘటించకపోతే తెలంగాణలో ఆదివాసీల నిరాశ్రయతతో పాటు సాంస్కృతిక ఉనికి కోల్పోయే ప్రమాదం ఉంది.

*(రచయిత అడ్వకేట్)*

వీ

# మల్లన్నసాగర్‌లో మునిగేదెవరు?

***ప్రాజెక్టుల పేరుతో పంట పొలాలను ముంచేస్తూ రైతుల, రైతు కూలీల జీవనాధారాలను విధ్వంసం చేస్తున్నారనీ, ఈ ప్రాజెక్టు ఎవరి అవసరాల కోసం నిర్మిస్తున్నారో, వాటిల్లో న్యాయబద్ధత ఎంతో తేల్చాలనీ ప్రశ్నిస్తున్నారు బి. రామకృష్ణ***

మల్లన్నసాగర్ రిజర్వాయర్ కోసం ముంపునకు గురికాబోతున్న గ్రామాలను 2016, జూన్ 11న 'వీక్షణం' మాసపత్రిక సంపాదకవర్గం సందర్శించింది. ప్రజలతో మాట్లాడి అక్కడి వాగు, చెరువులను పరిశీలించడం జరిగింది. ఏడాదికి రెండు పంటలు పండించే భూములను చూశాం. ఏటిగడ్డ కిష్టాపూర్ వాగులో, కోమటి చెరువులో ఇంత కరువు కాలంలో కూడా నీళ్లు ఉండడం విశేషం. వాగు పక్కన నాలుగైదు గజాల లోతులో తవ్విన బావుల్లో నీళ్లుండడం గమనించాం. ఆ గ్రామాల భూముల్లో వంద ఫీట్ల లోతుల్లోనే నీళ్లుండడం మూలంగా ఏడాదికి రెండుపంటలు, వీలున్నవారు మూడు పంటలు తీస్తున్నారు. ఇక్కడ పొలాల్లో వరి, మొక్కజొన్న, పత్తి పండిస్తుంటారు. ఇంత చక్కటి పంట పొలాలు, నీరున్న గ్రామాలను ముంచడానికి చేతులెట్లా వస్తాయి అనిపించింది. శాస్త్రీయ అధ్యయనాల ఆధారంగా ముంపుకు లోనయ్యే కుటుంబాలతో పాటు మరెందరికో మేలు చేస్తుందని నిరూపించబడి అత్యధిక సామాజిక ప్రయోజనాలను నెరవేర్చగలిగితే అది వేరే విషయం.

అధికారిక వెబ్‌సైట్‌లో ఉంచిన ప్లాన్‌కు భిన్నంగా ప్రాణహిత-చేవెళ్ల నీటి పారుదల ప్రాజెక్టులో మార్పులు చేయడం మూలంగా మెదక్ జిల్లా తొగుట మండలంలో 11, కొండపాక మండలంలో 10 చిన్న, పెద్ద గ్రామాలు మొత్తం 21 గ్రామాలు మల్లన్నసాగర్ రిజర్వాయర్ కోసం బలికాబోతున్నాయి. బ్రాహ్మణ బజరపల్లి, ఏటిగడ్డ కిష్టాపూర్, తిరుమలగిరి, మొగుళ్లచెరువు తండా, వేములగట్టు, తురక బజరపల్లి, పల్లెపహాడ్, దస్తగిరినగరం, తిప్పారం, సిగరం, ఎర్రవల్లి, మంగోల్, కాశెగుడిసెలు, కోనాయపల్లి, వడ్డెరకాలనీ గ్రామాలు ఇండ్లతో సహా మొత్తం మునిగి పోనున్నాయి. తుక్కపూర్, తొగుట, ఎల్లారెడ్డిపేట, మాతపల్లె, మేద్నిపూర్, ముద్దారం గ్రామాల భూములు మునిగిపోనున్నాయి. మొత్తంగా 3,112 ఇండ్లు, 20,079.16 ఎకరాల వ్యవసాయ భూములు కనుమరుగు కానున్నాయి. బతుకులు చిధ్రమవుతూ, ఉపాధి ఎలా, జీవనాధారం ఏమిటి అనే అభద్రత, అయోమయం, గందరగోళంలో ముంపుగ్రామాల కుటుంబాలు బంగారు తెలంగాణ ప్రభుత్వం ఇచ్చే షాక్‌లతో సతమతమవుతున్నాయి.

'బంగారు తెలంగాణ అని మురిపించి మా నోట్లో చక్కెర పోసింద్రు. దమ్ము తీయకుండా పోసింద్రు. మా ఊర్లను, పంట భూములను ముంచి మమ్మల్ని వెళ్లగొట్టే పని చేస్తుంద్రు. బంగారు తెలంగాణ అంటే ఇదేనా?', "నాకు భూమి లేదు, కూలి నాలి చేసుకుని ఊరి వారి సహాయ సహకారాలతో బతుకుతున్నా. మల్లన్నసాగర్ ప్రాజెక్టు వస్తే ఈ గ్రామం మొత్తం మునిగిపోతుంది. అప్పుడు మాలాంటి వాళ్ల బతుకులేం కావాలి?" అని ప్రశ్నిస్తున్న ఎర్రవల్లి గ్రామ రైతుకూలి ఆవేదనకు సమాధానమేది?

"పట్టా భూమి ఎకరాకు మీరిచ్చే 5.8 లక్షలు, సమీపంలో ఉన్న ప్రజ్ఞాపూర్ వద్ద కనీసం వందగజాల ఇల్లు స్థలం కొనడానికి కూడా సరిపోవు. మరి ఇల్లు కట్టుకొనేదెలా? బతుకోసం వ్యవసాయ భూమి సంగతేమిటి?" అని ప్రశ్నిస్తున్న ఎర్రవల్లి గ్రామ రైతు ఆవేదనకు బదులేది?

"తీవ్రమైన కరువున్న నేటి పరిస్థితుల్లో సహితం మా ఊళ్లో నీటికి కరువులేదు. ఏటా రెండు పంటలు పండించుకుంటున్నాం. ఎవరి కండ్లు మా ఊళ్లపై పడ్డాయో. తడకపల్లి నుండి రూటు మారి ఈ ప్రాజెక్టును మా ఊళ్ల దిక్కు మళ్లిస్తున్నారు. పచ్చని పొలాలతో, వరి, మొక్కజొన్న, పత్తి, కూరగాయలను పండించుకుంటూ మా బతుకేదో మేం బతుకుతుంటే, మల్లన్నసాగర్ మా జీవితాలను నిలువునా ముంచేయడం ఎలా సరైనది అని ప్రశ్నిస్తున్న ఏటిగడ్డ కిష్టాపూర్, వేముల గట్టు గ్రామాల ప్రజల ఆవేదనలకు, రోదనలకు సమాధానం ఏది?"

మల్లన్నసాగర్ ప్రాజెక్టు వద్దని వేములగట్టు గ్రామ పంచాయతీ ఏకగ్రీవ తీర్మానం చేసి వందలాది గ్రామస్థుల సంతకాలతో ప్రభుత్వానికి విన్నవించుకున్నారు. దానిపై స్పందనేది?

"అధునాతన పద్ధతులతో ఎక్స్‌పోర్ట్ క్వాలిటీతో, ఇజ్రాయిల్ తరహా పద్ధతులని, పాలిహౌజ్‌లలో లాభదాయకంగా వందెకరాల్లో పంటలు, కూరగాయలు పండించడం, పనిలో పనిగా ఆ వ్యవసాయక్షేత్రం విడిది కేంద్రంగా, రిసార్ట్‌గానూ, పచ్చటి పొలాలతో ఆహ్లాదంగానూ, ఆనందంగానూ ఉండడం అందులో గడుపుతూ తరించడం ఎవరికైనా ఇష్టంగానే ఉంటుంది. దీనికోసం పెట్టిపుట్టాలి. ఆ భాగ్యం మాకులేదు. అంతేసి డబ్బులూ మా దగ్గరలేవు, అన్నేసి ఎకరాలూ మావద్ద లేవు. బ్యాంకులు అంతేసి డబ్బులు మాకు ఇవ్వవు. ఇచ్చినా మేం చెల్లించలేం. భూతల్లి కరుణతో, భూగర్భ గంగమ్మ చలువతో ఉన్నంతలో బతుకుతున్నం. ఈ మాత్రం బతుకులనూ లాగేసుకోవడానికి యమధర్మరాజులు మల్లన్నసాగర్ యమపాశాన్ని మాపైకి విసురుతుండడాన్ని ఎలా జీర్ణించుకోవాలి" అని ముంపునకు గురయ్యే గ్రామాల ప్రజలు వేస్తున్న ప్రశ్నలకు సమాధానాలేవి?

3,112 ఇండ్లను, అందులో నివసిస్తున్న 10 నుండి 15 వేల మందిని బజారున వేసే ఈ రిజర్వాయర్ ఎవరి కోసం? దీనిలో 50 టీఎంసీల నీరును నిలువచేస్తామంటున్నారు కదా! ఈ నీటిలో మాకేమైనా వాటా ఉంటుందా? ఈ నీటితో మేం వ్యవసాయం చేసుకోవచ్చా? ఈ నీటి కోసం మేం కోల్పోయే భూములకు బదులుగా ఈ నీటి ద్వారా పండించుకునే భూములను ఎక్కడైనా ఇప్పిస్తారా? అది మీ బంగారు తెలంగాణ ఎజెండాలో ఉన్నదా? మేం కోల్పోయే ఇళ్లు పెంకుటిల్లో, మట్టిగోడలో ఏవైనా కావచ్చు. అవి మా జీవనంలో భాగం వాటిని మళ్లీ ఎక్కడ కట్టుకోవాలి? అని ప్రజలు వేసే ప్రశ్నలకు జవాబులేవి?

'సరే మేం మా గ్రామాలకు గ్రామాలనే త్యాగం చేస్తాం. ఈ త్యాగాలు

ఎవరి వెలుగుల కోసం? ఆ వెలుగుల్లో మేమెందుకు కనిపించకూడదు? మా కాలికి ముళ్లు గుచ్చుకుంటే నీ పంటితో తీస్తానని ఆత్మీయంగా మా కడుపునిండేటంత మాట చెప్పావు కదా! ఇప్పుడు మేమేం పాపం చేసుకున్నాం?' అని అడిగే రైతుకు ఏం సమాధానం చెబుతారు?

"మీరిచ్చే పరిహారం వంద, వందాయాభై గజాల ఇంటి జాగానిస్తాయి కావచ్చు... అదీకూడా కష్టమే. ఇంకా మహా అయితే ఆ జాగాలో ఇళ్లు కట్టుకుంటాం కాబోలు, ఆ సొమ్ము ఒకటి, రెండేళ్లు మురిపిస్తుంది కావచ్చు. ఆ తరువాత మా బతుకుల సంగతేంటి? చేతిలో పైసా లేక.... చేసుకునేందుకు కన్నతల్లి లాంటి వ్యవసాయ భూమి లేకా... పంటలు లేకా... ఉపాధి లేకా.... కరువంటే తెలియని మాకు తిండికి కరువు అవ్వడం మీకు మంచిగనిపిస్తున్నదా?" అని బతిమాలుతున్నట్లుగానో, ఆవేదనతోనో, ఆవేశంతోనో, దీనంగానో వేడుకుంటున్న ముంపుకు గురయ్యే 14 గ్రామాల ప్రజలకు ఎలా సర్ది చెబుతారో దళపతులు, అధిపతులు, రాష్ట్రాధిపతులు.

**భూసేకరణ చట్టం - 2013 ప్రకారం**

ప్రాజెక్టు నిర్మించేటప్పుడు దానివల్ల ఏర్పడే ప్రభావాన్ని తెలుసుకోవ డానికి సామాజిక ప్రభావ అంచనా (సోషల్ ఇంపాక్ట్ అసెస్‌మెంట్ - ఎస్ఐఏ)ను చేపట్టాలి. ఈ అధ్యయనంలో భాగంగా ప్రభావితమయ్యే గ్రామాల గ్రామపంచాయితీ / గ్రామసభల్లో చర్చ జరగాలి. పర్యావరణ నష్టం, ప్రజలకు జరిగే లాభనష్టాలు మొదలగునవి ఎన్నింటినో అంచనా వేయాలి. తరువాత సామాజిక, ప్రభావ అంచనాను ఎక్స్‌పర్ట్ కమిటి మూల్యాంకనం చేసి భూసేకరణ చేపట్టడం సమంజసమా కాదా అని తెలపాలి. దీన్నంతా పారదర్శకంగానే నిర్వహించాలి. వీటి వివరాలు అందరికి అందుబాటులో ఉంచాలి.

నీటి వసతులున్న బహుళ పంట భూములను సేకరించరాదు. విధిలేని పరిస్థితుల్లో తప్పనిసరైతే తప్ప చిట్టచివరి అవకాశంగా మాత్రమే సేకరించవచ్చు. అది కూడా జిల్లా, రాష్ట్ర మొత్తంలో నిర్ధారిత వ్యవసాయ భూపరిమితికి లోబడి ఉండేలా చూడాలి. ఒకవేళ ఇటువంటి భూములను సేకరిస్తే దానికి సమానమైన బీడు భూములను వ్యవసాయ భూములుగా చేయాలి. లేదా ఆ భూమికి సమానమైన విలువ మొత్తాన్ని ప్రభుత్వం జమచేసి దాన్ని ఆహార భద్రతను పెంచడం కోసం వ్యవసాయంలో పెట్టుబడిగా పెట్టాలి.

నీటి పారుదల ప్రాజెక్టుల విషయంలో వ్యవసాయ భూములు కోల్పోయిన భూ స్వంతదారులకు ప్రాజెక్టు కమాండ్ ప్రాంతంలో కనీసం ఒక ఎకర భూమిని కేటాయించాలి. ఎస్సీ, ఎస్టీలకైతే వారు కోల్పోయిన భూమితో సమానమైన లేదా గరిష్టంగా 2.5 ఎకరాలు కేటాయిస్తారు.

భూసేకరణకు పరిహారంగా పున:స్థాపితం గావించబడే కుటుంబాలకు మౌలిక వసతులు కల్పించాలి. రోడ్లు, డ్రైనేజీ, సురక్షిత మంచి నీరు, పశువులకు తాగే నీరు, పశువులను మేపుకునేటందుకు భూములు, రేషన్ షాపులు, పోస్టాఫీసులు, రవాణా వసతులు, స్మశానవాటికలు, విద్యుత్ సరఫరా, అంగన్‌వాడీ కేంద్రాలు, పాఠశాలలు, ఆరోగ్యకేంద్రం, పిల్లలకు ఆటస్థలం, కమ్యూనిటీహాల్, పశుసేవాసంస్థ, సరైన భద్రతా యంత్రాంగం మొదలగునవి భూసేకరణదారు కల్పించాలి. ఇవేవి నీటిపారుదల మంత్రి గాని, తెలంగాణ ప్రభుత్వాధినేత గాని మాట్లాడడంలేదు. వీటి గురించి ప్రస్తావనలు లేకుండా జిఒ123ను తెచ్చి బాధితుల నుండి రాతపూర్వకంగా వారు స్వచ్ఛందంగానే భూములు వదులుకుంటున్నామని ఒప్పంద పత్రాలు తయారు చేశారు. ఈ ఒప్పందంపై సంతకం పెడితే భవిష్యత్‌లో ఈ భూముల కోసం కోర్టులకు పోను వీలు లేకుండా జిఒ123 ను తయారు చేశారు. జిఒ123లో మరిన్ని ప్రజా వ్యతిరేక మార్పులు చేస్తూ జిఒ190, జిఒ214 లను తెచ్చారు. పునరావాసం అంటే ఏమిటి? ప్రాజెక్టుల వల్ల నష్టపోతున్న బతుకులకు బరోసాగా, నమ్మకమైన, భద్రమైన ప్రత్యామ్నాయ జీవికను అందివ్వడమే కదా. అధికారికంగా అలాంటి వివరాలు లేవు. అటువైపు ప్రభుత్వ ప్రయత్నాలు లేవు.

ముంపును వ్యతిరేకిస్తున్న క్రమంలో ఏటిగడ్డ కిష్టాపూర్‌లో ఇద్దరు యువకులను తొగుట పోలీస్‌స్టేషన్‌కు పిలిపించుకున్నారు. మల్లన్నసాగర్ ను వ్యతిరేకిస్తూ 'గిరాయిపల్లి దళం' పేరుతో రెండు పోస్టర్లు వేయబడ్డాయని వాటిని వీరే వేశారని తీవ్ర చిత్రహింసలపాలు చేశారు. చేయని దానికి బాధ్యులను చేసి లాఠీలతో, రబ్బర్‌లతో కొట్టడం జరిగింది. పోస్టర్లలోని రాతలు మీ రాతలు ఒకటేనా తెల్సుకుంటామని వీరితో అవే పోస్టర్లను రాయించి, తిరిగి వాటిని గ్రామంలో అంటించారని తెల్సింది. ఆ తరువాత వీరిద్దరిపై 124-ఎ సెక్షన్ ప్రకారం రాజద్రోహనేరం మోపి జైలుకు పంపించారు. ప్రాజెక్టును వ్యతిరేకిస్తే రాజద్రోహనేరం అవుతుందా? పోలీసులు ఇలా చట్టాలకు తమకు నచ్చిన రీతిలో వక్రభాష్యం చెబుతున్నారు. అసలు పోస్టర్లను ఆ ఇద్దరు యువకులు వేయనేలేదు. వాటిని కుట్రపూరితంగా, కావాలనే ఎవరు వేయించారో, ఎందుకు వేయించారో అర్థం చేసుకోవడం కష్టమైన పనేం కాదు. ఈ యువకుల నిర్బంధం, వారిపై టార్చర్, రాజద్రోహం కేసుపెట్టి జైలుకు పంపడంపై స్థానిక ఎమ్మెల్యే గాని నీటి పారుదలశాఖామంత్రి గాని స్పందించలేదని తెలిసింది. ఈ ఘటన దేనికి సంకేతం? భవిష్యత్‌లో ముంపు బాధితుల నిరసనలకు ప్రభుత్వం ఇచ్చే జవాబును ఇది సూచిస్తుందా?

మల్లన్నసాగర్ రిజర్వాయర్ ఎవరెవరికి మేలు చేస్తుంది? దాని వల్ల భూములు, ఇళ్లు కోల్పోతున్న ప్రజలకు జరిగే నష్టాన్ని ఎలా పూడ్చుతారు? దాని నిర్మాణఖర్చు, పర్యావరణ నష్టం ఎంత? నిర్మించ తలపెట్టిన మల్లన్న సాగర్ రిజర్వాయర్‌లోకి ఆదిలాబాద్‌లోని ప్రాణహిత నుండి వచ్చే నీరెంత? నిజంగా 50టీఎంసీల నీరు వస్తుందా? ఈ రిజర్వాయర్ వల్ల పరిసర ప్రాంతాలకు ఒనగూరే ప్రయోజనమెంత? మొదలగునవన్నీ అధ్యయనం చేస్తే తప్ప నికర మేలు తేలదు. ఈ ప్రాజెక్టుకు సంబంధించి వివరాలతో కూడిన నివేదిక (డిటైల్డ్ ప్రాజెక్ట్ రిపోర్ట్ - డిపిఆర్) లేనేలేదు. ఈ రిపోర్టు లేకుండా ముందుకెళ్లడం అంటే అర్థం ఏమిటి? ఎంతసేపటికీ ఎకరాకు 5.8 లక్షలు పరిహారం ఇస్తామని, 14 గ్రామాల ప్రజలను భూములు వదులుకోమని వత్తిడి తెస్తున్నారు. అసలు మల్లన్నసాగర్ నిర్మాణం న్యాయబద్ధత ఎంత అనేది తేలవల్సి ఉన్నది.

*(రచయిత ఉపాధ్యాయులు)* ✦

***బ్యాక్ కవర్ మీద వచ్చిన తెలంగాణ ఆత్మగౌరవ వేదిక ప్రచురణ శీర్షిక '50 టిఎంసిల కన్నీళ్లు' - 'ఎవరి కోసం మల్లన్నసాగర్?' ఉప శీర్షిక మాత్రమే. పొరపాటున పాత కవర్ డిజైన్ అచ్చయింది. - సం.***

# అసహనానికి కూడా హద్దులుండాలి !

***ఉద్యమ పార్టీ అని చెప్పుకుంటున్న టిఆర్ఎస్ అసెంబ్లీలో ప్రతిపక్షమే లేకుండా చేస్తూ, అంతా తానై తెలంగాణ ప్రజల్ని నిర్వాసితుల్ని చేస్తూ, ప్రజల పక్షాన గొంతు విప్పుతున్న కోదండరామ్‌పై విరుచుకుపడుతున్న తీరును వివరిస్తున్నారు* పిట్టల రవిందర్**

తెలంగాణ జాయింట్ యాక్షన్ కమిటీ (టిజెఎసి) చైర్మెన్ కోదండరామ్‌పై తెలంగాణ రాష్ట్ర సమితి (టిఆర్ఎస్) నుండి ప్రాతినిధ్యం వహిస్తున్న డజను మందికి పైగా మంత్రులు, వారితో పాటుగా పలువురు పార్లమెంట్ సభ్యులు, ఎంఎల్ఎలు, ఎంఎల్‌సిలు, పార్టీకి చెందిన నాయకులు ఒక దిన పత్రికలో వచ్చిన వార్తా శీర్షిక ఆధారంగా నిరాధారమైన నిందలు మోపుతూ మూకుమ్మడిగా విరుచుకుపడిన దుష్టాంతం రాజకీయ వర్గాల్లోనూ, ఉద్యమ సమాజంలోనూ తీవ్రస్థాయిలో ప్రకంపనలు సృష్టించింది.

ఈ అవకాశాన్ని ఉపయోగించుకోవడంలో పార్టీకి అనుబంధంగా (తెరవెనుక) పనిచేస్తున్న మేథావులు, రచయితలు, ఆశావహులు, పదవీ కాంక్షపరులు ఇట్లా ఎంతో మంది ఎన్నో రకాలుగా టిజెఎసిని తక్కువచేసి చూపేందుకు తీవ్రస్థాయిలోనే ప్రయత్నాలు చేస్తున్నారు. అయితే ఇందుకు దారితీసిన పరిస్థితులను, తదనంతర పరిణామాలను, భవిష్యత్తులో తలెత్తబోయే పర్యవసానాలను చర్చించడానికి మాత్రం ఈ పెద్దలు సిద్ధంగా ఉన్నట్లు కనిపించడంలేదు.

"రెండేళ్ల తెలంగాణ – ప్రజా ఆకాంక్షలు – ప్రభుత్వ తీరుతెన్నులు" అనే అంశంపై 'తెలంగాణ విద్యావంతుల వేదిక' జూన్ 5న హైదరాబాద్‌లో ఏర్పాటు చేసిన సదస్సు సందర్భంగా టిజెఎసి చైర్మెన్ కోదండరామ్ చేసిన ఉపన్యాసం ఆధారంగా ఒక దినపత్రిక 'చేతకాకుంటే దిగిపోండి' అనే శీర్షికతో వార్తను ప్రచురించింది. ఆ సదస్సును ఇతర పత్రికలు కూడా ప్రముఖంగానే రిపోర్టు చేశాయి. ఛానళ్లు ప్రసారం చేశాయి. 23 నిమిషాలపాటు సాగిన కోదండరామ్ ప్రసంగం మొత్తాన్ని సోషియల్ మీడియాలో, యూట్యూబ్, ఫేస్‌బుక్ తదితర సామాజిక మాధ్యమాలలో విరివిగా పోస్టింగ్ చేశారు. ప్రపంచవ్యాప్తంగా ఆయన ప్రసంగ వీడియో చూసినవారికెవ్వరికీ సదరు పత్రిక వార్తా శీర్షికలో ఉపయోగించిన వ్యాఖ్యలు ఎక్కడా కనిపించలేదు.

కోదండరామ్ చేయని వ్యాఖ్యలను కేంద్రంగా చేసుకుని అంతమంది మంత్రులు, ప్రజా ప్రతినిధులు, పార్టీ నాయకులు మూకుమ్మడి దాడికి దిగడాన్ని తెలంగాణ సమాజం యావత్తూ సహించలేకపోయింది. ఒక ఉద్యమ సంస్థకు నాయకత్వం వహిస్తూ ప్రజాదరణను నిలబెట్టుకునే ప్రయత్నం చేస్తున్న ప్రముఖ వ్యక్తిపై అధికారం అనుభవిస్తున్న ముఖ్యులు నిరాధారమైన నిందారోపణలు, విమర్శలు చేయడంపట్ల పార్టీలు, ప్రజా సంఘాలు, ఉద్యమ సంస్థలు తీవ్ర స్థాయిలో తమ నిరసనలను తెలియపరిచాయి.

"ఈ కోదండరామ్ ఎవ్వరయ్యా!?" అంటూ అసహనాన్ని వ్యక్తం చేస్తున్న అధికార పార్టీ పెద్దలకు ఇది ఊహించని పరిణామమే! అయితే ఆత్మగౌరవాన్ని చంపుకుని, స్వీయ అస్తిత్వాన్ని తాకట్టుపెట్టుకుని పదవులు తద్వారా సంక్రమించిన అధికారాలు అనుభవిస్తున్న పరాధీన మనుషుల నుండి మానసిక పరివర్తనను ఆశించడం సులభసాధ్యంకాదు.

తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును గట్టిగా వ్యతిరేకించిన పార్టీలతో, శక్తులతో కలిసి పనిచేసినవాళ్లు, రాష్ట్రసాధన ఉద్యమాన్ని స్వయంగా వ్యతిరేకించడం ద్వారా పదవులను కాపాడుకుని స్వరాష్ట్ర ఆకాంక్షను నిలబెట్టడానికి ఆత్మహత్యల పరంపర కొనసాగుతున్న విషాదకాలంలో వినోదం చూస్తున్నట్లు అధికారాన్ని అనుభవించినవాళ్లు (వీరినే 'తెలంగాణ ద్రోహులు' అని కూడా పిలుచుకుంటున్నారు), తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమంలో టిఆర్ఎస్ పార్టీ ప్రతినిధులుగా టిజెఎసి స్టీరింగ్ కమిటీలో సభ్యులుగా కోదండరామ్‌తో భుజం భుజం కలిపి క్రియాశీలకంగా పనిచేసిన ప్రగతిశీల భావాలున్న వాళ్లు, ఉస్మానియా క్యాంపస్‌లో ఉవ్వెత్తున ఎగిసిపడిన ఉద్యమ కార్యాచరణలో విద్యార్థి నాయకులుగా స్వయంగా భాగస్వాములై, తత్ఫలితంగా అందివచ్చిన అవకాశాలతో రాజకీయాల్లో చేరి పదవులు అనుభవిస్తున్న వాళ్లు, ఇంకా తదితరులు కోదండరామ్‌పై విరుచుకుపడినవాళ్లలో ఉన్నారు. వాళ్లు చేసిన విమర్శలు, ఈ సందర్భంగా వారు చేసిన దూషణలు, వాడిన భాష–పదజాలం, లేవలెత్తిన అంశాలు, సమయ సందర్భాలు... ప్రజల ఆగ్రహానికి మరింతహేతువయ్యాయి.

అయితే అధికార పార్టీ అగ్రనాయకత్వం తమతో కలిసి పనిచేసిన ఒక ప్రజాసంఘం నాయకునిపై ఇంత పెద్దఎత్తున మూకుమ్మడిగా కూడబలుక్కున్న రీతిలో ముప్పేటదాడికి పూనుకోవడం కాకతాళీయం గానో, అనాలోచితంగానో జరిగింది కాదనీ, ఈ దాడి వెనక అధినాయకుని ముందు జాగ్రత్త చర్యల వ్యూహాలు, భయాందోళనలు దాగి ఉన్నాయని సోషియల్ మీడియాలో జోరుగా సాగుతున్న చర్చల సారాంశంగా కనిపిస్తున్నది. టిఆర్ఎస్ పార్టీ లోలోపల అణచి వేసుకుంటున్న అసహనానికి ఆనవాలుగా పెల్లుబికిన వికృతచర్యగా ఈ హఠత్పరిణామాన్ని చూడవచ్చు!

తెలంగాణ రాష్ట్రం ఆవిర్భవించిన మరుక్షణం నుండే టిజెఎసి పట్ల, దానికి తిరుగులేని నాయకునిగా స్థిరపడిన కోదండరామ్ పట్ల టిఆర్ఎస్ అధినేత కె.సి.ఆర్ ఒక నిర్దిష్టమైన విధానాన్ని ఎంచుకుని అమలు చేస్తున్నట్లు గడచిన రెండేళ్ల కాలంలో జరిగిన పరిణామాలు స్పష్టం చేస్తున్నాయి. ఇందులో ప్రధానంగా రెండు అంశాలు చాలా ముఖ్యమైనవి.

మొదటిది బుద్ధిపూర్వక విస్మరణ, రెండవది ప్రయత్నపూర్వక

అణచివేత. 2014 జూన్ 2న జరిగిన తెలంగాణ రాష్ట్ర ఆవిర్భావ ఉత్సవం నుండి ముఖ్యమంత్రి హోదాలోగానీ, టిఆర్ఎస్ అధినేతగా గానీ ఇప్పటివరకూ ఆయన టిజెఎసి నాయకులను కలవడంగానీ, కనీసం టిజెఎసి పేరును ఉచ్చరించడంగానీ చేయలేదు. నిన్నమొన్న మాట్లాడిన మంత్రులు వాడిన పదజాలంలో ఇంకెక్కడి జెఎసి?, ఏ జెఎసికి చైర్మెన్?, కోదండరామ్‌ను జెఎసి కన్వీనర్‌గా చేసిందెవ్వరు? అంటూ వేసిన ప్రశ్నలు అంతర్లీనంగా "మాకు మద్దతునివ్వకపోతే లేదా మా పరిపాలనను ప్రశ్నిస్తే ఉనికిలో ఉండలేరు" అనే హెచ్చరికనే కనిపిస్తున్నది. ఉద్యమ కాలంలో మరీ ముఖ్యంగా 'సకల జనుల సమ్మె'కు మద్దతుగా టిఆర్ఎస్ పార్టీ 2011, సెప్టెంబర్ 12న కరీంనగర్‌లో నిర్వహించిన 'జనగర్జన' బహిరంగ సభలో టి.జి. వెంకటేశ్ వ్యాఖ్యలను ఉద్దేశించి కోదండరామ్ పట్ల కె.సి.ఆర్ చేసిన వాఖ్యానాలు (కోదండరామ్‌ను ఎవ్వడైనా ఏమైనా అంటే, అవాకులు చెవాకులు పేలితే, దుర్భాషలాడితే వాళ్ల నాలుక కోస్తా! తస్మాత్ జాగ్రత్త!!) ఇవాళ సోషియల్ మీడియాలో మళ్లీ చెక్కర్లు కొడుతూ గతంలో టిజెఎసి పట్ల కె.సి.ఆర్ ప్రదర్శించిన గౌరవ మర్యాదలను గుర్తుకు చేస్తున్నాయి. అయితే కాంగ్రెస్, తెలుగుదేశం, సిపిఐ, సిపిఐ (ఎం), వైఎస్ఆర్ సిపి లాంటి పార్టీలలో కరడుగట్టిన నాయకులుగా చెలామణిలో ఉన్న ముఖ్యనాయకులందరూ టిఆర్ఎస్ ప్రభుత్వం చేపట్టి అమలు జరుపుతున్న ప్రజాకర్షక పథకాలకు మంత్రముగ్ధులై (!?), తాము ప్రాతినిధ్యం వహిస్తున్న ప్రాంత ప్రయోజనాలను, ఆ ప్రాంత ప్రజల సంక్షేమాన్ని కాంక్షిస్తూ టిఆర్ఎస్ పార్టీలో చేరడానికి 'క్యూ' కడుతుంటే ... ఎంపి టికెట్‌ను నిరాకరించి, ప్రభుత్వ హోదాలను తృణీకరించి, రాజ్యసభ సభ్యత్వాన్ని కాదని ప్రజల పక్షాన నిలబడతానని, కలబడతానని బహిరంగంగా కోదండరామ్ ప్రకటించడమే ఏలినవారి అసహనానికి ఆజ్యం పోసినట్లయ్యిందని ఇప్పుడు అధికారపార్టీ నాయకులే అంతర్గత సంభాషణల్లో గుట్టురట్టుచేస్తున్నారు.

ఏకవ్యక్తి నాయకత్వంలోని కుటుంబ సభ్యుల ఆధిపత్యంలో, ప్రజాస్వామిక విలువల ప్రస్తావనలేని నియంతృత్వ పోకడలను తలపించే పాలనలో 'బంగారు తెలంగాణ' పేరిట రాజ్యాధికారాన్ని సుస్థిరం చేసుకోవాలని తాపత్రయపడుతున్న ముఖ్యమంత్రి చంద్రశేఖర్‌రావు అనుసరిస్తున్న ప్రాధాన్యాలను, పాలనలోని లోపాలను, లోటుపాట్లను టిజెఎసి ప్రశ్నించే ప్రయత్నం చేయడం ఆయన ప్రదర్శిస్తున్న అసహనానికి అసలు కారణాలు. కొత్త రాష్ట్రంలో ఉనికిని కోల్పోతున్న ప్రతిపక్షపార్టీలకు జీవం పోసే విధంగా, మీడియా ఎదుర్కొంటున్న ఒత్తిళ్లకు ఉపశమనం కలిగించే రీతిలో ప్రజలు ఎదుర్కొంటున్న వర్తమాన సమస్యలపై అధ్యయనం చేస్తూ, ప్రభుత్వ పని విధానాన్ని ఎత్తిచూపుతూ తెలంగాణ ప్రజా క్షేత్రంలో తన ఉనికిని సుస్థిరం చేసుకునే దిశలో టిజెఎసి ప్రయత్నించడం ఆయనకు, కొత్తగా అందివచ్చిన అధికారం కోసం ఆత్మవంచనతో ఆయనతో సర్దుకుని కాలం వెల్లదీస్తున్న వాళ్లకు కంటగింపుగానే కనిపిస్తున్నది. అందుకే వీళ్లందరూ తాము ఉద్యమ కాలంలో కూడబెట్టుకున్న చైతన్యాన్ని, ప్రజామోదాన్ని, స్ఫూర్తిని దీర్ఘకాలికంగా ప్రజలను భ్రమల్లో ముంచెత్తడానికి, అధినాయకుని మన్ననలు పొందడానికి, ఆయన కనుసన్నల్లో సాధ్యమైనంతకాలం కొనసాగడానికి తమ శక్తివంచనలేకుండా ఉపయోగిస్తున్నారు. అయితే మొదటి నుండీ టిఆర్ఎస్ పార్టీతో ఉద్యమ నేపథ్యంలో పనిచేస్తున్న వాళ్లకూ, వ్యాపార వ్యక్తిగత రాజకీయ ప్రయోజనాల కోసం కొత్తగా వచ్చి అధికార పార్టీలో కుప్పలు తెప్పలుగా వచ్చి చేరుకుంటున్న వాళ్లకు మధ్యన అంతర్గతంగా భవిష్యత్తులో పొడసూపనున్న వైరుధ్యాలను నివారించే ప్రయత్నంలో భాగంగా టిజెఎసి ప్రత్యామ్నాయంగా ఎదుగుతుందనే భయాందోళనల నుండి బయటపడే ముందస్తు వ్యూహంతోనే కోదండరామ్‌పై మూకుమ్మడి దాడికి ఉసిగొల్పుతున్నట్లు స్పష్టమవుతున్నది. అయితే తాము ఒక ప్రజా సంఘంగానే కొనసాగుతామని, రాజకీయ శక్తిగా అవతరించే ఆలోచన ఏ కోశానా లేదని, రాజకీయ పార్టీలను కలుపుకునే ఆలోచన కూడా లేదని కోదండరామ్ పదేపదే స్పష్టం చేస్తున్నప్పటికీ అధికారపార్టీ అధినాయకత్వానికి మనసు నిమ్మలం కావడంలేదు. టిజెఎసి భవిష్యత్తులో ప్రజల మద్దతుతో ప్రత్యామ్నాయ రాజకీయ శక్తిగా ఎదుగుతుందనే భయాందోళనలు అధికార పార్టీని వెంటాడుతున్నట్లు అధినాయకత్వం అనుసరిస్తున్న విధానాలవల్ల స్పష్టమవుతున్నది. టిఆర్ఎస్ పార్టీ అంతర్గతంగా ఎదుర్కొంటున్న ఈ మొత్తం గందరగోళంలో టిజెఎసి తరపున కోదండరామ్ అడుగుతున్న మౌలికమైన ప్రశ్నలను మరుగున పరిచే కుట్రలు కనిపిస్తున్నవి. అయితే టిజెఎసి లేవనెత్తిన అంశాలు అవి నెరవేరే వరకూ అధికారం అనుభవిస్తున్న వాళ్లందరినీ వెంటాడుతూనే ఉంటాయనే వాస్తవాన్ని వాళ్లందరూ గుర్తుంచుకోవాలి. లేదంటే, వీలున్న మార్గాల్లో, తోచిన పద్ధతుల్లో, అందివచ్చే అవకాశాల మేరకు ... ఎవరెంత అసహనానికి లోనైనా... ప్రజలు ప్రశ్నిస్తూనే ఉంటారు. టిజెఎసి వాళ్లందరితో కలిసి నిలబడుతూ కలబడుతూనే ఉంటుంది.

*(రచయిత సీనియర్ జర్నలిస్టు)*

## రాబోయే సంచికలలో...

- **ఉద్యమ మేధావి ప్రొ. బి జనార్దన్ రావు - సుంకరి సత్యం**
- **కాలుష్య నగరంగా మారిన విశాఖ - పి.వి. రమణ**
- **ఆధునిక బానిస భారతం - సంతోష్**
- **'జనతన రాజ్యం' పుస్తక పరిచయం**

# జిల్లాల పునర్వ్యవస్థీకరణ

***తెలంగాణలో కొత్త జిల్లాల ఏర్పాటులో ప్రజాభిప్రాయానికి, ప్రజల భాగస్వామ్యానికి ప్రాధాన్యత కాకుండా, ల్యాండ్ మాఫియా, రియల్ ఎస్టేట్ వ్యాపారుల రాజకీయ ప్రయోజనాలే ఎక్కువగా కనిపిస్తున్నాయని అంటున్నారు*** **బైరెడ్డి సతీష్**

గత కొద్ది నెలలుగా తెలంగాణ రాష్ట్రంలో కొన్ని ప్రాంతాల్లో ప్రజలు తమ ప్రాంతాన్ని ప్రత్యేక జిల్లా చేయమనో, పలానా జిల్లాలో కలపొద్దనో, సరిహద్దుల్ని మార్చవద్దనో ఉద్యమిస్తున్నారు. ఆయా ప్రాంతాల్లో రకరకాల రూపాల్లో జరుగుతున్న ప్రజా ఆందోళనలోని సామంజస్యాన్ని, ఉచితానుచితాలను పక్కకుపెడితే తె.రా.స. ప్రభుత్వం తమ ఎన్నికల్లో మానిఫెస్టోలో పేర్కొన్న జిల్లాల పునర్వ్యవస్థీకరణ వంటి ప్రధానమైన అంశాన్ని అప్పుడప్పుడు ప్రభుత్వాధినేత బయటకు కాస్త బలంగానే పలకడంతో జిల్లాగా ఏర్పడాల్సిన ప్రాంతం వారు, ఆ అవసరం లేని ప్రాంతాల్లో కూడా తీవ్రమైన చర్చ, ఉత్కంఠ, ఉత్సాహం, కొంత ఆందోళన నెలకొని ఉన్నాయి.

ప్రభుత్వాలు క్షేత్రస్థాయి ప్రజాభిప్రాయన్ని సేకరించి, ఆయా ప్రాంతాల ఆకాంక్షలను ఆకలింపు చేసుకొని విధాన ప్రకటన చేయడం కంటే హఠాత్తుగా ప్రధాన నిర్ణయాలను ప్రకటించడంతో ప్రజల్లో గందరగోళం నెలకొని ఎవ్వరికి అనుకూలంగా వారు మాట్లాడడం మొదలుపెట్టారు. అయితే గత కొద్ది రోజులుగా ఈ దిశగా ప్రభుత్వం వైపునుండి తీవ్రమైన కసరత్తే జరుగుతుంది. ఈ అంశంపై నిపుణుల కమిటీ వేసి, విస్తృతమైన ప్రజాభిప్రాయ సేకరణ జరిపి అనేక వర్గాలను ఈ ప్రక్రియలో భాగస్వామ్యం చేసి ముందుకు సాగినట్లయితే ఇవాళ్టి గందరగోళం ఉండేది కాదు. ప్రజలను ఇతర ప్రధాన అంశాలపైనుండి దృష్టి మరల్చేలా చేస్తున్నదేమో అనిపించేలా కూడా ఈ మొత్తం వ్యవహారాన్ని ప్రభుత్వం నడిపిస్తున్నది. పాలనా వికేంద్రీకరణ, ప్రజలకు సౌకర్యంగా ఉండేలా కొత్త జిల్లాలను ఏర్పాటు చేస్తామని చెబుతున్నది ప్రభుత్వం.

దేశంలో చిన్న రాష్ట్రాల ఏర్పాటు ఎంత అవసరమో చిన్న జిల్లాల ఏర్పాటు కూడా పాలనా సౌలభ్యం కోసం అంతే అవసరమనే వాదనలో విభేదించాల్సిందేమీ లేదు. రాష్ట్ర రాజధానులు రాజకీయ కేంద్రంగా, జిల్లాలు ముఖ్యమైన పాలనా యూనిట్‌గా ఉండి ప్రజలకు చేరువగా ఉండడానికి అవకాశం ఉంటుంది. ఇవాళ దేశంలో 674 జిల్లాలకు సగటున ఒక్కోజిల్లా 19లక్షల జనాభాను కలిగి ఉన్నది. అత్యధికంగా 48 లక్షల జనాభాతో పశ్చిమ బెంగాల్ జిల్లాలు ఉన్నాయి.

తెలంగాణ రాష్ట్రంలో 3.6 కోట్ల జనాభాతో ఒక్కో జిల్లా 36 లక్షల జనాభాను కల్గి ఉన్నది. దేశవ్యాప్త సగటును చూసినా తెలంగాణలో జనాభా పరంగా ఒక్కో జిల్లాకు అపరితమైన జనాభా ఉన్నట్టే లెక్క. కాశ్మీరులో 6 పార్లమెంటరీ నియోజక వర్గాలలో 24 జిల్లాలు, 2.5 కోట్ల జనాభాతో హర్యానాలో 21 జిల్లాలు, చత్తీస్‌ఘర్‌లో 24 జిల్లాలు ఉన్నాయి.

నిజానికి తెలంగాణలో వైశాల్యం రీత్యా, జనాభారీత్య చూసినా కూడా ఏనాడో జిల్లాల వ్యవస్థీకరణ చేయాల్సి ఉండె. ప్రధానంగా ఆదిలాబాద్, మెదక్, రంగారెడ్డి, మహబూబ్‌నగర్ లాంటి జిల్లాల ప్రజలు జిల్లా కేంద్రానికి 150 కిలోమీటర్లకు పైగా దూరంలో నివసిస్తూ అత్యవసర పనుల సందర్భంలో తీవ్రమైన ఇబ్బందిని ఎదుర్కొంటున్నారు. ఒక కోటికి సమీపిస్తున్న హైద్రాబాద్ జనాభాకు ఒక్కడే కలెక్టర్ ఉండడమంటే ప్రజల దైనందిన, ఇతర అత్యవసర రంగాలపై దృష్టి నిలపడం అసాధ్యమైన టువంటిదే. తెలంగాణలో చిట్టచివరగా ఏర్పడిన జిల్లా రంగారెడ్డి. 1978లో ఏర్పడిన ఈ జిల్లా తరువాత గత 38 ఏళ్లలో మరో జిల్లా ఏర్పడలేదు. పెరుగుతున్న జనాభా, వారి అవసరాలు, సంక్షేమాభివృద్ధి కార్యక్రమాల అనివార్యత కూడా నూతన జిల్లాల ఏర్పాటుకు దారితీస్తున్నది.

కొత్త జిల్లాల ప్రతిపాదన, ఏర్పాటు అనేది అంత సులభమైన ప్రక్రియ ఏమీకాదు. అత్యంత శాస్త్రీయంగా, ప్రజాస్వామికంగా, ప్రజాప్రయోజనాలే గీటురాయిగా అన్ని వర్గాల సమగ్రాభివృద్ధే ధ్యేయంగా కొత్త జిల్లాల ఏర్పాటు జరగాలి. రాజకీయ ప్రాబల్యం, ప్రయోజనాలు, కొన్ని వర్గాల లాభాలు, ఆధిపత్యం అంతర్గత ఎజెండాగా ముందుకు వెలితే ప్రమాధకరమైన ఫలితాలు వస్తాయి. ప్రభుత్వం తీసుకొనే అన్ని విధానపరమైన నిర్ణయాలను తమ ప్రయోజనాలకు అనుకూలంగా మలుచుకొనే ప్రాబల్య శక్తులు సమాజంలో బలంగా ఉన్నాయి. అసలు వారే ప్రభుత్వ నిర్ణయాలను ప్రభావితం చేయడమో లేదా ప్రభుత్వమే వారి ప్రయోజనాలకు అనుకూలంగా విధానాల రూపకల్పన చేయడమనేదే జరుగుతున్నది. వారి ప్రయోజనాలను ప్రజలందరి ప్రయోజనాలుగా ప్రచారం చేసే వ్యాపార, రాజకీయ మీడియా సంస్థలు ఏలాగూ ఉన్నాయి అనుకోండి.

కొత్త జిల్లాల ఏర్పాటు ప్రతిపాదనలో రియల్ మాఫియాలు, కార్పొరేట్‌లు రంగంలోకి దిగి వారి వ్యాపార ప్రయోజనాలకు అనుగుణంగా కొన్ని ప్రాంతాలు, పట్టణాలు కొత్త జిల్లాల కేంద్రాలు కావాలని కృత్రిమ ఉద్యమం కూడా నడుపుతున్నాయి. అనేక ప్రాంతాలలో రాజకీయ నాయకులకు వారివారి పార్టీల వైఖరితో సంబంధం లేకుండానే తమ పట్టు, రాజకీయ భవిష్యత్తు కోసం కూడా ఆయా ఉద్యమాల్లో పాల్గొంటున్నారు. ఒకే పార్టీ, ప్రజాసంఘాలు అయినా కూడా ప్రాంతాలను బట్టి భిన్నాభిప్రాయాలు వ్యక్తమవుతూ కొంత వైరుధ్యబరితమైన వాతావరణం నెలకొని ఉన్నది.

ఈ మొత్తం వ్యవహారంలో పట్టణ ప్రాంతాలు గ్రామీణ ప్రాంతాల

ప్రయోజనాలు, సౌకర్యాలతో నిమిత్తం లేకుండా వ్యవహరిస్తున్నాయి. కొత్త మండలాల ప్రతిపాధనలోకూడా కొన్ని గ్రామీణ ప్రాంతాల మధ్య వైరుధ్యం తలెత్తుతున్నది.

గిరిజన ప్రాంతాలు, సంఖ్యరీత్యా బలంగాలేని సామాజిక శ్రేణుల ప్రయోజనాలను పరిగణలోకి తీసుకోవాలి. కొన్ని ప్రాంతాల్లో కొన్ని సామాజిక వర్గాలు బలాన్ని కల్గి ఉండడం వల్ల ఈ అనివార్యత ఏర్పడుతుంది. ఆ ప్రాబల్య సామాజిక వర్గాలు జిల్లాలోని ఇతర సామాజిక శ్రేణుల ప్రజాజీవితాన్ని శాసించే ప్రమాదం లేకుండా జాగ్రత్తలు తీసుకోవాలి. భద్రాచలం నుండి ఆదిలాబాద్ అడవులదాక విస్తరించి ఉన్న గిరిజనులు అనేక జిల్లాలోకి విభజించబడడం వల్ల కూడా వారి 'వాయిస్' ఆయా జిల్లాల్లో బలంగా వినపడకపోవచ్చు.

హైద్రాబాద్ లాంటి నగరానికి దగ్గరగా ఉన్న ఇతర జిల్లాల ప్రాంతాలను నగర జిల్లాల్లోకి కలిపినట్లయితే ఆయా ప్రాంతాల్లో రియల్ మాఫియా విజృంబించవచ్చు. నగర ప్రజలతో సమానమైన మౌళిక సదుపాయాలు లేకపోవడంతో గ్రామీణ ప్రాంత ప్రజలకు ఉపాధి, ఉద్యోగ రంగాల్లో అన్యాయం జరిగే ప్రమాదం ఉంది. విహార స్థలాలు, రెవెన్యూను ఇచ్చే గుడులు, పర్యాటక ప్రాంతాలు, పరిశ్రమలు కొన్ని జిల్లాలకే పరిమితమైతే ప్రజలకు సమాన ఉపాధి అవకాశాలు రాకపోవచ్చు. ఇతర ప్రాంతాలకు రవాణా సదుపాయాలు మెరుగుపడకపోవచ్చు. అంతరాష్ట్ర వివాదాలు తలెత్తినట్టు అంతర్ జిల్లా వివాదాలు కూడా తలెత్తవచ్చు. రెండు జిల్లాల ప్రాంతాలను కలిపి ఒక జిల్లాగా ఏర్పరచడం వల్ల రెవెన్యూ రికార్డుల మార్పిడి ప్రక్రియ కష్టం కావచ్చు. అపరిష్కృతంగా ఉన్న భూవివాదాలు మరింత సంక్లిష్టంగా తయారుకావచ్చు.

నిజాం కాలంలో 1938 లో చేపట్టిన భూముల రికార్డులు తప్ప నేటికి సమగ్ర భూసర్వేను శాస్త్రీయంగా చేపట్టకపోవడంతో ప్రజా భాహుళ్యంలో అనేక వివాదాలు తలెత్తి వారి మధ్య ఉండే సామరస్య వాతావరణాన్ని కలుషితం చేస్తున్నాయి. ప్రతి 30 సంవత్సరాలకు ఒకసారి సమగ్ర భూసర్వే జరగాలని నిబంధనలు చెబుతున్నా ప్రభుత్వాలు పట్టించుకున్న పాపాన పోలేదు. కొన్ని ప్రాంతాల్లో మండలం, డివిజన్, జిల్లా సరిహద్దులు మారిపోనుండడంతో సాధారణ ప్రజలు మరిన్ని ఇక్కట్లను ఎదుర్కొంటారు. పరిష్కార యంత్రాంగం ప్రజలకు చేరువైనా కూడా సరిహద్దు సమస్యలతో వివాదాలు మరింత జటిలమై పరిష్కారానికి మరింత కాలం పడుతుంది. అయితే ఇవేమీ అధిగమించలేని సమస్యలేమీ కావు కానీ సమర్థవంతమైన, ప్రజల పట్ల నిబద్ధత కల్గిన అధికారగణం లేకపోతే ప్రజలు పాత ఇబ్బందుల్నే ఇకముందు కూడా ఎదుర్కొంటారు.

పాలనా వికేంద్రీకరణ అభివృద్ధికి బాటలు వేస్తుందా? అదే పాలనా వికేంద్రీకరణ అభివృద్ధి వికేంద్రీకరణకు దారితీస్తుందా? స్థానిక సంస్థలకు రాజ్యాంగబద్ధంగా రావల్సిన విధులు, నిధుల విషయంలో సూత్రబద్ధంగా, ప్రజాస్వామికంగా వ్యవహరించని రాష్ట్ర ప్రభుత్వాలు కొత్త జిల్లాల ఏర్పాటే పాలన వికేంద్రీకరణ అని ఎట్లా చెప్పగలుగుతారు? పైనుండి రుద్దబడే అభివృద్ధి నమూనాలో గ్రామసీమలు స్వయం సమృద్ధిని సాధించుకో గలుగుతాయా?

కొత్త జిల్లాలు కొత్త సంపన్న వర్గాలను ఏర్పరిస్తే ప్రజల జీవితాల్లోకి అభివృద్ధి ఎట్లా చేరుతుంది. పాలనా సౌలభ్యం, జిల్లా పాలనాయంత్రాంగం ప్రజలకు చేరువవడం బాగానే ఉంది కానీ, అదే అవినీతి, రాజకీయ, అధికార యంత్రాంగంతో ప్రజల జీవితాల్లో గుణాత్మకమైన కొత్త మార్పు లేమైనా వస్తాయా? పాలనా వికేంద్రీకరణ దానికదే అభివృద్ధి కాదు అభివృద్ధి వికేంద్రీకరణ అంతకంటే కాదు. రాజకీయ విధానాలను అనుసరించే అధికార యంత్రాంగ కార్యాచరణ ఉంటుంది కానీ, ప్రభుత్వ కార్యాలయాలు, అధికారుల పెంపుతోనే ప్రజల అభివృద్ధి ఆకాంక్షలు నెరవేరవు.

గత కొన్ని దశాబ్దాలుగా జరిగిందని చెప్పబడుతున్న అభివృద్ధి అంతా నగరాలు కేంద్రంగా ప్రధానంగా హైద్రాబాద్ చుట్టూ కేంద్రీకృతమైంది. అయితే కొత్త జిల్లాల ఏర్పాటుతో ప్రైవేటు ఉపాధి, ఉద్యోగాలు కాకుండా ప్రభుత్వ రంగంలోనే ప్రజలకు అవకాశాలు వచ్చేవిధంగా, అన్ని ప్రాంతాలకు సమాన అవకాశాలు అందివచ్చేలా ఉద్యోగ కల్పనను విస్తరించాలి. ప్రైవేటు రంగంలోని ఉపాధి భద్రతకు కూడా ప్రభుత్వమే పూచీ పడాల్సి ఉంటుంది. కొత్త జిల్లాల ఏర్పాటు క్రమంలో మౌళిక రంగాల అభివృద్ధిలో స్థానిక ప్రజలకు భాగస్వామ్యం కల్పించి ఉపాధిని పెంపొందించాలి. ఒక్కో కొత్త జిల్లా ఏర్పాటుకు వందకోట్లకు పైగా ఖర్చవుతుందని అంచనా వేస్తున్న సందర్భంలో ప్రజల పైసలు వృథాకాని విధానాన్ని పాటించాలి.

కొత్తగా 13 జిల్లాలనో, 14 జిల్లాలనో వాస్తురీత్యానో అధినేత అదృష్టసంఖ్య అనో అశాస్త్రీయ ప్రాతిపదికన కాకుండా జనాభా, ప్రజా ఆకాంక్షలు భౌగోళిక పరిస్థితులు, అన్ని ప్రాంతాలకు సమాన న్యాయం ప్రాతిపదికన జిల్లాల సంఖ్యను నిర్ణయించుకోవచ్చు. కొత్త జిల్లాలకు ఆయా ప్రాంతాల ప్రజల కోసం పనిచేసిన, త్యాగం చేసిన వాళ్ల పేర్లు పెడితే ఏ పేచీ ఉండదు కానీ, ప్రభుత్వాధినేతకు ఇష్టమని బద్రాద్రి, యాదాద్రి, రాజాద్రి, జోగులాంబ అని పెట్టడం సెక్యులర్ లక్షణం అనిపించుకోదు. ఉన్న జిల్లాల్లోని ఉన్నతాధికారులు, కొత్త ఉద్యోగులు కొందరు కొత్త జిల్లాలకు వెళ్లి పనిచేసేక్రమంలో ప్రజల హృదయాలకు చేరువయ్యేలా పనిచేయ్యాలే కానీ భౌతికంగా పాలనా వ్యవస్థ ప్రజల సమీపంలోకి చేరినంత మాత్రాన్నే ఫలితం ఏమీ ఉండదు. మౌలికంగా అభివృద్ధి నమూనా మారకుండా జిల్లాల పెంపువల్లనే అభివృద్ధి జరగదు. సాయంలేక సంక్షోభంలో పడిన రైతన్నల ఆత్మహత్యల పరంపర ఆగిపోదు. పుట్టిన నేలమీద ఉపాధిలేక ఊర్లకు ఊర్లే వలసపోతున్న దయనీయ దృశ్యాలు ఆగిపోవు. లక్షలాదిగా ఉన్న నిరుద్యోగులకు ఉపాధి ఉద్యోగాలు వెంటనే లభించవు.

కాంట్రాక్టర్లకు, కార్పొరేట్స్‌కి ప్రజల సొమ్మును ఊడ్చిపెట్టి లాభాల వరదను పాటించే విధానాలు మారకపోతే కొత్త జిల్లాలు భౌగోళికంగా, భౌతికంగా మిగిలిపోతాయే తప్ప బతుకుల్లో కొత్త కాంతిని ఏమీ తేలేవు. ప్రజల సమిష్టి సంపద అయిన సహజ వనరులను ప్రైవేటు శక్తులకు అప్పగించి ఉపాధిని దేబురించుకునే అగత్యం ప్రజలకు ఉండకూడదు. అభివృద్ధి, ఆత్మగౌరవం, స్వేచ్ఛా స్వతంత్ర్యాలు ప్రజల హక్కులే తప్ప పాలకుల బిక్ష కాదు. కొత్త జిల్లాలు ప్రజలపై పాలకులకు పట్టుకోసం కాకుండా ప్రజలకు పాలనా వ్యవస్థ జవాబుదారీతనాన్ని పెంచేలా ఉండాలి.

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)* వీ

# ఆదివాసి స్వయం పాలిత జిల్లాల ఆవశ్యకత

*తెలంగాణ జిల్లాల పునర్వ్యవస్థీకరణ వల్ల ఆదివాసులు తమ అస్తిత్వాన్ని కోల్పోయే ప్రమాదం ఉందనీ, ఆదివాసి ప్రాంతాలను స్వయం పాలిత జిల్లాగా, జోన్‌గా ప్రకటించాలనీ అంటున్నారు* **వాసం ఆనంద్ కుమార్**

పది జిల్లాల తెలంగాణలో 25 జిల్లాల ప్రక్రియ తెర మీదికి వచ్చిన తరుణంలో జిల్లాల విస్తీర్ణం, భౌగోళిక పరిస్థితులు, అధికార, న్యాయ, ఆర్థిక, విద్య, వైద్య, సాంస్కృతిక, రాజకీయ సమీకరణాలు మారనున్నాయి. ఈ సమయంలో ఉనికి, రాజకీయ ప్రయోజనాల కోసం ఎవరికి వారు తమ సొంత డిమాండ్లతో ముందుకొస్తున్నారు. ఎవరెన్ని డిమాండ్లతో ముందుకొచ్చినా ఆదివాసి జిల్లాలు ఏర్పాటు చేయకుంటే ఆదివాసులు కని, వినెరుగని తీవ్రమైన అన్యాయాన్ని చవిచూడ బోతున్నారు.

తెలంగాణ రాష్ట్ర ఉద్యమంలో ఆదివాసులు మాకు 'తెలంగాణ రాష్ట్రం కావాలి – ఆదివాసులకు స్వయం పాలన కావాలనే' నినాదంతో ఉద్యమం లో భాగస్వాములైనారు. ప్రొ. బియ్యాల జనార్ధన్ రావు, ప్రొ. జయశంకర్, తదితర మేధావుల స్వప్నం కూడా అదే. రాష్ట్రం వచ్చింది కాని ఆదివాసుల స్వయంపాలన కలగానే మిగిలి కన్నీటి గాథకు దారితీస్తుంది.

తెలంగాణ వ్యాప్తంగా ఆదివాసులు ఖమ్మం, వరంగల్, కరీంనగర్, అదిలాబాద్, మహబూబ్‌నగర్‌లలో కోయ, గోండ్, నాయక్‌పోడ్, కొలం, ఆంధ్, కొండరెడ్డి, చెంచు, పార్ధన్, తొటిలుగా 10 లక్షల జనాభా కలిగి 5వ షెడ్యూల్ ప్రాంతంలో నివసిస్తున్నారు. ఇప్పుడు ఏర్పడబోయే 25 జిల్లాలలో 6 జిల్లాల ఆదివాసులు కాస్తా 10 జిల్లాలుగా ముక్కలు చెక్కలుగా మ్యూజియంలో బొమ్మలుగా మారనున్నారు.

**ఆదివాసి ప్రాంతాల చారిత్రక నేపథ్యం**

భారతదేశ మూలవాసులు ఆదివాసులు, స్వాతంత్ర్యానికి ముందు ఆదివాసి రాజ్యాలు పాలన సాగిస్తూ అటవి, నీరు, భూమిపై హక్కుదారులుగా ఉండేవారు. ఈశాన్య భారతంలో నాగాలు, బోడోలు, ముండా, సవర మొదలైన తెగల పాలన ఉండేది. మధ్య భారతదేశం గొండ్వానా రాజ్యంగా 1500 శతాబ్దం వరకు ఆదివాసిల పాలన సాగింది. కాలక్రమేణ భారతదేశం పై మొగలులు, సుల్తానులు దండయాత్ర చేసి ఈ రాజ్యాలను ఆక్రమించి ఆదివాసి రాజ్యాలను కూలగొట్టారు.

17వ శతాబ్దంలో బ్రిటిష్ వారు వ్యాపారం నిమిత్తం ఈ దేశానికి వచ్చి, వారి పరిపాలనలోకి తెచ్చుకుని ఆదివాసి ప్రాంతంలోని అటవి జంతు, ఖనిజ, బంగారం, వజ్రా సంపదంత కొల్లగొట్టుకు పోతూ దాదాపు 200 సంవత్సరాల పాలన సాగించి విధ్వంసానికి పాల్పడ్డారు. ఈ తరుణంలో బ్రిటీష్ వారిని ఎదిరించిన తొలి స్వాతంత్ర సంగ్రామ పోరాట ఆదివాసి యోదులు బిర్సాముండా, రాంజీగోండ్, సంతాల్, బిల్లు మొదలైన వారు చరిత్రలో నిలిచి భారతదేశ స్వాతంత్ర్యానికి దిక్సూచిగా నిలిచారు.

దేశాల విభజనలో నాగాలు, సంతాలు, బోడోలు బంగ్లాదేశ్, చైనా, బూటాన్, నేపాల్‌గా ముక్కలుగా చీలి అస్థిత్వ పోరాటాలు చేస్తున్నారు. స్వాతంత్ర అనంతరం గోండ్వానా మధ్య భారతదేశాన్ని భాష, పరిపాలన అభివృద్ధి పేరుతో ఆదివాసి ప్రాంతాల్ని మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, చత్తీస్‌గడ్, జార్ఖండ్, ఒరిస్సా, బీహార్, పశ్చిమబెంగాల్, ఆంధ్రప్రదేశ్, తెలంగాణలుగా విడదీసి ఆదివాసుల సంస్కృతి సంప్రదాయాలను భాషను, అడవి సంపదను జీవనాన్ని విచ్చిన్నం చేశారు.

**తెలంగాణలోని ఆదివాసుల పరిస్థితి**

తెలంగాణ రాష్ట్ర సాధనకి సమ్మక్క-సారలమ్మ కొమురం భీం పోరాటాలే స్ఫూర్తి అన్న మన ముఖ్యమంత్రి వీరి స్వయంపాలన ఆశయాలను ఆవిరి చేస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ నుంచి తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు క్రమంలో చీకటి ఒప్పందంతో పోలవరం కింద 7 మండలాలు 3 లక్షల మంది ఆదివాసులను బలి ఇచ్చి తెలంగాణ వచ్చాక టి.ఆర్.ఎస్. ప్రభుత్వం ఆదివాసులపై వేట ప్రారంభించింది.

వరుసగా ఆదివాసులు విద్య, ఉద్యోగ, రాజకీయంగా, ఆర్థికంగా వెనుకబడి, రిజర్వేషన్ అంత 1976 లో కలపబడిన బంజారల వశమైన క్రమంలో చెల్లప్ప కమీషన్ వేసి గిరిజనులకు 12 శాతం రిజర్వేషన్ అని వాల్మీకి బోయ, ఖైతి లంబాడాలను కలపాలనే పిడుగు లాంటి విషయాన్ని ఎజెండాలో పెట్టి అమలుకు పూనుకున్నారు. ఈ ప్రభుత్వం టిఎస్‌పిఎస్‌సిలో సభ్యులుగా, ఎంఎల్‌సిలుగా, మంత్రులుగా, ప్రభుత్వ అధికారులుగా మొదలైన బంజారాలకు కట్టపెట్టి ఆదివాసులకు ఎటువంటి పదవులు ఇవ్వకుండా విస్మరించింది.

ఆదివాసులకు ఆయుధమైన 1/70 యాక్టు ఉన్నా ప్రభుత్వం ఏర్పాటు కాగానే ఆదివాసి ప్రాంతంలో ఆంధ్ర గిరిజనేతరుల చేతిలో ఉన్నా భూములకు రుణ మాఫిని అమలు చేస్తూ ఈ చట్టం ప్రకారంగా గిరిజనేతరులకు భూమికొనే లేదా అమ్మే అధికారం లేకున్న చట్ట వ్యతిరేక మాఫికి పూనుకుంది.

అడవితో ఆదివాసులకున్న అనుబంధాన్ని తెగతెంపులు చేయటానికి అమ్రాబాద్ (రాజీవ్‌గాంధి టైగర్ జోన్) కవ్వాల టైగర్ జోన్, తెరపైకి వచ్చిన ఏటూరునాగారం టైగర్‌జోన్‌లు అమలుచేస్తూ, బయ్యారం ఉక్కు ఓపెన్ కాస్టులతో ఆదివాసులను ఖాళీ చేయాలని ప్రభుత్వం కంకణం కట్టుకుంది.

అటవీ హక్కు చట్టం-2006 ప్రకారం పోడు చేసుకుంటున్న ఆదివాసుల పట్టాలు ఇవ్వాల్సి ఉన్నా హరితహారం పేరుతో అటవీ

అధికారులచే దౌర్జన్యాలు చేస్తూ దాడికి దిగింది. కుంటాల, కొమురంభీం ప్రాజెక్టుల ఎత్తు పెంచుతూ భారీ ప్రాజెక్టులతో ఆదివాసి ప్రాంతాలని ముంచాలని చూస్తుంది. ఏజెన్సీలో ఉన్నటువంటి కమలాపూర్ ఫ్యాక్టరీ, మణుగూరు (భద్రాద్రి) థర్మల్ ప్లాంట్, సింగరేణిల వల్ల విషపూరిత వాతావరణానికి వేలాది ఆదివాసులు బలవుతున్న పరిస్థితి. పైగా అక్కడ ఉద్యోగాలలో 100 శాతం వాటా ఆదివాసులదైనా మైదాన ప్రాంత వాసులను కొనసాగిస్తూ ఆదివాసుల నోట్లో మన్ను పోస్తుంది.

ఆదివాసి ప్రాంతాలన్ని గోదావరి, కృష్ణా నదీ పరివాహక ప్రాంతంలో ఉండి భారీ నీటి ప్రాజెక్టులున్న త్రాగు, సాగు నీరువ్వని పరిస్థితి. వర్షాకాలం వచ్చిందంటే ముంపుతో విలవిల, వేసవొస్తే చుక్క నీటి కోసం గొంతెండుతున్నా పట్టించుకున్న పాపాన పోలేదు.

ఈ ప్రాంతాన్ని పర్యాటక ప్రాంతాలుగా మారుస్తూ వలస వాదాన్ని ప్రోత్సహిస్తూ, వ్యాపారం పేరుతో అడవిని, ఆదివాసిల సంస్కృతి - సంప్రదాయాలని దెబ్బతీసున్నాయి. ఆదివాసిల విద్యకై గిరిజన యూనివర్సిటీ వస్తే ఆదివాసి ప్రాంతాలైన ఉట్నూరు, ఏటూరునాగారం, భద్రాచలం లేదా చర్ల లాంటి ప్రాంతంలో ఏర్పాటు చేయాల్సింది పనోయి మైదాన ప్రాంతానికి తరలిస్తుంది.

కొమురంభీం పోరాట స్ఫూర్తిని పునికి పుచ్చుకున్నట్లు చెప్పే ముఖ్యమంత్రి బంజారాలకు ఆధ్యాత్మిక గురువు, సాధువు అయిన సేవాలాల్ జయంతికి జిల్లాకో 10 లక్షల చొప్పున కోటి రూపాయలు ఇస్తూ కొమురంభీం వర్ధంతి కేవలం ఒక్క ఆదిలాబాద్ జిల్లాలో నిర్వహించి మిగతా ఆదివాసులను విస్మరించింది. మరోపక్క నాన్ షెడ్యూల్ సమస్య.

ఆర్టికల్ 244(1) పార్ట్-సి 6(సి) ప్రకారం రాష్ట్రాల విభజన క్రమంలో ఆదిలాబాద్ - 200, వరంగల్ - 76, ఖమ్మం - 25, కరీంనగర్ - 200, మహబూబ్‌నగర్ - 50, దాక ఆదివాసి నాన్-షెడ్యూల్డ్ గ్రామాలకు షెడ్యూల్డ్ హోదా కల్పించాల్సి ఉన్నా గవర్నర్ పట్టించుకునే పరిస్థితి లేదు. సమ్మక్క పుట్టిన - బయ్యక్కపేటకే ఏజెన్సీ హోదా లేదు. 5వ షెడ్యూల్ ఆదివాసి ప్రాంతాల అదిపతి అయిన గవర్నర్ భద్రాచలం పుణ్య దర్శనానికి వెళ్తాడు కాని ఖమ్మం ఆదివాసుల స్థితి, గతులపై ఆదివాసి ప్రాంతాలను సందర్శించిన దాఖలాలు లేవు.

వరంగల్ - ఏటూరునాగారం ఏరియాలోని రామప్ప గుడిని సందర్శించాడు. కాని అక్కడి ఆదివాసులని కలిసిన సందర్భం లేదు. చెంచుల ఏరియాలోని శ్రీశైలాన్ని దర్శించిన ఒక చెంచు పెంటకు పోలేదు, కరీంనగర్ - కాళేశ్వరానికి, దర్మపురికి వెళ్ళినా మహదేవ్‌పూర్, సారంగాపూర్ ఆదివాసి ప్రాంతాలకు వెళ్లని పరిస్థితి. ఆదిలాబాద్-బాసర క్షేత్రాన్ని సందర్శించిన గోండు గూడాలను చూసిన పాపాన పోలేదు.

ఇటువంటి పరిస్థితుల మధ్య ఆదివాసులు కొట్టు మిట్టాడుతుండగా ప్రభుత్వం 25 జిల్లాలను ప్రకటించినది. వీటిలో ఆదివాసులు ఖమ్మం - వైరా, ఇల్లందు, కొత్తగూడెం - కొత్తగూడెం, భద్రాచలం, పినపాక, అశ్వారావుపేట, సత్తుపల్లి, ఆదిలాబాద్ - ఆదిలాబాద్, బోథ్, నిర్మల్, ఖానాపూర్, బైంసా, మంచిర్యాల - మంచిర్యాల, సిర్పూర్ కాగజ్‌నగర్, ఆసిఫాబాద్, చెన్నూర్, జగిత్యాల- ధర్మపురి, వరంగల్ - మహబూబాబాద్, నర్సంపేట, భూపాలపల్లి - భూపాలపల్లి, ములుగు, మంథిని, నాగర్‌కర్నూలు - అచ్చంపేటలుగా ఆదివాసి నియోజక వర్గాలు ఉన్నాయి.

ఈ విధంగా జిల్లాల వారిగా 5వ షెడ్యూలు ప్రాంతాలు విడిపోయి అగమ్యగోచరంగా, కుక్కలు చింపిన ఇస్తారుకుగా మారనుంది. ఈ పరిస్థితి 'మూలిగే నక్క మీద తాటి ముంజ పడ్డట్లు' ఆదివాసిల మీద కె.సి.ఆర్. పంజా పడుతుంది. కనుక ఆదివాసి ఐటిడిఎ ప్రాంతాలైన భద్రాచలం, ఏటూర్ నాగారాలని కోయల (సమ్మక్క-సారలమ్మ) జిల్లాగా ఉట్నూర్ కేంద్రంగా (కొమురంభీం) గోండుల జిల్లాగా చెంచుల బెల్టు ప్రత్యేక జోనుగా ఆదివాసి స్వయం పాలిత ప్రాంతంగా ప్రకటించాలి. ఈ స్వయం పాలిత జిల్లాలకు రాజ్యాంగ భద్దమైన హక్కులు, చుట్టున్నాయి.

**స్వయంపాలిత జిల్లాకై రాజ్యాంగ పరమైన అంశాలు**

5వ షెడ్యూలు - ఆర్టికల్ 244(1) షెడ్యూల్డు ప్రాంతాలు, షెడ్యూల్డు తెగల పరిపాలన, నియంత్రణ గురించి చెప్తూ, దీని ప్రకారం ఆదివాసి ప్రాంతాలలో పరిపాలన వ్యవహారాలు గవర్నర్ చేతిలో ఉంటాయి కనుక షెడ్యూల్డు తెగల కౌన్సిల్ల ద్వారా 6వ షెడ్యూల్‌ని పోలిన స్వయంపాలిత జిల్లాలుగ ప్రకటించే అస్కారం ఉంది.

పీసా (పంచాయితీ రాజ్ చట్టం) 1996 4(ఠ) క్లాజులో 6వ షెడ్యూల్డు మాదిరిగా ఆదివాసిల అలవాట్లు, భూమి, అటవి, ప్రకృతి వనరులు, సంస్కృతి- సంప్రదాయాలు, రక్షణకై 5వ షెడ్యూల్డు ప్రాంతాలను స్వయంపాలిత జిల్లాలుగా ప్రకటించవచ్చు అని దిలిప్ సింగ్ భూరియా కమిటీ 1996, కాక కమిటి 2014 సూచించింది.

స్వాతంత్ర్యానికి ముందు బ్రిటిష్ ఇండియాలో షెడ్యూల్డు జిల్లా నిబంధన 1874 ప్రకారం భద్రాచలం, రేకపల్లి రంపచోదవరం ప్రాంతంగా జిల్లా పరిపాలన సాగింది. గిరిజన ప్రాంతాల నిబంధన 1359 (ఎఫ్) ద్వారా ఏజెంట్స్, సబ్-ఏజెంట్స్‌గా ప్రత్యేక పరిపాలన అధికారాలు సాగాయి. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లోని గిరిజన ప్రాంతాలు - 1839 నుంచే ప్రత్యేక శాసనాలతో సుదీర్ఘ చరిత్ర కలిగి ఉంది.

ఇటువంటి రాజ్యాంగపరమైన అంశాలను పరిగణలోకి తీసుకొని తెలంగాణలోని 17,852 చ.కి షెడ్యూల్డు ప్రాంతాన్ని, పీసా-1996 4(ఠ) ప్రకారం ఆదివాసి స్వయంపాలిత జిల్లాలుగా ఏటూరునాగారం, భద్రాచలం 9,222 చ.కి (సమ్మక్క-సారలమ్మ జిల్లా) ఉట్నూర్ (కొమురంభీం జిల్లా) లను 8,130 చ.కి. ప్రకటించి, చెంచులకు ప్రత్యేక జోన్ ఏర్పాటుకై రాజకీయపార్టీలు, రాజకీయ నాయకులు, ప్రజా సంఘాలు, ప్రజాస్వామిక వాదులు, మేదావులు, ఆదివాసి, ఆదివాసేతర సంఘాలు కంకణబద్దులైన ఆదివాసుల న్యాయమైన, స్వయంపాలిత జిల్లాల డిమాండ్‌ను అమలు పరిచి ఆదివాసులను అడవిని కాపాడుదాం.

*(రచయిత అడ్వకేట్ - ఆదివాసి విద్యార్థి సంఘం - ఎఎస్‌యు)* వీ

**ఆర్ఎస్ రావు స్మారకోపన్యాసం - 2016 - 'వ్యవసాయ సమస్యపై మరోచూపు - భారత వ్యవసాయ మార్పుల రాజకీయార్థిక శాస్త్రం' - ప్రొ. డి. నరసింహారెడ్డి, ప్రఖ్యాత అర్థశాస్త్రవేత్త వీక్షణం ఆగస్టు 2016 సంచికలో రాబోతున్నది**

# విద్రోహంపై ఎక్కుపెట్టిన సిద్ధేశ్వరం అలుగు

***దశాబ్దాలుగా రాయలసీమ ప్రాంతాన్ని నిర్లక్ష్యం చేస్తున్న పాలకులపై విసుగెత్తిన ప్రజలు, ఎన్నో అడ్డంకులను, అవరోధాలను అధిగమించి సిద్ధేశ్వరంలో కృష్ణానదిపై అలుగు నిర్మాణ ప్రారంభోత్సవంతో తమ ధిక్కారాన్ని తెలియజేశారని అంటున్నారు కె. నాగేశ్వరాచారి***

ఏళ్ల నాటి విద్రోహం, నిర్లక్ష్యంపై ఎక్కుపెట్టిన సిద్ధేశ్వరం అలుగు శంకుస్థాపన. శ్రీశైలం ప్రాజెక్టుకు 86 కిలోమీటర్ల ఎగువన సిద్ధేశ్వరం దగ్గర మే 31న కర్నూలు జిల్లాలో ఐక్యకార్యాచరణ సమితి నేతృత్వంలో కృష్ణా నదిపై అలుగు శంకుస్థాపన జరిగింది. దీనివల్ల 50 టిఎంసిల నీరు సీమ ప్రజలకు లభిస్తుంది.

సాయుధ ముఠాకక్షల కార్పణ్యాల విషపు కోరల్లో నలిగిన సీమ జనం రాయలసీమ ఐక్యకార్యాచరణ సమితి నేతృత్వంలో ముందుకు కదిలారు. వేలాది మంది జనం కష్టాల్ని కడుపున పెట్టుకొని ఆశల్ని సద్దిమూట కట్టుకొని సమితి పిలుపునందుకొని సిద్ధేశ్వరం బయలుదేరారు. అడ్డంకుల్ని, అవరోధాల్ని తోసిరాజని పోలీసుల నిర్బంధాన్ని ధిక్కరించి అలుగుకు శంకుస్థాపన చేశారు. సీమకు జరిగిన విద్రోహాన్ని నిరూపించనక్కరలేని, చర్చించనక్కరలేని సత్యం, నిజం, వరుస కరువుల చరిత్ర ఓట్ల రాజకీయ నాయకులకు తెలియకపోవచ్చు గాని, సామాజిక అవగాహన ఉన్న విద్యా వంతులకు తెలుసు. చరిత్రలో కరువు సమాచారం అందినకాన్నుంచి లెక్కపెడితే వందలాది కరువు సంవత్సరాలు ఇనుప గజ్జెలు కట్టి నాట్యమాడినాయి. ఆదాయం పెంచుకోవడానికే అయినా బ్రిటిష్ ప్రభుత్వం, సిద్ధేశ్వరం నిర్మిస్తే సీమ కష్టాలు తీరతాయనుకున్నారు. తరువాత కాలంలో ప్లానింగ్ కమిషన్ భారత ప్రభుత్వానికి అనుమతినిచ్చింది కూడా! 13 సంవత్సరాల క్రితం ఇంజనీర్ల కమిటీ సాధ్యాసాధ్యాల్ని వివరించి అవసరమని కూడా ప్రభుత్వానికి సిఫార్సు చేసింది కూడా! ఈ మధ్య కాలంలోనే ఎగువన తుంగభద్ర డ్యాం, శ్రీశైలం, నాగార్జున సాగర్, తెలుగు గంగ, పోతిరెడ్డిపాడులు నిర్మితమైనాయి. కరువుల పరంపర, రైతుల ఆత్మహత్యల పరంపర, వలసల వరుసలు కొనసాగుతూనే ఉన్నాయి. ఇక సహనం నశించిన జనం సమితి ఇచ్చిన వివరణతో ఏకీభవించి సిద్ధేశ్వరం అలుగుకు పరుగులు పట్టారు.

నిన్నగాక మొన్న మొదలు పెట్టిన పట్టిసీమ ఎవరి అవసరాలు తీర్చడానికి పూర్తి చేసినట్లు? వందల సంవత్సరాలుగా అఘోరిస్తున్నా తక్షణావసరంగా సీమనీటి ప్రాధాన్యత పాలకులకు పట్టలేదు. రాష్ట్ర విభజన సమయంలో సీమ ప్రజల్ని రెచ్చగొట్టి లోపాయకారిగా రాజధాని ప్రాంతాన్ని ఎంపిక చేసుకున్నారు. కొత్త రాష్ట్రం ఏర్పడినదానిగా ఇప్పటి వరకు సీమకు ప్రాధాన్యతనిచ్చి ఏర్పాటు చేసిన పరిశ్రమలు లేవు.

శ్రీబాగ్‌లో మొదలైన విద్రోహం తుంగభద్ర బోర్డును కృష్ణా బోర్డు పరిధిలో కలుపుకునే వరకు కొనసాగుతూనే ఉంది. మరీ మధ్య కాలంలో సీమ ఎన్ని విద్రోహపు దెబ్బల్ని చవిచూసిందో! 53 సార్లు కేంద్ర కరువు బృందం పరిశీలన, దొక్కల కరువు, ధాతకరువు, వరుస సంవత్సరాల కరువులు, కోట్లాది రూపాయల కరువు నివారణ పథకాలు, ఇవన్నీ సీమ విద్రోహపు నాటకంలోని అంకాలే!

మద్రాస్ నుండి విడివడి సీమ ఆంధ్రలో కలిసి అందులో భాగమైంది. సీమ విలీన కాలంలో ఆంధ్ర నాయకులు హామీలిచ్చినారు. అమలు జరిగాయా? అమలు జరిగే తీరును ప్రజా ప్రతినిధులు పర్యవేక్షించాలి. అమలు జరగాలని అడిగేవారిని పదవులతో జోకొట్టారు. అమలుకు మళ్ల హామీల వరదలు పారించారు. పీతల సంస్కృతిని పెంచి పోషించారు. సీమ ప్రజల్ని ఊరించడానికి రాయల పట్టాభిషేకోత్సవాలు, లేపాక్షి ఉత్సవాలు, భువన విజయాలు నడిపి గతకీర్తిని పిప్పిగానంతో ఓలలాడించారు. కరువు మరణ మృదంగాన్ని మరిచినారు. సీమకు సంక్రమించిన హక్కుల అమలుకు పదవుల పల్లకీలెక్కి ప్రయత్నించలేదు.

సీమ ప్రజల ఇన్నేళ్ల సహనం, కష్టం గత మే నెల 31న కట్టలు తెంచుకొంది. జల దీక్షలు బూటకాలని అర్థం చేసుకున్నారు. కర్నూలు జిల్లా నలుమూలల నుంచి దాదాపు 20 వేల మంది జనం సద్దులు గట్టుకుని, పలుగు పార చేతబట్టి జై సిద్ధేశ్వరమంటూ స్వచ్ఛందంగా అలుగు శంకుస్థాపనకు బయలుదేరారు.

ప్రభుత్వం అలుగు శంకుస్థాపనకు అనుమతి లేదని అడ్డంకులు కల్పించింది. సిద్ధేశ్వరానికి వాహనాలు వెళ్లకుండా రోడ్లు తవ్వి, గుంతలమయం చేసి పోలీసులు విధ్వంసానికి పాల్పడ్డారు. ఉద్యమ నాయకుల్ని గృహంలో నిర్బంధించారు. రోడ్ల పొడవునా పోలీస్ పికెటింగ్‌లు ఏర్పాటు చేశారు. ఓ రకంగా యుద్ధ వాతావరణాన్ని సృష్టించారు. సామాన్య ప్రజల్లో భయోత్పాతాన్ని సృష్టించాలని పోలీసులు శాయ శక్తులా కృషి చేశారు. ఇంత నిర్బంధం ఎందుకు? రైతులు తమ పక్కనే కృష్ణా నదిలో పారుతున్న నీరు తమ పొలాలకు కావాలన్నందుకు. ఈ కోర్కెలు ఈనాటివి కావు వందల సంవత్సరాల నాటివి.

రాయలసీమ ఐక్యకార్యాచరణ సమితి దాదాపు రెండు నెలలకు పైగా జిల్లావ్యాప్తంగా మండల కేంద్రాల్లోనూ, ముఖ్య పట్టణాల్లోనూ రైతాంగంతో సమావేశాలు ఏర్పాటు చేసింది. కనీవినీ ఎరుగని ఎండల్ని భరిస్తూ అలుగు నిర్మాణావశ్యకతను ప్రజల ముందు పెట్టి చర్చించింది. చదివి, విని, చర్చించుకున్న జనం కదిలారు. ఈ శంకుస్థాపన కార్యక్రమంలో పాల్గొన్న రైతాంగపు అభిప్రాయాలు, మనోగతాలు ప్రజాస్వామ్యంపై నమ్మకమున్న వాళ్లను ఆలోచింపజేశాయి. 'ఇంజనీరు సార్లు చెప్పినట్లు మొత్తం పారుదల ఉన్న ఊర్లన్నీ కలిసి సెందాలెత్తి అలుగు కట్టుకుందం. ఇంగెన్నేండ్లు గవర్నమెంటునడిగేది. ఒగటి పీకేస్తే ఎంటికంటరు, పదిమంది పీకేస్తే కంబడంటారు' అనుకుంటూ తెచ్చుకున్న సద్దులు అక్కడే తిన్నారు.

# సిద్ధేశ్వరం అలుగు రాయలసీమ రైతుల హక్కు

***కోస్తా, రాయలసీమ రాజకీయ నాయకులు రాయలసీమకు చేసిన మోసాలను గుర్తించిన ప్రజలు తమ సమస్యలను తామే పరిష్కరించుకునే క్రమంలో అలుగును ప్రారంభించారని అంటున్నారు* కె. సుభాషిణి**

ప్రజలను ఎల్లకాలం మభ్యపుచ్చి ఉంచడం సాధ్యం కాదు అన్న విషయం పాలకులకు ఎరుకలో ఉన్న విషయమే. సంస్కరణలు అనే తాయిలాలతో కొంతకాలం సమస్యలను వాయిదా వేయవచ్చు. రాజకీయ చతురతతో అటువైపు శిబిరంలోని నాయకులను తమ వైపుకు తిప్పుకొని పబ్బం గడుపుకోవచ్చు. ఇటువంటి దగుల్బాజీ రాజకీయాలను, రాజకీయ నాయకులను ప్రజలు గతంలోనూ చూశారు. ఇప్పుడూ చూస్తున్నారు. అయితే చరిత్రలో పాలకులు చేసే మోసాలను ప్రజలు ఎప్పుడో ఒకసారి తప్పక తెలుసుకుంటారు. ఇంతకాలం ఎంత ఘోరంగా మోసపోయామో, కోలుకోలేనంతగా నష్టపోయామో అని తెలుసుకున్నప్పుడు ప్రజల ఆగ్రహం కట్టలు తెంచుకుంటుంది. మే 31న రాయలసీమలో సరిగ్గా అదే జరిగింది.

రాయలసీమ సాగునీటి సాధన సమితి అధ్వర్యంలో సిద్ధేశ్వరం అలుగు శంకుస్థాపనకు రంగం సిద్ధమయ్యింది. ప్రణాళికలు తయారు అయ్యాయి. గ్రామగ్రామానా సభలు, సదస్సులు ఏర్పాటు చేశారు. నీటి పంపకంలో రాయలసీమకు జరిగిన అన్యాయాలను రైతులకు తెలియజేశారు. ఏ ప్రధాన రాజకీయ పార్టీల అండ లేకుండా, సిద్ధేశ్వరం అలుగు సాధన అన్న ఎకైక అజెండాతో రాయలసీమ రైతులు స్వచ్ఛందంగా సిద్ధేశ్వరం అలుగు శంకుస్థానకు కదిలి రావటం అనేది చాలా ఉత్తేజభరితమైన విషయం. ఏమిటి ఈ సిద్ధేశ్వరం అలుగు? ఎందుకు? అన్న ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకున్న రైతులు సిద్ధేశ్వరం అలుగు నిర్మాణం తమ హక్కుగా భావించి దానిని సాధించుకోటానికి పెద్ద ఎత్తున కదిలి వచ్చారు.

కోస్తా, రాయలసీమ పెట్టుబడిదారుల స్వప్రయోజనాల కొరకు రంగం మీదకు వచ్చిన సమైక్యాంధ్రా ఉద్యమ మత్తు నుండి రాయలసీమ ప్రజలు ఇప్పుడిప్పుడే బయట పడుతున్నారు. వెనుకబడిన రాయలసీమ అభివృద్ధికి అవసరమయిన నీటి ప్రాజెక్టులు, విద్యాసంస్థలు, పరిశ్రమలు లాంటివి, రాయలసీమలో ఏర్పాటు చేయకుండా, రాయలసీమకు దక్కనివ్వకుండా ప్రతిది కోస్తా వైపుకు తన్నుకుపోతుంటే ముందులాగా కళ్లు అప్పగించి చూసే పరిస్థితి ఇప్పుడు రాయలసీమ ప్రజల మనసులల్లో లేదు. రాయలసీమ వెనుకబాటుకు కారణం వర్షాభావ పరిస్థితుల వలన తరుచుగా వచ్చే కరువులే అని రాయలసీమ ప్రజలనూ, బయట ప్రపంచాన్నీ నమ్మిస్తున్న పాలక వర్గాల కుట్రలను రాయలసీమ ప్రజలు తెలుసుకునే ప్రయత్నం చేస్తున్నారు.

గత శతాబ్ధ కాలంగా రాయలసీమ ప్రజలు ఎలా దగా పడ్డారో, కరువు రక్కసి కోరలకు చిక్కి, తాగునీరు, తిండి లేక ఎలా ఆలమటించారో, నెర్రెలు చీలిన భూముల దాహార్తిని ఎలా తీర్చలేకపోయారో, పశువులకు గుప్పెడు గడ్డిని అందివ్వలేక వాటిని కబేలాలకు ఎందుకు అమ్ముకోవాల్సి వచ్చిందో, ఉన్నత విద్యకు చాలా కాలం పాటు ఎందుకు దూరమయ్యారో అర్థం చేసుకోవటం మొదలు పెట్టారు. తమ వెనుకబాటుకు వలస పాలకులయిన బ్రిటిష్ వారో, ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో తమిళులతో కలిసి ఉండడమో కాదనీ, తెలుగు భాష మాట్లాడే సాటి కోస్తా రాజకీయ నాయకులు, వారికి వంత పాడే రాయలసీమ నాయకులే అని రాయలసీమ ప్రజలకు స్పష్టంగా తెలిసిపోయింది.

పదవులు, అధికారం కోసం రాయలసీమ ప్రయోజనాలను పణంగా పెట్టి, కోస్తా రాజకీయ నాయకులతో కుమ్మక్కయ్యి, బెజవాడ పురవీధుల్లో ఏనుగు అంబారి ఎక్కి వూరేగి పరవశించిపోయిన రాయలసీమ రాజకీయ నాయకులను, రాయలసీమ ప్రజలు నేడు ఏవగించుకుంటున్నారు. పుస్తకాలకు ఎక్కని చరిత్రను తవ్వి చదివే ప్రయత్నం చేస్తున్నారు. తరతరాలుగా తమ జీవితాలు ఇంతగా చితికిపోవటానికీ, చిన్నాభిన్నం కావటానికీ కారణమయిన శక్తులు ఇంటా, బయటా వున్నాయన్న నగ్న సత్యం అనుభవంలోకి వచ్చింది. ఈ వంచన నుండి బయట పడాలనే ఆరాటం రాయలసీమ ప్రజలల్లో బలంగా కనిపిస్తోంది.

రాయలసీమకు దక్కవలసిన వాటాను దక్కించుకోవాలంటే ప్రత్యేక రాయలసీమ రాష్ట్ర ఆవశ్యకత రంగం మీదకు వచ్చింది. ఇప్పుడు ఆ డిమాండ్ ఊపు అందుకుంటోంది. రాయలసీమ రాష్ట్ర డిమాండ్ 2014 తర్వాత మొదలైనది కాదు. బ్రిటిష్ పాలనలో, ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో

---

ప్రభుత్వం పట్ల ప్రజలకు విశ్వాసం సన్నగిల్లిందనడానికి ఇంతకంటే ఏం నిదర్శనం కావాలి. ప్రజా సంక్షేమం ప్రభుత్వాలు మరిచాయని అర్థమవుతుంది. ఈ వ్యతిరేకతను గురించి ప్రభుత్వాలకు తెలియదని కాదు. అణచివేయగలమన్న ధీమా ప్రభుత్వాలకుంది. ఆ తీరుగానే ప్రజలు ఎదిరించే స్థితికి తామే నెడుతున్నామని ప్రభుత్వం గుర్తించాలి.

అనంతపురం జిల్లాలో చాలా కాలంగా ఎచ్ఎల్సి సమాంతర కాలువ డిమాండ్ ఉండనే ఉంది. కడప జిల్లాకు కెసి కెనాల్ పరిష్కృత్ సమస్య ఉంది. పంచవర్ష ప్రణాళికలు గయేస్తున్న హంద్రీనీవా చిత్తూరు జిల్లాకు అందని ద్రాక్ష పండైంది.

నిస్పృహలోని జనం సిద్ధేశ్వరం అలుగు నిర్మాణానికి పలుగులు పట్టినట్లే పట్టి వారి సమస్యల సాధనకు కృషి చేసుకోవాల్సిన గతి ప్రజలకు పట్టింది. ప్రతినిధులు నామావశిష్టంగా మిగలక్కూడదనుకుంటే తక్షణ పరిష్కారాలకు నడుంబిగించాలి మరి.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

సాటి తెలుగువారయిన కోస్తావారితో కలిసి ఉన్నప్పుడే ప్రారంభమైంది. తెలుగువారి పట్ల తమిళులు ప్రదర్శించిన వివక్షతకు వ్యతిరేకంగా, తెలుగు భాషాభిమానంతో, తెలుగు ప్రజలకు ప్రత్యేక రాష్ట్రం కావాలనే ఆకాంక్షతో ఆంధ్ర రాష్ట్ర ఉద్యమం ప్రారంభమయ్యింది.

ఆంధ్ర రాష్ట్ర ఉద్యమం కొనసాగుతున్నప్పుడే కోస్తా పాలక వర్గ కుటిల స్వభావం బయట పడింది. ఎంతో మంది ప్రముఖులకు డిగ్రీ పట్టాలను అందించిన అనంతపురం ఆర్ట్స్ కళాశాల 1916లో (జూలై 2016లో శతాబ్ది ఉత్సవాలు జరగాలి!) అనంతపురంలో ఏర్పాటు అయ్యింది. దానికి కొనసాగింపుగా, వెనుకబడిన రాయలసీమ ప్రాంత వాసులకు ఉన్నత విద్యను అందివ్వాలనే ఉన్నత ఆశయంతో, అనంతపురంలో ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటు చేయాలని మద్రాసు సెనెట్ ఏకగ్రీవంగా నిర్ణయం తీసుకుంది. అయితే ఈ నిర్ణయాన్ని కోస్తా పాలకవర్గం అడ్డుకొని, ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని విశాఖపట్టణంలో ఏర్పాటు చేయించుకోటానికి కుట్ర పన్ని విజయం సాధించారు. ఇది 1926లో జరిగింది. అప్పటి నుండే ఆంధ్రరాష్ట్ర ఉద్యమాన్ని అనుమానించడం మొదలైంది. ఈ కుట్ర ఒక్క ఆంధ్ర విశ్వవిద్యాలయానికే పరిమితం కాలేదు.

డొక్కల కరువుతో తల్లడిల్లిన రాయలసీమ ప్రాంత ప్రజల ఆగచాట్లు చూసి బ్రిటిష్ పాలకులు చలించిపోయారు. మెకంజీ నివేదిక ఆధారంగా, కరువు పీడిత ప్రాంతమైన రాయలసీమను సస్యశ్యామలం చేయడానికి బ్రిటిష్ పాలకులు కర్నూలు జిల్లా, కొత్తపల్లి మండలం, సిద్ధేశ్వరం దగ్గర కృష్ణా-పెన్నార్ ప్రాజెక్టు నిర్మాణానికి ప్రణాళిక సిద్ధం చేశారు. అయితే అది కార్య రూపం దాల్చలేదు. బ్రిటిష్ పాలకులు భారతదేశం వదిలి వెళ్లిన కొన్ని సంవత్సరాల తర్వాత ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో కృష్ణా-పెన్నార్ ప్రాజెక్టు అవశ్యకత తిరిగి చర్చకు వచ్చింది. ఈ ప్రాజెక్ట్ వలన రాయలసీమ, నెల్లూరు, తమిళనాడులకు అంతా కలిపి 24 లక్షల ఎకరాలకు సాగునీరు అందివ్వాలనేది లక్ష్యం.

1951 ప్రాంతంలో ఈ ప్రాజెక్టుకు ప్లానింగ్ కమీషన్ అనుమతి కూడా లభించింది. దీన్నీ కూడా కోస్తా పాలక వర్గం తన స్వార్థం కొరకు, కుటిల బుద్ధితో మన ప్రాంతంలో పారే నీళ్లు మనకు దక్కాలి కానీ తమిళులకు నీళ్లు ఇవ్వటం ఏమిటి అని తెలుగు భాషాభిమానం పేరిట రాయలసీమ ప్రజలను రెచ్చగొట్టి, కృష్ణా-పెన్నార్ ప్రాజెక్ట్ నిర్మాణాన్ని శాశ్వతంగా రద్దు చేయించారు. పోనీ, తెలుగు మాట్లాడే సాటి రాయలసీమ ప్రజల ప్రయోజనాల కొరకు కృష్ణా-పెన్నార్ ప్రాజెక్ట్ నమూనాను మార్చి, కొత్తది ఏదన్నా ప్రయత్నించారా అంటే, ప్రయత్నించారు! ఎలా?

రాయలసీమ రైతుల జీవితాలకు, భావి తరాలకు సమాధి కట్టి, సిద్ధేశ్వరం వద్ద నిర్మించ తలపెట్టిన కృష్ణా-పెన్నార్ ప్రాజెక్టను రద్దు చేయించి, నందికొండ వద్ద కృష్ణా నదిపై నాగార్జునసాగర్ డ్యామ్‌ను నిర్మించుకున్నారు. అప్పటికే కృష్ణా నదిపై, బెజవాడ-గుంటూరుల మధ్య ప్రకాశం బ్యారేజీ ఉంది. ఈ బ్యారేజీ కింద 12 లక్షల ఎకరాలకు సాగునీరు లభిస్తోంది. దీని వలన 1857 నుండే కృష్ణా డెల్టా ప్రాంతం సుసంపన్నమైన ప్రాంతంగా కొనసాగితోంది. 1857 నుండే 12 లక్షల ఎకరాలకు సాగునీరు, మెరుగయిన వర్షపాతం కలిగిన కోస్తా ప్రాంత నాయకులకు తోటి రాయలసీమ ప్రాంత ప్రజలపై కనీసమయిన సానుభూతి కూడా లేదు అని చెప్పటానికి ఇంతకంటే నిదర్శనం ఏముంటుంది?

ఈ నాగార్జునసాగర్ డ్యామ్ నిర్మాణానికి రాయలసీమ నాయకులు అడ్డుపడకుండా వారికి అధికార పదవులు అనే ఎర చూపి తమ వైపుకు తిప్పుకుంది కోస్తా పాలకవర్గం. రాయలసీమ రాజకీయ నాయకులు మాకు అధికారం, పదవులు దక్కితే చాలు అనే నీచ స్వార్థబుద్ధికి లోనయ్యి, రాయలసీమ రైతుల జీవితాలను పణంగా పెట్టి, వారి సమాధుల పైన భవంతులు నిర్మించుకొని మంత్రులు, ముఖ్యమంత్రులు అయ్యారు. సొంత ప్రాంత రాజకీయ నాయకుల చేతిలోనే దగా పడడం రాయలసీమ ప్రజల దౌర్భాగ్యం.

కోస్తా సంపన్న వర్గ జలదోపిడి నాగార్జునసాగర్ డ్యాం నిర్మాణంతో ఆగలేదు. సాగర్ డెల్టాకు సాగునీరు స్థిరీకరించుకోడానికీ, వారు స్థాపించే పరిశ్రమలకు కావాల్సిన విద్యుత్తును సమకూర్చుకోడానికీ కృష్ణా నదిపై ఇంకొక ప్రాజెక్ట్ నిర్మాణం అవసరమయ్యింది. అప్పుడయినా సిద్ధేశ్వరం దగ్గర నిర్మాణం చేపట్టారా అంటే అదీ లేదు. అక్కడ నిర్మాణం చేస్తే రాయలసీమ ప్రజలు నీళ్లు వాడుకుంటే, తమకు తక్కువ అయిపోతాయనే దుర్బుద్ధితో సిద్ధేశ్వరం వద్ద నిర్మాణం ఊసు ఎత్తకుండా శ్రీశైలం ప్రాజెక్ట్ నిర్మాణాన్ని రంగం మీదకు తీసుకొచ్చారు.

చివరకు అది జల విద్యుత్తు ప్రాజెక్ట్‌గా రూపుదిద్దుకొని, నాగార్జునసాగర్ డ్యాంకు బ్యాలెన్సింగ్ రిజర్వాయరు అయి కూచుంది. శ్రీశైలం రిజర్వాయర్ కొరకు కర్నూలు జిల్లా రైతులు 90 వేల ఎకరాల పంట భూములను సమర్పిస్తే చివరకు రాయలసీమ రైతాంగానికి మిగిలింది రిజర్వాయర్లో నీళ్లు లేనప్పుడు లేచే నల్ల దుమ్ము మాత్రమే. త్యాగం ఒకరిది, సౌఖ్యం ఒకరిది!

తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రెండు రాష్ట్రాలకు కలిపి కృష్ణా జలాల్లో 800 టిఎంసిల నీళ్లు కేటాయించారు. వెనుకబడిన రాయలసీమ నాలుగు జిల్లాలకు కలిపి కృష్ణా జలాల్లో 122.7 టిఎంసిల నీళ్లు కేటాయించారు. ఏ సంవత్సరం కూడా పూర్తి వాటా వాడుకున్న చరిత్ర లేదు. దాదాపు 65 నుండి 75 టిఎంసిల నీళ్లు వాడుకునే భాగ్యానికి నోచుకోక నీళ్లను కిందికి వదిలేస్తున్నారు. ఎందుకు ఈ పరిస్థితి దాపురించింది అంటే రాయలసీమకు కేటాయించిన కృష్ణా జలాలను నిల్వ చేసుకొని, వాడుకోటానికి పూర్తిస్థాయి ప్రాజెక్టులు గానీ, రిజర్వాయర్లు గానీ రాయలసీమలో లేవు. కేటాయించిన కృష్ణా జలాలు కొద్దిమేరకు అయినా వాడుకోటానికి ఉన్న ఒకే ఒక్క అవకాశం పోతిరెడ్డిపాడు హెడ్ రెగ్యులేటర్. గాలేరు-నగరి, తెలుగు గంగ ప్రాజెక్టుల ద్వారా సాగు అయ్యే 11.8 లక్షల ఎకరాల భూమికి(రబీ పంటకు) అవసరమయ్యే నీరు పోతిరెడ్డిపాడు హెడ్ రెగ్యులేటర్ ద్వారా అందుతుంది. దీని లెవల్ 841 అడుగులు. శ్రీశైలం ప్రాజెక్ట్ ఎత్తు 885 అడుగులు.

శ్రీశైలం డ్యాంలో నీళ్లు 854 అడుగుల వద్ద ఉన్నప్పుడు మాత్రమే పోతిరెడ్డిపాడుకు నీళ్లు అందేది. బానపొట్ట కోస్తా నాయకులకు ఈ మాత్రం నీళ్లు వదులుకోవడం కూడా కంటగింపుగా తయారు అయ్యింది. అంగబలం, అర్థబలం, అధికార బలం మెండుగా ఉన్న కోస్తా సంపన్న వర్గం 1996లో జిఒ 69 ని తీసుకొచ్చి, రాయలసీమ రైతులను కష్టాల సుడిగుండంలో తోసేసింది. ఈ జిఒ ఏం చెబుతుంది అంటే శ్రీశైలం డ్యాంలో నీళ్లు 834 అడుగుల వద్ద ఉన్నప్పటి నుండే కిందికి అంటే సాగర్‌కు నీళ్లు తీసుకుపోవచ్చు అని. ఇక కేటాయించిన కృష్ణా జలాలను వాడుకోటానికి రాయలసీమ వాసులకు మార్గం ఏది?

తుంగభద్ర నది నుండి కృష్ణా నదికి కేటాయించిన నీళ్లు 31.4 టిఎంసిలు మాత్రమే. అయితే ప్రతి యేటా సగటున దాదాపు 180 టిఎంసిల నీళ్లు తుంగభద్ర నుండి కృష్ణా నదిలో కలుస్తున్నాయి. శ్రీశైలం నుండి నాగార్జునసాగర్‌కు విడుదల చేయాల్సింది 263 టిఎంసిల నీళ్లు మాత్రమే! అయితే దీనికి భిన్నంగా కేటాయించిన నీటి కంటే కూడా రెండురెట్లు, మూడు రెట్లు నీళ్లు నాగార్జునసాగర్‌కు తరలించుకు పోతున్నారు. మూడవ పంటకు కూడా వాడుకున్నంత వాడుకొని మిగిలిన నీటిని సముద్రంలోకి కలిపేస్తున్నారు. 12 నుండి 14 నెలల మధ్య కాలంలో మూడు పంటలు పండించుకునే సాగర్, కృష్ణా డెల్టా రైతులకు 36 నెలలకు ఒక పంటకు కూడా నోచుకోని రాయలసీమ రైతులకు పోలిక ఎక్కడ?

రాయలసీమలో కరువుకు పూర్తి కారణం కేవలం తక్కువ వర్షపాతం మాత్రమే కాదు. రాయలసీమలో అసలు నదులే లేవా అంటే ఉన్నాయి కాని ఆ నదుల గుండా పారే నీళ్లు మాత్రం రాయలసీమ ప్రజలకు దక్కడం లేదు. తమ కళ్ల ముందే నీళ్లు పారుతుంటాయి. దాదాపు 90 వేల ఎకరాల భూముల్ని శ్రీశైలం రిజర్వాయర్‌కు సమర్పించుకున్నారు కర్నూలు జిల్లా రైతులు. మరి శ్రీశైలం రిజర్వాయర్ రాయలసీమ ప్రజల దాహార్తి తీర్చిందా? రాయలసీమ రైతులను కరువు రక్కసి నుండి బయట పడేసిందా? తమ భూముల్ని ముంచి నిర్మించిన శ్రీశైలం రిజర్వాయర్ తమ కోసం కాదు కృష్ణా, గుంటూరు జిల్లా రైతులకు మాత్రమే ఉపయోగ పడుతున్నది అని తెలుసుకొని రాయలసీమ రైతులు ఆగ్రహంతో మండిపోతున్నారు. పాలక, ప్రతిపక్ష రాజకీయ పార్టీలు ఏవీ కూడా తమకు నీళ్లు రానివ్వవని అర్థం చేసుకున్న రాయలసీమ రైతులు ప్రభుత్వాన్ని ఏమాత్రం విశ్వసించటం లేదు. దుర్మార్గ, పక్షపాత బుద్ధితో వెనుకబడిన ప్రాంతాలను నిర్లక్ష్యం చేస్తున్న ప్రభుత్వాలకు ఈ సంఘటన ఒక చెంపదెబ్బ లాంటిది. తమ ప్రాంత ముఖ్యమంత్రే రాయలసీమకు తీరని ద్రోహం చేస్తున్నాడు అన్న విషయం రాయలసీమ ప్రజలకు పూర్తిగా తెలిసిపోయింది.

నాగార్జునసాగర్, శ్రీశైలం ప్రాజెక్టులు కట్టడం వలన రాయలసీమలో కృష్ణా నదిపై డ్యాం కట్టే అవకాశాలు శాశ్వతంగా మూసుకుపోయాయి. ఇక మిగిలింది కేవలం సిద్ధేశ్వరం అలుగును నిర్మించుకోవటం మాత్రమే. సిద్ధేశ్వరం అలుగు శంకుస్థాపనకు తామే స్వయంగా పూనుకున్నారు. పక్షపాత బుద్ధితో వెనుకబడిన ప్రాంతాలను నిర్లక్ష్యం చేస్తున్న ప్రభుత్వాలకు ఈ సంఘటన ఒక చెంపదెబ్బ లాంటిది. తమ ప్రాంత ముఖ్యమంత్రే రాయలసీమకు తీరని ద్రోహం చేస్తున్నాడు అన్న విషయం రాయలసీమ ప్రజలకు పూర్తిగా తెలిసిపోయింది.

సిద్ధేశ్వరం అలుగు నిర్మాణం వలన రాయలసీమకు కేటాయించిన నికరజలాలలో కేవలం 50 టిఎంసిల నీరు మాత్రమే నిల్వ చేసుకొనడానికి వీలు ఉంటుంది. ఈ అలుగు నిర్మాణం వలన సంక్షోభంలో ఉన్న రాయలసీమ వ్యవసాయం అంతో ఇంతో కుదుటపడుతుంది. ప్రజలు ఆర్థికంగా నిలదొక్కుకోగలిగే పరిస్థితులు ఏర్పడతాయి. తద్వారా ప్రజల జీవన ప్రమాణాలు మెరుగవుతాయి. అలుగు అంటే డ్యాం కాదు. గేట్లు ఎత్తితే నీళ్లు అన్నీ కిందకు పోతాయి అని అనుకోటానికి అలుగుకు గేట్లు ఉండవు. రెండు కొండల మధ్య నిర్మించ తలపెట్టిన సిద్ధేశ్వరం అలుగు ఒక పెద్ద చెరువు లాంటిది. ఒక చెరువు నిండితే అలుగు ద్వారా ఇంకొక చెరువుకు నీళ్లు పోతుంటాయి. మొదటి చెరువు ఖాళీ కాదు. అందులో నీరు నిండుగా ఉంటుంది. సిద్ధేశ్వరం అలుగు నిర్మాణం తర్వాత 50 టిఎంసిల నీరు అక్కడ నిలువ ఉంటుంది. దీని మూలంగా పోతిరెడ్డిపాడు హెడ్ రెగ్యులేటర్‌కు నీళ్లు అందే అవకాశం సజీవంగా ఉంటుంది. అలుగు నిండిన తర్వాత ప్రతి నీటి బొట్టు కిందికి అనగా శ్రీశైలం చేరుకుంటుంది.

సిద్ధేశ్వరం అలుగు శంకుస్థాపనకు రాయలసీమ నాలుగు జిల్లాల నుండి రైతులు, ఉద్యమనాయకులు, ప్రజా సంఘాలు పెద్ద సంఖ్యలో హాజరు కావచ్చని ఇంటలిజెన్స్ ఇచ్చిన సమాచారంతో కర్నూలు జిల్లా పోలీసులు అప్రమత్తమయ్యారు. దండులా కదిలిన రాయలసీమ రైతులను అడుగడుగున అడ్డుకున్నారు. ముందురోజు రాత్రే అరెస్టులు, గృహ నిర్బంధాలతో రాయలసీమ సాగునీటి సాధన సమితి నాయకులను కట్టడి చేసింది. చెక్ పోస్టుల సంఖ్యను పెంచారు. దారి వెంబట పోలీసులు పెద్ద సంఖ్యలో మోహరించారు. వాహనాలను ముందుకు పోనివ్వకుండా ఆపేశారు. ప్రొక్లెయినర్లను, టిప్పర్లను వాడి రాత్రికి రాత్రే రోడ్లను తవ్వేశారు. అసలే ఆగ్రహంతో ఉన్న రైతాంగానికి ప్రభుత్వచర్యలు అగ్నికి ఆజ్యం పోసినట్టయ్యింది. పోలీసులతో వాగ్వివాదానికి దిగారు. శాంతి యుతంగా పోతున్న రైతులను ఈ తరహాలో అడ్డుకోవడాన్ని రాయలసీమ ప్రజలు జీర్ణించుకోలేకపోయారు. పట్టు వదలని విక్రమార్కులవలే పోలీసుల కన్నుగప్పి అడ్డదారుల గుండా వాగులు, వంకలు దాటుకుంటూ శంకుస్థాపన స్థలానికి చేరుకోటానికి ప్రయత్నించారు.

సిద్ధేశ్వరం సంగమేశ్వరానికి ఒకరిటిన్నర కిలోమీటర్ల దూరంలో ఉంది. కొత్తపల్లి మండలం కపిలేశ్వరం (సంగమేశ్వరానికి రెండు కిలోమీటర్ల దూరంలో) దగ్గర మనిషి లోతు కందకం తవ్వడంతో వాహనాలు ముందుకు వెళ్లలేకపోయాయి. పెద్ద సంఖ్యలో వాహనాలు, రైతులు అక్కడికి చేరుకున్నారు. కర్నూలు జిల్లా, ఆత్మకూరు నుండి సంగమేశ్వరం వరకు కృష్ణా పుష్కరాల కోసం కొత్తగా రోడ్లు వెయ్యడం, వెడల్పు చేయడం చేస్తున్నారు. సిద్ధేశ్వరం అలుగు శంకుస్థాపనను అడ్డుకోడానికి వేసిన రోడ్లను తవ్వి కందకాలుగా చేయడం పూర్తిగా ప్రజా వ్యతిరేకం, ప్రజా ధనాన్ని దుర్వినియోగపరచడమే అవుతుంది. కపిలేశ్వరానికి రెండు కిలోమీటర్ల దూరంలో వున్న సంగమేశ్వరానికి మండుటెండలో, చెట్లు, నీళ్లు లేని ఆ దారిలో నడిచి అయినా వెళ్తామని రైతులు పట్టుపట్టారు. చాలాసేపు వాహనాలను రైతులను ముందుకు కదలనివ్వకుండా నిలిపి ఉంచారు. ఎర్రమఠం మీదుగానే కాకుండా, నీళ్లులేని శ్రీశైలం రిజర్వాయర్ గుండా కూడా పెద్ద ఎత్తున వాహనాలు రావటంతో రైతులని నిలువరించడం పోలీసులకు శక్తికి మించిన పని అయ్యింది. చివరకు చేతులు ఎత్తేశారు. ఒక్కసారిగా వాహనాలు ముందుకు కదిలి సంగమేశ్వరం చేరుకున్నాయి. సంగమేశ్వరం చుట్టుపక్కల ప్రాంతం అంతా వాహనాలతో నిండిపోయింది. అక్కడి నుండి ఒకటిన్నర కిలోమీటర్ల దూరంలో ఉన్న సిద్ధేశ్వరానికి కాలినడకన ఒక తీర్థాన్ని దర్శించడానికి పోతున్నట్టుగా ప్రజలు బారులు తీరారు. రెండు కొండల మధ్య నిర్మించ తలపెట్టిన సిద్ధేశ్వరం అలుగుకు వెళ్లిన ప్రతి ఒక్కరు తలా రెండు రాళ్లను ఆ ప్రదేశంలో వేశారు.

సిద్ధేశ్వరం అలుగు శంకుస్థాపనను అడ్డుకోడానికి ప్రభుత్వం ఎన్ని కుటిల ప్రయత్నాలు పన్నినా వారి ఆటలు సాగలేదు. ప్రజలు పూర్తిగా విజయం సాధించారు. ప్రతిపాదిత సిద్ధేశ్వరం దగ్గర అలుగు శంకుస్థాపనను అడ్డుకోవాలని ప్రభుత్వం ప్రయత్నిస్తే రెండు చోట్ల శంకుస్థాపన జరిగింది. పోలీసుల కళ్లు గప్పి సాగునీటి సాధన సమితి అధ్యక్షుడు బొజ్జా దశరథరామి రెడ్డి, రెడ్డిపల్లెల్లో రైతుల సమక్షంలో సిద్ధేశ్వరం అలుగుకు శంకుస్థాపన చేశారు. నాటకీయ పరిణామాల మధ్య, చెవులు హోరెత్తించే నినాదల మధ్య, కపిలేశ్వరం దగ్గర ప్రజాసంఘాల నాయకులు సిద్ధేశ్వరం అలుగుకు శంకుస్థాపన చేశారు. కపిలేశ్వరం చుట్టుపక్కల అంతా రాళ్లు, గుట్టలతో కూడుకున్న భూమి. రాళ్లను పేర్చి, ఒక పెద్ద బండరాయిని శిలాఫలకంలాగా నిలబెట్టుతుంటే కూడా పోలీసులు అడ్డుకోడానికి ప్రయత్నించారు. కానీ ప్రజా సంఘాల కార్యకర్తలు వారిని చుట్టు ముట్టటంతో కదలలేక నిస్సహాయంగా చూస్తూ ఉండిపోయారు.

సమైక్యాంధ్ర ఉద్యమాన్ని భుజాన మోసుకుంటూ, చూపించిన విజువల్సే చూపించుకుంటూ, చదివిన వార్తలనే చదువుకుంటూ, రాసిందే రాసుకొని మురిసిపోయిన ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియా, సిద్ధేశ్వరం అలుగు గురించి టివి చానల్లో ఒక్క వార్త కూడా ప్రసారం కాకపోవటం ఊహించిందే. అక్కడికి మీడియా రాలేదా అంటే, పెద్ద ఎత్తున మీడియా అక్కడికి చేరుకుంది, అన్నిటిని రికార్డ్ చేసింది. కానీ ఏం ప్రయోజనం? టివి చానల్లు, వార్తాపత్రికలు, రాయలసీమ ప్రాంతానికే చెందిన ముఖ్యమంత్రి, ప్రతిపక్ష నాయకుడు ఎవరి ప్రయోజనాల పట్ల ఆసక్తి కనబరుస్తున్నారో, ఎవరి చేతిలో కీలుబొమ్మలుగా మనుగడ సాగిస్తున్నారో రాయలసీమ ప్రజలకు ప్రత్యక్ష అనుభవం ద్వారా తెలిసివచ్చింది.

రాయలసీమ ప్రజలను అపహాస్యం చేయటం కోస్తా పాలకవర్గానికి, వారికి తానాతందనా అనే రాయలసీమ మేకవన్నె పులులకు ఆంధ్రప్రదేశ్ లో కొదవ లేదు. అందరిలోకి ఆరితేరిన వాడు చంద్రబాబు నాయుడు. రాయలసీమ నుండి కరువు పారదోలడానికి వర్షపు నీటితో నింపుకునే ఇంకుడు గుంతలే శరణ్యం అని ప్రచారం చేస్తున్నాడు. నేను రాయలసీమ బిడ్డను, నా ప్రాంత ప్రజలకు అన్యాయం చేస్తానా అని మొసలి కన్నీరు కార్చే చంద్రబాబును మాకు ఏం న్యాయం చేశావో చెప్పమంటూ రాయలసీమ ప్రజలు అడుగుతున్నారు. మా పొలాలను ముంచి, మా కళ్లముందే పారుతున్న మా వాటా నదీ జలాలు మాకు ఇవ్వండి అని అడుగుతుంటే, నదీజలాలు అడగకండి...వర్షపు నీటినే నమ్ముకొని బతకండి అని చంద్రబాబు రాయలసీమ ప్రజలను పరోక్షంగా వెక్కిరిస్తున్నాడు.

ఇలాంటి పరిస్థితులల్లో ప్రత్యేక రాయలసీమ రాష్ట్ర సాధన తప్ప రాయలసీమ ప్రజలకు వేరే మార్గం కనిపించడం లేదు.

రాయలసీమ రాష్ట్రం కొరకు ప్రయత్నాలు ఆంధ్ర రాష్ట్ర ఉద్యమ కాలంలోనే మొదలయ్యాయి. రాయలసీమకు విద్రోహం తలపెట్టిన రాయలసీమ నాయకులే కాదు, రాయలసీమ తరుపున గట్టిగా గొంతులు విప్పిన నాయకులూ ఉన్నారు. పప్పూరి రామాచార్యులు, కడప కోటిరెడ్డి, టి.ఎన్.రామకృష్ణారెడ్డి లాంటి వాళ్లు 1931లోనే ఆంధ్రా వాళ్లతో కలిసేకంటే ప్రత్యేక రాష్ట్ర స్థాపనే మేలు అని బలంగా వాదించారు. రాయలసీమ నాయకుల మద్దతు లేకుండా ఆంధ్ర రాష్ట్ర సాధన సాధ్యం కాదని కోస్తా నాయకులకు తెలుసు. రాయలసీమ ప్రజల అనుమానాలను తీర్చడానికి ఒప్పందం చేసుకోక తప్పలేదు కోస్తా నాయకత్వానికి. 1937లో ఆంధ్ర పత్రిక వ్యవస్థాపకుడు, కాశీనాధుని నాగేశ్వర రావు పంతులు నివాసమైన 'శ్రీబాగ్' లో రాయలసీమ కోస్తా నాయకుల మధ్య ఒక ఒప్పందం కుదిరింది. ప్రసిద్ధి చెందిన 'శ్రీబాగ్ ఒడంబడిక'. ఈ ఒడంబడికలో ప్రధానంగా

1) ఆంధ్ర విశ్వవిద్యాలయానికి రెండు కేంద్రాలు ఏర్పాటు చేయాలి. ఒకటి అనంతపురంలో, ఇంకొకటి విశాఖపట్టణంలో

2) కృష్ణా, తుంగభద్ర, పెన్నా నదుల నీటి వినియోగం పది సంవత్సరాలు గాని అవసరమయితే అంతకంటే ఎక్కువ కాలం రాయలసీమకే ప్రాముఖ్యత ఇవ్వాలి.

3) రాయలసీమ ప్రజలు కోరుకుంటే రాజధానిని గాని లేదా హైకోర్టును గాని రాయలసీమ జిల్లాలలో ఏర్పాటు చేయాలి.

వీటిలో దేన్నీ కూడా రాయలసీమకు దక్కనివ్వకుండా బుట్ట దాఖలు చేసింది కోస్తా నాయకత్వం. దీనిని నోరెత్తి ప్రశ్నించని వైఖరి రాయలసీమ రాజకీయ పార్టీలది. ఇంత విద్రోహాల చరిత్రను రాయలసీమ రైతులు జీర్ణించుకోలేకపోతున్నారు. తమ వాటా నీటిని దక్కించుకోడానికి తామే పోరాటం చేయాల్సిన అవసరాన్ని గుర్తించారు.

ఆఖరి అవకాశంగా మిగిలిన సిద్ధేశ్వరం అలుగుకు శంకుస్థాపన చేయడానికి రాయలసీమ రైతాంగం తొలిసారిగా అడుగులు వేసింది. జడవకుండా, సాధించి తీరాలనే పట్టుదలతో రైతాంగాం స్వచ్ఛందంగా కదిలింది. అంటే ఒక ఉద్యమానికి కావలసిన పరిస్థితులు పరిపక్వమైనవి. రాయలసీమకు అన్యాయం జరిగింది అని ప్రతి ఒక్కరి మనసులల్లో నాటుకుపోయింది. రాయలసీమకు అన్యాయం ఎప్పుడు జరిగింది? ఎలా జరిగింది? ఎందుకు జరిగింది? అన్యాయం చేసిన శక్తులు ఏవి? ఈ ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకోవాలనే ఆరాటం రాయలసీమ ప్రజలలో క్రమంగా పెరుగుతోంది. సరిగ్గా ఇలాంటి సమయంలోనే ఉద్యమాన్ని సరి అయిన దిశలో నడిపించడానికి అవసరమయిన బలమైన నాయకత్వం, పౌరసమాజం కావాలి. కార్యాచరణ ప్రణాళికలను తయారు చేసుకోవాలి. అయితే అధికార, ప్రతిపక్ష పార్టీలు అందుకు సిద్ధంగా లేకపోవడమే కాదు ఉద్యమాన్ని నీరుగార్చడానికి, తప్పుదోవ పట్టించడానికి ఎల్లవేళల సర్వసన్నద్ధమై ఉంటాయి. ఇన్ని బ్యారికేడ్లను దాటుకొని ముందుకు పోవాలనే ఎరుక ప్రజలకు కలుగజేసే బాధ్యత పౌర సమాజానిదే. ముఖ్యంగా కళాశాలలు, విశ్వవిద్యాలయాలలో చరిత్రని ఏమాత్రం పట్టించుకోని విద్యార్థి లోకానికి రాయలసీమకు జరిగిన విద్రోహ చరిత్రను వివరించే సదస్సులు, సమావేశాలు భారీ ఎత్తున నిర్వహించాలి. ప్రత్యేక రాష్ట్రం ఏర్పడితే మనుగడ ఎలా సాగిస్తుందో కూడా తెలియజేయాలి. రాయలసీమ ఇప్పుడు ఒక చారిత్రాత్మక మలుపులో ఉంది. రాయలసీమ ప్రత్యేక రాష్ట్ర సాధన కొరకు, రాయలసీమ రచయితలు, కళాకారులు, ఉద్యోగులు, విద్యార్థులు చరిత్ర హీనులుగా కాకుండా, చరిత్రను మలుపు తిప్పే మేధావులుగా తయారు కావాలి.

సిద్ధేశ్వరం అలుగు శంకుస్థాపనకు ఉప్పెనలా కదిలివచ్చిన రైతాంగంలో ఒక్కమహిళా రైతు కూడా లేకపోవడం పెద్దలోపం. రైతాంగం అంటే కేవలం పురుషులు మాత్రమే కాదు, స్త్రీలు కూడా భాగస్వామ్యం కావాలి. స్త్రీల భాగస్వామ్యం లేకపోతే ఏ ఉద్యమం పరిపూర్ణత సాధించలేదు.

*(రచయిత సామాజిక కార్యకర్త, లెక్చరర్)* వీ

# హేతుబద్ధీకరణలో హేతుబద్ధత ఎక్కడ?

*తెలంగాణ ప్రభుత్వ పాఠశాలల్లో మౌలిక వసతులు ఏర్పాటు చేసి విద్యను అందించాల్సిన ప్రభుత్వం హేతుబద్ధీకరణ పేరుతో పాఠశాలల మూసివేతకు ప్రణాళికలను సిద్ధం చేస్తోందనీ, విద్యను ప్రైవేటీకరణ దిశగా నెడుతోందనీ అంటున్నారు* **వికసిత**

హేతుబద్ధీకరణ అనే పదానికి చాలా విస్తృతమైన అర్థం ఉందని అందరికీ తెలుసు. హేతుబద్ధీకరణ అనేది ఎంతో తార్కికంగా, పూర్తిగా నిజాలపై, నిజాయితీపై, న్యాయాన్యాయ విచక్షణపై, ప్రజల బాగోగులపై, మానవీయతపై, ప్రజాస్వామిక ఆలోచనలపై ఆధారపడే విషయంగా, ఆధారపడి జరిగే ప్రక్రియగా కూడా మనందరికీ తెలుసు. కానీ తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం, విద్యాశాఖ హేతుబద్ధీకరణ పేరు పెట్టుకుని అమలు చేస్తున్న ప్రక్రియలో మాత్రం ఇవేమీ కనిపించవు. ఆశ్చర్యమే అయినా ఇది నమ్మక తప్పని కఠోర వాస్తవం. పాఠశాలలన్నింటిని మూసివేసి పల్లెటూర్లలోని విద్యా సంస్థలకు తాళాలు వేసి ఆ పల్లెలను నిరక్షరాస్యతా నిలయాలుగా మార్చడానికి 'హేతుబద్ధీకరణ' అనే పేరుతో ఒక ప్రక్రియను ప్రారంభించి అమలు చేయాలని ఒక అడుగు వేసింది.

ప్రభుత్వ రంగంలోని విద్యా వ్యవస్థ ఎందుకు పతనమవుతున్నదో విశ్లేషించి, పరిశోధించి అసలు కారణాలను పట్టుకుని, మూలాలను వెతికిపట్టుకుని వాటిని ప్రక్షాళన చేసే పనిని ప్రారంభించాల్సింది పోయి, హేతుబద్ధీకరణ పేరుతో పాఠశాలలను మూసివేసి టీచర్లను తీసివేస్తే చాలనుకుని, అదే పెద్ద ప్రక్షాళన అనుకుని తెలంగాణ ప్రభుత్వం తాను వేసిన అడుగును గొప్ప ముందడుగుగా భావిస్తున్నదేమో గానీ, తరచిచూస్తే అదొక పెద్ద వెనకడుగు. ఇంకా చెప్పాలంటే వెనక్కి అదొక పెద్ద గెంతు.

హేతుబద్ధీకరణ పేరిట పాఠశాలలను మూసివేయాలని, ఉపాధ్యాయుల సంఖ్యను తగ్గించివేయాలని తెలంగాణ ప్రభుత్వం, విద్యా శాఖ నిర్ణయించుకున్నాయి. ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమ సమయంలో అప్పటి ప్రభుత్వం టీచర్ల పోస్టుల సంఖ్యను కుదించడాన్ని సమైక్యాంధ్ర పాలకుల కుట్రగా అభివర్ణించిన తెలంగాణ రాష్ట్ర సమితి అధికారంలోకి రాగానే సరిగ్గా వారి అడుగుజాడల్లోనే నడవాలని ఉవ్విళ్లూరుతున్నది. ఆమాటకొస్తే సమైక్య రాష్ట్రంలో కనీసం పది మంది విద్యార్థులుంటే ఒక టీచర్‌నైనా ఉంచేవారు. కానీ 'ఘనత' కలిగిన ఈ ప్రభుత్వం ఇరవైకి తక్కువ మంది విద్యార్థులున్న ప్రాథమిక పాఠశాలలను, ఆరేడు తరగతుల్లో నలభై మంది విద్యార్థులు లేని ప్రాథమికోన్నత పాఠశాలలను, 70 మంది విద్యార్థులు లేని ఉన్నత పాఠశాలలను మొత్తంగా మూసివేసే దుర్మార్గమైన జిఒ నెం. 6ను తీయడానికి గత సంవత్సరమే సమాయత్తమైంది. విద్యావేత్తలు, ప్రజా సంఘాలు, ప్రగతిశీల ఉపాధ్యాయ సంఘాలు, ముఖ్యంగా విద్యా పరిరక్షణ కమిటి ఒత్తిడితో ఒకడుగు వెనక్కి వేసింది. మళ్లీ ఈ సంవత్సరం కూడా అదే తరహాలో హేతుబద్ధీకరణ జరపాలని అనుకున్నది. నిజానికి ఒకే గ్రామ పంచాయితి ఒక కిలోమీటర్ పరిధిలోని పాఠశాలలను కలిపివేస్తామని కూడా ఇప్పటికే విద్యాశాఖ నిర్ణయం తీసుకున్నది. ఈ నిర్ణయం వల్ల ప్రతి మండలంలోనూ పదులకొద్దీ పాఠశాలలు మూతపడే ప్రమాదముంది.

కిలోమీటర్ కొక పాఠశాల అనే సార్వజనీన ఆమోదం కలిగిన భావనను ప్రభుత్వం పక్కన పడేసింది. అట్లాగే విద్యార్థుల సంఖ్య ఇరవై కంటే తక్కువ ఉన్న ప్రాథమిక పాఠశాలలను మొత్తంగా తీసివేసే ఆలోచనకు కూడా కార్యాచరణ రూపం తయారు చేసుకుంది. ఇదే జరిగితే తెలంగాణ వ్యాప్తంగా మండలానికో ఐదారు పాఠశాలలు తప్ప మిగిలినవన్నీ మూతపడతాయి.

ప్రతి ఊరికి ఒక బడి ఉండడం ఆ ఊరి ప్రజల హక్కు. శారీరక మానసిక శ్రమలకు గురికాని విధంగా సమీపంలో ఉన్న పాఠశాలలో చదువుకోవడం విద్యార్థుల హక్కు. విద్యార్థుల సంఖ్య పెరగడం అనేది ప్రభుత్వంలోని కొందరు అంటున్నట్లుగా ఉపాధ్యాయుల విశ్వసనీయతకు సంబంధించిన విషయం కాదు. అది విద్యాశాఖ, ప్రభుత్వాల విశ్వసనీయత కు సంబంధించింది. ఎందుకంటే ప్రభుత్వం, విద్యా శాఖ ఆదేశించినట్లే ఉపాధ్యాయులు నడుచుకుంటారు కనుక. కానీ విశ్వసనీయత విషయంలో ఉపాధ్యాయులు మాత్రమే బలైపోవడం బాధాకరం.

ఉన్నత మధ్యతరగతి వర్గం పెరుగుతూ వస్తున్న ఈ ప్రపంచీకరణ విష ఫలితాలు వేగంగా పరుచుకుంటున్న కాలంలో ఇంగ్లిష్ మీడియం పట్ల మోజు, ఆకర్షణ ఎక్కువై, ప్రైవేట్ పాఠశాలలు కూడా సరిపోవని, కార్పొరేట్ పాఠశాలల దారి పడుతున్న తల్లిదండ్రులు తమ పిల్లలను ప్రభుత్వ పాఠశాలల్లోకి పంపడానికి అయిష్టంగా మారిపోవడానికి కారణమైన తాగునీరు, బెంచీలు, తరగతి గదులు వంటి కనీస అవసరాల పట్ల దశాబ్దాలుగా కనీస దృష్టి సారించని ప్రభుత్వాల నిర్లక్ష్య విధానాల మూలంగా ఈరోజు ప్రభుత్వ పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య గణనీయంగా తగ్గుతూ వస్తున్నది. ఈ క్రమంలోనే ఇప్పుడు ఒక ప్రాథమిక పాఠశాలలో 15 నుంచి 20 మంది పిల్లలు, ప్రాథమికోన్నత పాఠశాలలో 30 నుంచి 40 మంది పిల్లలు, ఉన్నత పాఠశాలలో 70 నుంచి 100 మంది విద్యార్థులుండడం ఒక గొప్ప విషయంగా మారిపోయింది.

కానీ ఈ ప్రభుత్వం ఈ విషయాన్ని అర్థం చేసుకోవడం ఇష్టం లేక 20కి తగ్గిన విద్యార్థులున్న ప్రాథమిక పాఠశాలలను మూసివేసే ఆలోచన చేస్తున్నది. పల్లెటూర్లకు బడిని దూరం చేస్తున్నది. అక్కడి విద్యార్థులను చదువుకు దూరం చేస్తున్నది. అలాగే ప్రాథమికోన్నత పాఠశాలల్లో 1 నుంచి 7 తరగతులకు అదనంగా 8వ తరగతిని ప్రారంభించాల్సింది పోయి ఉన్న 6, 7 తరగతులనే కనీస సంఖ్య 40 ఉండాలనే నియమం పెట్టి తీసివేసే ఆలోచనలో ఉంది. దీంతో మూడు కిలోమీటర్ల పరిధిలో

ప్రాథమికోన్నత పాఠశాలలే లేకుండా పోతాయి. 75 సంఖ్య కంటే తక్కువ ఉన్న ఉన్నత పాఠశాలలను కూడా తీసివేసే ఆలోచన ఉంది. ఈ పాఠశాలల మూసివేతపై ఇటీవల సుప్రీం కోర్టు ఘాటుగా స్పందించింది. 20 సంఖ్య కాదు, అసలు సున్న సంఖ్య గల (పిల్లలు లేని) పాఠశాలలను మాత్రం ఎందుకు మూసివేస్తారో వివరణ ఇవ్వమని ఆదేశించింది. మరింత బాధ్యతతో సుప్రీంకోర్టు ఈ అస్తవ్యస్త పరిస్థితిని పరిశీలించడానికి బృందాలను కూడా తెలంగాణకు పంపింది. ఈ బృందాలు తెలంగాణ జిల్లాల్లో పర్యటించి తల్లిదండ్రుల, విద్యార్థుల, ఉపాధ్యాయుల అభిప్రాయాలను సేకరించాయి.

ఈ వ్యవహారమంతా ఎటు తిరిగి ఎటు పోతుందోనన్న భయంతో తాత్కాలికంగా హేతుబద్ధీకరణ ఈ సంవత్సరం ఉండబోదని ప్రభుత్వం ప్రకటించింది. కానీ ఆలోచన లేకుండా రాత్రికి రాత్రి నిర్ణయాలు ప్రకటించేసి జి.ఒ.లు తీసిపారేసే ఈ చంచల ప్రభుత్వాన్ని ఏ కోశానా నమ్మడానికి వీలులేదు కనుక ఏ క్షణాన్నైనా హేతుబద్ధీకరణ షెడ్యూల్‌ను ప్రకటించే అవకాశముందనే భావించాల్సి వస్తుంది. హేతుబద్ధీకరణను వ్యతిరేకిస్తూ ఉపన్యాసాలు దంచిన విషయాన్ని మర్చిపోయి ప్రపంచ బ్యాంకు గాట్స్ ఒప్పందాలను అమలు పరిచేందుకు, ప్రభుత్వ రంగంలోని విద్యను సర్వ నాశనం చేయడానికి శతధా ప్రయత్నించిన చంద్రబాబు నాయుడు ఆలోచనా విధానాన్ని ఆయనకు సమీపంగా ఉండి క్షుణ్ణంగా నేర్చుకున్న ప్రస్తుత తెలంగాణ రాష్ట్ర తొలి విద్యాశాఖ మంత్రిచే ఆ విధానాలను తెలంగాణ ప్రజల మీద రుద్దించడానికి తాపత్రయ పడుతున్నారు. కానీ ఈ విధానాలు పల్లె ప్రజలకు, పేద ప్రజలకు తీవ్రంగా నష్టాన్ని కలిగిస్తాయి. మరీ ముఖ్యంగా దళిత, గిరిజన విద్యార్థులను బాల కార్మికులుగా మార్చి వారిని పొలం పనులకు, కార్మాగారాలకు పరిమితం చేస్తాయి. బంగారు తెలంగాణ అనే పేరు పెట్టుకున్న లక్ష్యానికి ఈ పరిస్థితి ఏమాత్రం దోహదపడదనే విషయాన్ని ప్రభుత్వంలోని వాళ్లు గుర్తించకపోతే అంతిమంగా 1400 మంది ప్రాణత్యాగాలు చేసి సాధించుకున్న తెలంగాణ రాష్ట్ర ఆవిర్భావానికే అర్థం లేకుండా పోతుంది.

పాఠశాలల మూసివేత విషయం ఇట్లా ఉంటే, ఈ మధ్య విద్యాశాఖ తీసుకున్న అనాలోచిత నిర్ణయాలు కొన్ని హాస్యాస్పదంగా మారి వాటివల్ల ఆ శాఖ అభాసుపాలై పోయింది. అతి ప్రాధాన్యమైన విషయాలలో నిర్ణయాలు తీసుకునేటప్పుడు ఎవరితో చర్చించకుండా, అభిప్రాయం కోరకుండా ఏకపక్షంగా హఠాత్తుగా నిర్ణయాలు తీసుకుంటే ఎంతటి ప్రాధాన్యత కలిగిన విషయమైనా అప్రాధాన్యంగా మారిపోతుందని రాష్ట్ర విద్యాశాఖ ఇటీవల తీసుకున్న ఆ నిర్ణయాలను చూస్తే తెలుస్తుంది.

వాటిలో మొదటిది – గత విద్యా సంవత్సరం (2015-16) ఒంటి పూట బడులు తీసివేసి రెండు పూటలా బడి నడుపుతామని ప్రకటించిన విద్యాశాఖ ఆ తర్వాత ఎండల తీవ్రత ఎదురుకావడంతో వెనక్కి తగ్గింది. ఎండల తీవ్రత వల్లనే ప్రతి సంవత్సరం మార్చ్, ఏప్రిల్ నెలల్లో ఒంటి పూట బడులు నడుస్తాయనే చిన్న విషయాన్ని కూడా అర్థం చేసుకోనంత తొందరపాటు అది. ప్రతి సంవత్సరం చివరి పనిదినం ఏప్రిల్ 23 కాగా ఈ సంవత్సరం ముందే సెలవులిచ్చి జూన్ 12న తెరవాల్సిన పాఠశాలలను జూన్ 1 నుంచే ప్రారంభిస్తామని ఎవరితో సంప్రదించ కుండానే ప్రకటించిన విద్యాశాఖ అందుకుగాను సిబిఎస్ఇ విధానాన్ని చూపించి మార్చ్‌లోనే పరీక్షలను నిర్వహించింది. పరీక్షలు ముగిశాక తర్వాతి తరగతి సిలబస్ ప్రారంభించాల్సిందేనని ప్రకటించింది. కానీ పరీక్షలయ్యాక విద్యార్థుల హాజరు గణనీయంగా తగ్గడంతో మళ్లీ మాట మార్చి మౌలికాంశాలు (బేసిక్స్) బోధించమని చెప్పింది. ఈ వ్యవహారంతో దాదాపు చివరి నెల రోజులూ విద్యార్థులు రాక పాఠశాలలు బోసిపోవడంతో పాటు విద్యార్థులు వ్యవసాయ పనులకు రోజు కూలీగా వెళ్లే పరిస్థితి ఏర్పడింది. ఇక ఏప్రిల్ 14, 15 రెండు రోజులూ సెలవు దినాలు కాగా 15వ రోజున హఠాత్తుగా 16 నుంచి వేసవి సెలవులను ప్రకటిస్తూ విద్యాశాఖ నిర్ణయం తీసుకుంది. దాంతో 13న ఆ విద్యా సంవత్సరపు చివరి పనిదినం కావడంతో ఆ రోజున సాధారణ సెలవులో ఉన్న ఉపాధ్యాయులు ఇబ్బందిపడే పరిస్థితి ఏర్పడింది. ఎండల తీవ్రతను కారణంగా చూపి ముందస్తు వేసవి సెలవులను ప్రకటించిన విద్యాశాఖ కనీసం నాలుగు రోజులైనా ఆ మాటమీద నిలబడలేదు. రాజకీయ ప్రయోజనం కోసం సెలవులలోనూ మధ్యాహ్న భోజనం పెట్టాలంటూ ప్రభుత్వం ఆదేశాలిచ్చింది. ఇంత అనాలోచితంగా నిర్ణయాలు తీసుకుంటుండడంతో ఉపాధ్యాయులు, విద్యార్థులు తీవ్రంగా ఇబ్బంది పడ్డారు. దాని బదులుగా పాఠశాలలకు యథావిధిగా సెలవులిచ్చి విద్యార్థుల కుటుంబాలకు కరువు వేసవిలో నిత్యావసర వస్తువులను ఇచ్చి ఉంటే కుటుంబమంతా ఎంతో సంతోషించేది. కాని అలా చేయలేదు.

ఇక రెండోది, ఈ మధ్య ప్రాథమిక పాఠశాలల్లో ఇంగ్లిష్ మీడియం కూడా భోదించవచ్చునని ప్రభుత్వం అనుమతినిచ్చింది. అయితే అట్లాంటి భోదన వల్ల కలిగే ఫలితాలకు గానీ, పర్యవసానాలకు గానీ ఆయా పాఠశాలల ఉపాధ్యాయులే జవాబుదారి అవుతారు. విద్యాశాఖ ఇచ్చిన అనుమతి పూర్తిగా మౌఖికాదేశమే. తనకు న్యాయపరమైన చిక్కులు ఎదురు కాకుండా రాతపూర్వక ఆదేశాలివ్వలేదు. నిజానికి మాతృభాషలో ప్రాథమిక విద్య ఉండాలనే న్యాయబద్ధమైన డిమాండ్‌కు ఈ అనుమతి వ్యతిరేకం కనుక విద్యాశాఖ ముమ్ముందు తానెలాంటి చిక్కుల్లోనూ పడకుండా అంతా టీచర్ల నెత్తిమీద పెట్టింది. పైగా ఇంగ్లిష్ మీడియం నిర్వహణకు గాను ఎలాంటి వస్తువులు, బడ్జెట్, అదనపు ఉపాధ్యాయులు, పాఠశాల భవనం వంటి వేటినీ కోరబోమని ముందే ప్రధానో పాధ్యాయులు, గ్రామ సర్పంచ్‌ల నుంచి హామీ తీసుకున్నది. ఇక ఇప్పుడు పాఠశాలల్లో కాస్తో కూస్తో పిల్లల సంఖ్య పెరిగిననూ అందుకు సంతోష పడాలో, ఏ వసతులూ లేని ప్రతికూల పరిస్థితులలో తరగతికొక టీచర్ కూడా లేకుండా, పుస్తకాలు లేకుండా ఇంగ్లిష్, తెలుగు రెండు మీడియా లలో ప్రతిరోజూ 72 సబ్జెక్టులు, 32 పిరియడ్‌లు ఎలా భోదించాలో తెలియక టీచర్లంతా తలలు పట్టుకుంటున్నారు.

ఇట్లా అర్థంపర్థం లేని నిర్ణయాలతో రోజుకో పిల్లిమొగ్గ వేస్తూ విద్యా శాఖ ఉపాధ్యాయులను, తల్లిదండ్రులను, విద్యార్థులను గందరగోళ పరుస్తున్నది. హఠాత్తుగా తీసుకునే ఏ నిర్ణయమైనా నష్టాన్నే మిగిలిస్తుందన్న విషయాన్ని మర్చిపోయి విద్యాశాఖ ప్రవర్తిస్తున్నది. కావున ఇప్పటికైనా సావధానంగా ఏ విషయాన్నైనా ఆలోచించి, ఉపాధ్యాయులతో, విద్యావేత్త లతో చర్చించి నిర్ణయాలు తీసుకుని భేషజాలకు పోని విధంగా పనితీరును కొనసాగిస్తే సమాజానికి, ముఖ్యంగా పేద విద్యార్థులకు, వారి తల్లిదండ్రు లకు మేలు జరుగుతుంది. లేకుంటే విద్యారంగ చరిత్రలో దోషిగా నిలిచి ప్రభుత్వం శాశ్వతంగా తలదించుకునే పరిస్థితి ఏర్పడుతుంది.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# సర్కారీ స్కూళ్ల మూసివేత

***కెజి నుండి పిజి వరకు ఉచిత విద్యను అందిస్తానన్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం హేతుబద్ధీకరణ పేరుతో ప్రభుత్వ పాఠశాలలను మూసివేసి, సామాన్య ప్రజలకు విద్యను దూరం చేసి ప్రైవేటీకరించే ప్రయత్నం చేస్తోందని అంటున్నారు* ఎం.కె. కుమార్**

విద్యా ప్రైవేటీకరణ ఆంధ్రప్రదేశ్‌లో వేగవంతమవుతోంది. ప్రభుత్వ పాఠశాలలను మూసివేసే దిశగా చంద్రబాబు ప్రభుత్వం పావులు కదుపుతోంది. పాఠశాలలను మూసివేసి వాటన్నిటిని ప్రైవేటు పరం చేయాలని మంత్రి నారాయణ ప్రపంచ బ్యాంకు ఆదేశాలను అమలు చేస్తున్నారు. ప్రభుత్వ పాఠశాల భవనాలను ప్రైవేటువారికి అద్దెకిచ్చి, ప్రభుత్వ పాఠశాలలకు వచ్చే విద్యార్థుల దగ్గరే అధిక ఫీజులు వసూలు చేయాలని ప్రణాళికలు సిద్ధం చేసుకుంటున్నారు. హేతుబద్ధీకరణ పేరుతో జరుగుతున్న ఈ కుట్రను ప్రతిపక్ష రాజకీయ పార్టీలు సైతం తీవ్రస్థాయిలో విమర్శించడం లేదు. విద్యార్థులు ప్రభుత్వ పాఠశాలలకు రావడం లేదని, వచ్చినా నిర్ణీత సంఖ్యలో హాజరుకావడం లేదని అందుకే స్కూళ్లని మూసివేయాలని నిర్ణయించుకున్నట్టు ప్రభుత్వం ప్రకటించింది. జిఒ నెంబరు 30ని తీసికొచ్చి సుమారు 6 వేల పాఠశాలలను మూయడానికి సంకల్పించింది. మరోవైపు విద్యకు దూరమైన 6 నుంచి 14 సంవత్సరాల వయస్సు గల పిల్లలకు ప్రయాణ చార్జీలు ప్రభుత్వమే కల్పిస్తుందని ప్రకటిస్తున్నారు. 2010లో తెచ్చిన విద్యాహక్కు చట్టం ప్రకారం 1 నుండి 5వ తరగతి వరకు చదివే పిల్లలకు కిలోమీటరు దూరంలోను, 6 నుండి 8వ తరగతి వరకు చదివే పిల్లలకు మూడు కిలోమీటర్లలోపు ప్రభుత్వ పాఠశాలలుండాలి. ఈ చట్టానికే ప్రభుత్వం సవరణలు తెచ్చింది. దీనివల్ల లక్షలాదిమంది పిల్లలు విద్యకు దూరమవుతారు. అలాగే విద్యాహక్కు చట్టం నిర్వీర్యానికి గురౌతుంది.

2015లో ప్రభుత్వం ఏకంగా 1500 పాఠశాలలను మూసివేసింది. హేతుబద్ధీకరణ పేరుతో చేపట్టిన మొదటి విడతలో భాగంగా పెద్దఎత్తున పాఠశాలలను మూసివేశారు. ప్రస్తుతం రెండవ విడత హేతుబద్ధీకరణను ప్రభుత్వం చేపట్టడానికి జిఒ30ని తెచ్చింది. ఇది మరో 6 వేల పాఠశాలలను మూసివేయనుంది. ఉపాధ్యాయ సంఘాల నుండి వ్యతిరేకత రావడంతో తాత్కాలికంగా పాఠశాలల మూసివేతను వాయిదా వేస్తున్నట్టు విద్యాశాఖమంత్రి గంటా శ్రీనివాసరావు ప్రకటించినా తెరవెనుక పావులు కదుపుతూనే ఉన్నారు. నిర్బంధ విద్యాహక్కు చట్టాన్ని బలహీనం చేసే విధంగా ప్రభుత్వం పావులు కదపడం వెనుక కార్పొరేట్ మాఫియా అధిపతి మంత్రి నారాయణ ఉన్నట్లు ప్రతిపక్షాలు బాహాటంగానే విమర్శిస్తున్నాయి. నారాయణ-చైతన్య కబంధ హస్తాల్లో రాష్ట్ర విద్యారంగాన్ని ఉంచడానికి జరుగుతున్న కుట్రగా దీన్ని భావించవచ్చు.

ప్రాథమికోన్నత పాఠశాలల వల్లే ఉపయోగాలు లేవని ప్రభుత్వం తలంచింది. ప్రాథమిక, ఉన్నత పాఠశాలల వల్లే విద్యార్థులకు ప్రయోజనం చేకూరుతుందని ప్రభుత్వం భావిస్తోంది. దీనివల్ల 5,475 అప్పర్ ప్రైమరీ పాఠశాలలు మూతపడనున్నాయి. అలాగే 6 వేలకు పైగా ఏకోపాధ్యాయ పాఠశాలలను మూసివేయాలని ప్రభుత్వం సంకల్పించింది. ఒకే ఒక్క ఉపాధ్యాయుడితో నడిపిస్తున్న ప్రాథమిక పాఠశాలలు 5,916, యుపి పాఠశాలలు 28 ఈ విధానం వల్ల మూతపడనున్నాయి. పాఠశాలలో ఒకే ఒక్క ఉపాధ్యాయుడు కొనసాగడానికి కారణం ప్రభుత్వాలు ఉపాధ్యాయ పోస్టుల ఖాళీలను భర్తీ చేయకపోవడమనే ప్రాథమిక విషయాన్ని ప్రభుత్వం పెడచెవిన పెడుతోంది. పాఠశాలల్లో చదువుకోవ డానికి విద్యార్థులు అధిక సంఖ్యలో ఉన్నప్పటికీ వారికి తగినంత రీతిలో ఉపాధ్యాయులు ఉండడంలేదు. ప్రభుత్వం ఉపాధ్యాయులను నియమించక పోవడం వల్ల విద్యకు దూరమవుతున్న లక్షలాది మంది పేద విద్యార్థులు అధిక ఫీజులతో నడుస్తున్న ప్రైవేటు పాఠశాలల్లో చేరలేక విద్యకు పూర్తిగా దూరమయ్యే పరిస్థితి నెలకొంది. భావి భారత పౌరులు కావలసిన వీరంతా లంపెన్ ప్రొలటేరియన్ రిజర్వుడు సైన్యంలో చేరుతున్నారు.

దశాబ్దాలుగా ఉపాధ్యాయ పోస్టులను భర్తీ చేయకుండా పాలక వర్గాలు విద్యారంగాన్ని తీవ్ర నిర్లక్ష్యానికి గురి చేస్తున్నాయి. 2014లో ప్రభుత్వం డిఎస్‌సి నోటిఫికేషన్ జారీ చేస్తూ, 10,313 ఉపాధ్యాయ పోస్టులు ఖాళీగా ఉన్నాయని వీటన్నింటిని భర్తీ చేస్తామని ప్రకటించింది. ఇప్పటికీ నియామకాల ప్రక్రియను ప్రభుత్వం పూర్తిచేయలేక పోయింది. ప్రభుత్వ గణాంకాల ప్రకారం ఇంకా 19,468 ఉపాధ్యాయ పోస్టులు ఖాళీగా ఉన్నట్లు తెలుస్తోంది.

దేశవ్యాప్తంగానే విద్యను ప్రైవేటీకరించడం ఊపందుకుంటోంది. సామ్రాజ్యవాదాన్ని విస్తరింపజేయడానికి విద్యా ప్రైవేటీకరణ అత్యవసరం. అలాగే విద్యను సరుకుగా చేసి మార్కెట్‌లో అమ్మకానికి పెట్టడం వల్ల కార్పొరేట్ల ఆదాయం మరింత పెరుగుతుంది. ఒక్క రూపాయి పెట్టుబడి లేకుండా ప్రైవేటు పాఠశాలలు స్థాపించి, వాటికి రకరకాల పేర్లు తగిలించి కోట్లు దండుకోవడం ప్రతి మండల కేంద్రంలోనూ జరుగుతోంది. ఆ పాఠశాలలకు చట్ట ప్రకారం ఉండవలసిన మరుగుదొడ్లు, మంచినీరు, ఆటస్థలం, గ్రంథాలయం ఉండడం లేదు. మరోవైపు విద్యను కాషాయీ కరించడం వల్ల విద్యార్థుల్లో శాస్త్రీయ దృక్పథం, హేతుబద్ధ ఆలోచనలు తగ్గిపోయే ప్రమాదముంది. హిందూ మతోన్మాదం ఉక్కు పిడికిలిలో విద్యను బంధించడానికి స్వయానా కేంద్ర ప్రభుత్వమే రంగంలోకి దిగింది. సామాజిక వ్యవస్థ పురోగతి సాధించడానికి విద్యావంతులైన యువత అత్యవసరం. చరిత్ర గతిని మలచడానికి, సమాజానికి సరైన దిశను కల్పించడానికి, ప్రజాస్వామిక వాతావరణం వ్యాప్తి చెందడానికి విద్యారంగాన్ని ప్రభుత్వమే కలుషితం కాకుండా కాపాడాలి.

శతాబ్దాలుగా మహిళలకు, శూద్రులకు విద్య నిరాకరించబడింది. మతాలు విద్యను ఆధిపత్య శక్తుల చేతుల్లోనే ఉంచి రాజ్యాధికారాన్ని అనుభవించాయి. విద్య అట్టడుగు వర్గాల ప్రజలకు నిరాకరించబడింది. విద్యను మనుధర్మ శాస్త్రం కొన్ని అగ్రవర్ణ కులాలకే పరిమితం చేసింది. అందుకే పేదవర్గ ప్రజలు దాన్ని తగులబెడుతున్నారు. ప్రస్తుత ప్రభుత్వ విద్యా ప్రైవేటీకరణ వల్ల ఆర్థిక హోదాను కలిగిన కుటుంబాలే తమ

పిల్లలకు విద్యను కొనివ్వగలుగుతాయి. 65 శాతం ప్రజానీకం విద్యను కొనగలిగే ఆర్థిక స్థితిమంతులు కారు. వీరంతా విద్యకు దూరమయ్యే పరిస్థితి నెలకొంది. విద్యను అందరికీ ఉచితంగా నిర్బంధంగా అందించాలని ఒకవైపు చట్టాలు తెస్తూ, ఆచరణలో ఎందుకు పనికిరాని వాటిగా చేయడానికి ప్రభుత్వం ఆ చట్టానికి సవరణలు తెస్తోంది. విద్యా వికాసం వల్లే చరిత్రలో ప్రశ్నించేతత్వాన్ని చార్వాకులు, లోకాయతులు, బుద్ధుడు ప్రజలకు నేర్పారు. విద్యను ప్రజలందరికి పంచాలని, చైతన్యాన్ని, జ్ఞానాన్ని పంచే విధంగా విద్య ఉండాలని భక్తి ఉద్యమాలే పెల్లుబికాయి. అంబేద్కర్, మహాత్మాపూలే దంపతులు, అట్టడుగు వర్గాలకు, మహిళలకు విద్యను అందించడానికి సామాజిక ఉద్యమాలు చేపట్టారు. విద్యా ఉద్యమాల ఫలితంగానే స్వాతంత్ర్యం ముందరే విద్య ప్రజలందరి హక్కు అనే నినాదం పెల్లుబికి, రాజ్యాంగంలో చేర్చబడింది. నిజానికి ప్రాథమిక హక్కుల్లో భాగంగా చేర్చాల్సిన విద్యను, ఆదేశిక సూత్రాల్లో చేర్చడం వెనుక ఆధిపత్య వర్గాల కుట్ర దాగి ఉంది.

వలస పాలకుల అనంతరం దేశానికి ఉపయోగపడే రీతిలో విద్యా రంగాన్ని తీర్చిదిద్దకుండా, మెకాలే విద్యా విధానాన్నే కొనసాగించడం ప్రమాదకరంగా తయారయింది. కామన్ స్కూల్ విధానాన్ని ప్రవేశ పెట్టకుండా ప్రభుత్వమే అడ్డుకుంటోంది. ఈ విధానం వల్ల విద్యార్థుల్లో ఆర్థిక, సామాజిక అసమానతలు తొలగిపోతాయి. కలెక్టర్ కొడుకు, రైతు కొడుకు, కార్మికుని కొడుకు ఒకే ప్రభుత్వ పాఠశాలల్లో చదువుకోవడం వల్లే భావ అసమానతలు తొలగుతాయి. మాతృభాషలో విద్యాబోధన ఉండాలనే ప్రాథమిక అంశాన్ని ప్రైవేటు పాఠశాలలు పూర్తిగా విస్మరిస్తున్నాయి. అదే క్రమంలో ఇంగ్లిష్‌ను విస్మరించకుండా ఉన్నత విద్యలో దాన్ని ప్రవేశపెట్టే విధంగా చర్యలు తీసుకోవాలి.

ప్రభుత్వ పాఠశాలలు నిర్వీర్యం అవడానికి కారణం ప్రభుత్వ ఉపాధ్యాయులే అని మధ్యతరగతి వర్గం బలంగా నమ్ముతోంది. ఉపాధ్యాయులు ఎన్నికల్లో పలు రాజకీయ పార్టీలకు మద్దతుగా ప్రచారం చేయడమేగాక, వారు గెలవడానికి అనైతిక మార్గాలకు పాల్పడుతున్నారు. చాలా నియోజకవర్గాల్లోని గ్రామాల్లో టీచర్లు ఓట్లను డబ్బులతో కొనడానికి, ఓటర్లకు మద్యం పంపిణీ చేయడానికి ఉపయోగ పడుతున్నారని వీరివాదన. అలాగే రియల్ ఎస్టేట్ రంగాన్ని రాష్ట్రంలో పెంచి పోషించింది సగటు టీచరేనని వీరు విశ్వసిస్తున్నారు. మధ్యతరగతిలో ఉన్న ఆ భావాలను పోగొట్టడానికి ఉపాధ్యాయ సంఘాలు ప్రయత్నించడం లేదు. సమైక్యాంధ్ర ఉద్యమం కోసం నెలల పాటు స్కూళ్లను మూసివేసి ఉద్యమంలో పాల్గొన్న ఉపాధ్యాయులు, రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నా, ధరలు పెరుగుతున్నా, నిరుద్యోగ సమస్య తీవ్రమవుతున్నా, విద్యాహక్కు బలహీనమవుతున్నా పట్టించుకోవడం లేదు.

ఈ రోజుకి కొన్ని ప్రభుత్వ పాఠశాలల్లో ఉత్తీర్ణత శాతం పెరగడానికి ఉపాధ్యాయులే అనే కారణాన్ని విస్మరించరాదు. ధనికులు, పేదలు ప్రైవేటు పాఠశాలలు లేని కాలంలో ప్రభుత్వ పాఠశాలల్లోనే తమ విద్యను కొనసాగించేవారు. అప్పుడు ప్రభుత్వ పాఠశాలల వ్యవస్థ మెరుగ్గా ఉండేది. విద్యను సరుకుగా చేసిన తర్వాత, ప్రైవేటు పాఠశాలలు రావడం మొదలైంది. ఆ తర్వాత కార్పొరేటు వర్గం దీనిపై కన్నేసింది. చివరికి నారాయణ–చైతన్య విద్యా సంస్థల గుత్తాధిపత్యంలోకి వెళ్లిపోయింది.

నిజానికి ఇప్పటికీ ప్రైవేట్ పాఠశాలల్లో కన్నా, ప్రభుత్వ పాఠశాలల్లో ఉత్తీర్ణత శాతం ఎక్కువగా ఉంది. విద్యలో కార్పొరేటీకరణ పెరిగిన తర్వాత, ప్రభుత్వ పాఠశాలలు పేద విద్యార్థులకు హోటళ్లుగా మారిపోయాయి. వారికి మధ్యాహ్న భోజనాన్ని, పాలు, బ్రెడ్‌ను అందించడానికే ముఖ్యంగా ప్రాథమిక పాఠశాలలు ఉపయోగపడుతున్నాయనే అపవాదు ఉంది. పేద విద్యార్థులను ప్రతిభావంతులుగా తీర్చిదిద్దడంలో విద్యను బోధించడంతో పాటు, ఉపాధ్యాయుడు సామాజిక బాధ్యతను మోసినట్టవుతుంది. పేదవర్గానికి చైతన్యాన్ని అందించి వారిని భావి భారత పౌరులుగా తీర్చిదిద్దడంలో ఉపాధ్యాయుడికి ప్రధాన పాత్ర ఉంటోంది. ప్రభుత్వ పాఠశాలలను మెరుగుపర్చడానికి ఉపాధ్యాయులతో పాటు సమాజానికి బాధ్యత ఉంటుంది. ప్రైవేటు పాఠశాలల రద్దుకు అందరూ ఉద్యమించాలి. విద్యలో ఉన్న ధనిక–పేద విద్యార్థుల అసమానతను పక్కన పెట్టి మొదటగా ప్రభుత్వ ఉద్యోగుల పిల్లలందరూ ప్రభుత్వ పాఠశాలలకు రావాలి. నిజానికి ప్రభుత్వం రెసిడెన్షియల్ విద్యా విధానాన్ని అభివృద్ధి పర్చడంలో కొంత విజయం సాధించింది. అక్కడ మెరిట్ విద్యార్థులు రావడానికి ప్రభుత్వ ఉపాధ్యాయులే కారణమన్న విషయాన్ని విస్మరించరాదు. ప్రభుత్వ ఉపాధ్యాయులు పనికిరారనే భావజాలాన్ని కార్పొరేటు విద్యారంగమే విస్తృతంగా ప్రచారం చేస్తోంది.

సమాజంలోను సినిసిజం రాజ్యమేలుతోంది. ఈ వ్యవస్థను బాగుచేయలేమనే నిర్వేదం అలుముకుంటోంది. ప్రైవేట్ విద్యా సంస్థలోనే నాణ్యమైన విద్య అందుతుందనే తప్పుడు ప్రచారం మూలానా పేదవిద్యార్థుల తల్లిదండ్రులు పిల్లల చదువు కోసం ఆస్తులు అమ్ముకుంటున్నారు.

మతోన్మాద అభివృద్ధి కోసం రెండో విడత ఆర్థిక విధానాలను కేంద్రం వ్యూహాత్మకంగా వాడుకుంటోంది. అందుకే దేశభక్తి పేరుతో స్వదేశీ జపం ఒకవైపు మొదలుపెడుతూనే, విదేశీ పెట్టుబడులను దేశంలోని కీలక రంగాల్లోకి ఆహ్వానిస్తున్నారు. ఈ విరుద్ధమైన భిన్న వైరుధ్యాలను పెంచిపోషిస్తూ, ప్రజల్లో గందరగోళాన్ని సృష్టిస్తున్నారు. ప్రభుత్వాలు ఒకవైపు పాఠశాలలను మూసివేస్తుంటే, మరోవైపు ఆర్ఎస్ఎస్ ఏకోపాధ్యాయ పాఠశాలలను రాష్ట్రంలో రెండు వేలకు పైగా నడుపుతోంది. ఈ పాఠశాలలు పేద విద్యార్థులనే టార్గెట్ చేస్తున్నాయి. సరస్వతీ ప్రార్థనతో మొదలుపెట్టి, హిందూ జాతీయవాదంతో ముగిస్తారు. వీరందరిని ఆర్ఎస్ఎస్ కార్యకర్తలుగా భవిష్యత్తులో తయారు చేసుకోవడానికి కావలసిన ముడిసరుకు ఈ పాఠశాలల్లో అందిస్తారు.

పేద విద్యార్థులకు కెజి నుండి పిజి వరకు ఉచిత విద్యను అందిస్తామని గద్దెనెక్కిన తెదేపా ప్రభుత్వం ఏకంగా పది వేల పాఠశాలలను రేషనైలేజేషన్ పేరుతో మూసివేయాలని చూస్తోంది. పిల్లలు లేరనే సాకుతో చేస్తున్న ఈ విద్యా విధ్వంసాన్ని ప్రశ్నించడానికి పౌరబృందాలు ముందుకు రాకపోవడం విచారకరం. ప్రైవేట్ పాఠశాలల్లో వేలమంది పిల్లలు చేరుతుంటే, ప్రభుత్వ పాఠశాలల్లో ఎందుకు పిల్లలు చేరడం లేదనే ప్రశ్నకు ప్రభుత్వం దగ్గర సమాధానం లేదు. రాష్ట్రంలోని విద్యారంగాన్ని నారాయణ – చైతన్య లాంటి మాఫియా విద్యా సంస్థల నుండి కాపాడడానికి పెద్ద పోరాటమే చేయవలసి ఉంది.

విదేశీ పెట్టుబడులు రావడం, నూతన రాజధానిని విదేశీ సంస్థలతో నిర్మించి సామాన్యుడికి చోటులేకుండా చేయడం అనే విధానం రాష్ట్ర ప్రజలకు తీవ్ర నష్టాన్ని చేకూర్చనుంది. నూతన రాజధానిలో ఒక్క ప్రభుత్వ బడిని నిర్మించకపోవడాన్ని బట్టే విద్యను కార్పొరేటీకరించడానికి ప్రభుత్వం కట్టుబడి ఉన్నట్లు అర్థమౌ తోంది. ఈ నేపథ్యంలో 65 శాతంగా ఉన్న అట్టడుగు కులాలకు, పేదవర్గా నికి విద్య దూరమవబోతోంది. మనువు పాలించిన కాలంలో ఎలాగైతే శూద్రులు, ఇతర నిమ్నకులాలు విద్యకు దూరంగా గెంటి వేయబడ్డారో అలాంటి కుట్రే ఇప్పుడు ఆధునిక రాజ్యంలోనూ జరగబోతోంది.

*(రచయిత పౌరహక్కుల కార్యకర్త)* వీ

# తేలిపోతున్న గుజరాత్ మారణకాండ కేసులు

***న్యాయవ్యవస్థలోని లొసుగులతో పాలకులు ప్రజలకు, ముఖ్యంగా మైనారిటీలకు న్యాయం అందకుండా చేస్తున్నారనీ, 14 ఏళ్లపాటు సుదీర్ఘంగా సాగిన గుజరాత్ మారణకాండ కేసులో ఇది మరోసారి బహిర్గతమైందనీ అంటున్నారు*** **షేక్ కరీముల్లా**

స్వాతంత్ర్యానంతరం దేశ విభజనతో మొదలైన మైనార్టీ ప్రజలపై దాడులు, ఊచకోతలు ఒక పరంపరగా యథేచ్ఛగా కొనసాగుతున్నాయి. ప్రాచీన, మధ్య యుగాలలో మతతత్వ ఛాయలు లేవు. మన గత చరిత్ర, సంస్కృతి సాధించిన విజయాలు మొత్తం ప్రపంచానికి తెలుసు. మనం గతంలో ఎంతో గొప్పగా ఉన్నాం. ఇప్పుడెందుకు లేం? అపార వనరులు, సంపద ఉండి కటిక దారిద్ర్యంలో ఎందుకు ఉన్నాం?

ఒకప్పుడు ప్రపంచానికి మత సామరస్యాన్ని, రాజకీయాలను, కళలను, విజ్ఞాన శాస్త్రాలను నేర్పిన గొప్ప చరిత్ర గల మనం ఇప్పుడు బలహీనదశలో మనమెందుకున్నామంటే ఆది నుండి కులతత్వం, మతతత్వం ఈ దేశాన్ని పూర్తిగా బలహీనపరిచాయి. నాలుగు పడగల హైందవ విషసర్పం పడగ విప్పి కరాళనృత్యం చేస్తూ ఈ దేశ మూలవాసులను కాటువేస్తూ ఉంది. 1937 తరువాత మతతత్వం కొత్త దశలోకి ప్రవేశించింది. ఇది ఫాసిస్టు మతతత్వం. అసత్యాలు, హత్యలు, హింసలు ప్రాతిపదికగా ఇది ఆవిర్భవించింది.

ఈ ప్రమాదాన్ని గుర్తించిన అప్పటి జాతీయ నాయకత్వం రాజ్యాంగానికి లౌకిక స్ఫూర్తిని అందించింది. రాజ్యం అన్ని మతాల నుంచి వేరుపడి తీరాలని, అన్ని మతాల పట్ల తటస్థంగా ఉండాలని, రాజ్యానికి అన్ని మతాల పట్ల సమానమైన గౌరవం ఉండాలని (లౌకిక స్ఫూర్తి) సూచించింది. కాని ఆచరణలో దీనికి భిన్నంగా జరుగుతుంది. అధికారం చేపట్టిన అన్ని రాజకీయ పార్టీలు లౌకిక తత్వానికి అర్థం లేకుండా చేశాయి.

భారతీయ జనతా పార్టీ కరుడు గట్టిన హిందూత్వానికి, కాంగ్రెస్ పార్టీ సుతిమెత్తని హిందూత్వకు మధ్య పెద్ద వ్యత్యాసం ఏమీ లేదని చరిత్ర నిరూపించింది. విద్యా రంగం, మీడియా, బ్యూరోక్రసి, న్యాయ వ్యవస్థలతో సహా అన్ని రాజ్య అంగాలలోకి హిందూత్వ శక్తులు బలంగా చొచ్చుకుపోయి దేశానికి చేస్తున్న కీడును ప్రజలు గమనించాలి.

1947 నుంచి పంజాబ్, హిమాచల్‌ప్రదేశ్, హర్యానా, ఉత్తర భారతంలో జరిగిన మతతత్వ భావజాల వ్యాప్తి చాపకింద నీరులా వ్యాపించింది. ఫలితంగా పురి విప్పిన మత మౌఢ్యం కారణంగా మొరాదాబాద్, మీరట్, బెంగళూరు, బొంబాయి, భివాండీ, భగల్పూర్, జైపూర్, లక్నో, హైదరాబాద్, ఒరిస్సాలో దళిత, ఆదివాసి క్రైస్తవులపై దాడులు. నిన్నటి ముజఫర్ నగర్ హత్యాకాండలు ఇవన్నీ రక్తసిక్త ప్రత్యక్ష హింసాత్మక రూపాలు. భారతీయ చరిత్రపై నెత్తుటి మరకలు.

1980 నుంచి గుజరాత్‌లో బిజెపి, ఆర్ఎస్ఎస్‌ల ప్రచార యంత్రాంగాలు చేపట్టిన మతతత్వ కార్యక్రమాలు, చివరకు విద్యా విషయక సిలబస్‌లో సైతం మతతత్వ భావజాల వ్యాప్తి పర్యవసానమే యావత్ దేశాన్ని భయభ్రాంతం చేసి, ప్రపంచ పటం మీదకు చేరిన 2002 గుజరాత్ హింసాకాండ.

నేడు దేశాన్ని ఏలుతున్న పెద్ద మనిషి నరేంద్రమోడీ ఒక కరుడు గట్టిన హిందూత్వవాది. గోధ్రా సంఘటనను సృష్టించి, దానిని సాకుగా చూపి గుజరాత్‌లో నరేంద్రమోడీ నాయకత్వాన సుమారు 2000 మంది అమాయక ముస్లిం ప్రజలను ఊచకోత కోశారు. ఈ ఘటనలో సుమారు 15 వేల మంది హిందూ ఫాసిస్టు మూకలు విఎచ్‌పి, ఆర్ఎస్ఎస్, శ్రీరామసేన, భజరంగదళ్‌కు చెందిన శిక్షణ కలిగిన గుంపులు సంఘటితంగా పాల్గొన్నాయి. ఒక సుదీర్ఘ ప్రణాళికతో పెట్రోలు, కిరోసిన్, ద్రావకాలు, ఎల్‌పిజి గ్యాస్, ప్రమాదకర రసాయనాలతో కాషాయ మూకలు ముస్లిం ప్రజలపై విరుచుకుపడ్డాయి. రాజ్యం సహకారంతో ఈ నరమేధం కొనసాగింది. ఇద్దరు మంత్రులు, ఒకడు హరేన్‌పాండ్యా ఒక పర్యాయం హోం మంత్రిగా చేసి తిరిగి రెవెన్యూ మంత్రిగా అప్పుడు బాధ్యతలలో ఉండి, పోలీస్ కంట్రోల్ రూంలో కూర్చొని స్వయంగా దాడులను పర్యవేక్షించాడంటే పరిస్థితి తీవ్రత అర్థం చేసుకోవచ్చు.

ముస్లింలు అధికంగా నివసించే ప్రాంతాలలో కత్తుల కవాతులతో ముస్లింలపై విరుచుకుపడిన దృశ్యాలు శరీర అవయవాలు తెగిపడుతున్న దృశ్యాలు. ఎంత కసితో అంటే ఒక గర్భిణి స్త్రీ కడుపు చీల్చి పసిగొంతు తెగిన చప్పుడు కడుపుతెగిన తల్లి రక్తపు మడుగులో గిలగిల కొట్టుకుంటూ శరీర చివరి కదలికలు ఆగిపోతున్న దృశ్యం 14 సంవత్సరాలైనా మెదడులో గింగుర్లు తిరుగుతున్న సజీవ జ్ఞాపకాలు. ఇది రాజ్య హింసకు పరాకాష్ట. లెనిన్ మహాశయుడు చెప్పినట్లు రాజ్యం పాలక వర్గాలకు చెందిన సాయుధ విభాగమని ఈ సంఘటన రుజువు చేసింది.

ఈ పరంపరలో 14 ఏళ్ల క్రితం తీవ్ర సంచలనం సృష్టించిన గుజరాత్, అహ్మదాబాద్‌లోని గుల్బర్గ్ హౌసింగ్ కాలనీ మారణకాండలో కాంగ్రెస్ పార్టీ మాజీ ఎంపి ఇషాన్ జాఫ్రీతో సహా 69 మంది సజీవ దహనం అయ్యారు. 2002 ఫిబ్రవరి 28న పెద్ద ఎత్తున ఆయుధాలు చేపట్టిన ఓ గుంపు గుల్బర్గ్ సొసైటిపై దాడులకు దిగింది. 29 బంగళాలు, 10 అపార్ట్‌మెంట్లపై విచక్షణా రహితంగా జరిపిన దాడుల్లో ఇషాన్ జాఫ్రీతో సహా మొత్తం 69 మందిని దుండగులు అత్యంత పాశవికంగా సజీవ దహనం చేశారు.

ఇషాన్ జాఫ్రీని ఇంటి నుంచి బయటకు ఈడ్చుకువచ్చి, చంపేసి, నిప్పంటించారని, ఈ సందర్భంలో ఆయన అమాయకులు బలికాకుండా చూడాలని పోలీస్ అధికారులకు, బిజెపి నేతలకు ఫోన్ చేసి ఎంత

వేడుకున్నా కరుణించలేదని ఆయన అభ్యర్థన అరణ్యరోదన అయిందని జాఫ్రీ భార్య జకియా జాఫ్రీ వాపోయారు. అనంతరం గుజరాత్‌లో కొన్ని రోజుల పాటు చెలరేగిన అల్లర్లలో సుమారు రెండు వేల మందికి పైగా మరణించారు.

ఈ కేసులో అసలైన దోషులను విడిచిపెట్టి అమాయకులను ఇరికించారంటూ జకియా జాఫ్రీ దిగువ కోర్టు నుండి హైకోర్టు, సుప్రీం కోర్టు వరకు వెళ్లి న్యాయ పోరాటం సాగించిన ఫలితంగా హత్యాకాండ జరిగిన తరువాత ఏడేళ్లనాడు విచారణ ప్రారంభం కావడమే ఒక వింతగా న్యాయ నిపుణులు భావించారు. ఈ ఘటనలో అప్పటి ముఖ్యమంత్రి మోడీ పాత్ర ఉందని, అతనిని ప్రధాన నిందితునిగా చేర్చాలని కోరుతూ ఆమె దిగువ కోర్టు నుంచి హైకోర్టు వరకు వివిధ స్థాయిల్లో దాఖలు చేసిన పిటిషన్లు తిరస్కరణకు గురయ్యాయి. మోడీ అప్పుడు ముఖ్యమంత్రి మాత్రమే. ఇప్పుడు ప్రధాన మంత్రి హోదాలో ఉన్నారు. ఆయనపై దాఖలు చేసే పిటిషన్లు నిలబడవని తెలిసినా, వాస్తవాలేమిటో ప్రజలకు తెలియజేయడం కోసమే తాను సుదీర్ఘ న్యాయ పోరాటం చేస్తున్నానని ఆమె స్పష్టం చేస్తున్నారు.

సుప్రీం కోర్టు ఆదేశాలతో సిబిఐ మాజీ డైరెక్టర్ ఆర్కే రాఘవన్ నాయకత్వంలో ఏర్పాటైన ప్రత్యేక దర్యాప్తు చేపట్టిన 'సిట్' బృందం మార్చి 2010లో మోడీని ప్రశ్నించింది. ఏప్రిల్ 2012లో మోడీపై వస్తున్న ఆరోపణలపై ఆధారాలు లేవని సిట్ నివేదిక ఇచ్చింది. ఇప్పుడు తాజాగా సిట్ సమర్పించిన ఛార్జిషీట్‌పై విచారణ జరిపిన అహ్మదాబాద్‌లోని ప్రత్యేక కోర్టు మొత్తం 66 మంది నిందితుల్లో 24 మందిని దోషులుగా తేల్చింది. 36 మందిని నిర్దోషులుగా ప్రకటించింది. జూన్ 17న ప్రత్యేక కోర్టు తుది తీర్పు వెల్లడించింది. 11 మందికి యావజ్జీవ శిక్ష విధించింది. వీరిని మరణించేదాకా జైల్లోనే ఉంచాలంది. మిగతా 13 మంది దోషులలో ఒకరికి పదేళ్లు, 12 మందికి ఏడేళ్ల వంతున జైలుశిక్ష విధించింది.

ఈ సుదీర్ఘకాల విచారణలో ఆరుగురు చనిపోయారు. ఈ తీర్పుపై స్పందిస్తూ ఇషాన్ జాఫ్రీ కుమారుడు తన్వీర్ పలు ప్రశ్నలు లేవనెత్తారు. 69 మందిని 24 మందే ఎలా దాడిచేసి చంపుతారు? అంతపెద్ద సొసైటిపై కేవలం 24 మందే ఎలా దాడి చేసి రోజంతా మారణకాండ సృష్టించ గలరు? 69 మందిని ఎలా చంపగలుగుతారని ప్రశ్నించారు.

గుల్బర్గ్ కాలని కేసులో పక్కా ఆధారాలు ఉన్నా అసలైన నిందితులను విడిచిపెట్టి, ఎవరో కొందరిపై పేలవంగా అభియోగాలు నమోదు చేసి తేలిపోయేటట్లు చేశారని బాధితులు అనుమానిస్తున్నారు. నిందితులకు ప్రత్యేక కోర్టు విధించిన శిక్షలు హైకోర్టులో నిలబడే అవకాశాలు లేకపోవడంతో ఈ కేసు కూడా తుస్సుమనడం ఖాయం అనిపిస్తుంది. గుజరాత్ అల్లర్లలో చోటుచేసుకున్న 14 ఘటనలు పథకం ప్రకారం జరిగినవేనని హక్కుల సంఘాల వారు నిర్ధారించారు.

అలాగే ఈ దహనకాండలో బిజెపి, ఆర్‌ఎస్‌ఎస్ అనుబంధ సంఘాల నాయకులకు ప్రత్యేక ప్రమేయం ఉందని ఈ ఘటనలపై సొంతంగా నిజనిర్ధారణ జరిపిన మానవ హక్కుల సంఘాల వారు కూడా తేల్చారు. అయినా గుల్బర్గ్ సొసైటి దుర్ఘటన వెనుక కుట్ర జరిగిందన్నదానిపై స్పష్టమైన ఆధారాలు లేవని పేర్కొంటూ ప్రత్యేక కోర్టు ఐపిసి 120బి సెక్షన్‌ను ఉపసంహరించుకోవడం దురదృష్టకరం. 300 మంది సాక్షులను ప్రత్యేక కోర్టు విచారించినప్పటికి అసలైన వారికి శిక్ష పడకపోవడాన్ని బట్టి కేసు విచారణ తూతూ మంత్రంగా జరిగిందన్న అనుమానాన్ని జకియా జాఫ్రీ వ్యక్తం చేస్తున్నారు. ఆమె వ్యక్తపరచినట్లు గుజరాత్ మారణకాండ కేసులన్ని దూది పింజల్లా తేలిపోవలసిందేనా? కోర్టు తీర్పుపై జకియా జాఫ్రీ అసంతృప్తితో తీవ్ర విచారం వ్యక్తం చేశారు.

'నిందితులు తాము చేసిన తప్పులకు శిక్ష అనుభవించాలి. వారంతా నా కళ్లముందే ఎంతోమందిని కిరాతకంగా చంపేశారు. మాకు నిలువ నీడ లేకుండా చేశారు. తాను దోషులకు ఉరిశిక్ష విధించాలని కోరుకోవడం లేదని కానీ వారికి గరిష్టంగా శిక్షలు పడాలి. ఈ రోజుతో తన పోరాటం ముగిసిపోతుందని అనుకున్నానని, న్యాయం అసంపూర్ణమే. ఈ తీర్పుతో నా పోరాటం కొనసాగించక తప్పదు' అంటూ 77 ఏళ్ల జకియా జాఫ్రీ మీడియా ముందు వాపోయారు. దీనిపై తాము హైకోర్టులో అప్పీలు చేస్తామని చెప్పారు.

ఈ కేసులో బాధితుల పక్షాన పోరాడుతున్న మానవ హక్కుల కార్యకర్త తీస్తా సెతల్వాద్ మాట్లాడుతూ 'ఇది ముమ్మాటికి నేరపూరిత కుట్రకు సంబంధించిన కేసేనని' అన్నారు. అలాగే ఢిల్లీ హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ రాజిందర్ సచార్ మాట్లాడుతూ 'ఊచకోత నాడు మోడీ గుజరాత్ ముఖ్యమంత్రిగా ఉన్నారని, ఈ తీర్పు మోడీకి కళంకితమని' అన్నారు. సుప్రీం కోర్టు నియమించిన సిట్ జరుపుతున్న దర్యాప్తు తీరు గురించి సుప్రీం కోర్టు అనుమానం వ్యక్తం చేస్తూ ప్రసిద్ధ న్యాయవాది రాజు రామచంద్రన్‌ను ప్రత్యేక అధికారిగా నియమించి ప్రత్యేక చర్యలు చేపట్టినప్పటికీ ఈ మారణకాండ ముందస్తు ప్రణాళిక మేరకే పన్నిన కుట్రే అని నమోదు చేసిన అభియోగాలను సిట్ నిరూపించలేక పోయింది. కావాలనే కేసును నీరుకార్చి బిజెపి జేబుసంస్థగా వ్యవహరించిందని బాధితులు అనుమానం వ్యక్తం చేస్తున్నారు.

గుజరాత్ మారణకాండలో ఒకటైన బెస్ట్ బేకరి కేసు ఘటనలో బేకరి యజమాని, కుటుంబ సభ్యులతో సహా మొత్తం 14 మంది సజీవ దహనం అయ్యారు. ఈ కేసు కూడా తేలిపోయింది. మొత్తం గుజరాత్ మారణకాండకు సంబంధించిన 14 కేసులు తుస్సుమనిపించేందుకు ఉన్నత స్థాయిలో ప్రయత్నాలు జరుగుతున్నాయి. అది నిజమేనని ఈ కేసుల తీరుతెన్నులు తెలుపుతున్నాయి.

ఇవేకాక మాలెగావ్, గోవా, థానే, సంఝౌతా ఎక్స్‌ప్రెస్, హైదరాబాద్ మక్కా మసీదు, ఇలా అనేక ప్రాంతాలలో బాంబులు పేల్చి నరమేధం సృష్టించిన హిందూత్వ ఉగ్రవాదం తాటాకు కేసులన్ని ఒకటి తరువాత ఒకటి జారిపోతున్నాయి. దోషులు తప్పించుకుంటున్నారు. ఇదంతా రాజ్యం కనుసన్నల్లో జరుగుతుందనేది వాస్తవం.

మరోవైపు ఎక్కడ ఏ చిన్న సంఘటన జరిగినా ముస్లిం యువకులను పెద్ద ఎత్తున అరెస్టులు చేసి, జైళ్లలో కుక్కి వారిని చావబాదుతున్నారు. సంవత్సరాల తరబడి విచారణలు లేకుండా జైలు శిక్షలు అనుభవించేటట్లు చేస్తున్నారు. ఈ సంఘటనలన్ని 'చట్టం ముందు అందరూ సమానమే' అన్నది బూటకం అని తేలిపోయింది. మనది ప్రజాస్వామ్యమేనా? నిజమైన ప్రజాస్వామిక వ్యవస్థలో ఇలాంటి వివక్షత ఉంటుందా?

ఒక కేసుకు సంబంధించి తప్పుడు తీర్పుల విషయంలో దేశ అత్యున్నత న్యాయస్థానం సుప్రీం కోర్టు కొన్ని కీలక వ్యాఖ్యలు చేసింది. 'కోర్టుల్లో న్యాయం జరుగుతుందని ప్రజలు ఓపికగా ఎదురు చూస్తారని, నేరానికి తగిన శిక్ష విధించడంలో కోర్టులు నిర్హేతుకంగా వ్యవహరించి

# మాలేగావ్ - బలిపశువులుగా ముస్లింలు

***దేశంలో ఎక్కడ ఏ అల్లర్లు, బాంబు దాడులు జరిగినా దాని వెనకాల ముస్లిం మతస్థులే ఉన్నారనే అభియోగంపై వారిని తీవ్ర చిత్రహింసలకు, మానసిక హింసలకు గురిచేస్తున్నారనీ, దీని వల్ల ముస్లిం యువత బలైపోతోందనీ అంటున్నారు*** **ఏంపెల్లి భాస్కర్**

మహారాష్ట్రలో చేనేత ప్రధాన వృత్తిగా, ముస్లిం మెజారిటీ జనాభాగా ఉండే మాలేగావ్ పట్టణంలోని 2006 సెప్టెంబర్‌లో ఒక ముస్లిం పర్వ దినాన ముస్లింలంతా ప్రార్థన ముగించుకొని బయటకు వస్తుండగా జరిగిన బాంబు పేలుళ్లలో 31 మంది చనిపోగా, దాదాపు 312 మంది గాయపడ్డారు.

ఈ కేసును మొదట మహారాష్ట్ర తీవ్రవాద నిరోధక సంస్థ యాంటి టెర్రరిస్ట్ స్క్వాడ్ (ఎటిఎస్) విచారణకు తీసుకుంది. ఈ పేలుళ్లకు బాధ్యులుగా చూపిస్తూ తొమ్మిది మంది ముస్లింలను అరెస్టు చేశారు. వీరంతా గతంలో నిషేధిత అతివాద ముస్లిం సంస్థ అయిన స్టూడెంట్ ఇస్లామిక్ మూవ్‌మెంట్ ఆఫ్ ఇండియా (సిమి)లో పనిచేశారని ఆరోపించారు. తర్వాత ఈ కేసును 2007 జూలైలో సిబిఐకి అప్పగించారు. సిబిఐ కూడా మహారాష్ట్ర ఎటిఎస్ విచారణ సరైందేనని ఈ తొమ్మిది మందే పేలుళ్లకు కారణమని తేల్చి చెప్పింది.

అయితే 2011లో కేసును నేషనల్ ఇన్వెస్టిగేషన్ ఏజెన్సీ (ఎన్ఐఎ)కి అప్పగించిన తర్వాత కొత్త మలుపు తిరిగింది. దేశంలోని హిందూ తీవ్రవాద సంస్థలు బయటికి వచ్చాయి. నేషనల్ ఇన్వెస్టిగేషన్ ఏజెన్సీకి కేసును విచారణ కొనసాగించమని మాత్రమే చెప్పారు. అంటే అంతకు ముందు జరిగిన విచారణతో దానికి ఏం సంబంధం లేదు. ఎన్ఐఎ విచారణలో హిందూ తీవ్రవాద సంస్థల పాత్ర వెలుగులోకి వచ్చి మరో నలుగురిని అరెస్టు చేశారు. కానీ మొదట అరెస్టు చేసిన తొమ్మిది మందిని వదిలివేయలేదు.

పది సంవత్సరాల విచారణ అనుభవించాక, విచారణ పేరుతో అనేక రకాల హింసను అనుభవించాక, ఐదు సంవత్సరాల జైలు జీవితం అనుభవించాక ఏ ఆధారాలు దొరకలేదని, దొరికిన ఆధారాలు విచారణ సంస్థల సృష్టే అని, పైగా ఈ పేలుళ్లకు హిందూ తీవ్రవాద గ్రూపులు కారణమని ఇప్పుడు వీరిని వదిలివేయడం జరిగింది. వారిని ఈ కేసులో ఇరికించడానికి కారణం సిమితో సంబంధాలున్నాయనే అనుమానం మాత్రమే!

హైదరాబాద్ మక్కా మసీదు పేలుళ్ల నిందితుడు స్వామి అసిమానంద అప్రూవర్‌గా మారి 2006 మాలేగావ్ పేలుళ్లలో హిందూ తీవ్రవాద సంస్థల పాత్రను వెలికి తెచ్చాడు. తీవ్రవాదానికి, హింసకు ప్రతిరూపంగా ముస్లింలను, ముస్లిం మతంను చూపించే పత్రికలు హిందూమత తీవ్రవాదం బయటపడగానే పదజాలం మార్చాయి. హిందూమతం పేరు కానీ, ఆయా సంస్థల పేరు కానీ ఎత్తకుండా 'మెజారిటి కమ్యూనిటికి' చెందిన వారే పేలుళ్లకి కారణం అని రాశారు.

పెళ్లై నాలుగు నెలలే అయిన ఒక 23 సంవత్సరాల యువకున్ని అరెస్టు చేసి, ఆ పెళ్లిలో బాంబు పేలుళ్లకు పథకం వేశారని ఆరోపించి ఐదు సంవత్సరాలు జైల్లో వేశారు. హిందూ తీవ్రవాది అప్రూవర్‌గా మారి నిజం చెప్పేంత వరకు ఆధారాల గురించి పట్టించుకున్నవాడే లేడు. సాక్ష్యాలు సృష్టించడానికి ప్రయత్నాలు తప్ప 'పది సంవత్సరాలు చాలా కష్టాలు అనుభవించాం ఇప్పుడు నాకు భయం లేదు. భయానికి కూడా ఒక పరిమితి ఉంటుంది. ఆ పరిమితి దాటిన తర్వాత అది పెద్దగా ప్రభావితం చేయదు. నేను ఆ స్థితికి చేరుకున్నాను' అంటారాయన.

సిమితో సంబంధాలున్నాయని ఒకసారి అనుమానించబడ్డాక ఎప్పుడు, ఎక్కడ పేలుళ్లు జరిగినా పోలీసుల ముందు హాజరు కావాల్సి ఉంటుంది. అలా జరిగిందే ఈ అరెస్టు కూడా. ఆధారాలు దొరకకపోతే

---

నప్పుడు వారి నమ్మకం సడలి నిస్పృహకు లోనౌతారని, అప్పుడు వారిలో సహనం నశిస్తుందని' సుప్రీం కోర్టు వ్యాఖ్యానించింది. ఈ సందర్భంగా సుప్రీం మాట్లాడుతూ కోర్టులు శిక్షలు విధించే సమయంలో వ్యవహరించాల్సిన తీరును వివరిస్తూ 'శాసన వ్యవస్థ చట్టాలు రూపొందించే సమయంలో శిక్షకు సంబంధించిన నిర్ణయాన్ని కోర్టుల వివేచనకు వదిలేసిందని, ఇలాంటి స్థితిలో కోర్టులు మరింత బాధ్యతగా వ్యవహరించాలని సహేతుకమైన, న్యాయబద్ధమైన వివేచనను కోర్టులు ప్రదర్శించాలి. న్యాయపాలనకు ప్రాధాన్యతనిస్తూనే సమాజ సామూహిక చేతనతో, సమతుల్యంతో తీర్పులు ఇవ్వాలి' అంటూ లోతైన వ్యాఖ్యలు చేసింది.

ఈ పరిణామాలు ప్రస్తుతం రాజ్యం ప్రదర్శిస్తున్న అసహన పరిస్థితులు 1975 ఎమర్జెన్సీని తలపిస్తున్నాయి. మేధావుల హత్యలు, ప్రశ్నించే ప్రగతిశీలక బుద్ధిజీవులు, విద్యార్థులపై దేశద్రోహ ముద్ర. ఇదంతా సంఘ్‌పరివార్ శక్తులు దేశంలో నెలకొల్పిన విషమస్థితి. ఆర్ఎస్ఎస్ రూపమాత్రంగానే మతోన్మాద సంస్థ, సారాంశంలో ఫాసిజం దాని తత్వమని ప్రజలు గ్రహించాలి. ఈ ఫాసిజాన్ని ఒక ఆర్థిక అంశంగా చూడాలి. ప్రజలను దోచుకోవడానికి మతం, మతోన్మాదం ఒక సాధనమని గ్రహించాలి. వామపక్షవాదులు, ప్రగతిశీలురు, ప్రజాస్వామిక బుద్ధిజీవులు, ప్రజలు అప్రమత్తమవ్వాలి. మార్క్స్‌ని, ఫూలే, అంబేద్కర్‌ని చదవకపోయినా ముందు సావర్కర్, గోల్వాల్కర్, హెగ్డేవార్‌లను చదవాలి. అర్థం చేసుకోవాలి. తద్వారా ముందు ముందు రాబోయే పెను తుఫానులను ఎదుర్కొనేందుకు ఇది అత్యవసరం

*(రచయిత సామాజిక విశ్లేషకులు)*

అది నిందితుడి తప్పు. సాక్ష్యాలు చూపించలేకపోతే అది చట్టం తప్పు. అందుకే ఎటిఎస్, సిబిఐ సాక్ష్యాలు సంపాదించే పనిలో లేదా ఎన్ఐఎ (నేషనల్ ఇన్వెస్టిగేషన్ ఏజెన్సీ) చెప్పినట్లుగా సాక్ష్యాలు సృష్టించే పనిలో ఉండిపోయాయి. వీరిని ఔరంగాబాదు ఆయుధ రవాణా కేసులోనూ, ముంబై ట్రైన్ పేలుళ్ల కేసులోనూ అదుపులోకి తీసుకోవడం జరిగింది. మాలేగావ్‌లో హిందూ టెర్రరిస్టులు బయటపడ్డారు. కాబట్టి ముస్లింలను వదిలేశారు. వీరికి సంబంధం లేకపోయినా ఇంకో ముస్లిం టెర్రరిస్టు గ్రూపు చేసుంటే వీరుకూడా నేరస్తులే. ఎందుకంటే ముస్లిం కాబట్టి. ముఖ్యంగా అభ్యుదయ భావాలున్న ముస్లింలు కాబట్టి.

పేలుడు జరిగిన రోజు చికెన్ గునియా వచ్చి మంచంలో ఉన్నవాన్ని అరెస్టు చేసి, నార్కో పరీక్షల కోసం అనేక రకాల కెమికల్స్ బాడీలోకి ఎక్కించి, పవిత్ర రంజాన్ రోజు బట్టలూడదీసి కొట్టి, బారుగా పెరిగిన గడ్డం పట్టి పీకుతూ బలవంతంగా నేరం ఒప్పించారు. యువకులను అరెస్టు చేసి, ఆర్థిక ప్రగతికి ఉపయోగపడే యవ్వనమంతా జైలుపాలు చేసి, సమాజంలో దోషులను చేసి, నమ్మకాలను అవమానించి ఏ దేశాన్ని ఏ చట్టాన్ని గౌరవించమని చెప్తావు? శరీరంలోకి ఎక్కించిన కెమికల్స్ వలన, భౌతిక హింస వలన శరీరంలో ఇప్పుడు వస్తున్న రకరకాల మార్పులను, జరిగిన ఆర్థిక, సామాజిక నష్టాన్ని ఎవరు పూడుస్తారు? ఉపశమనమేమంటే వారింకా బతికే ఉన్నారు. వదిలివేయబడ్డారు. ఎంత గొప్పది చట్టం, వ్యవస్థ. భారత్‌మాతాకీ జై! హిందూ, ముస్లిం సైనికుల మనోభావాలు మత భావాలు దెబ్బతీసినందుకే సిపాయిల తిరుగుబాటు జరిగి ప్రథమ స్వతంత్ర్య సంగ్రామానికి దారితీసింది అని గొప్పలు చెప్పుకుంటాం. మరి ఇంత అవమానానికి గురైన వీరిని ఏ సంగ్రామం చేయమందాం. ఎవరి మీద చేయమందాం. వ్యక్తులకు, సంస్థలకు నమ్మకాలు, మతం ఉండడం వేరు. కానీ రాజ్యానికి, ప్రభుత్వానికి మతం, నమ్మకాలు ఉండడం వేరు. చేసిన ఏ చట్టాన్నైనా, రాసిన ఏ రాజ్యాంగాన్నైనా అది ఆవహిస్తుంది.

2006లో పేలుళ్లు జరిగిన తర్వాత మహారాష్ట్ర ఎటిఎస్ (యాంటి టెర్రరిస్ట్ స్క్వాడ్), 2007 జూలైలో సిబిఐ, 2011లో ఎన్ఐఎ ఈ కేసును విచారిస్తూ వచ్చాయి. అయితే ఇన్ని విచారణ సంస్థలుండడం వల్లే కేసు పది సంవత్సరాలు సాగి అమాయకులకు శిక్ష పడింది అనిపించినా, ఒకే ఏజెన్సీ ఉంటే వీరిలా బయటపడేవారు కాదేమో అనిపిస్తుంది. హేమంత్ కర్కరే వంటి నిజాయితీగల ఆఫీసర్ మూలానా దేశంలోని తీవ్రవాదంపై చర్చ ఒక మలుపు తిరిగి హిందూ తీవ్రవాద సంస్థలు వెలుగులోకి వచ్చాయి. ఆయన అరెస్టు చేసిన వారిని వారి ప్రభుత్వం కాపాడుతున్నప్పటికి.

కేసులు కొట్టేసే సందర్భంలో జడ్జ్ 'ముస్లింలు తమకు పవిత్రమైన రోజున తమతోటి ముస్లింలను చంపారనడం నమ్మశక్యం కాదు' అందుకే వీరు దోషులు అనడానికి అవకాశం లేదు అన్నాడు. ఇలాంటి లాజిక్‌లు కొన్ని సార్లు పనిచేసినా ముస్లింలంతా తీవ్రవాదులే అనే నమ్మకం లాంటిదే అది కూడా. ఇదే బాంబు పేలుళ్లలో వేరే ముస్లిం తీవ్రవాదులు చేసి హిందువులు చనిపోతే పరిస్థితి ఎలా ఉండేది. అఫ్జల్‌గురు, యాకూబ్ మెమన్‌లాగా వీరు కూడా ఎప్పుడో అత్యున్నత న్యాయస్థానం చేత, ప్రపంచంలోనే అతిపెద్ద ప్రజాస్వామ్యం చేత, అత్యంత సెక్యులర్‌గా జాతి భద్రత కోసం హత్య చేయబడి ఉండేవారు. అలా కాకుండా విచారణ సంస్థలలో రాజకీయ జోక్యాన్ని లేకుండా చేసి, అవి స్వతంత్రంగా పనిచేసే అవకాశం కల్పిస్తే విచారణ నిజాయితీగా జరిగి అమాయకులు, తప్పు చేయనివారు ఇలాంటి శిక్షలు అనుభవించకుండా ఉంటారు.

దీనికి కొనసాగింపుగా జడ్జి ఇంకా 'ఒకవేళ ముస్లింలు మత ఘర్షణలు సృష్టించాలంటే హిందూ మత పండగలయిన వినాయక నిమజ్జనం, హిందూ దేవాలయాలను ఉపయోగించుకుంటారు. కానీ ముస్లింల పవిత్ర దినంను ఎందుకు ఉపయోగించుకుంటారు' అన్నాడు. ఒకవేళ హిందూ తీవ్రవాద సంస్థలు హిందూ పండగల్లో, దేవాలయాల్లో బాంబులు పెట్టి ముస్లింలను బలిపశువులను చేస్తే?

అజ్మీర్ దర్గాలోకి ఎక్కువగా హిందువులు వెళ్లడం ఆపాలని హిందూ తీవ్రవాద సంస్థలు అక్కడ బాంబులు పెట్టి ముగ్గురు మరణించి, ఎంతో మంది గాయపడడానికి కారణం అయ్యారు. వాటి పరిస్థితి ఏంటి? వాటిని ఎలా చూస్తారు? విచారణ సంస్థలు స్వతంత్రంగా పనిచేయ నీయకుండా, సాక్ష్యాల మీద ఆధార పడకుండా ఇలాంటి లాజిక్‌లేని లాజిక్‌ల మీద ఆధారపడి న్యాయ వ్యవస్థ పనిచేస్తుంది కాబట్టే ఎంతో మంది అమాయకులు జైళ్లలో మగ్గుతున్నారు. చాలా మంది శిక్ష నుండి తప్పించుకుంటున్నారు. రాజస్తాన్‌లో 1992లో బన్వారీ దేవి అనే దళిత మహిళ మీద అత్యాచారం జరిగినప్పుడు కూడా రాజస్తాన్ హైకోర్టు 'దళిత మహిళను అగ్రకులాల వారు ముట్టుకోరని, పైగా అల్లుని ముందు మామ అత్యాచారం చేయడం హిందూ ధర్మంలో సాధ్యం కాదని' కేసు కొట్టివేశారు. ఇలాంటి మతతత్వ లాజిక్‌లు అమాయకుల ప్రాణాలతో చెలగాటం ఆడతాయి.

ఇందులో మహారాష్ట్ర ఎటిఎస్ (యాంటి టెర్రరిస్ట్ స్క్వాడ్) వాదనేమంటే, నేషనల్ ఇన్వెస్టిగేషన్ ఏజెన్సీ (ఎన్ఐఎ)ని విచారణ కొనసాగించమని (ఫర్దర్ ఇన్వెస్టిగేషన్) చెప్పారు. కానీ తిరిగి విచారించమనలేదు (రీ ఇన్వెస్టిగేషన్). కాబట్టి కొత్తగా ఎంత మందినైనా అరెస్టు చేయండి కానీ ఇంతకు ముందు అరెస్టు చేసిన వారిని వదిలి వేయడానికి వీలు లేదు. ఎటిఎస్ చూపించిన సాక్ష్యాల సాధికారతను ప్రశ్నించడానికి వీలు లేదు. అయితే ఎన్ఐఎ విచారణలో నిందితులను బలవంతంగా నేరం ఒప్పించారని, సాక్ష్యంగా చూపించిన ఫోన్ సంభాషణలు పోలీసులు రాసిన స్క్రిప్టేనని, గోడౌన్‌లో దొరికిందని చెప్తున్న ఆర్‌డిఎక్స్ (మందుగుండు సామాగ్రి) ఎటిఎస్ సృష్టేనని, సంబంధిత గోడౌన్‌కి సంబంధించిన వ్యక్తిని పేలుళ్లు జరగడానికి నెల రోజుల ముందే అరెస్టు చేశారని తేల్చిన విషయాలన్ని మహారాష్ట్ర ఎటిఎస్‌కి అందులోని కొంతమంది అధికారులకి మింగుడు పడడం లేదు.

ఇదంతా జరిగాక జడ్జి ఉద్దేశంలో 'ఎటిఎస్ ఆఫీసర్లకి ఈ తొమ్మిది మంది మీద ఎలాంటి వ్యక్తిగత వైరం లేదు. వారి ఉద్యోగ నిర్వహణలో భాగంగా ఇదంతా జరిగింది. కాబట్టి వారిని నిందించడం సరికాదు.' మరి ఎవరిని నిందించాలి? చివరగా కొన్నిసార్లు సత్యమే గెలుస్తుంది. అయితే చాలాసార్లు పోలీసులు చెప్పాలనుకున్న సత్యం, రాజ్యం నిరూపించాలనుకున్న సత్యం, లేదా ఆ రాజ్యాన్ని నడిపించే మతం నమ్మిన సత్యమే గెలుస్తుంది.

*(రచయిత రిసర్చ్ స్కాలర్, కేంద్రీయ విశ్వవిద్యాలయం)* వీ

# విప్లవోద్యమాన్ని అణచడానికి మిషన్ 2016

*కార్పొరేట్ కంపెనీల దోపిడీ ప్రయోజనాల కోసం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు బస్తర్ ప్రజలపై అణచివేత, దాడులు, హత్యలు, అత్యాచారాలు కొనసాగిస్తున్నాయనీ, ప్రజల ప్రజాస్వామిక హక్కుల కోసం అందరూ ఐక్యమై పోరాటం చేయాలనీ అంటున్నారు* **సంజయ్ కశ్యప్**

ఛత్తీస్‌గడ్ కేంద్ర సాయుధ బలగాలు, ఎయిర్‌ఫోర్స్ గరుడా కమాండోలు, పోలీసు కమాండోలు కలిసి సంయుక్తంగా, మూడు ఎంఐ-17 హెలికాప్టర్స్ ద్వారా ఎయిర్ స్ట్రైక్ డ్రిల్స్ ప్రాక్టీసు చేశాయంటూ రాయపూర్ నుండి పత్రికా ప్రకటన మీడియా బ్యానర్ వార్తలాగ వచ్చింది.

గతంలో 2015 అక్టోబర్ 13న తెలంగాణ బార్డర్‌లోని బీజాపూర్ జిల్లా చర్లగూడెం దాని పరిధిలోని కర్రగుట్టల వద్ద ఎయిర్ స్ట్రైక్ డ్రిల్స్ ప్రాక్టీసు చేశారు.

మోడీ నాయకత్వంలోని బిజెపి ప్రభుత్వం ఎందుకు బస్తర్‌లో మావోయిస్టు అణచివేత పేరుతో ప్రజలపై వైమానిక దాడులు, బాంబింగ్‌లు చేయడానికి తహతహలాడుతున్నది? నేపథ్యం చూడడం అవసరం. మోడి 'అచ్చే దిన్ ఆయేంగే – బురే దిన్ జాయింగే', 'సబ్‌కా సాథి – సబ్ కా వికాస్' అనే ప్రకారంజక నినాదాలు ఇచ్చి – అధికారంలోకి వచ్చిన వెనువెంటనే – ప్రజాస్వామ్యపు ముసుగు ధరించిన బ్రాహ్మణీయ హిందూ ఫాసిస్టులు, సామ్రాజ్యవాద దళారులకు ప్రాతినిధ్యం వహిస్తున్న సంఘ్ పరివార్, బిజెపి – తమ దేశ, విదేశీ కార్పొరేట్ సంస్థల ప్రయోజనాల కోసం, ప్రైవేటీకరణని వేగిరపరిచింది. రక్షణ, బిమా రంగాలను ప్రైవేటీకరిణకు అనుమతి ఇచ్చింది.

మరోవైపు దేశంలో బ్రాహ్మణీయ హిందూయిజాన్ని వ్యతిరేకించే వర్గాలపై కత్తిగట్టి దాడులు ప్రారంభించింది. విద్యను ప్రైవేటీకరణను వేగిరపరుస్తుంది. క్రమబద్ధంగా కాషాయీకరణకు పూనుకున్నారు. హేతువాదులపై, అభ్యుదయవాదులపై దాడులు, గోమాంసం తిన్నాడనే నెపంతో ఉత్తర్‌ప్రదేశ్‌లో దాద్రి వద్ద ముస్లింను హత్యచేస్తూ, బ్రాహ్మణ హిందూయిజం తన విషపు కోరను చాస్తూ అసహనం హద్దులను దాటి ఫాసిస్టు దాడులకు పూనుకుంటున్నది.

గత ప్రభుత్వాలు మణిపూర్‌లో, అస్సాంలో, కశ్మీర్‌లో ప్రత్యేక సాయుధ బలగాల చట్టం (ఎఎఫ్‌ఎస్‌ఎ)ను తెచ్చి – ప్రజలపై వైమానిక దాడులు నిర్వహించి వందల మంది అమాయక ప్రజలను సామూహిక హత్యచేశాయి. నేడు మోడీ ప్రభుత్వం ప్రత్యేక సాయుధ బలగాల చట్టం – పార్లమెంట్ అనుమతి లేకుండా, అంతరంగిక భద్రతకు ముప్పు పేరుతో – మావోయిస్టులను అణచివేత నెపంతో – ప్రజలపై యుద్ధం హెలికాప్టర్‌ల ద్వారా బాంబుల వర్షం కురిపించడానికి, గరుడ కమాండోలతో డ్రిల్స్ ప్రాక్టీసు చేస్తున్నది. పోరాడే ప్రజలపై తన విషపు కోరలను చాస్తున్నది.

గత మే 9న దంతెవాడ పర్యటనలో నరేంద్రమోడీ మావోయిస్టులకు 'మీరు ఆయుధాలు వదలండి – నాగళ్లు పట్టండి', 'ప్రజల సంవేదనను వినండి' అంటూ హితవు పలికాడు. కార్పొరేట్ సంస్థల ప్రయోజనాల కోసం 24 వేల కోట్ల రూపాయల అభివృద్ధి పథకాల ప్రకటన చేశాడు. పోలీసు ఉన్నతాధికారులకు – మావోయిస్టు ఉద్యమాన్ని త్వరగా అణచివేసే పథక రచన చేయండి అని ఆదేశాలు ఇస్తూ – కార్పొరేట్ సంస్థలకు మోదీ మీ సేవకుడే, యుపిఎ చేయలేనిది నేను చేసి చూపిస్తానని మాట్లాడాడు. వెంటనే కేంద్రంలో నక్సలైట్ వ్యవహారాల కోసం ప్రత్యేక బాధ్యత అధికారిగా కె. విజయ్ కుమార్‌ను నియమించారు. జాతీయ భద్రత సలహాదారు అజిత్ దోబాల్ మావోయిస్టు అణచివేతకు ప్రత్యేక శ్రద్ధకు, వ్యూహ రచనలకు కేంద్ర హోంమంత్రి కార్యాలయం సంయుక్తంగా ఈ పనిని నిర్వహించాలని ఆదేశాలిచ్చాడు.

దీనితో కేంద్ర హోంమంత్రాలయం ఇంటిలిజెన్స్ అధికారులు, అజిత్ దోబాల్, కె. విజయ్‌కుమార్‌లు, జులై నుండి డిసెంబర్ వరకు పలుమార్లు రాయ్‌పూర్, జగదల్‌పూర్, సుక్మా, దంతెవాడ, బీజాపూర్‌ను సందర్శించారు. రాష్ట్ర పోలీస్, కేంద్రీయ అర్ధసైనిక బలగాల అధికారులతో సమావేశమై – మావోయిస్టులపై అణచివేతను సమీక్షించి – నిర్దాక్షిణ్యంగా అణచివేతకు, పౌరహక్కుల ఉల్లంఘనకు పూర్తి స్వేచ్ఛను ఇచ్చారు. అదనంగా గత ఆరు నెలలో ఎనిమిది బెటాలియన్ల అర్ధసైనిక బలగాలను బస్తర్‌లో మోహరించారు. కొత్తగా క్యాంపులు వేశారు. దంతెవాడ నుండి సుక్మా రహదారిపై గమావాడ, రేషం, గండెనార్, కెరియాడ్ ఘాట్, సింగం, కొర్ర గ్రామాల వద్ద, జాతీయ రహదారి జగదల్‌పూర్ – కొంటపై పాలెం, రోఖేల్, కోయిల్‌బట్టి, పాకేలం, రాజాముండా, బొంకెక్‌తోర్రి క్యాంపులు వేశారు.

జగదల్‌పూర్ – భోపాల్‌పట్నం జాతీయ రహదారిపై – కర్రమర్క, మినగపూర్, బీజాపూర్ ఘాట్ వద్ద క్యాంపులు వేసి కార్పొరేట్ సెక్యూరిటీని విస్తరిస్తూ – దోర్నపాల్, బైరంగడ్ లాంటి స్టేషన్లను కోట్లాది రూపాయలతో ఫోర్టిఫైడ్ పోలీసు స్టేషన్లుగా బలోపేతం చేశారు. కొత్త సరెండర్ – పునరావాసం పథకాలు ప్రకటన చేశారు. ఇంటిలిజెన్స్ వ్యవస్థ విస్తరణకు నిధులను కేటాయించారు. మీడియాను కంట్రోల్‌లో పెట్టుకోవడం కోసం పోలీసు యంత్రాంగాన్ని ఐజి, ఎస్‌పి కార్యాలయాల నుండి వచ్చే ప్రకటనలను కాదని రాసే విలేకరులను అరెస్టులు చేయడం, బెదిరించడం చేశారు. ప్రభుత్వ సాయుధ బలగాలు జరుపుతున్న అణచివేతలను, హత్యలను, చెప్పలేని అమానవీయ హింసలను బయటికి పొక్కకుండా, నిజాలు ఏమాత్రం బయట ప్రచారం కాకుండా, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు – ఆర్‌ఎస్‌ఎస్, బిజెపి బ్రాహ్మణీయ హిందూ ఫాసిస్టు శక్తులు ఏకమై పౌరహక్కుల అణచివేత – ప్రజాస్వామికవాదులపై – ప్రతిపక్షపార్టీలపై దాడులకు రంగం సిద్ధం చేసుకున్నారు.

**మిషన్ 2016 ప్రకటన**

ఈ నేపథ్యంలో అక్టోబర్ రెండవ వారంలో బీజాపూర్ జిల్లాలో ఎయిర్ స్ట్రైక్స్ ప్రాక్టీసు చేశారు. సెప్టెంబర్ నుండి డిసెంబర్ వరకు నలభై మంది ప్రజలను, పార్టీ కార్యకర్తలను ఎన్‌కౌంటర్ల పేరుతో హత్యచేశారు. సామూహిక అరెస్టులు చేసి బెదిరించి, సరెండర్ చూయించడం

మొదలుపెట్టారు. 2016లో మావోయిస్టులను దండకారణ్యంలో పూర్తిగా నిర్మూలిస్తామనే ప్రకటన జారీచేశారు. కేంద్ర హెూంమంత్రి, పిఎంఒ కార్యాలయం బస్తర్ ప్రజపై క్రూర దమనకాండకు పూర్తి స్వేచ్ఛను ఇవ్వడంతో, బస్తర్‌లో ఐజి గా పనిచేస్తున్న శివరాం ప్రసాద్ కల్లూరికి అడ్డూఆపూ లేకుండా సాయుధ బలగాలను, పూర్తి పోలీసు యంత్రాంగాన్ని ఉపయోగించి పోలీసు రాజ్యాన్ని నడుపుతున్నాడు. పౌర పాలన, రాష్ట్రంలోని నామమాత్రపు హక్కులు పూర్తిగా తుంగలో తొక్కి ఫాసిస్టు పాలనను కొనసాగిస్తున్నారు. దీనికి తోడు స్థానిక భూస్వామ్య పెత్తందారీ శక్తులు, బడా వ్యాపారులు, కాంట్రాక్టర్‌లు, దళారీ రాజకీయ నాయకులు, లంపెన్ శక్తుల తోడుతో – సాయుధ బలగాలు చేసే అణచివేత, క్రూర హింసకు ప్రధాన స్రవంతిలో సాక్ష్యాలు లేకుండా, బయట ప్రజాస్వామ్యం ముసుగు చెదరకుండా ఫాసిస్టు దాడులు కొనసాగిస్తున్నాయి.

డిసెంబర్ నెలలో బీజాపూర్ జిల్లాలో తోడ్క అనే గ్రామంలో నాలుగు నెలల పసికందును నక్సలైట్లు చంపారని ఐజి కల్లూరి స్వయంగా మీడియాలో ప్రచారం మొదలుపెట్టాడు. నిజానికి తల్లే తప్పతాగి మత్తులో పసికందుపై పడుకోగా ఊపిరి మెసలక చనిపోయాడు. గతంలో ఈ కుటుంబాన్ని మావోయిస్టులు ప్రజావ్యతిరేక కార్యకలాపాలకు శిక్షించారు. ఈ విషయాన్ని ఆసరాగా చేసుకొని ఈ తప్పుడు ప్రచారంతో విద్యార్థులతో ర్యాలీలు తీయించారు.

డిసెంబర్ 22న బస్తర్ ముఖ్యపట్టణమైన జగదల్‌పూర్‌లో పోలీసు యంత్రాంగం సంఘ్ పరివార్, కార్పొరేట్ శక్తులు, బడా వ్యాపారులు, కాంట్రాక్టర్లు, దళారీ రాజకీయ నాయకులు, లంపెన్ గ్యాంగులను కలుపుకొని 'ధిక్కార ర్యాలీ'ని నిర్వహించారు. ఈ ర్యాలీ వివిధ సామాజిక సంస్థలు ఏకమై సామాజిక ఏకతా మంచ్ బ్యానరుపై నిర్వహించారు. దీనికి స్వయంగా బస్తర్ ఐజి శివరాం ప్రసాద్ కల్లూరి, ఆర్ఎస్ఎస్–బిజెపి నేతలు మనీష్ పారేఖ్, రిషి హెమాగి, సుబ్బారావు, శేషనారాయణ తివారీలు నాయకత్వం వహించారు. మావోయిస్టులను బస్తర్ నుండి తన్ని తరిమేయడం, మావోయిస్టు ప్రాబల్య ప్రాంతాలలో ప్రభుత్వ యంత్రాంగాన్ని ప్రతిష్ఠించడం తమ లక్ష్యంగా ప్రకటించుకున్నారు. పోలీసులు పెంచి పోషిస్తున్న ఈ రాజ్యాంగేతర గుండా గ్యాంగ్ అడ్డూ అదుపూ లేకుండా తన కార్యకలాపాలను కొనసాగించింది.

మరోవైపు ప్రభుత్వ సాయుధ బలగాలు విచ్చలవిడిగా గ్రామాలపై విదేశీ సైనికుల్లాగ నిత్యం దాడులు చేస్తున్నాయి. కనబడ్డవారిపై కాల్పులు, అరెస్టులు, అత్యాచారాలు కొనసాగిస్తున్నాయి. ప్రజలు కష్టపడి ఇక్కట్లుపడి అడవిలో ఏరుకున్న చింతపండు, ఇప్పపువ్వు, పండించిన ధాన్యాన్ని, పప్పు దినుసులను, డబ్బులను దోచుకెళ్లడం, కోళ్లను, మేకలను తినడం సాధారణమైన విషయంగా మారింది.

గత అక్టోబర్ 19 నుండి 21 వరకు బీజాపూర్ జిల్లా, బాసగూడెం డాంగా, చిన్నగెల్లూర్, పెద్దగెల్లూర్, బుడిగిన, గుండం గ్రామాలపై కోబ్రా, డిఎఫ్, ఎస్‌టిఎఫ్, డిఆర్‌జి బలగాలు దాడిచేశాయి. గర్భవతి మహిళలను సభ్యసమాజం తలవంచుకునేలా నీళ్లలో ముంచివేసి సామూహిక అత్యాచారం జరిపారు. 14 ఏళ్ల బాలికపై అత్యాచారం చేశారు. కనపడ్డ వారినల్లా కొట్టారు. ఇళ్లలో పడి దోచుకొన్నారు. ఈ అన్యాయాన్ని, అణచివేతను, మహిళలు వ్యతిరేకిస్తూ, బీజాపూర్ జిల్లా ఎస్‌పికి, కలెక్టర్‌కు విన్నవించారు. ప్రతిపక్ష పార్టీ కాంగ్రెస్‌తో సహా నిజనిర్ధారణ కమిటీ వేసి అత్యాచారాల వాస్తవాలను మీడియాలో వివరించారు. దోషులైన పోలీసులను శిక్షించాలని కోరారు.

కాని రమణ్‌సింగ్ ప్రభుత్వం మిషన్ 2016 పేరుతో మావోయిస్టు ఉద్యమాన్ని అణచడమే ఏకైక ఎజెండా తీసుకొని పనిచేస్తుంది. రాష్ట్రంలో తీవ్రమైన కరువు తాండవిస్తున్నా – కొన్ని నామమాత్రపు చర్యలు తీసుకొని, ప్రభుత్వ యంత్రాంగం ప్రధాన ఫోకస్ రాష్ట్రంలో మావోయిస్టు ఉద్యమాన్ని అణచడంగా పనిచేస్తుంది. ఓ అనధికార అంచనా ప్రకారం ప్రతిరోజు పది కోట్ల రూపాయల ఖర్చుతో మావోయిస్టు అణచివేతకు భద్రతా బలగాలకై, హెలికాప్టర్‌ల రవాణాకై ఖర్చు చేస్తున్నది.

జనవరి 11 నుండి 17 మధ్యన బీజాపూర్ జిల్లా అవపల్లి ఠాననేంద్ర – గొట్టుం గ్రామాలపై రెండు వందల మంది పోలీసులు దాడిచేసి గ్రామాన్నంతా దోచుకున్నారు. కనపడ్డ వాళ్లనల్లా కొట్టారు. 22 మంది మహిళలను తీవ్రంగా కొట్టారు. తొమ్మిది మంది మహిళలపై సామూహిక అత్యాచారం జరిపారు. ఈ దారుణాన్ని ఖండిస్తూ పౌరహక్కుల సంయుక్త సంస్థ (సిడిఆర్ఒ), మహిళలపై లైంగిక హింస – రాజ్యహింసను వ్యతిరేకించే కమిటీ – జనవరి 18 నుండి 20 వరకు ఈ గ్రామాలను సందర్శించి పీడిత మహిళలతో మాట్లాడారు. అత్యాచారాలకు పాల్పడ్డ పోలీసులపై ఎఫ్ఐఆర్ నమోదు చేశారు.

ఇదే సమయంలో సుకుమా జిల్లా కూత గ్రామంపై జనవరి 6న దాడి చేసి మహిళలను, పురుషులను విపరీతంగా కొట్టారు. గ్రామంలో కనబడ్డ మహిళలను, పురుషులను, జమచేసి, పిల్లలు, వృద్ధులను కూడ తీవ్రంగా హింసించారు. తొమ్మిది మంది మహిళలపై సామూహిక అత్యాచారం చేశారు. పోలీసులతో గాదిరసు ఠానా వద్ద అరెస్టు చేసిన భర్తను, కుమారుణ్ని విడవమని, తను చిన్న పిల్ల తల్లినని వినతి చేస్తే, నీవు పిల్లల తల్లివని ఎలా తెలుస్తది? నీ రొమ్మును పిండి చూస్తానని – రాక్షసంగా – రొమ్ములు పిండి చూసారు రమణ్‌సింగ్ ప్రభుత్వపు జాతీయ రక్షణా పోలీసు జవాన్లు. గ్రామాలపై కూంబింగ్ అంటేనే పోలీసు బలగాలు ఓపెన్‌గా మాకు మోడీ – రమణ్‌సింగ్ – మావోయిస్టులను అణచడానికి పూర్తి స్వేచ్ఛనిచ్చారు. మమ్ముల్ని ఎవరు ఏమీ చేయరు. ఎవరికి చెప్పుకోలేరు. మాట్లాడితే వారిని తూటాలతో తునకల్లాగా గాలిలో ఎగిరిపడేలా చేస్తామని గర్వంగా మాట్లాడుతున్నారు.

ఈ అత్యాచారాలను ఖండిస్తూ సుక్మాలో, బీజాపూర్‌లో ప్రజలు ర్యాలీ తీశారు. బస్తర్ కమీషనర్‌కు విన్నవించుకున్నారు. ప్రజాస్వామిక సంస్థలు, ఆదివాసీ సంస్థలు దోషులైన పోలీసులను శిక్షించాలని డిమాండ్ చేశారు.

కానీ పౌరహక్కుల సంఘాల, ప్రజాస్వామిక వాదుల డిమాండ్లను కాలరాచడానికి పోలీసులు, మాజీ జుడుం నేతలు, సంఘ్ పరివార్ శక్తులు కలిసి బీజాపూర్‌లో 'నక్సలైట్ల పీడిత సంగం' పేరుతో మధుకర్‌రావు, మిబ్బేతుగ్గే, సుక్లూ పటేల్ నాయకత్వంలో పౌరహక్కుల సంస్థలకు వ్యతిరేకంగా ర్యాలీ నిర్వహించారు. 'సామాజిక ఏకతా మంచ్' పేరుతో సుబ్బారావు, సంపత్ ఝా, మనిష్ పారేఖ్ నాయకత్వంలో జగదల్‌పూర్‌లో ర్యాలీ తీశారు. సామాజిక కర్యాకర్త బేలా భాటియా ముర్దాబాద్ అనే నినాదాలు చేస్తూ రచయిత్రి అరుంధతీ రాయ్ దిష్టిబొమ్మను తగులబెట్టారు. పౌరహక్కుల సంస్థలు 'బస్తర్‌ను విడిచి వెళ్లాలి, పోలీసులు మహిళలపై అత్యాచారాలు చేశారనేది బూటకం' అంటూ నినాదాలు చేశారు.

పోలీసు – సామాజిక ఏకతా మంచ్ కలిసి జగదల్‌పూర్ నుండి తన ఇంటికి వస్తున్న సామాజిక కార్యకర్త, ఆప్ పార్టీ నేత సోని సోరీపై ఫిబ్రవరి 20న బంజారాఘాట్ వద్ద మోటర్ సైకిల్‌ను ఆపి మొఖంపై కెమికల్ దాడి చేశారు. ఈ దాడి రాష్ట్రంలో, దేశంలో ప్రజాస్వామిక సంస్థలు, వివిధ రాజకీయ పార్టీలు తీవ్రంగా ఖండించాయి. పోలీసులు 'సోనిసోరిపై దాడికి మాకు సంబంధం లేదు, మేము నేరస్తులను

పట్టుకుంటా'మని ప్రకటనలు ఇస్తూ, సోనిసోరి కుటుంబాన్ని విచారణ పేరుతో ఇబ్బందులకు గురిచేశారు.

మరోవైపు జగదల్‌పూర్‌లో నివాసముంటున్న ఇండిపెండెంట్ విలేకరి మాలిని సుబ్రమణ్యం ఇంటిపై సామాజిక ఏకతా మంచ్ కార్యకర్తలు దాడిచేశారు. సామాజిక కార్యకర్త బేలా భాటియా కిరాయికుంటున్న యజమానిని బెదిరించి ఇల్లు ఖాళీ చేయించారు.

పేద ఆదివాసీ ప్రజలకు న్యాయ సహాయం అందించాలనే ఉద్దేశ్యంతో పనిచేస్తున్న లీగల్ ఎయిడ్ గ్రూపు, మహిళా వకీళ్లను బెదిరించారు. వారు కిరాయికుంటున్న యజమానులను బెదిరించారు. జగదల్‌పూర్ పట్టణంలో వారికి ఏ హోటల్‌లో రూం ఇవ్వవద్దనే ఆదేశాలిచ్చారు. వారు జగదల్‌పూర్ జిల్లా కోర్టులు, పేద ఆదివాసీ ప్రజలకు న్యాయ సహాయం అందించడానికి అడ్డంకులు కల్పిస్తూ బయటివారు ఇక్కడి కోర్టులో వాదించడానికి వీలు లేదని సంఘ్ పరివార్ – బిజెపి శక్తులు ప్రకటించాయి. బెదిరించాయి. విచిత్రమైన విషయమేమంటే ఈ సామాజిక ఏకతా మంచ్ పేరుతో, వకీళ్ల పేరుతో పనిచేస్తున్న, చలామణి అవుతున్న సంఘ్‌పరివార్ – బిజెపి నేతలలో అత్యధికులు యుపి, బీహార్, రాజస్థాన్, పంజాబ్ నుండి వలస వచ్చిన వారు. ఆదివాసి సంస్కృతిని, సామాజిక వ్యవస్థను ధ్వంసం చేస్తూ – బ్రాహ్మణీయ హిందూ సంస్కృతిని విస్తరింప చేస్తున్నారు. కార్పొరేట్ సంస్థల ప్రయోజనాలు నెరవేర్చే ప్రభుత్వ అధికారులుగా, బడా వ్యాపారులుగా, టేకేదారులుగా, మీడియా అధిపతులుగా, రియల్ ఎస్టేట్ వ్యాపారులుగా చలామణీ అవుతున్నారు. సామాజిక ఏకతా మంచ్ కార్యకర్తలు, ఐజి కల్లూరి, బస్తర్ ఎస్‌పి రాజేంద్ర నారాయణ్, కలెక్టర్ అమిత్ కటాకిటా – భుజం భుజం కలిపి పనిచేస్తున్నారు. 2016లో బస్తర్‌ను నక్సలైట్ల ముక్తి ప్రాంతంగా మార్చేయమని మాట్లాడారు. ఈ సభలో ఒకే వేదికపైన బస్తర్ చాంబర్ ఆఫ్ కామర్స్, జిల్లా అధివక్త సంఘ్, కంట్రాక్టర్ల సంఘం నాయకులు 'మిషన్ – 2016' గురించి, నక్సలైట్లను నిర్మూలించే లక్ష్యం గురించి మాట్లాడారు.

అంటే రాజ్యాంగం ద్వారా ఏర్పరుచుకున్న న్యాయవ్యవస్థ, చట్టాలు బస్తర్‌లో ఏమాత్రం పనిచేయవు. కార్పొరేట్ సంస్థల ప్రయోజనాల రక్షణే జాతి రక్షణగా, అభివృద్ధి నమూనాగా, జాతీయతగా కార్పొరేట్ మీడియాలో ప్రచారం చేస్తూ పోలీసు ఆఫీసు నుండి జారీ అయిన స్టేట్‌మెంట్స్ మాత్రమే ప్రచారం చేస్తూ, ఎన్‌కౌంటర్లు, సరెండర్లు, గ్రామాలపై పోలీసు దాడులకు సంబంధించిన – ఏ మాత్రం వాస్తవ కథనాలను రాసే విలేకరులను రమణ్‌సింగ్ ప్రభుత్వం సహించలేని, ఫాసిస్టు అణచివేత చర్యలు చేపట్టింది. నిజాలు, వాస్తవాలు బయటికి పొక్కకుండా చర్యలు చేపట్టింది.

మావోయిస్టు ఏరివేత పేరుతో పోలీసుల అత్యాచారాలు, ఎన్‌కౌంటర్ కథనాలను బయటికి పొక్కకుండా గత ఆగస్టులో బస్తర్ జిల్లా దర్భబ్లాక్‌లో స్థానిక విలేకరులు సోమాటనూ, సంతోష్ యాదవ్‌లను ఛత్తీస్‌గఢ్ జన సురక్ష ఖానూన్ చట్టం కింద అరెస్టు చేసి జైల్లో వేశారు. మార్చిలో దంతెవాడలో ప్రభాత్‌సింగ్, దీపక్ జయస్వాల్‌ను అరెస్టు చేసి పెట్టారు. బిబిసి విలేకరి అలోక్ ప్రతాప్ బస్తర్ జిల్లా మార్దుం థానా ఏరియాలో హిడ్మే అనే రైతు ఎన్‌కౌంటర్ వాస్తవాల రిపోర్టింగ్ కోసం ప్రయత్నిస్తే, పోలీసులు, సామాజిక ఏకతా మంచ్ కార్యకర్తలు దాడులకు ప్రయత్నించారు. ఐజి శివప్రసాద్ కల్లూరి బిబిసి విలేకరితో మాట్లాడానికి నిరాకరించాడు. జాతివ్యతిరేక విలేకరులతో నేను మాట్లాడనని నియంత హిట్లర్ స్వరంలో, గర్వంగా మాట్లాడాడు.

బస్తర్‌లో ప్రభుత్వ సాయిధ బలగాలు చేసే అత్యాచారాలు, జులుంను వ్యక్తీకరించ డానికి పదాలు, వాక్యాలు చాలవు. 2016లోనే నలభై మంది మహిళలు పైగా పోలీసుల అత్యాచారాలకు గురైనారు. పోలీసులపై ఎఫ్ఐఆర్‌ను నమోదు చేశారు. కాని ఇప్పటి వరకు ప్రభుత్వం ఏం చర్య తీసుకోలేదు. కాని నిస్సిగ్గుగా మావోయిస్టులు పోలీసులపై బేబునియాద్ ఆరోపణలు చేస్తున్నారని, మహిళలపై అత్యాచారాలను సమర్థించు కుంటున్నారు. అత్యాచారాలకు పాల్పడ్డ పోలీసు జవాన్లకు అవుట్ ఆఫ్ టర్న్ ప్రమోషన్లు ఇచ్చారు.

ప్రజలను పక్కదారి పట్టించడానికి, మహిళలపై అత్యాచారాల ఘటనను న్యాయ విచారణను చేస్తాము అంటూ మహిళలపై అత్యాచారాలకు పాల్పడ్డ జవాన్లకు నాయకత్వం వహించిన బీజాపూర్ డిఎస్‌పి వెలిశెల ఇందిర కళ్యాణ్ నాయకత్వంలో ఎంక్వైరీ కమిటీ వేశారు. తర్వాత రాష్ట్ర మానవాధికార కమిషన్ బీజాపూర్, సుక్మను సందర్శించింది. ఈ మానవాధికార కమిషన్‌కు సల్వాజుడుం టైంలో బీజాపూర్‌లో ప్రజలపై, మహిళలపై చెప్పలేని అత్యాచారాలకు పాల్పడ్డంలో నాయకత్వం వహించిన ఐపిఎస్ అధికారి రతన్ లుతడాంగ్‌నే నాయకుడు. మహిళలను బీజాపూర్‌కు పిలిపించి – అత్యాచారాలకు పాల్పడ్డ జవాన్ల పహరాలో, సమక్షంలో అత్యాచార వివరాలను తెలుసుకున్నారు.

జాతీయ షెడ్యూల్డ్ తెగల కమిషన్ అధ్యక్షులు రామేశ్వర్ ఉరాం అయితే పీడిత మహిళలతో మాట్లాడడం అనేది పోలీసుల సహకారంతో ఓ ప్రహసనంగా నిర్వహించాడు. రామేశ్వర్ ఉరాం బస్తర్‌లో తన పర్యటనను ముగించుకొని, నక్సలైట్ల ఏరివేత చర్యలను బలహీన పరచడం కోసం ఆరోపణలు చేస్తుంటారనే విషయాన్ని కాదనలేమని మాట్లాడాడు.

మహిళలపై అత్యాచారాలకు పాల్పడ్డ సాయిధ బలగాలకు చెందిన అధికారులకు జవాన్లపై ఇప్పటివరకు ఏ చర్య తీసుకోలేదు సరికదా, ప్రభుత్వ సాయిధ బలగాలు మహిళలపై అత్యాచారాలు చేయడం ఆగింది లేదు. ప్రభుత్వం చెప్పుకుంటున్న సరెండర్ పాలసీలో భాగంగా తన కుటుంబ సభ్యుల సమక్షంలో సుక్మా జిల్లా గాదీరన్ థానాలో సరెండర్ అయిన కొర్రా నివాసి సోడి మూయేపై థానాలో సామూహిక అత్యాచారం జరిపి, విషయం బయటికి పొక్కకుండా, ఒడిశాలోని మల్కన్‌గిరి జిల్లా హాస్పిటల్‌లో చికిత్స చేయించారు.

గత నవంబర్–డిసెంబర్ నెలలో బీజాపూర్ జిల్లా గంగలూర్ థానా ఏరియాలో కోర్సేలి, నేంద్ర గ్రామాలలో మహిళలపై అత్యాచారాల గురించి బీజాపూర్ థానాలో షికాయత్ నమోదు చేయడానికి ముందుకొచ్చారు. కాని మహిళలపై అత్యాచారాలకు పాల్పడ్డ జవాన్లకు, అధికారులకు అవుట్ ఆఫ్ టర్న్ ప్రమోషన్, రివార్డులు ఇచ్చి సన్మానించింది.

ఎన్‌కౌంటర్‌పై, సరెండర్స్‌పై వాస్తవ కథనం రాస్తే పోలీసుల బెదిరింపులకు, అరెస్టులకు గురికావలసిందే. ఇప్పటి వరకు నలుగురు విలేకరులు అరెస్టు అయ్యారు. ఇండిపెండెంట్ రిపోర్టర్‌లను బెదిరించి బస్తర్ నుండి వెళ్లగొట్టడం జాతీయత పేరుతో కొనసాగుతున్నది.

ఈ నేపథ్యంలో విలేకరులపై దాడుల గురించి ఎంక్వైరీ చేయడానికి ఎడిటర్స్ గిల్డ్ ఆఫ్ ఇండియా – సీనియర్ విలేకరి వినోద్‌వర్మ నాయకత్వంలో బస్తర్ పర్యటించి, బస్తర్‌లో విలేకరులపై పోలీసుల దాడులపై విస్తృత రిపోర్టు, బస్తర్‌లో ప్రజాస్వామ్యం – పౌరహక్కులు లేవు. పోలీసు ఆఫీసు నుండి విడుదలైన ప్రకటనలను పేస్టు చేయడమే రిపోర్టర్ల పని – ఈ హద్దు దాటిన రిపోర్టర్‌లు, విలేకరులు పోలీసుల కోపానికి, అసహనానికి, బెదిరింపులకు, దాడులకు బలవుతున్నారని చెప్పాడు. బస్తర్‌లో పోలీసుల రాజ్యం నడుస్తున్నది. పౌరహక్కులు కాలరాచి వేయబడుతున్నవని అమ్నెస్టీ ఇంటర్నేషనల్ వివరమైన రిపోర్టును విడుదల చేసింది.

ఏప్రిల్ 1, 2016న సుక్మా జిల్లా కిష్టారం తానా పరిధిలోని వరపురం వద్ద, కోబ్రా, ఎస్‌టిఎఫ్, సిఆర్‌పిఎఫ్ బలగాలు సంయుక్తంగా మూడు వాయుసేన హెలికాప్టర్స్‌లో విమాన దాడులు, బాంబింగ్ డ్రిల్స్‌ను ప్రాక్టీసు చేశాయి. వాయుసేనకు చెందిన ఛత్తీస్‌గఢ్ ప్రాంత కమాండర్ అజయ్ శుక్లా, నక్సలైట్ ఆపరేషన్ ప్రత్యేక డిజిపి – డిఎం అవస్థీ ఈ ఎయిర్ స్ట్రైక్స్ డ్రిల్స్ ప్రాక్టీసు చేసినట్లు రాయపూర్‌లో ప్రకటించారు. మావోయిస్టులు ప్రభుత్వ సాయుధ బలగాలపై దాడిచేస్తే – మేము మావోయిస్టులను రూపుమాపుతాం, ఎయిర్ బాంబింగ్‌తో గట్టి జవాబు చెబుతామని చెబుతున్నారు. వాస్తవమేమిటంటే మోదీ – రమణ్‌సింగ్‌లు ప్రకటించుకున్న మిషన్ 2016 అంత సరళంగా నెరవేరేటట్టు కనపడడం లేదు. ఛత్తీస్‌గఢ్ – తెలంగాణ – మహారాష్ట్ర – ఆంధ్ర పోలీసు, కమాండో బలగాలతో సంయుక్తంగా దండకారణ్య ఉద్యమ నిర్మూలనకు నిర్వహిస్తున్న మహా అభియాన్‌కు – మావోయిస్టులు ప్రజల సహకారంతో గట్టి ప్రతిఘటన ఇస్తున్నారు.

ఛత్తీస్‌గఢ్ – తెలంగాణ కమాండో బలగాలు సంయుక్తంగా బీజాపూర్ జిల్లా పామేడ్ తానా పరిధిలోని బొట్టెం గ్రామంలో మార్చ్ 1న పిఎల్‌జిఏపై దాడి చేయగా తొమ్మిది మంది మావోయిస్టు కార్యకర్తలు చనిపోయారు. ఈ సందర్భంగా ఛత్తీస్‌గఢ్ పోలీసులు, అర్ధసైనిక బలగాలు మార్చ్ 2న సుక్మా జిల్లా కిష్టారం తానా పరిధిలోని గ్రామాలపై దాడి చేశాయి. మావోయిస్టుల పిఎల్‌జిఎ గెరిల్లాలు ఈ దాడిని తిప్పికొడుతూ పోలీసులను చుట్టుముట్టారు. ఈ హోరాహోరి పోరు 26 గంటలు సాగింది. ప్రభుత్వ సాయుధ బలగాలు 15 కిలోమీటర్లు లోపలికి వెళ్లి గాయపడి, చచ్చి వెనుతిరిగారు. కాని గెరిల్లాలు వారిని కిష్టారం తానాకు వెళ్లకుండా పోట్టెంమంగు గ్రామాల వద్దే అడ్డం తిరిగి చుట్టుముట్టాయి. ఈ పోరాటంలో ముగ్గురు అర్ధసైనిక బలగాల జవాన్లు చనిపోయారు. 17 మంది జవాన్లు గాయపడ్డారు. దంతెవాడ జిల్లా మైలవాడ వద్ద మార్చి 30న మావోయిస్టులు రోడ్డుపై పోలీసులు ప్రయాణిస్తున్న వాహనాన్ని పేల్చారు. దీనితో వాహనంలో ఉన్న ఏడుగురు సిఆర్‌పిఎఫ్ జవాన్లు చనిపోయారు.

మోదీ – రమణ్‌సింగ్ నిర్ణయించుకున్న మిషన్–2016లో భాగంగా సాధారణ ప్రజలపై అమానవీయ నిర్బంధం, మహిళలపై అత్యాచారాలు కొనసాగిస్తున్నప్పటికీ మావోయిస్టులు గట్టి ప్రతిఘటన ఇస్తున్నారు. దీనితో మావోయిస్టులను త్వరగా నిర్మూలించి కార్పొరేట్ కంపెనీలకు మైన్స్ అప్పగించాలనే పథకం అమలుకు మోదీ సర్కార్ బస్తర్‌లో ప్రజలపై విమాన దాడులతో బాంబుల వర్షం కురిపించి – సామాన్య ప్రజలను సామూహిక హత్యలు చేసి ఛిద్రమైన శవాలుగా మార్చేందుకు ఏప్రిల్ 1న సుక్మా జిల్లా కిష్టారం దగ్గర వీరపురం వద్ద ఎయిర్ స్ట్రైక్ డ్రిల్స్ అభ్యాసం చేశారు. బీజాపూర్‌లోని ఇంద్రావతి నేషనల్ పార్కులో ఎయిర్ స్ట్రిప్ నిర్మించడానికి అనుమతి వచ్చింది.

ప్రభుత్వం ఎయిర్ స్ట్రైక్ డ్రిల్స్‌ను దేశంలో వివిధ సామాజిక సంస్థలు, పౌరహక్కుల సంస్థలు తీవ్రంగా ఖండించాయి. కార్పొరేట్ సంస్థల ప్రయోజనాల కోసం మోదీ ప్రభుత్వం బస్తర్ ప్రజలపై ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరుతో అన్యాయమైన యుద్ధం చేస్తున్నదని అవి తీవ్రంగా నిరసన తెలిపాయి.

ఈ ఎయిర్ స్ట్రైక్ డ్రిల్స్‌కు వ్యతిరేకంగా మావోయిస్టులు ఏప్రిల్ 15న దండకారణ్యంలో బంద్‌ను నిర్వహించారు. పరిస్థితిని సమక్షించే నెపంతో కేంద్ర హోంమంత్రి ఏప్రిల్ 16న రాయ్‌పూర్‌ను సందర్శించారు. ఏప్రిల్ 15న జగదల్‌పూర్, బస్తర్ ఐజి శివరాం ప్రసాద్ కల్లూరి నాయకత్వంలో సామాజిక ఏకతా మంచ్ నాయకులు తమ సంస్థను రద్దు చేస్తున్నట్లు ప్రకటించారు.

ప్రజల, ప్రజాస్వామిక వాదుల, పౌరహక్కుల సంస్థల ఒత్తిడితో రమణ్ సింగ్ ప్రభుత్వం ఏర్పరచిన రాజ్యాంగేతర గ్యాంగును రద్దుపరుచుకోవడానికి ఒత్తిడి చేయబడ్డది. కేంద్ర హోంమంత్రి పర్యటనకు ముందు ఒకరోజు ఈ రద్దును ప్రకటించాక ఐజి కల్లూరి – ప్రజలపై దాడులకు మరో రూపంలో – అరాచక పథకాలు – హోంమంత్రి రాజ్‌నాథ్ సింగ్ ముందు పెట్టాడనడంలో సందేహం లేదు. మావోయిస్టుల ఏరివేత చర్యలను సమీక్షించి, మరిన్ని బలగాలను, నిధులను ఇస్తాం. రోడ్లు, కమ్యూనికేషన్ వ్యవస్థను పటిష్టం చేయాలంటూ, పోలీసులకు మానవ హక్కుల ఉల్లంఘనలపై క్లీన్‌చిట్ ఇచ్చారు. ఆదివాసీ మహిళలపై అత్యాచారాలు, బూటకపు ఎన్‌కౌంటర్లలో సాధారణ ప్రజలను క్రూరంగా హత్యలు చేయడానికి వెనుకాడవద్దని హితవు పలికివెళ్లాడు. అందుకే బస్తర్ ప్రజలపై క్రూరమైన హింస, అత్యాచారాలకు పాల్పడుతూ – మావోయిస్టు ఉద్యమాన్ని అణచడం – అంతరంగిక భద్రతలో మొదటి ప్రియారిటీ ఇస్తూ అర్ధసైనిక బలగాల మోహరింపు.

దేశవ్యాప్తంగా మోదీ ప్రభుత్వం బ్రాహ్మణీయ హిందూ ఫాసిజాన్ని ప్రజలు, ప్రజాస్వామికవాదులు, అల్పసంఖ్యాక ప్రజలు, కార్మికులు, మహిళలు ఖండిస్తున్నారు. కాని ప్రభుత్వం తన కిరాయి సాయుధ బలగాలతో ప్రజా ఉద్యమాన్ని అణచివేస్తున్నది. అడవి, భూమి, నీరు, ఖనిజాలపై హక్కులు కావాలి అంటూ, ఆత్మగౌరవంతో బతుకుతాం, మా అభివృద్ధిని మేమే చేసుకుంటాం అంటూ, ప్రత్యామ్నాయంగా గ్రామ గ్రామంలో జనతన సర్కార్ ఏర్పరుచుకుంటూ, కార్పొరేట్ సంస్థల అభివృద్ధి మోడల్‌ను పర్యావరణ విధ్వంసాన్ని తిరస్కరిస్తూ, ప్రజా అభివృద్ధి మోడల్‌ను ముందుకు తీసుకెళ్తూ – మా భూముల నుండి, మా ఇళ్ల మీద, మా పూర్వీకులున్న నేల, అడవుల నుండి నిర్వాసితులను చేసే ప్రభుత్వ పథకాలను తీవ్రంగా వ్యతిరేకిస్తూ, ప్రజలు మావోయిస్టు పార్టీ నాయకత్వంలో పోరాడుతున్నారు. అనూహ్యమైన త్యాగాలతో నిర్మిస్తున్న ప్రజా యుద్ధపు దారిలో ప్రయాణించడానికి స్ఫూర్తినిస్తున్నారు. తమ హక్కులకై పోరాడుతున్న జెఎన్‌యు విద్యార్థులు – 'వి స్టాండ్ విత్ బస్తర్ ఆదివాసీస్' అంటున్నారు. అంటే మేము బస్తర్ ఆదివాసుల పక్షాన నిలబడుతున్నామని చెబుతూ – యువలోకానికి దేశంలో సామ్రాజ్యవాదుల, దళారీ బ్రాహ్మణీయ హిందూ ఫాసిస్టు పాలకులతో పోరాడాలని, బారికేడ్లు నిర్మించాలని, భగత్‌సింగ్ మరో ఆజాదీ కోసం పోరాడాలని పిలుపునిస్తున్నారు.

దేశంలో పీడిత ప్రజలకు, కార్మికులకు, విద్యార్థులకు, యువతకు దండకారణ్య విప్లవోద్యమం స్ఫూరిస్తున్నది. ఈ ఉద్యమాన్ని అణచడానికి ప్రభుత్వ సాయుధ బలగాలు నిరంతరం దాడిచేస్తున్నాయి. మిషన్–2016 పేరుతో జనవరి నుండి మే 20 వరకు బస్తర్‌లోని 7 జిల్లాలు, మహారాష్ట్రలోని గడిచిరోలిలో 65 మంది సామాన్య ప్రజలను విప్లవ కార్యకర్తలను ఎన్‌కౌంటర్ల పేరుతో క్రూరంగా హత్య చేసింది. వీరిలో 20 మంది మహిళలున్నారు. వారిలో కొందరిపై పోలీసులు సామూహిక అత్యాచారం జరిపి హత్యచేశారు. 45 మంది మహిళలపై అత్యాచారాలకు పాల్పడ్డారు. తప్పుడు కేసులు బెట్టి జైళ్లలో బంధిస్తున్నారు. బెదిరించి సామూహిక సరెండ్లు చేయిస్తున్నారు.

గత ఏప్రిల్ నెలలో సుక్మా జిల్లా దోర్నపాల్‌లో పోలీసు అధికారుల ద్వారా సరెండర్ చూపించిన 76 మంది నక్సలైట్ల గురించి సుక్మా జిల్లా సిజెఎం ప్రభాకర్‌గ్వాల్ – సరెండర్ చూపించిన నక్సలైట్ల నేర రికార్డు

# ఒక ప్రేక్షకుడి మదిలోని కొన్ని ప్రశ్నలు

*సమాన అభివృద్ధి కోసం జరిగే పోరాటాలు వర్గ ఘర్షణ రూపం తీసుకుంటాయనీ, అసమాన అభివృద్ధిని కోరుకునే పోరాటాలు కుల, మత, ప్రాంత, భాష, జాతి ఘర్షణల రూపాలు తీసుకుంటాయనీ అంటున్నారు* **కె. సురేష్**

పెట్టుబడిదారీ విధానమే అసమానతలకు, ఆధిపత్య భావజాలానికి మూలం. అయితే అసలు కారణాన్ని కాక సమస్యకు మరేదో కారణాన్ని చూపినంత కాలం పెట్టుబడిదారీ వర్గాలకు ఎల్లప్పుడూ సంతోషమే. హిందూత్వకు ఇస్లాం మతం బూచి, జర్మన్ ఆర్యులకు యూదుల బూచి, అమెరికన్లకు కమ్యునిస్టుల బూచి... ఏదైనా ఒక సమూహం ఐకమత్యంగా ఉండాలంటే బయటనుంచి భయపెట్టే ఒక బూచి ఉండాలంట. అందుకే జాతి దేశాలను ఐకమత్యంగా ఉంచే విదేశీ బూచిని పాలక వర్గాలు ఎల్లప్పుడూ కాపాడుకుంటూనే ఉంటాయి. ప్రపంచ ప్రజలందరూ ఏకమయ్యి జాతీయతావాదం వెనక్కి వెళ్లటం దోపిడీ వర్గాలకు నచ్చదు.

భారతదేశ స్వాతంత్ర పోరాటం అప్పుడు, స్వతంత్రం వచ్చినప్పుడు తెల్లదొరలు పోయి నల్ల దొరలు రావటం మాత్రమేనని, ఇది అధికార బదిలీ తప్ప నిజమైన స్వతంత్రం కాదని కొన్ని వర్గాలు విశ్లేషించాయి. స్వయం ప్రతిపత్తిని కోరుకునే జాతీయ బూర్జువా వర్గమే లేదనీ, ఉన్నది దళారీ బూర్జువా వర్గమేనని అన్నారు. ప్రత్యక్ష వలసపాలనతో ఇక అవసరం లేదని, పరోక్షంగా ఆర్థిక దోపిడీ కొనసాగించవచ్చన్న నిర్ణయానికి వచ్చిన తరువాతే మన దేశానికి స్వాతంత్రం ఇవ్వడానికి బ్రిటిష్ పాలకులు సన్నద్ధమయ్యారని చెబుతారు. ఈ అంశాలన్నిటినీ తరిమెళ్ల నాగిరెడ్డి తన 'తాకట్టులో భారతదేశం' పుస్తకంలో చక్కగా వివరించారు. ఆ పరిస్థితుల్లో ఈనాటికి కూడా మౌలికంగా మార్పు రాలేదు.

తెలంగాణ ప్రాంతంలోని వనరులు, ఉద్యోగాలు, భాష, సంస్కృతులపై ఆంధ్ర ప్రాంతపు ఆధిపత్యం, దోపిడీ ఉన్నమాట వాస్తవం. నైజాంలోని ప్రస్తుత తెలంగాణ జిల్లాలను ఆంధ్రలో కలపటాన్ని ప్రజలు వ్యతిరేకించడమూ, తెలంగాణ రాష్ట్ర ఆకాంక్ష సాధారణ ప్రజలలోనూ సుదీర్ఘ కాలంగా ఉండడమూ వాస్తవం. తెలంగాణ ఉద్యమ మలి దశలో రాజకీయ పార్టీగా ముందుకొచ్చిన తెలంగాణ రాష్ట్ర సమితికి తప్ప మరొక మార్గం ద్వారా తెలంగాణ రాష్ట్రం సాధ్యం కాని విషయమూ, ఆ ఆకాంక్ష ఉన్న అందరూ అనివార్యంగా టిఆర్ఎస్‌కి మద్దతునివ్వక తప్పని పరిస్థితి కూడా వాస్తవమే.

ఒక ప్రాంత ప్రజలు సొంతరాష్ట్రం కావాలనుకోవటాన్ని నేను సమర్థిస్తాను. కానీ దోపిడీ, ఆధిపత్య వర్గాలు బయటవాళ్లలో తప్ప ఆ ప్రాంతంలో లేవనుకోవటం నాకు అర్థం కాలేదు. భౌగోళిక తెలంగాణ నుంచి సామాజిక, ప్రజాస్వామిక తెలంగాణ అంటూ జరిగిన చర్చలు నాలో అనేక ప్రశ్నలు లేవనెత్తాయి. వివిధ బూర్జువా పార్టీల గురించి, పార్లమెంటరీ కమ్యూనిస్టు పార్టీల స్వభావం, పరిమితుల గురించి అందరికీ

---

అడిగాడు. పోలీసు అధికారులు సరెండర్ అయిన వారిపై నేరం నమోదు రికార్డు చూపించలేకపోయారు. దీనితో సిజెఎం ప్రభాకర్‌గ్వాల్ సాధారణ ప్రజలను సంతలలో, ఇళ్లలలో, గ్రామాలలో పట్టుకొచ్చి – నక్సలైట్లు అని చూపిస్తున్నారు. ఇది పోలీసులు చేస్తున్న చట్టవ్యతిరేక చర్య అంటూ పోలీసులు చేసే చట్టాల ఉల్లంఘనలో చేతులు కలపడానికి నిరాకరించాడు. దీనితో దళితుడైన సిజెఎంను – బ్రాహ్మణీయ రమణ్‌సింగ్ సర్కార్ కోపానికి గురికావలిసి వచ్చింది. అతన్ని పదవి నుండి తొలగించారు. అంటే న్యాయవ్యవస్థలో సిజెఎం కూడా పోలీసు విభాగం చేస్తున్న రాజ్యాంగపర చట్టాల ఉల్లంఘనల గురించి మాట్లాడితేనే రమణ్‌సింగ్ ప్రభుత్వం కోపానికి గురయ్యాడంటే – బస్తర్‌లో ప్రజాస్వామిక హక్కుల పరిస్థితిని అర్థం చేసుకోవచ్చు.

పోలీసులు సామాన్య ప్రజలను నిత్యం ఎన్‌కౌంటర్ల పేర హత్యలు చేయడం కొనసాగిస్తున్నారు. ఏప్రిల్ 18న బస్తర్ జిల్లా కోలేంగ్ సంతలో కుంజం కోసా అనే రైతును పట్టుకొని హత్యచేశారు. ఏప్రిల్ 23న సుక్మా జిల్లా కిష్టారం ఠానా పరిధిలోని కుమ్మోడ్‌లోహ్‌కు చెందిన సోడిపాండు అనే 50 సంవత్సరాల రైతును పట్టుకొని కాల్చి చంపారు. మే 7న దంతెవాడ జిల్లా ముర్జం గ్రామం వద్ద పొడియం విజ్జ, మడ్కం మాష్లా అనే యువకులను కాల్చిచంపారు. మే 10న సుక్మా జిల్లా మరయిగూడ దగ్గర కన్నయిగూడకు చెందిన రైతు – ఐదుగురు పిల్లల తండ్రి అయిన పొడియం దేవ ఉదయం తునికాకు కోయడానికి అడవికి వెళ్లాడు. గస్తీకి వెళ్లిన సాయుధులు ఇతన్ని పట్టుకున్నారు. ఇతనితో పాటు తాతిశుక్క అనే మరో రైతును పట్టుకొని కాల్చిచంపి ఎన్‌కౌంటర్‌లో ఇద్దరు డ్రెస్సులు వేసుకున్న నక్సలైట్లు చనిపోయారని ప్రకటించారు.

దండకారణ్య ప్రజలపై మిషన్–2016 పేరుతో మోదీ – రమణ్‌సింగ్ –చంద్రశేఖర్‌రావ – దేవేంద్ర ఫడ్నవీస్ – నవీన్ పట్నాయక్ – చంద్రబాబు నాయుడు సంయుక్తంగా చేస్తున్న నిర్బంధాన్ని, క్రూరమైన దాడులను, హత్యలను, పౌరహక్కుల ఉల్లంఘనను తీవ్రంగా ఖండిస్తూ ఉద్యమించ వలసిన అవసరముంది. పౌరహక్కులను ఉల్లంఘిస్తూ, మహిళలపై అత్యాచారాలకు పాల్పడిన ప్రభుత్వ సాయుధ బలాగల జవాన్లపై, అధికారులపై క్రిమినల్ కేసులు నమోదు చేయాలి. పదవి నుండి తొలగించాలి. బస్తర్ ప్రజలపై కేంద్ర ప్రభుత్వం తలపెట్టిన ఎయిర్ బాంబింగ్ నిర్ణయాన్ని వెనక్కు తీసుకోవాలి. బస్తర్ నుండి కేంద్ర అర్ధసైనిక బలగాలను వెనక్కు పంపాలి. డిఆర్‌జి, కోబ్రా, గ్రేహౌండ్స్, ఎస్ఒజి, సి–60 కమాండో లాంటి ప్రజలను హత్యచేసే ప్రత్యేక బలగాలను రద్దుచేయాలి – అనే ప్రజాస్వామిక డిమాండ్లతో, బస్తర్ ప్రజలపై సాక్ష్యం లేని, అన్యాయమైన యుద్ధాన్ని, ప్రజలందరూ ముక్తకంఠంతో నిరసించాలి. సంఘీభావ ఉద్యమాలు, మిలిటెంట్ ప్రజా ఉద్యమాలు కొనసాగించాలి.

*(రచయిత ఆదివాసి కార్యకర్త)* వీ

తెలుసు. అవి అలానే ప్రవర్తిస్తాయి. పార్లమెంటరీ పంథా బయట ఉన్నామనే వాళ్ల గురించే నా ప్రశ్నలు. ఈ నా ప్రశ్నలు ఒక క్రమపద్ధతిలో, లాజికల్‌గా ఉన్నాయని నేను అనుకోవటం లేదు. కాని కొంత కాలంగా నా మనస్సుని తొలుస్తున్న ప్రశ్నలను కాగితం మీద ఉంచుతున్నాను.

అరుంధతీ రాయ్ తన వ్యాసాలలో చాలా విస్పష్టంగా ఒక అంశాన్ని పేర్కొన్నారు – ప్రస్తుత పరిస్థితులలో పేద ప్రజల పక్షాన ఉన్నది మావోయిస్టులు ఒక్కరే, అందుకే నేను వాళ్ల తరఫున ఉన్నాను అని, ఒకవేళ వీళ్లు అధికారంలోకి వచ్చి ప్రజా వ్యతిరేక పనులు చేపడితే వాళ్లను వ్యతిరేకించే వాళ్లల్లో నేను మొదటిదానిగా ఉంటాను అని. అలాంటి స్పష్టత తెలంగాణ ఉద్యమ కాలంలో ఎవ్వరూ ఇవ్వలేదు. ఇవ్వాళ పదవులు పొందిన వాళ్లు గమ్మున ఉన్నారు, వాటిని ఆశిస్తున్న వాళ్లు ఇంకా పొగుడుతూనే ఉన్నారు, ఏ లబ్ధి లేదని నిర్ధారించుకున్న వాళ్లు మాత్రమే విమర్శలకు దిగుతున్నారు అని నాకు అనిపిస్తోంది.

నాదెండ్ల భాస్కరరావు విషయంలో పౌరహక్కుల సంఘాలు ఉద్యమంలో పాల్గొన్నాయంటే ఎన్‌టి రామారావుని సమర్థించాయని కాదు. అక్కడ వ్యక్తులు కాదు, ప్రజాస్వామ్యం అనే అంశం ముఖ్యమైనది. విశాల ప్రజాస్వామిక ఉద్యమాలలో భాగమవుతూ ప్రజలను చైతన్యపరుస్తూ, సంఘటిత పరుస్తూ ఉద్యమాలు ముందుకు వెళ్లాలి. అయితే మనం ఎవరితో, ఎందుకు కలుస్తున్నామో స్పష్టత లేకపోతే మనం బలపడటం కాకుండా ఎదుటివాళ్లు బలపడతారు. పార్లమెంటరీ వామపక్షాలు ఎన్నికలలో వివిధ బూర్జువా రాజకీయ పార్టీలతో పొత్తు కుదుర్చుకున్న తీరు ఇదే విధంగా, ఆత్మహత్యా సదృశ్యంగా ఉంటూ వస్తోంది.

తెలంగాణ సాయుధ పోరాట వారసత్వాన్ని ఒక్క తెలంగాణకే పరిమితం చేస్తూ, రాష్ట్ర సాధన ఉద్యమంతో జమకట్టడం నన్ను బాధించింది. ఒక్క తెలంగాణకే కాదు, భారతదేశానికే కాదు (అబ్ తెలంగాణ జీ రహేహై లోగ్ మేరే గావ్ కే) సమస్త పీడిత, తాడిత ప్రజానీకానికి తెలంగాణ సాయుధ పోరాటం దారి చూపాల్సి ఉంది. కానీ దానిని ఒక పరిమిత ఉద్యమం అప్రాప్రియేట్ చేసుకోడానికి ప్రయత్నించి, కొంతవరకు సఫలమయ్యింది.

ప్రజాస్వామిక, సామాజిక తెలంగాణ కావాలంటున్నప్పుడు సామాజిక ఆంధ్రప్రదేశ్, భారతదేశం, ప్రపంచం మాటేమిటని నాకు చాలాసార్లు అనిపించింది. ప్రజాస్వామిక, సామాజిక సమాజాలను నిర్మించుకోడానికి అక్కడ ఉన్న పీడిత ప్రజలను, వాళ్ల పక్షాన ఉన్న ప్రజలను కలుపుకో వలసిన అవసరం లేదా అని అనుకునేవాడిని.

సొంత రాజ్యాంగం ఉండి, 'సర్వసత్తాక' దేశం ఏర్పడుతున్నప్పుడు లేని ఆశలు ఆ ఫెడరల్ రాజ్యంలో కొత్తగా ఏర్పడే రాష్ట్రంపై ఎట్లా పెట్టుకుంటున్నారని అనిపించేది.

తెలంగాణ రాష్ట్రం ఏర్పడితే నా భాష మరో పది సంవత్సరాలు ఖచ్చితంగా బతుకుతుందని ఒక మిత్రుడు చెప్పాడు. అది నిజమే. ఆంధ్రుల ఆధిపత్యం తొలగిపోవటంతో తెలంగాణ భాషలో హాయిగా, చక్కగా ఇప్పుడు ఎంతోమంది మాట్లాడుతున్నారు, రాస్తున్నారు. అయితే ప్రజల సంస్కృతి అంటే ఏమిటి, అందుకు ప్రజలు ఏం చెయ్యాలి, ప్రభుత్వాలు ఏమి చెయ్యాలి అనేదానిపై నాకు ఎన్నో సందేహాలు ఉన్నాయి. నేను (భారతీయుడిగా) హిందూమతంలో, ఆంధ్రా ప్రాంతంలో, కమ్మకులంలో (మగవాడిగా) పుట్టాను. నేను కాదనుకుంటే ఈ అస్తిత్వాలు అంత తేలికగా పోయేవి కావు. కానీ ఆ సంస్కృతులేవీ నావని అనుకోలేదు. నేను ప్రచండ....? జాతీయవాదిని కాదు కాబట్టి ఆ సంబరాలు నావని అనుకోలేదు. నేను నాస్తికుడిని కాబట్టి నేను పుట్టిన మతంలోని పండగలు నా సంస్కృతి అని నేననుకోలేదు. నేను పెట్టుబడిదారీ విధానాన్ని సమర్థించడంలేదు కాబట్టి పుట్టినరోజు పండగలు వంటివి నా సంస్కృతి అనుకోలేదు. అటు పాతదానిని ఆచరించలేక, ప్రస్తుత వాటిని ఆమోదించలేక నేను ఒక శూన్యంలో ఉన్నాను. జీవితాలలో సంబరాలకు, సాంప్రదాయాలకు, రిచ్యువల్స్‌కి కూడా ముఖ్యమైన స్థానం ఉందని నాకు తెలుసు. కానీ నిజమైన ప్రజల సంస్కృతి, శ్రామిక సంస్కృతి అంటే ఏమిటి అని ఎదురు చూస్తూ ఉన్నాను. ఒకప్పుడు శ్రామిక వర్గానికి చెందని మార్క్సిస్టులు 'డీక్లాసిఫై' అవ్వాలని అనేవాళ్లు. ఇప్పుడు ఆ మాటే లేదు. ఆ అంతర్గత ఘర్షణలు, వైఫల్యాలు, విషాదాలు లేవు.

పార్లమెంటరీ వామపక్ష పార్టీలతో సహా ఏ రాజకీయ పార్టీ అయినా ప్రస్తుతం పెట్టుబడిదారీ విధానాన్ని, సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకించే స్థితిలో లేదు. అధికారంలోకి రావటానికి ఈ పార్టీలు ఏ నినాదాలు ఇచ్చినా అంతిమంగా పాలక వర్గాలకు అనుకూలంగానే (ప్రజలకు వ్యతిరేకంగానే) పని చేస్తాయని మనకు తెలియదా, అనుభవంలోకి మళ్లీ మళ్లీ రాలేదా?

సాపేక్షికంగానైనా ఏ బూర్జువా పార్టీ గొప్పదో, ఏ నాయకుడు గొప్పవాడో చర్చించాల్సిన అవసరం నాకు లేదు. ఆ పార్టీలు, ఆ నాయకులలో ఎవరు అధికారంలో ఉన్నా జరిగేది సామ్రాజ్యవాదానికి ఊడిగమే కదా? పార్టీల అండ ఉన్న ఏ సామాజిక వర్గం లబ్ధి పొందుతుంది అన్నది ఒక్కటే మారుతుంది. ప్రభుత్వాలను ప్రజలు ఎన్నుకోవటమనే ఒక తంతు ఉన్నప్పటికీ ఏ పార్టీ తన ప్రయోజనాలను మెరుగ్గా తీరుస్తుందో దానికి అధికారం సాధించే సత్తా సామ్రాజ్యవాద వర్గానికి ఉంది. ఒకసారి ఒక చర్చలో చంద్రబాబు వల్ల సాధ్యం కాని 'సంస్కరణలు' వైఎస్ఆర్ తెలివిగా సాధించాడని నేనంటే ఒక పార్లమెంటరీ వామపక్ష కార్యకర్త ఇది ఒకరి వైఫల్యం, మరొకరి విజయం కాదు, ఇద్దరి వెనకా ఉన్నది సామ్రాజ్యవాద మేధోవర్గమే అని చెప్పాడు. ఒక వ్యూహం పని చేయనప్పుడు మరొక వ్యూహాన్ని వాళ్లు రూపొందించారట. చంద్రబాబు చేపట్టిన ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా ప్రజల్ని సమీకరించ గలిగాం కానీ వైఎస్ఆర్ చేపట్టిన ప్రజాదరణ పథకాల నేపథ్యంలో ప్రజల్ని సమీకరించలేకపోతున్నాం అని కూడా ఆ కార్యకర్త అన్నాడు. మారిన పరిస్థితుల్లో కొత్త వ్యూహాన్ని రచించే వామపక్ష మేధోవర్గం ఎందుకు లేకుండా పోయిందని నాకు అనిపించింది.

పురుషాధిపత్యాన్ని వ్యతిరేకిస్తున్న క్రమంలో పురుషులు చేసిన, చేస్తున్న తప్పుడు పనులు చేయడమే స్త్రీ విముక్తికి సంకేతం అని కొంతమంది మహిళలు భావించారు. దోపిడీవర్గానికి వ్యతిరేకంగా పోరాడుతున్న క్రమం లో పీడితవర్గం తమతోపాటు దోపిడీవర్గాన్ని కూడా విముక్తి చేయాలని పాలో ఫ్రేరీ అంటాడు. దోపిడీవర్గం తనను తాను విముక్తం చేసుకోలేదు. ఆ విధంగా అభిజాత్య, ఆధిపత్య ధోరణులు కనబరిచే వ్యక్తులను కూడా వాటి నుంచి వాటికి గురైన ప్రజలే విముక్తం చెయ్యాలి. అయితే అభిజాత్య, ఆధిపత్య ధోరణులకు ఉన్న సమ్మతం, ప్రభావాల కారణంగా కిందివర్గాలు పైకి వచ్చినప్పుడు వాటిని వ్యతిరేకించడానికి బదులు వాటినే

అందిపుచ్చుకుని, వాటినే ప్రదర్శించే ప్రమాదం ఉంది. ఇటువంటి వాటిపట్ల సచేతనంగా ఉండడం గానీ, మొత్తంగా అభిజాత్య ధోరణులకు వ్యతిరేకంగా నిలబడడంగానీ తెలంగాణ రాష్ట్ర ఉద్యమం చెయ్యలేదు.

రెండువైపులా పెత్తందారీ బూర్జువా పార్టీలు ప్రజల్లో ఉద్వేగాలను రేపాయి, లేని భయాలను పురిగొల్పాయి, లేని ఆశలను కల్పించాయి.

ఆంధ్ర దోపిడీదారులు తమ ప్రాంత వనరులను, ప్రజలను దోచుకోరా, అక్కడి దళితుల, బడుగు వర్గాల పై అభిజాత్యం ప్రదర్శించరా, వారి భాషా, సంస్కృతులను అవహేళన చెయ్యరా అని నాకు అనిపించేది. నేను బడిలో చదువుకునే రోజులలో దళితులను వాళ్లు ఆ మాటను పలికేదాన్నిబట్టి 'ముప్పియ్యారుగాళ్లు' అనేవాళ్లని నాకు తెలుసు.

అంతకంటే ముఖ్యమైన ప్రశ్న ఆంధ్ర పెట్టుబడిదారులు కూడా దళారీలే కదా? వాళ్లు కూడా ఎవరి మోచేతి నీళ్లో తాగుతున్న వాళ్లే కదా? తెలుగు కూడా ఇంగ్లిష్ ఆధిపత్యం కింద నలిగిపోతోంది కదా? తెలంగాణ పెట్టుబడిదారుల కంటే ఆంధ్ర పెట్టుబడిదారులు, తెలంగాణ భాష కంటే ఆంధ్ర తెలుగూ నిచ్చెనమెట్ల అంతరాల్లో ఒక మెట్టుపైన ఉన్నాయనడంలో నాకు సందేహం లేదు.

నిచ్చెనమెట్ల అంతరాల్లో ఎవరు పైన, ఎవరు కింద ఉంటారన్నదే సమస్య అయితే నాకు ఎటువంటి ప్రశ్నలు లేవు.

భౌగోళిక తెలంగాణ నాలుగు అడుగుల ప్రయాణం, మేం సామాజిక తెలంగాణ కోసం మరో అయిదు అడుగులు వెయ్యాలి అన్నప్పుడే నాకు ప్రశ్నలు. నాలుగు అడుగుల దూరం ప్రయాణం చేసే క్రమంలో మరో అయిదు అడుగులు కలిసి వచ్చే వాళ్లని దూరం చేసుకోకూడదు గదా?

నిచ్చెనమెట్ల సమాజాన్ని కాకుండా సమసమాజాన్ని ఎలా నెలకొల్పుతాం? సోవియట్ రష్యా ప్రయోగం లాగానే ఆ దేశ పతనంతో ముక్కలు, చెక్కలు అయిపోయినప్పుడు జాతుల మధ్య సామరస్యత ప్రయోగం కూడా విఫలమైన నేపథ్యంలో దీనిని ఎలా నెలకొల్పుతాం? ఇవి మన ముందు ఉండాల్సిన ప్రశ్నలు అని నాకు అనిపిస్తుంది.

కొన్ని దశాబ్దాల క్రితం మధ్యతరగతి ప్రజలు సామాజిక మార్పును పునాదుల్లో మార్పుల ద్వారా సమసమాజం నుంచి కోరుకున్నారు. ఇవ్వాళ మధ్యతరగతి కేవలం ఉపరితలంలో మార్పులను కోరుకుంటోంది. అందరూ ఓటు వెయ్యాలని, నోటుకు ఆశపడకుండా ఓటు వెయ్యాలని ప్రచారం చేస్తోంది. అవినీతి వ్యతిరేక ఉద్యమం ద్వారా, సుపరిపాలన ద్వారా మార్పును సాధించవచ్చని ఈ వర్గం నమ్ముతోంది. ఇప్పటి మధ్యతరగతి అంతకు ముందుకంటే ఎంతో ఎక్కువ జీతాలను చూస్తోంది, ఎంతో వస్తు సంపదను, వినియోగదారీ సంస్కృతినీ చూస్తోంది. గత మధ్యతరగతి వ్యక్తులు జీవితాలను త్యాగం చేస్తూ కమ్యూనిస్టు ఉద్యమాల వైపు నిలబడితే ఇప్పటి మధ్యతరగతి తమకు ఇబ్బందికరం కాని రీతిలో సంస్కరణ ఉద్యమాలు చేపడుతూ 'మేము సైతం...' అంటూ సంతృప్తి చెందుతోంది. ఒక ఆదర్శ, ప్రగతిశీల మధ్యతరగతి లేని నేపథ్యంలో మన ముందున్న సమస్యలు మరింత జటిలంగా మారతాయి.

తెరాస ఉద్యమ పార్టీ అని, అది ఉద్యమ, ప్రజల ఆకాంక్షలను తీరుస్తుందని చాలామంది ఆశలు పెట్టుకున్నారు. దీనికి ఆధారం ఏమిటో నాకు ఏనాడూ అర్థం కాలేదు. అంతకుముందు ప్రత్యేక రాష్ట్ర ఉద్యమాలతో రాష్ట్రాన్ని సాధించి అధికారంలోకి వచ్చిన అస్సాం గణ పరిషత్‌నీ, జార్ఖండ్ ముక్తి మోర్చాని, వాటి అనుభవాలను విస్మరించి తెరాసకి ప్రత్యేకతని ఆపాదించుకుని, ఎన్నో ఆశలు పెట్టుకుని, ఇప్పుడు 'అయ్యో' అంటున్న వాళ్లను చూస్తున్నాను.రాజ్యహింస వంటి విషయాలను పక్కన పెట్టి అవినీతి గురించి ఇక్కడ కొంత చర్చిస్తాను.

తెలంగాణ ఏర్పడితే అవినీతి లేకుండా ఉంటుందా? ఉంటుందని సాధారణ ప్రజలు అనుకుని ఉండవచ్చు. బూర్జువా మేధావులు ఆశించి ఉండవచ్చు. కానీ విప్లవ మేధావులు ఎలా అనుకుంటారు, ఎలా ఆశిస్తారు? తెలంగాణ రాష్ట్రం ఏర్పడడంతోనే అన్ని ప్రజా సమస్యలు పరిష్కారమవుతాయని ఎలా అనుకుంటారు?

అవినీతి ఆరోపణలకు రాజకీయ నాయకులు 'నిరూపిస్తే రాజకీయంగా సన్యసిస్తా' అంటూ ప్రతిజ్ఞలు చేస్తూ ఉంటారు. అవినీతి జరుగుతోందని అందరికీ తెలుసు, కానీ దానిని నిరూపించడం కూడా సాధ్యం కాదని తెలుసు. అధికారంలో ఉన్న పార్టీలు తమకి దూరమైనవాళ్లపైనా, తమను వ్యతిరేకించేవాళ్లపైనా ఈ ఆరోపణలను ఆయుధంగా వాడుకుంటూ ఉంటారు. ఈ నేపథ్యంలో రెండు తెలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులు 'అవినీతి ఎక్కడ ఉన్నా సహించేది లేదని' పత్రికల్లో గర్జిస్తుంటే నవ్వు వస్తుంది.

అవినీతి నుంచి తెరాస పార్టీని, నాయకులను ఉద్యమ సమయంలో కూడా వేరుగా నిలిపిన ఘటనలు ఏమీ లేవు. ఇప్పుడు అంతకన్నా లేవు. కానీ స్వయంగా ముఖ్యమంత్రి గారే తెలంగాణలో ఇంకా అవినీతి ఉండడమేమిటని ఆశ్చర్యపోతున్నారు.

అవినీతి లేకుండా ఇవ్వాళ ఏదీ నడవడం లేదు.

నేను ప్రభుత్వంలో కొంత కాలం పనిచేశాను. లంచం తీసుకోకుండా ఉండగలమేమో కానీ ప్రభుత్వ పనులకు, ప్రభుత్వోద్యోగిగా నా వ్యక్తిగత పనులకు లంచం ఇవ్వకుండా పనులు జరగవని నాకు అర్థమయ్యింది.

నేను కొంత కాలం పత్రికా రంగంలో ఉన్నాను. కొంత కాలం స్వచ్ఛంద సంస్థలలో కూడా పనిచేశాను. అనేక రకాల చిన్నా, పెద్దా ప్రజా సంస్థలనీ, అపార్ట్‌మెంట్/ కాలనీ సంక్షేమ సంఘాలను కూడా చూశాను. ఎక్కడా కూడా అవినీతి లేకుండా లేదు, ఎక్కడా నాకు 'పారదర్శకత', 'జవాబుదారీతనం' కనిపించలేదు. ఎక్కడికక్కడ అందినకాడికి దండుకుందామనే సంస్కృతే.

నిచ్చెనమెట్ల సమాజంలో దోపిడీ, హింస ఉంది. కానీ దానిని బలంగా నిలుపుతున్న భావజాలం ఉంది. నేను ఒకడికంటే కింద ఉండవచ్చు కానీ ఇంకొకడి కంటే పైన ఉన్నానన్న భావన కావచ్చు (అట్టడుగున ఉన్న వ్యక్తిని తప్పించి), లేదు 'సొంత ప్రతిభ', 'సామర్థ్యాలు' ఉంటే, లేదా 'అదృష్టం' కలిసి వస్తే బాగా పైకి ఎదగవచ్చు అన్న ఆశ కావచ్చు. ఏదీ కాకపోతే 'కర్మ' అని రాజీపడడం కావచ్చు. దీనిని ప్రశ్నించే సంస్కృతి ఇంకా మనకు అలవడలేదు. సమసమాజానికి అవసరమైన బలమైన భావజాలం ఇంకా ఏర్పడలేదు, ప్రజలలో ప్రచారం కాలేదు. అభివృద్ధి అంటే ఏమిటి అన్న దానిపై జరగాల్సినంత చర్చ జరగడంలేదు. ప్రజాస్వామ్యం, ప్రజాస్వామిక చర్చ, ప్రజాస్వామికంగా నిర్ణయాలు తీసుకునే పద్ధతులు కనీసం కొన్నిచోట్ల అయినా ఆచరణలో కనపడడం లేదు. ఇదంతా నా 'పెస్సిమిజం' కావచ్చు. కానీ సరైన ప్రశ్నలు వెయ్యడం కూడా మనం ఇంకా నేర్చుకోలేదని, సరైన సమాధానాలకు ఇంకా చాలా దూరంలో ఉన్నామని అనిపిస్తోంది.

*(రచయిత 'మంచి పుస్తకం' ప్రచురణకర్త)* వీ

# తాత్విక ఆయుధాలు అత్యవసరం

***హిందూ సామ్రాజ్యవాదాన్ని ఓడించడానికి తాత్విక ఆయుధాలు కావాలని, మార్క్స్ చెప్పిన గతితార్కిక భౌతిక వాదాన్నీ, అంబేద్కర్ రచనలనూ అధ్యయనం చేయాలనీ అంటున్నారు* డా. కత్తి పద్మారావు**

నరేంద్రమోడీ ప్రధానమంత్రి అయ్యాక ఆర్.ఎస్.ఎస్. విశ్వ హిందూ పరిషత్, ఎబివిపిల హింసాత్మక కార్యకలాపాలు విజృంభించాయి. అయితే భారతదేశ స్వాంతంత్ర్యానికి ముందు నుంచే వీరు ఈ కార్యకలాపాలను కొనసాగించడమే కాక, చరిత్ర నిర్మాణంలో కూడా హిందూ ముస్లిం వైరుధ్యాలను జొప్పించిన వైనాన్ని మనం అవగాహన చేసుకోవాల్సిన అవసరం ఉంది. నిజానికి భారతదేశంలో హిందూ మతోన్మాదాన్ని పెంపొందించడంలో ఆర్ఎస్ఎస్ పాత్ర గణనీయమైంది. దాని కుతంత్ర పూరితమైన వ్యూహం నుండే 'రామజన్మభూమి – బాబ్రీ మసీద్' వివాదం కూడా పుట్టింది. ఆర్ఎస్ఎస్ శక్తుల మతోన్మాద చరిత్రను మనం అర్థం చేసుకుంటేగాని ఈ వివాద విషయం మనకు అవగతం కాదు.

బ్రాహ్మణ మతం ఒక కాలకూట విషనాగు. అది వర్ణవ్యవస్థను పెంచి పోషించింది. కుల విద్వేషాలు రేపింది, అస్పృశ్యతా మారణ హోమాన్ని ఆచరించింది. ఈ బ్రాహ్మణ్య నియంతృత్వాన్ని అమానుషత్వాన్ని భరించలేక దళిత బలహీన వర్గాల ప్రజలు సిక్కు, ఇస్లాం, క్రైస్తవ మతాలను స్వీకరించారు. ఆర్ఎస్ఎస్ దళిత బలహీన వర్గాలను అణగదొక్కడమే కాక వారు స్వీకరించిన మైనారిటీ మతాలను ద్వేషించడం, నిర్జించడం చేస్తూ వచ్చింది. భారతదేశంలో ఇదొక పెద్ద సంఘర్షణగా సాగుతూ వచ్చింది. మూడు దశాబ్దాల పాటు రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ (ఆర్ఎస్ఎస్) నాయకుడిగా ఉన్న ఎం.ఎస్. గోల్వాల్కర్ 1939లో రాసిన 'మనం' అనే పుస్తకంలో ముస్లింలను ఉటంకిస్తూ "ఖూనీకోర్లు, దోపిడీ దొంగలు, బందిపోటు దొంగలు, శత్రువులు, నాశనం చేయాల్సిన శక్తులు, దండయాత్రలు చేసిన విరోధులు, మన ఘోరమైన పాత శత్రువులు" వంటి మాటలు వాడడం జరిగింది. భారతీయులుగా ఉండి ఇతర మతం తీసుకున్నందుకు వారిని శత్రువులుగా చిత్రించడం జరిగింది. ఇస్లాం భారతీయం కాదు కాబట్టి ఇస్లాం స్వీకరించిన వాళ్లు కూడా భారతీయులు కాదనే వాదం లేవనెత్తారు.

ఈనాడు భారతీయ మతంగా చలామణి అవుతున్న హిందూమతం కూడా ఒకనాడు వలస వచ్చిన వైదికమత పరిణామ రూపమే. వైదిక మతాన్ని ప్రవచించిన ఆర్యులు భారతీయులు కాదని తిలక్ అంగీకరిస్తున్నాడు. అందువల్ల ఈనాడు హిందువులందరూ భారతీయులు కాదనడం యదార్థమవుతుందా? భారతీయ సంస్కృతిలో భారతీయ వాస్తవికత నుండి పుట్టిన బౌద్ధ మతం ప్రపంచంలో పెక్కు దేశాలకు వ్యాపించింది. వారందరూ భారతదేశం నుండి వలస వెళ్లినవారా? భారతీయులను విడదీసి పాలించే వలసవాదుల చరిత్రనే గుండెలకు పట్టించుకొని మత విద్వేషాన్ని ఇరుపక్షాలు పెంచుకుంటూ వచ్చాయి. భారతదేశ చరిత్రను హిందూ, ముస్లిం, బ్రిటిష్ యుగాలుగా వర్గీకరించిన ఘనత జేమ్స్‌మిల్‌కు దక్కగా తర్వాత ఇది ద్విజాతి సిద్ధాంతాన్ని సమర్థించడానికి ప్రధానాంశంగా ఉపయోగపడింది. ఈ స్ఫూర్తితో బయలుదేరిన జాతీయ ఉద్యమ నాయకులలో హిందూ ముస్లిం భేదం కొట్టొచ్చినట్లు కనపడేది. జాతీయ ఉద్యమంలో బలంగా చోటుచేసుకున్న ఈ వైషమ్యం దేశ విభజనకు దారితీసింది. భారతదేశంలో జాతీయ రాజకీయాలు ప్రారంభమైన నాటినుండి రాజకీయాలకు మతానికి అవినాభావ సంబంధం బలంగా పెనవేసుకుంది.

19వ శతాబ్దంలో భారత రాజకీయాల్లో మతవాదం చోటుచేసు కొనేసరికి మతాన్ని అన్వయించి రాయడం మొదలయింది. మధ్యయుగ భారత చరిత్రను మతవాదులు సుదీర్ఘమయిన హిందూ ముస్లిం సంఘర్షణగా చూస్తూ అనివార్యంగా అదే దృష్టిని 19, 20 శతాబ్దాలకు అన్వయిస్తూ జాతి వివక్షతా సిద్ధాంతానికి, రాజకీయాలకు ఈ ఆధునిక యుగంలో 'న్యాయం' చేయగలిగామనుకొంటున్నారు. మత వివక్షతా చరిత్రకారులు మధ్యయుగాల్లోని ముస్లిం పాలకుల పాలనను విదేశీయుల పాలనగా చిత్రీకరిస్తూ, భారత సమాజానికి ముస్లింలు శాశ్వతంగా విదేశీయులని చెప్పగలుగుతున్నారు. ఈ దారుణమైన భావం హిందూ, ముస్లిం వైషమ్యాలను పెంచడానికి మరింతగా తోడ్పడింది. మతాన్ని రాజకీయాలకు ఉపయోగించుకోవడమనే ప్రక్రియ భారతదేశం చీలికకు దారితీసింది. ఈనాటి అంతస్సంఘర్షణలకు కూడా బలంగా మూలమవుతుంది.

ఈ మత మౌఢ్యాన్ని ఆర్ఎస్ఎస్ నాయకులు చాలా తీవ్రంగా పెంచారు. కత్తులు, కర్రలతో కవాతులు నేర్పుతూ పసితనం నుండి ఉగ్గుపాలతో క్రైస్తవ, ఇస్లాం మతాలపై ద్వేషాన్ని రంగరించి పోశారు. 'పాంచజన్యం'లో గోల్వాల్కర్ ఈ పరమత ద్వేషానలాన్ని ఏ విధంగా రగిలించాడో, ముస్లింలంపై హిందువులను ఎలా ఉసిగొల్పుతున్నాడో చూడండి. "మనం నమ్మిన ప్రతిదాన్ని పూర్తిగా వ్యతిరేకించేటంత లోతుగా నాటుకుపోయింది వారి ద్వేషం. మన దేవాలయాల్లో పూజలు చేస్తే వారు వాటిని అపవిత్రం చేస్తారు. మనం భజనలు చేసినా రథోత్సవాలు జరిపినా వారికి కంపరమెత్తుతుంది. గోవును మనం పూజిస్తే వారు భక్షిస్తారు. పవిత్ర మాతృత్వానికి ప్రతీకగా మనం స్త్రీని ఆరాధిస్తే వారు బలాత్కరిస్తారు" అని పేర్కొన్నారు.

ఆర్ఎస్ఎస్ అనే ఈ విషవృక్షం ముస్లిం మత ద్వేషంతో ఆనాటి కాలంలోనే ఎంత విస్తృతంగా అభివృద్ధి చెందిందో ఆర్ఎస్ఎస్ కథా రచయిత కె.ఆర్. మల్కాని ఏ విధంగా వర్ణిస్తున్నాడో చూడండి. "1940లో శ్రీ గురూజీ సర్ సంఘ్‌చాలక్‌గా బాధ్యత స్వీకరించారు. అప్పటికి ఆర్ఎస్ఎస్ చిన్న మొక్క మాత్రమే. ఏడు సంవత్సరాల వ్యవధిలో అది పెద్ద వటవృక్షమై దేశంలో మూల మూలలకు అక్షరాలా కాశ్మీరు నుండి కన్యాకుమారి వరకు శాఖోప శాఖలుగా విస్తరించింది. ఈ అభివృద్ధి

మహోద్భుతం అనక తప్పదు. దేశంలోని శాసనసభలో తన ప్రతినిధులు లేకపోయినప్పటికి, ప్రతి పాఠశాలలో, కళాశాలలో, ప్రతి కార్యాలయంలో, కర్మాగారంలో, అన్నింటికీ మించి ప్రజల హృదయాల్లో సంఘం చోటు సంపాదించుకుంది. ఢిల్లీలో ఐ.సి.ఎస్. అధికారులు కూడా నిత్యమూ హాజరయ్యే శాఖ కూడా ఒకటి ఏర్పడిందని" విశ్లేషించారు.

ఈ మతోన్మాదం వలన ప్రజలకు కలిగే మత్తును గురించి మార్క్సిస్టు దార్శనికులు శాస్త్రీయ అవగాహన కలిగి ఉన్నారు. అందుకే కమ్యూనిస్టులన్నా కమ్యూనిస్టు దేశాలన్నా ఆర్ఎస్ఎస్ వారికి గుండెదడ. కమ్యూనిజం ఒక దేశానికి పరిమితమైన ఛాందస జాతీయవాదం కాదు. ఒక జాతిని మరొక జాతి మీదకు, ఒక కులాన్ని మరొక కులం మీదకు ఉసిగొలిపే వేర్పాటువాదం కాదు. సోషలిస్టు ఉద్యమ స్వరూప స్వభావాలు తెలియని ఆర్ఎస్ఎస్ ఆనాటి నుండి ఈనాటి వరకు కమ్యూనిస్టు ఉద్యమాన్ని గురించి అవాకులు, చవాకులు కూయడం పరిపాటి అయింది. నిజానికి భారతీయ కమ్యూనిస్టులు ఈ మతోన్మాదంపై చేయాల్సినంత యుద్ధం చేయలేదు. ఆ మత శక్తే కమ్యూనిస్టు ఉద్యమ వ్యాప్తికి అవరోధమైంది.

ఈ హిందూ మతోన్మాదం విషయంలో భారతదేశంలో డా. బిఆర్ అంబేద్కర్ సరిగ్గా అంచనా వేశారు. హిందూ మతాన్ని నిర్మూలించకుండా భారతీయ సామాజిక విప్లవం విజయవంతం కాదని, హిందూ మతోన్మాదం ప్రమాదకరమైందని అంబేద్కర్ నొక్కి వక్కాణించారు. భారత సామాజిక విప్లవాన్ని ముందుకు తీసుకుపోయిన బౌద్ధ ఉద్యమంలోని మానవతావాదాన్ని ఆయన పరివ్యాప్తం చేశారు. కమ్యూనిస్టులు ప్రాచీన భారత సామాజిక ఉద్యమకారులను, ఆధునిక సామాజిక ఉద్యమకారులైన మహాత్మాఫూలే, డా. బి.ఆర్.అంబేద్కర్, పెరియార్ వంటివారిని, వారి సిద్ధాంతాలను నిర్లక్ష్యం చేశారు. దాని ఫలితంగా భారతదేశంలో ఈనాడు మతోన్మాదం చిట్టెం కట్టుకుపోయింది. మతోన్మాదుల, సామ్రాజ్యవాదుల అండ తీసుకొని మరింతగా బలపడడం ప్రారంభించారు. సామ్రాజ్యవాద శక్తుల బలమయిన అండతో అభివృద్ధి చెందుతున్న ఆర్ఎస్ఎస్ దాని నిధులను గూర్చిన లెక్కలు ఎప్పుడూ ప్రభుత్వానికి చెప్పలేదు, చూపించలేదు. కాంగ్రెస్ పార్టీలో ఉన్న బలహీనతను ఎత్తి వారిని బెదిరిస్తూ, సామ్రాజ్యవాద దేశాల నుండి ధనాన్ని, ఆయుధాలను యథేచ్ఛగా తెప్పించుకొంటూ, అత్యంత ప్రమాదకరమైన విచ్ఛిన్నకర శక్తిగా ఈ సంస్థ అభివృద్ధి చెందుతూ వచ్చింది. ఇప్పుడు ఇక దీనికి రాజ్య వ్యవస్థ తోడైందంటే ఎంత ప్రమాదమో చూడండి!

ఈనాడు మార్క్సిస్టులు, అంబేద్కర్‌వాదులు ఐక్యంగా, సిద్ధాంత బలంతో ఎరుపు నీలి పతాకాల సమైక్యతతో ఎదిరించినప్పుడే ఆర్ఎస్ఎస్ శక్తులను ఓడించగలం. మార్క్స్, అంబేద్కర్‌ల సిద్ధాంతాల సమన్వయమే హిందూ సామ్రాజ్య శక్తులను ఓడించగలుగుతుంది. నిజానికి మనం లోతుగా వెళ్లి, వీళ్ల వాదానికి మూలమైన వేదాల గురించి ఆలోచిస్తే అవి అసలు భారతీయమైనవే కావని మనకు అర్థమవుతుంది. భారత ఉపఖండం 5 వేల సంవత్సరాల చారిత్రక ఆధారాలున్న దేశం. గుప్తుల కాలం వరకూ 'హిందు' అనే శబ్దమే భారతదేశంలో లేదు. వేదాలు, ఉపనిషత్తులు, దర్శనాలు, ఆరణ్యకాలు, బ్రాహ్మణాలు, కావ్యాల్లో ఎక్కడా హిందూ శబ్దం లేదు. సింధూ శబ్దాన్ని పారశీకులు పలకటం రాక 'హిందూ'గా పలికారని అంబేద్కర్ చెప్పారు. భారతదేశానికి ఆర్యులు వలస వచ్చిన తర్వాత భారతదేశం మీద భౌతిక దాడే కాకుండా, వారు సాంస్కృతికమైన, సాంఘికమైన, ఆర్థికమైన, రాజకీయమైన దాడులు అనేక పార్శ్వాల నుండి చేశారు. ఈనాటికీ భారతదేశంలో బౌద్ధులు, జైనులు, సిక్కులు, జొరాష్ట్రియన్‌లు, మార్క్సిస్టులు, అంబేద్కర్ వాదులు అనేక తాత్విక, సామాజిక సమూహాలు హిందువులు కాదు. హిందూ మతం భారతదేశం ఆధిపత్యంలో ఉందనుకోవడం హిందువుల భ్రమ. నిజానికి భారతదేశంలో వచ్చిన తత్వశాస్త్రాలన్నీ నిరీశ్వరమైనవే. చార్వాక, జైన, బౌద్ధ, సాంఖ్య, యోగ, వైశేషిక, న్యాయ దర్శనాలన్నీ మొదట నిరీశ్వరమైనవే. తర్వాత ఈశ్వరమయం చేశారు.

చార్వాకులు భారతదేశంలో మొదటి తాత్వికోద్యమ నిర్మాతలు. సామాజిక దోపిడీకి ఎదురుతిరిగి గుండెలిచ్చినవారు. బానిస తిరుగుబాటు ఉద్యమ నిర్వాహకులు. భారతదేశంలో నిజాయితీగా ప్రశ్నించడాన్ని, అన్యాయాన్ని ఎదిరించడాన్ని, సామాజిక దోపిడీని ఎదుర్కొనడాన్ని మొట్టమొదటగా నేర్పిన విజ్ఞానులు. అందుకే భారతదేశంలో ఏ తాత్విక పునాదుల మీద దోపిడీ వ్యవస్థకు నిర్మాణం జరిగిందో, దాన్ని మొదటగా ఎదిరించిన తాత్వికోద్యమాలేవో తెలుసుకొని ఆ మార్గంలో ఆ పునాదుల్ని కదిలించాలి. అందుకే ఏ వ్యవస్థనైనా నిర్మూలించాలన్నా, అభివృద్ధి చేయాలన్నా, దాని మూలాలలోకి పోవడం ఎంతైనా అవసరం. ఈ దేశంలో సామాజిక విప్లవం ఆవశ్యకతను గుర్తించని వారు ఎందరో ఉన్నారు. ఏ సాంస్కృతిక విప్లవాల ద్వారా చార్వాకాన్ని చంపడానికి ప్రయత్నించారో – ఆ సాంస్కృతిక విప్లవం ద్వారానే దానికి జీవం పోయాలి. కృష్ణ మిశ్రుడు ప్రబోధ చంద్రోదయం నాటకంలో నాస్తిక వాదానికి చావు దెబ్బ కొట్టడానికి ప్రయత్నించాడు. క్రోధ, లోభ, మోహ, దంభములే నాస్తికత్వంగా వివేక, విద్యా విజ్ఞానాలే ఆస్తికత్వంగా తేల్చివేశాడు. దీనికి ప్రత్యామ్నాయంగా బౌద్ధం హిందూమతం లో ఉండే కామ మోహితమైన అంశాల్ని బయటకు తీసుకొచ్చింది. జ్ఞాన బోధని ప్రచురింపచేసింది. ఈనాటి మార్క్సిస్టులకు, అంబేద్కర్‌వాదు లకు తప్పక చార్వాక, బౌద్ధ దర్శనాల అధ్యయనం చారిత్రక అవసరం. లేకుంటే ఆర్ఎస్ఎస్ వాళ్లని ఎదుర్కొని నిలబడలేం. నిజానికి ఆంధ్రదేశం లో ఈ రోజు ఉన్నటువంటి శైవారామాలన్నీ ఒకనాటి బౌద్ధారామాలే. బౌద్ధుల తలలు తెంచి వీరు ఈ ఆరామాలని సృష్టించారు. అందుకే డా. బిఆర్ అంబేద్కర్ బౌద్ధ సంస్కృతీ పునరుజ్జీవనోద్యమాన్ని ప్రారంభించటమే కాక జీవన విధానంలో సమతా మార్గాన్ని రూపొందించారు.

ఈనాడు విశ్వవిద్యాలయాల్లో దళితుల చదువు గురించి జరుగుతున్న ఈర్ష్యకు వెనుక మనుస్మృతి భావజాలం ఉంది. 'అధ్యాపనం చాధ్యయనం యజనం యజనం తథా దాన ప్రతిగ్రహంచైవ బ్రాహ్మణ నామ కల్పయత్' (వేదములను శాస్త్రములను చెప్పుట, తాము చదువుట, యజ్ఞములు చేయుట, దానము గ్రహించుట ఈ ఆరు కర్మలను బ్రాహ్మణునికి ఏర్పరిచారు). బ్రాహ్మణులు ఈ అభిప్రాయంతో చదువుకు మేమే అర్హులం. వేరే వాళ్లు చదవడానికి వీల్లేదు అనే ద్వేషాన్ని ఆనాటికీ ఈనాటికీ పేర్చుకున్నారు. నిజానికి వీరు రూపొందించిన దేవుడు వల్లే ఈ వర్ణవాదం వచ్చింది. అందుకనే జైనులు దేవుడు లేదని నిరూపించారు. ఆనాటి ఈశ్వరవాదంతో పోరాడి గెలిచారు. జైనులు తమ తర్కం ద్వారా దేవుడు లేదని నిరూపించి భారతీయ తత్త్వశాస్త్ర ప్రమాణాల్ని పెంచారు. తర్కరహస్య దీపిక రాసిన గుణరత్నుడు షడ్దర్శన సముచ్చయం రాసిన హరిభద్రుడు ఈ విషయాన్ని స్పష్టంగా నిరూపించారు. హరిభద్రుడు క్రీ.శ. 8వ శతాబ్దానికి, గుణరత్నుడు క్రీ.శ. 15వ శతాబ్దానికి చెందినవారు. గుణరత్నుడు దైవ భావాన్ని ఖండిస్తూ వాదిస్తూ దైవభావాన్ని సమర్థించిన న్యాయ వైశేషిక దర్శనాలను తీవ్రంగా ఖండించాడు. జైనులు భారత నాస్తికవాదానికి పట్టుకొమ్మలుగా నిలిచారు. జైనుల వీతరాగస్తుతిలో

వారి సిద్ధాంతానికి సంబంధించిన ఒక వాదాన్ని మాధవాచార్యుడు సర్వదర్శన సంగ్రహంలో ఇలా వ్యాఖ్యానించారు. 'ఈశ్వరుడు త్రిలోక నిర్మాత' అనే వాదాన్ని, అభూత కల్పనను జైనులు తమ తర్కంతో ఎద్దేవా చేశారు.' నిజానికి న్యాయ వైశేషిక దర్శనాలు కూడా మొదట నిరీశ్వర మైనవి. న్యాయదర్శన కర్త గౌతముడు క్రీ.పూ. 300 నాడు ఈ దర్శనం రాసినట్టు చెప్పుకుంటారు. న్యాయదర్శనానికి క్రీ.శ. 400లో వాత్స్యాయనుడు గొప్ప వ్యాఖ్యానం రాశాడు. తత్వం పునాదిగా ఉన్న వైశేషిక దర్శనాన్ని కణాదుడు అత్యంత ప్రతిభావంతంగా తీర్చిదిద్దారు. ఈ దర్శనాలేవీ మొదట దేవుడిని అంగీకరించలేదు. దేవుడున్నాడు అనే భావన మనిషిని భావ బానిసత్వంలోకి నెడుతుంది. మార్క్స్, లెనిన్, స్టాలిన్, మావో, మహాత్మాపూలే, అంబేద్కర్, పెరియార్ వీరెవరూ దేవుడిని అంగీకరించలేదు.

భారతదేశంలో క్రీ.పూ. నుంచి భౌతికవాదాన్ని చెప్పిన మక్కలి గోశాలుడు, పూర్ణ కాశ్యపుడు, ప్రకృత కాత్యాయనుడు, సంజయ వేలట్టిపుత్ర వీరందరూ కూడా దేవుని ఉనికిని అనుమానించి భౌతికవాదాన్ని భిన్న దృక్పథాలతో ప్రవచించినవారు. కణాదుడు భారతదేశంలో ప్రసిద్ధి చెందిన దార్శనికుల్లో ఒకరు. ప్రపంచ దార్శనికుల్లో కణాదునికి సముచిత స్థానం ఉంది. కారణం ఆయన స్థాపించిన అణు సిద్ధాంతంలో ఉన్న ప్రసిద్ధి. కణాదుడు ఉలూకుని కుమారుడు. కణాదుడు నేటి అలహాబాద్ మండలంలోని పభోసా (ప్రభాస) అనే గ్రామానికి సంబంధించినవాడు. నేల మీద పడివున్న గింజలను ఏరుకొని తిని బ్రతికేవాడట. అందుచే కణాదుడనే పేరు వచ్చిందని న్యాయకందరీకారుడు వివరించాడు. కణాద "ఇతితస్య కాపోతం వృత్తి మనుతిష్టతో రథ్యానిపతితాంస్తణాల కణావాదాయ ప్రత్యహం కృతాహార నిమిత్తా" అని వివరణ ఇచ్చారు. అణు సిద్ధాంతాన్ని కనిపెట్టాడు కావున కణాదునికి ఈ పేరు వచ్చిందని కొందరు వ్యాఖ్యానం చేశారు. కణాదుడు ప్రత్యక్షం, అనుమానం అనే రెండు ప్రమాణాలు మాత్రమే అంగీకరించాడు. శబ్దం, ఉపమానమూ కూడా అనుమానంలోనే అంతర్గతమౌతాయి అన్నాడు. కణాదుడు పదార్థాన్ని ద్రవం, గుణ, కర్మ, సామాన్యం, విశేషం, సమవాయం అని ఆరు భాగాలుగా విభజించాడు. తరువాత ద్రవ్యం, పృథివీ, జలం, అగ్ని, తేజస్సు, వాయువు, ఆకాశం, కాలం, దిక్కు, ఆత్మ, మనస్సు అను తొమ్మిది రకాలుగా విభజించాడు. కర్మపణం, అవక్షేపణం, అంకుచనం, ప్రసారణం, గమనం అని ఐదు రకాలు ఉంటుందన్నాడు.

నిరీశ్వరమైన వైశేషిక దర్శనాన్ని హిందూ మతవాదులు తొక్కివేయడం వల్ల భారతదేశానికి ఎంతో నష్టం జరిగింది. పాశ్చాత్య దేశాల్లో పెక్కు తత్వవేత్తలు కూడా దేవుడు లేడనే స్పష్టంగా చెప్పారు. రాబర్ట్ ఇంగర్సాల్ 'ది గాడ్స్' అనే పుస్తకంలో దేవుళ్ల ఉత్పత్తి గురించి శాస్త్రీయంగా, చారిత్రకంగా విశ్లేషించారు. "దేవుళ్ల ఉత్పత్తి అసంఖ్యాక నమూనాలలో వివిధ ఫాషన్లలో జరిగింది. కొందరికి వెయ్యి చేతులు, కొందరికి వంద తలలు, కొందరికి సజీవ సర్ప కంఠాభరణాలు, కొందరు గదాధరులు, కొందరు కత్తిడాలు ధరించారు. కొందరికి రెక్కలుండేవి. కొందరు అదృశ్యులు, కొందరు పూర్తిగా గోచరిస్తారు. కొందరు వీపులు మాత్రం కనిపింపజేస్తారు. కొందరు అసూయాగ్రస్తులు, కొందరు మూర్ఖులు, కొందరు మానవాకారులు, కొందరు హంసరూపులు, కొందరు వృషభ రూపులు, కొందరు పక్షిరూపులు, కొందరు సుందరాంగులయిన మానవ పుత్రికల వెంటబడ్డారు. చాలామంది వివాహితులు, కొందరు నిత్య బ్రహ్మచారులు, కొందరికి పిల్లలున్నారు. ఆ పిల్లలు మళ్లీ తండ్రులుగా దేవుళ్లయి పూజలందుకున్నారు. ఈ దేవుళ్లలో చాలామంది ప్రతీకార పరాయణులు, ఆటవికులు, కామాంధులు, అమాయకులు, వాళ్ల సమాచారం కోసం పూజార్లేగతి. కాగా వాళ్ల అజ్ఞానం మనలో ఆశ్చర్యాన్ని రేకెత్తింపదు" అని విశ్లేషించారు.

దేవుడు లేడనే భావనే భౌతికవాదానికి, గతితార్కిక భౌతికవాదానికీ పునాది. దేవుడున్నాడు అని కొలిచేవాళ్లు మార్క్సిస్టులు కాలేరు. అంబేద్కర్‌వాదులు కాలేరు. 'మతం మనిషికి మత్తుమందు' అని మార్క్స్ అనే వరకే ప్రచారం చేస్తున్నారు. మార్క్స్ ఎంగెల్స్ దేవుడు లేడని ప్రకటించారు. అందుకే వాళ్లు గతితార్కిక భౌతికవాదంలో ప్రపంచ పరిణామం దేవుడు వల్ల కాదు. అది సామాజిక చలన సూత్రాల నుండే అని నిరూపించారు. మార్క్స్ రూపొందించిన గతితార్కిక చారిత్రక భౌతికవాద దృక్పథం మానవ సమాజంలో ఉన్న ప్రధాన వైరుధ్యాన్ని బయటకు తీసుకువచ్చింది. తత్త్వశాస్త్రం ఇప్పటివరకు సమాజాన్ని వ్యాఖ్యానించింది. కాని మార్క్స్ తాత్త్విక సిద్ధాంతం సమాజాన్ని మార్చే శక్తిగా రూపొందింది. 'మానవుని జ్ఞానం అతని మీద ఆధారపడకుండా ఉన్న ప్రకృతిని ఎలా ప్రతిబింబిస్తుందో, అలాగే మానవుని సామాజిక జ్ఞానం సమాజ ఆర్థికవ్యవస్థను ప్రతిబింబిస్తుంద'ని మార్క్స్ సిద్ధాంతీకరించాడు. అందువలనే మార్క్స్ తత్త్వశాస్త్రం ఆర్థికంగా అణగదొక్క బడుతున్న కార్మికవర్గానికి శక్తివంతమైన సాధనాలు సమకూర్చింది.

ఈనాడు హిందూ సామ్రాజ్యవాదాన్ని ఎదుర్కోవాలంటే భౌతికవాద దృక్పథాన్ని, తత్వశాస్త్ర అవగాహనని ప్రాచీన భారతీయ తాత్వికుల సిద్ధాంతాలను మనం అవగాహన చేసుకోవాల్సిన అవసరం ఉంది. హిందూ మతం కేవలం మతమే. దానిలో జ్ఞానం లేదు. కర్మకాండ ఉంది. వర్ణతత్వం ఉంది. కులతత్వం ఉంది. అస్పృశ్యత ఉంది. ప్రతి మార్క్స్ వాది, అంబేద్కర్ వాది అంబేద్కర్ చెప్పినట్లు నేను 'హిందూ మతంలో పుట్టాను కాని హిందువుగా మరణించను' అని శపథం చేయాలి. మార్క్స్ కూడా క్రైస్తవ మతం నుంచి బయటకు వచ్చాకే భౌతికవాది, గతితార్కిక భౌతికవాది కాగలిగాడు. మనం ఇళ్లల్లో పూజలు చేస్తూ, పెళ్లిళ్లకు బ్రాహ్మణుణ్ని పిలుస్తూ, కులం పెళ్లిళ్లు చేసుకుంటూ, మార్క్స్ వాదాన్ని, అంబేద్కర్ వాదాన్ని ఆచరణలో ప్రతిఫలింపచేయలేం. అంబేద్కర్ కూడా బౌద్ధాన్ని మతంగా తీసుకోలేదు. ధర్మంగా స్వీకరించాడు. బౌద్ధంలో గతితర్కం ఉందని చెప్పాడు. మార్క్స్ చెప్పిన దోపిడీ నిర్మూలన, బౌద్ధంలోని దుఃఖనిర్మూలన ఒకటే అని చెప్పాడు. అందుకే హిందూ సామ్రాజ్యవాదాన్ని భౌతిక తాత్త్విక ఆయుధాలతో ఎదుర్కొందాం. విజయం సాదిద్దాం. హిందూ సామ్రాజ్యవాదాన్ని ఎదుర్కోవడానికి అంబేద్కర్‌ను ఎంతగా అధ్యయనం చేస్తే అన్ని తాత్త్విక ఆయుధాలు మనకు దొరుకుతాయి.

వేదాలు, బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు, పురాణాలు కల్పితమైనవని అంబేద్కర్ తేల్చి చెప్పాడు. చాలామంది మార్క్సువాదులు ఇంకా మతం, కులం ఉచ్చుల్లో ఉండి కేవలం ఆర్థికవాదాన్నే మాట్లాడుతున్నారు. అందుకే భారతదేశ పునర్నిర్మాణానికి అంబేద్కర్ రాసిన హిందూ మతంలో చిక్కుముడులు, శూద్రులెవరు అస్పృశ్యులెవరు, కులనిర్మూలన గ్రంథాలను చదవడం చారిత్రక అవసరం. అందుకే భారతదేశంలో వైదిక సంస్కృతిని ఎదిరించి పోరాడిన తత్త్వవేత్తలందరినీ మనం అధ్యయనం చేయడమే కాక ఆచరణ లోను ప్రతిఫలింప చేయవలసిన అవసరం ఉంది. అప్పుడే హిందూ సామ్రాజ్యవాదం ఓటమికి గురవుతుంది. మనం విజయం పొందుతాం.

*(రచయిత సామాజిక తత్త్వవేత్త, నవ్యాంధ్ర పార్టీ వ్యవస్థాపక అధ్యక్షులు)* వీ

# ఉగ్రవాదంలో కొత్తకోణం

***ప్రపంచవ్యాప్తంగా ఉగ్రవాదం రోజురోజుకూ పెట్రేగిపోతోందనీ, దీనికి అమెరికా ఆయుధ వ్యాపారం ఆజ్యం పోస్తోందనీ అంటున్నారు* రాజేంద్రబాబు అర్విణి**

"ప్రపంచంలో మా సానుభూతిపరులు ఎక్కడ ఉన్నా, మరీ ముఖ్యంగా అమెరికాలో, ఈ పవిత్ర రంజాన్ మాసం పొడువునా హత్యాకాండను కొనసాగించండి." – ప్రతి సంవత్సరం ఇస్లామిక్ స్టేట్ తన అనుచరులకు ఇచ్చే సందేశంలో భాగంగా ఒక నెలరోజుల క్రితం ఐసిస్ అధికార ప్రతినిధి అబూ మొహమ్మద్ అల్–అద్నాని తమ ప్రసార సాధనాల ద్వారా ఇచ్చిన ఆదేశాలు ఇవి. అమెరికాను దృష్టిలో ఉంచుకుని ఆయన ఇచ్చిన సలహా ఇంకా పాశవికంగా ఉంది. "ఎంత చిన్న స్థాయిలో అయినా దాడులను జరపండి. అమెరికా దేశంలో జరిగే చిన్న ప్రాణ నష్టమయినా ఇతర ప్రాంతాలలో జరిగే అతిపెద్ద దాడికన్నా మాకు అత్యంత సంతోషాన్ని కలగచేస్తుంది." 2014 సెప్టెంబర్‌లో అద్నాని ఇచ్చిన మరొక సందేశంలో మరింత స్పష్టంగా చెప్పాడు. 'ఎవరి అనుమతి తీసుకోవలసిన అవసరం లేదు. అయితే, మారణకాండ జరపడానికి ముందుగాని, జరుపుతున్న సమయంలోగాని ఐసిస్‌కు విధేయత ప్రకటించాలి. ఆయుధాలు కొనలేని స్థితిలో ఉన్నవాళ్లు ఇస్లాంపట్ల విశ్వాసంలేని ద్రోహులను చంపటానికి రాళ్లుగాని, చురకత్తులుగాని లేదా కనీసం తోలుతున్న కార్లనయినా ఉపయోగించాలి'.

గతంలో ఆల్‌ఖైదా కూడా కాల్పులకు ఒడిగట్టేది. ఆ కాల్పులు ఓ పద్ధతి ప్రకారం జరిగేవి. తమ శత్రువులను గుర్తించి, వారిని శిక్షించడానికి తాను శిక్షణ ఇచ్చిన కార్యకర్తలను వినియోగించేది. ఆ రకంగా ఆల్‌ఖైదా దాడులు వ్యవస్థీకృతంగా ఉండేవని చెప్పవచ్చు. ఇటీవలి కాలంలో ఐఎస్‌ఐఎస్ పాల్పడుతున్న దాడులు, మారణకాండ వికృత రూపం సంతరించుకున్నాయి. ఐఎస్‌ఐఎస్ కార్యకర్తగా ఉండవలసిన అవసరం లేదు. సానుభూతిపరుడు అయితే చాలు. శిక్షణ అవసరంలేదు. ఆ సంస్థలో భాగస్వామ్యమూ అవసరంలేదు. రాజకీయ విశ్వాసాలు ఉండాల్సిన అవసరంలేదు. అసలు రాజకీయాల గురించి తెలవాల్సిన అవసరమేలేదు. ప్రణాళిక రూపొందించాల్సిన అవసరం సంస్థకు లేదు. ఆ ప్రణాళిక కార్యరూపం దాల్చడానికి అవసరమయిన వనరులు సంస్థ సమకూర్చాల్సిన అవసరమూలేదు. ఐఎస్‌ఐఎస్ సానుభూతిపరుని చేతిలో ఒక మారణాయుధం ఉంటేచాలు. పలువురిని చంపి హీరో అవుదామని, ఆ క్రమంలో తాను చనిపోవడానికయినా సిద్ధంగా ఉండాలన్న మానసిక వైకల్యం ఉంటే చాలు. ఇదీ ఐఎస్‌ఐఎస్ ఉగ్రవాద కార్యకలాపాలలో ఈ మధ్య కనిపిస్తున్న కొత్తకోణం. ఇది ప్రమాదకరమయిన ధోరణి. సామాన్య మానవుణ్ణి మరింత అభద్రతా భావానికి గురిచేసే ధోరణి. ఈ ధోరణి ఇటీవల అమెరికాలో జరిగిన విచ్చలవిడి కాల్పుల్లో కానవచ్చింది.

ఉమర్ మతిన్ అనే యువకుడు నేరం, శిక్షను గురించిన కోర్సులో అసోసియేటెడ్ డిగ్రీ పొందినవాడు. కొంతకాలం ప్రభుత్వ జైళ్ల శాఖలో పనిచేశాడు. సెక్యురిటి గార్డుగా ఉద్యోగంలో ఉన్నవాడు. ఐఎస్‌ఐఎస్ భావజాలంతో ప్రభావితమయినవాడు. కాని ఆ సంస్థతో సంబంధాలు ఉన్నట్టు ఆధారాలు ఎక్కడా లభించలేదు. ఉమర్‌మతిన్ ఓ నడిరాత్రి అమెరికాలోని ఓర్లాండో పట్టణంలో ఒక నైట్ క్లబ్‌లోకి జొరబడి విచక్షణా రహితంగా కాల్పులు జరపగా 49 మంది మరణించారు. కాల్పులు జరుపుతూ అమెరికా పోలీసులకు ఫోన్ చేసి ఐఎస్‌ఐఎస్‌కు తన విధేయతను చాటుకున్నాడు. సిరియాపై అమెరికా చేస్తున్న దాడులను, బాంబుల వర్షాన్ని ఆపివేయాలని డిమాండ్ చేశాడు. ఆ కాల్పులలో మరణించిన వారిలో ఎక్కువ మంది నల్లజాతివారు, ఇస్పానిక్లు, స్పానిష్ సాంస్కృతిక వారసత్వానికి చెందినవారు. చనిపోయినవారు గాని, గాయపడ్డవారు గాని, అక్కడ ఉండి ఆ నరమేధం బారిన పడకుండా తప్పించుకున్న వాళ్లుగాని ఎవరూ అమెరికా సామ్రాజ్యవాద దురహంకారానికి ప్రతీకలు కాదు. ఇస్లాం మత మౌఢ్యానికి శత్రువులు కాదు. ప్రకృతి పరమయిన సహజత్వానికి విరుద్ధంగా కాపిటలిస్టు వికార సంస్కృతిని పుణికిపుచ్చుకున్న వాళ్లు. ఇతరులకు ఇబ్బంది లేకుండా తమ జీవితాల్లో ఆనందాన్ని వెతుక్కునే వికృత జీవులు మాత్రమే. స్వలింగ సంపర్కంపై ఆసక్తి ఉన్న స్త్రీ పురుషులకు, లింగ మార్పిడి చేయించుకున్న వ్యక్తుల కోసం ప్రత్యేకించబడ్డది ఆ నైట్‌క్లబ్.

అమెరికాలో ఎన్నికల కాలం ఇది. మారణాయుధాల అమ్మకంపై నియంత్రణ లేని అమెరికా దేశంలో విచ్చలవిడి కాల్పులకు ఐఎస్‌ఐఎస్ అధికార ప్రతినిధి అద్నాని పిలుపు ఇచ్చిన సంగతిని ఓర్లాండో ఘటనతో ఖంగుతిన్న అమెరికా ప్రభుత్వం, అధికార పక్షమయిన డెమొక్రటిక్ పార్టీ తక్కువ చేసి చూపించే ప్రయత్నం చేస్తున్నాయి. అందుకు అనుగుణంగా అమెరికా మీడియా చర్చను స్వలింగ సంపర్కంవైపు, గన్ కంట్రోల్లవైపు ఎక్కువ కేంద్రీకృతం చేసే ప్రయత్నం చేస్తున్నది. స్వలింగ సంపర్కులకు, లింగమార్పిడి చేయించుకున్న వ్యక్తులకు ఆలవాలమయిన నైట్‌క్లబ్‌లో మారణకాండకు పూనుకోవడమంటే పౌరుల వ్యక్తిగత స్వేచ్ఛకు అడ్డుకట్ట వేసే ప్రయత్నం చేయడమేననే అభిప్రాయాన్ని కూడగట్టే ప్రయత్నం చేస్తున్నది. అయితే, ఆ హనన కార్యాన్ని చాలా ప్రశాంత చిత్తంతో నిర్వహించిన ఉమర్‌మతిన్ ఆ క్లబ్‌లో ఉన్నంతసేపు ఎప్పుడు 'గే' (పురుష స్వలింగ సంపర్కులు) ల గురించి ఒక్కమాట మాట్లాడలేదని, ఆయన మాట్లాడినదల్లా ఐఎస్‌ఐఎస్ గురించి, సిరియా గురించి, తాను ఇంకా తలపెట్టబోయే హత్యాకాండను గురించి మాత్రమేనని ప్రత్యక్ష సాక్షి ఒకతను చెప్పినట్టుగా న్యూయార్క్ టైమ్స్ పత్రిక వెల్లడించింది.

ఆవేశాన్ని, కోపాన్ని, అనుభూతులను తనలోనే అణుచుకొని పెట్టుకునే మనస్తత్వం కాబట్టి, ఉమర్‌మతిన్ మానసిక దౌర్బల్యంతో ఇంత మందిని హతమార్చాడని కూడా మీడియా మరో చిత్రీకరణ చేసేందుకు బేహుదా

ప్రయత్నం చేస్తుంది. మతిన్ నైట్‌క్లబ్‌లో ప్రవేశించినప్పటి నుండి పోలీసులు అతన్ని కాల్చివేసే వరకు మతిన్ స్థిరచిత్తంతో కనిపించాడని ప్రత్యక్ష సాక్ష్యులు చెపుతున్నారు. జైలు ఉద్యోగానికి ఆయన్ను సిఫారస్ చేస్తూ కళాశాలలో ఆయన ప్రాజెక్ట్ పనిని పర్యవేక్షించిన అమెరికన్ ప్రొఫెసర్ తనకు మంచికితాబు ఇచ్చాడు. "మతిన్ ఆ జైలు ఉద్యోగంలో ఉంటే, ఆ జైలులోని ఖైదీలు, బయట ప్రజలు గుండెమీద చెయ్యివేసుకుని నిద్రపోవచ్చు" అని మతిన్ గురించి తన అభిప్రాయం వ్యక్తపరిచాడు.

తుపాకులు, పిస్తళ్లు, మారణాయుధాలు చాలా సులభంగా లభించే కొన్ని దేశాలలో అమెరికా ఒకటి. భారతదేశంలో దీపావళి టపాసులు కొన్నంత సులభంగా అమెరికాలో నిజమయిన గన్లు, తుపాకీ గుండ్లు కొనవచ్చు. మారణాయుధాలు కలిగి ఉండడానికి సంబంధించి నియంత్రణాధికారాలు బహు తక్కువ. తమ రక్షణ కోసం తమతో ఆయుధాలు ఉంచుకునే హక్కు పౌరులకు ఉండాలని రిపబ్లికన్లు వాదిస్తారు. ఆయుధాలు కలిగి ఉండడం విషయంలో ఎలాంటి నియంత్రణ అవసరం లేదంటారు. కొంతయినా నియంత్రణ ఉండాలని డెమోక్రాట్ల అభిప్రాయం. "సులభంగా లభించే మారణాయుధాలతో అమెరికా సమాజం తెర్లిపోతుంది. ఇంకా ఆలస్యం దేనికి" అని అల్‌ఖైదా అధికార ప్రతినిధి 2011 లోనే తన అనుచరులకు సామాజిక మాధ్యమాల ద్వారా పదనిర్దేశం చేశాడు. ఫెడరల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్ (ఎఫ్‌బిఐ) వద్ద 8,00,000 మందితో కూడిన అనుమానితుల జాబితా ఒకటి ఉంది. అందులో 64000 మందినో–ఫ్లై ఆంక్షలలో ఉన్నవారూ ఉన్నారు. అంటే ఈ 64 వేల మంది అమెరికా దేశంలో గాని, దేశం బయటగాని విమానాలలో ప్రయాణించకూడదు. (ఈ గణాంకాలు 2014 సంవత్సరానికి సంబంధించినవి) కనీసం ఈ 8 లక్షల మంది విషయంలో నయినా ఆయుధ నియంత్రణకు అమెరికా కాంగ్రెస్ (చట్టసభ) ఒప్పుకోవడంలేదు. కారణం అమెరికా ఆయుధాల వ్యాపారి.

ఆయుధాలు తయారుచేసే ఫ్యాక్టరీ యజమానుల గుప్పిట్లో అమెరికా చట్టసభ, ప్రభుత్వం ఉన్నాయి. ఆ ఆయుధాల మార్కెట్‌కోసం ప్రపంచంలో ఏదో ఒకచోట ఎప్పుడూ యుద్ధం సృష్టించబడుతుంది అనడంలో అతిశయోక్తిలేదు. భారతదేశానికి సరిహద్దు సమస్యలు ఏమిలేకపోయినా ప్రతి సంవత్సరం కొన్నివేల కోట్ల రూపాయల విలువగల ఆయుధాలు, యుద్ధ సామాగ్రి అమెరికా నుండి, దాని మిత్రదేశాల నుండి ఎందుకు కొంటుందో ఆలోచిస్తే కారణం అర్థం అవుతుంది. అమెరికా ఆయుధ వ్యాపారుల ధనదాహానికి అమెరికా దేశం కూడా అప్పనంగా ఆహుతి అయ్యింది. "గన్ లాబీ" గుప్పిట్లో, మారణాయుధాల పరిశ్రమ చేతుల్లో అమెరికా కాంగ్రెస్ (అమెరికా చట్టసభ) బందీ అయిందని, అమెరికా పౌరుల శ్రేయస్సును కాదని మారణాయుధాల బేహారులకే జీహుజర్ అంటుందని ఓర్లాండో నరమేధం తర్వాత న్యూయార్క్ మ్యాగజైన్ సంపాదకీయంలో రాసింది. ఎఫ్‌బిఐ వారి అనుమానితుల జాబితాలో ఉన్న ఒక మహిళ తనపై ఉన్ననిఘాను తప్పించుకొని ఒక మాల్ లోకి వెళ్లి కేవలం 7 నిమిషాలలో బాగా విలువైన ఒక తుపాకీకొని అంతర్ధానమై పోయిందట. ఇది ఫ్లోరిడా రాష్ట్రంలోనే, ఓర్లాండో సంఘటన తర్వాతనే జరిగింది. ఇది ఒక చిన్నవార్తగా పత్రికలలో ప్రకటించారు. అంత సులభంగా మారణాయుధం చట్టబద్ధంగానే చేజిక్కించుకున్న ఆ మహిళ ఆచూకీ లభించినా, ఆమెను చేయగలిగిందేమీ లేదు.

ఓర్లాండో కాల్పులు అంతర్జాతీయంగా కలకలంతో పాటు, అమెరికా అధ్యక్ష ఎన్నికలలో కలవరమూ సృష్టించాయి. డెమోక్రటిక్ పార్టీ అభ్యర్థి హిల్లరీ క్లింటన్, ఆమెను సమర్థిస్తున్న అధ్యక్షుడు బారక్ ఒబామా ఒకింత ఆత్మరక్షణలో పడిపోయినట్టుగా అనిపిస్తున్నది. అమెరికా జాతీయవాదాన్ని రెచ్చగొడుతూ ముస్లింలకు, హిస్పానిక్స్‌కు వ్యతిరేకంగా బహిరంగ వ్యాఖ్యలు చేసిన డొనాల్డ్ ట్రంప్ ఇంకాస్త ముందుకు వెళ్లి, తాను అధ్యక్షుడైతే ఉగ్రవాద నేపథ్యం, అమెరికా దాని మిత్రదేశాల ఆకాంక్షలకు భిన్నంగా పనిచేసిన చరిత్ర గలిగిన కొన్నిదేశాల నుండి ఎవరూ కూడా అమెరికాలో కాలు మోపకుండా విధాన నిర్ణయం తీసుకుంటానని ప్రకటించాడు. 17 దేశాల పేర్లు కూడా ఆయన వెల్లడి చేశాడు. అవి – ఫిలిప్పైన్స్, ఇరాక్, పాకిస్తాన్, ఇరాన్, ఈజిప్ట్, ఆఫ్ఘనిస్తాన్, సోమాలియా, సిరియా, యెమన్, లెబనాన్, మలేసియా, సుడాన్, ఇండోనేషియా, సౌదీ అరేబియా, యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్, మాలి, లిబియా. ఈ జాబితాలో భారత్, చైనా, మెక్సికోలు లేకపోవడం గమనార్హం.

ఊహాగానాలు, వార్తా కథనాలు ఎలా ఉన్నా, ఐఎస్ఐఎస్ సంస్థ తీసుకున్న 'ఒంటరి తోడేలుదెబ్బ' వ్యూహం ప్రపంచ మానవాళిని అభద్రతా భావంలో ముంచెత్తుతుంది.

జూన్ 12న కాల్పులు జరిగితే, కాల్పుల సమయంలో హంతకుని ప్రవర్తన, అతడు పోలీసులకు ఫోన్ చేసి చెప్పిన విషయాలు జూన్ 20 దాకా పోలీసులు గుప్తంగా ఉంచారు. పోలీసులు చివరికి మీడియాలో వెల్లడించిన వివరాల ప్రకారం ఆనాటి తెల్లవారుముజాన 2.02 గంటలకు హంతకుడు మొట్ట మొదటిసారి కాల్పులు జరిపాడు. 2.35 గంటలకు పోలీసులకు ఫోన్‌చేసి ఐఎస్ఐఎస్‌కు తన విధేయత ప్రకటించాడు. ఆ తర్వాత నాలుగుసార్లు మొత్తం 29 నిమిషాలు పోలీసులతో మాట్లాడాడు. మూడు గంటలు దాదాపు 300 మంది కస్టమర్లను బందీలుగా ఉంచుకొని, చివరి క్షణాలలోనే కాల్పులు జరిపి కొంతమందిని హతమార్చాడు. 5.15 గంటలకు తానూ పోలీసు కాల్పుల్లో మరణించాడు. మొత్తం 29 నిమిషాలు పోలీసులతో మాట్లాడినా భద్రతా కారణాల రీత్యా కేవలం 4 నిమిషాల సంభాషణా వివరాలను మాత్రమే ప్రపంచానికి వెల్లడించారు. వెల్లడించిన 4 నిమిషాల సంభాషణలో మూడు విషయాలు స్పష్టమయ్యాయి. అవి; 'దయామయుడు అల్లా తరపున ఈ కాల్పులు జరుపుతున్నాను', 'ఇస్లామిక్ స్టేట్, దాని నాయకుడు అబుబాకర్ అల్–బాగ్దాదికి ఈ హత్యాకాండను అంకితమిస్తున్నాను', 'సిరియా, ఇరాక్‌లపై అమెరికా బాంబుదాడులు నిలిపివేయాలి'. అమెరికా పోలీసులతో ఆరోజు రాత్రి 2.48 గంటలకు 9 నిమిషాలు, 3.03 గంటలకు 16 నిమిషాలు, 3.24 గంటలకు 3 నిమిషాలు మాట్లాడినట్టు రికార్డు అయింది. మాట్లాడిన విషయాలు పూర్తిగా వెల్లడించక పోయినా, 'అతడు ప్రశాంతంగా, స్థిర చిత్తంతో మాట్లాడా'డని మాత్రం స్పష్టంచేశారు.

'విచారణ ప్రారంభ దశలోనే ఉంది. ఇది కొన్ని నెలలు పట్టవచ్చు. లేదా కొన్ని సంవత్సరాలు పట్టినా వింత ఏమీ లేదు' అని కూడా ప్రకటించారు. అంటే వాస్తవాలు బయటికి రాకుండా భూస్థాపితమయినా కావచ్చు. ఏది ఏమయినా, ఉగ్రవాది ఉమర్‌మతిన్ స్థిమితం తప్పి చిత్త చాపల్యంతో ఆ మారణకాండకు ఒడిగట్టాడు అని భావించడం మాత్రం సత్యదూరం.

*(రచయిత రిటైర్డ్ జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్)* వీ

# సామ్రాజ్యవాదంపై లెనిన్ రచనకు వందేళ్లు

***వంద సంవత్సరాల కింద ఏ చారిత్రక రాజకీయ పరిస్థితుల నేపథ్యంలో లెనిన్ సుప్రసిద్ధ రచన 'సామ్రాజ్యవాదం - పెట్టుబడిదారీ విధానపు అత్యున్నత దశ' వెలువడిందో వివరిస్తున్నారు* పి. ప్రసాదు**

మార్క్సిస్టు సిద్ధాంత గ్రంథ రాశిలో ఉత్తమోత్తమ గ్రంథం "సామ్రాజ్యవాదం, పెట్టుబడి దారీ విధానపు అత్యున్నత దశ". ఈ గ్రంథ రచయిత మార్క్సిస్టు మహోపాధ్యాయుల్లో ఒకరైన కా. లెనిన్. కొత్త క్యాలెండర్ ప్రకారం 1916, జులై 2న ఈ గ్రంథ రచన ముగిసింది. నూరేళ్లు నిండిన సందర్భంగా ఒకసారి దాని చారిత్రికావలోకనం చేద్దాం.

ఈ రచన కోసం కా. లెనిన్‌కు ఆరు నెలలు పట్టింది. తొలుత బెర్న్ నగరంలో 1915 జనవరి నుండి ఆ ఏడాది చివరి వరకూ గ్రంథాధ్యయనం సాగించాడు. మొత్తం 106 జర్మన్ భాషా గ్రంథాలు, 23 ఫ్రెంచి భాషా గ్రంథాలు, 17 ఇంగ్లీషు భాషా గ్రంథాలు రెండు రష్యన్ అనువాద గ్రంథాలు కలిపి మొత్తం 148 గ్రంథాలను అధ్యయనం చేశాడు. అంతేకాకుండా 232 వ్యాసాలను ఉపయోగించు కున్నాడు. వార్తాపత్రికల సమాచారం సరే సరి. వీటి ఆధారంగా 800 పేజీల నోట్స్ రాసుకున్నాడు. జూరిచ్ నగరంలో 1916 జనవరి నుంచి జులై 2 వరకూ గ్రంథ రచన చేశాడు.

ఈ పుస్తక రచన కోసం ప్రధానంగా రెండు గ్రంథాలు లెనిన్‌కు ఎక్కువగా దోహదపడ్డాయి. ఆంగ్ల ఆర్థికవేత్త జె.ఎ. హాబ్సన్ రచించిన 'సామ్రాజ్యవాదం' అనే పుస్తకం 1902లో లండన్, న్యూయార్క్‌లలో ప్రచురితమైనది. రుడాల్ఫ్ హిల్ఫర్‌డింగ్ రచించిన 'ఫైనాన్స్ పెట్టుబడి' అనే పుస్తకం 1910లో వియన్నాలో ప్రచురితమైనది. హాబ్సన్ బూర్జువా సంస్కరణ వాది కాగా, హిల్ఫర్‌డింగ్ ఆస్ట్రియన్ సోషల్ డెమోక్రాటు.

ఈ ఇద్దరి రచనలు సామ్రాజ్యవాద దోపిడీ స్వభావాన్ని ఎండగట్టాయి. కానీ దానిపై పోరాడాల్సిన కార్మికవర్గానికి తగు రాజకీయ దిశానిర్దేశం చేయలేదు. పైగా తప్పుడు పరిష్కారాన్ని చూపించాయి. తద్భిన్నంగా లెనిన్ గ్రంథం ప్రపంచ కార్మికవర్గం చేతిలో ఆయుధంగా మారింది. హాబ్సన్, హిల్ఫర్‌డింగ్ వంటి రచయితలు తమ రచనల ద్వారా తయారు చేసిన అస్థిపంజరానికి లెనిన్ రక్తమాంసాలను పేర్చి జీవంపోసి తీర్చిదిద్దారు. తద్వారా దానికి సామ్రాజ్యవాదంపై పోరాడే శక్తిని అందించారు. అదే లెనిన్ గ్రంథం ప్రత్యేక విశిష్టత.

ఏదైనా ఒక సిద్ధాంత గ్రంథానికి రాజకీయ ప్రాధాన్యతను సరిగ్గా అంచనా వేయాలంటే, అది రచించిన కాలం నాటి చారిత్రక పరిస్థితుల లోకి వెళ్లి విశ్లేషించాలి. ఒక చారిత్రిక అవసరం కోసం లెనిన్ యీ గ్రంథాన్ని రచించాడు. నిజానికి సామ్రాజ్యవాదాన్ని లెనిన్ కనుగొనలేదు. సామ్రాజ్యవాద దోపిడీని కూడా లెనిన్ కొత్తగా కనుగొన్నది కాదు. ఇలాంటి ఆవిష్కరణలను లెనిన్ కంటే ముందు చేసిన వాళ్లున్నారు. ఈ గ్రంథం రాయడానికి నాలుగేళ్ల ముందు 1912లో రెండవ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ (కొమింటర్న్) బాస్లే ప్రణాళికను ఆమోదించింది. త్వరలో రానున్న సామ్రాజ్యవాద యుద్ధ నేపథ్యంలో కార్మికవర్గ అంతర్జాతీయతకు గల ప్రాధాన్యతకు బాస్లే ప్రణాళిక అద్దం పట్టింది. దాని ఆమోదంలో లెనిన్ కీలక పాత్రను పోషించాడు. కాని మొదటి ప్రపంచ యుద్ధం సమీపిస్తున్న క్రమంలో రెండో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నాయకత్వం వర్గ సామరస్య విధానాన్ని చేపట్టి, కార్మికవర్గ అంతర్జాతీయతను విసర్జించింది. ఆయా సామ్రాజ్యవాద దేశాల ప్రభుత్వాలు 'పితృదేశరక్షణ' పేరిట సృష్టించిన యుద్ధోన్మాద ఊబిలో దిగిపోయింది. తద్వారా కార్మికవర్గాన్ని యుద్ధ బలిపీఠం ఎక్కించ జూసింది. హైండ్‌మన్‌తో ప్రారంభమైన యుద్ధానుకూల రాజకీయ పతనం ప్లెహనోవ్, కాట్స్కీల వరకూ వ్యాపించింది. సరిగ్గా అలాంటి నిర్దిష్ట చారిత్రక రాజకీయ పరిస్థితు లలో సామ్రాజ్యవాద యుగ విశిష్టత గూర్చి లెనిన్ విశ్లేషించాల్సి వచ్చింది.

స్టాక్‌హోమ్, స్టుట్‌గార్ట్, బాసెల్‌లలో జరిగిన రెండో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ వేదికల మీద లెనిన్ సైద్ధాంతిక పోరాటం సాగిస్తూ వచ్చాడు. 1908-09 ల వరకూ మార్క్సిస్టుగా నిలబడ్డ కాట్స్కీ ఆ తర్వాత సెంట్రిస్టు పేరిట అవకాశవాదిగా మారాడు. పెట్టుబడిదారీ విధానంలో సామ్రాజ్యవాదాన్ని అంతర్భాగంగా కాకుండా, అదో ప్రత్యేక దశగా కాట్స్కీ సూత్రీకరించాడు. ఈ ఒక్క ముడిని తెంచి వేస్తే మార్క్స్ నుంచి లెనిన్‌ను వేరు చేసి రానున్న సామ్రాజ్యవాద యుద్ధానికి వ్యతిరేకంగా లెనిన్ సైద్ధాంతిక పోరాటాన్ని మార్క్సిజానికి వ్యతిరేకమైనదిగా చిత్రించవచ్చనేది వాళ్ల లక్ష్యం. ఈ చారిత్రిక పరిస్థితులలో వెలువడ్డ యీ గ్రంథం 'లెనినిజం' ఆవిర్భావానికి పునాది అయింది.

మొదటి ప్రపంచ యుద్ధ పరిస్థితులు ముంచుకొస్తున్న కొద్దీ మార్క్సిజం మీద రెండు రకాల రాజకీయ దాడులు పెరుగుతూ వచ్చాయి. మొదటిది, సామ్రాజ్యవాద శిబిరం నుంచి ప్రత్యక్షంగా సాగింది. రెండవది, కొమింటర్న్ నుంచి పరోక్షంగా సాగింది. మొదటి దాడి బయటి శత్రువుల నుంచి సాగింది. రెండో దాడి ఇంటి దొంగల నుంచి సాగింది. మార్క్స్ - ఎంగెల్స్‌ల బోధనలకు, వాళ్ల చారిత్రిక జోస్యాలకు భిన్నంగా పెట్టుబడిదారీ వ్యవస్థ అధికోత్పత్తి సంక్షోభాలను అధిగమించిందనీ, కొత్తగా సామ్రాజ్యవాద దశలోకి మారడం ద్వారా కార్మికవర్గ విప్లవాల ప్రమాదం నుంచి కూడా పెట్టుబడి వారీ వ్యవస్థ బయట పడిందనీ, అనగా ఆచరణలో మార్క్సిజానికి కాలదోషం పట్టిందనీ ఆనాటి సామ్రాజ్యవాద తాత్విక, రాజకీయ శక్తులు విస్తృత ప్రచారానికి దిగాయి. పెట్టుబడిదారీ వ్యవస్థ నుంచి సామ్రాజ్యవాద దశను వేరుచేయడం ద్వారా వీరు ఈ ప్రచారాన్ని సాగించారు. మరోవైపు రెండో ఇంటర్నేషనల్‌కు చెందిన ఆనాటి వివిధ యూరప్ దేశాల సోషల్ డెమోక్రటిక్ పార్టీల నాయకులు ఇంకో తరహా దాడికి దిగారు. వీళ్ల మాటల్లో

సామ్రాజ్యవాదాన్ని తీవ్రంగా విమర్శిస్తారు. చేతల్లో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని నీరుగారుస్తారు.

రెండో కొమింటర్న్ నాయకుల చేత మార్క్సిజం వక్రీకరణకూ, వికృతీకరణకూ గురైన ఫలితంగా బాస్లే ప్రణాళిక జమ్మి చెట్టు ఎక్కింది. ఆయా దేశాల ప్రభుత్వాల పక్షాన ఆయా దేశాల కార్మికవర్గం యుద్ధంలో పాల్గొనాలన్నంత వరకూ నాటి రివిజనిస్టులు దిగజారారు. ఒకవైపు మార్క్సిజానికే కాల దోషం పట్టిందని సామ్రాజ్యవాద ప్రచారకులు దాడికి దిగారు. మరోవైపు మార్క్సును అడ్డం పెట్టుకుని సామ్రాజ్యవాదుల ప్రయోజనాల కనుగుణ్యంగా దానిని సవరించుకోవాలని రివిజనిస్టు శక్తులు దాడికి దిగాయి. ఈ దాడుల మధ్య పెట్టుబడిదారీ విధానంతో సంబంధంలేని ప్రత్యేక దశగా కాకుండా, అందులోని అత్యున్నత దశగా సామ్రాజ్యవాదం గూర్చి లెనిన్ సూత్రీకరించాడు.

లెనిన్‌కు ముందు సామ్రాజ్యవాద గుణగణాలను అత్యద్భుతంగా విశ్లేషించిన ఆర్థిక, రాజకీయ పండితులున్నారు. కానీ దానిని నిర్మూలించే పరిష్కార మార్గాన్ని చూపించలేకపోయారు. ప్రకృతి నియమాల ప్రకారం గొంగళి పురుగు నుంచి సీతాకోక చిలుక పుడుతుంది. గొంగళిపురుగు మీద సాగించిన తరహా పోరాటాన్ని సీతాకోక చిలుక మీద సాగించడం సాధ్యం కాదు. అంతవరకూ నేల మీద ప్రాకే గొంగళి పురుగు నుంచి గాలిలో ఎగిరే సీతాకోకచిలుకపైకి యుద్ధరంగాన్ని మార్చాల్సివచ్చింది. ఒకవైపు నిన్నటి గొంగళిపురుగు అదృశ్యమై పోయిందన్న వాదనలను లెనిన్ చిత్తు చేశాడు. మరోవైపు ఈనాటి సీతాకోక చిలుక నూతన జీవజాతిగా ఆవిర్భవించిందన్న వాదనలను చిత్తు చేశాడు. గొంగళి పురుగు (పెట్టుబడిదారీ వ్యవస్థ) తాను పుట్టిన నేలకే పరిమితమై (యూరప్‌కే పరిమితమని అర్థం) ప్రాకుతుంది. సీతాకోక చిలుక (సామ్రాజ్యవాదం) రెక్కలతో తన నేలను విడిచి ఇతర ప్రాంతాలలోకి (వలస, అర్ధవలస దేశాలని అర్థం) ఎగురుతుంది. ఈ కారణంగా రెండింటిపై పోరాట రూపాలూ, యుద్ధ క్షేత్రాలూ ఒకటిగా వుండవు. ఇదే వాస్తవాన్ని సిద్ధాంతపరంగా ఈ గ్రంథం ద్వారా లెనిన్ నిరూపించాడు.

నిజానికి సామ్రాజ్యవాదం ఒక కొత్త సామాజిక వ్యవస్థ కాదు. అది పెట్టుబడిదారీ వ్యవస్థలో అంతర్భాగం మాత్రమే. తన గ్రంథానికి శీర్షిక ఎంచుకోవడంలోనే లెనిన్ తన ఉద్దేశ్యాన్ని స్పష్టం చేశాడు. పాత ఉత్పత్తి సంబంధాలలో మౌలిక మార్పు జరిగిన ఫలితంగా ఏర్పడింది కాదు. పైగా పెట్టుబడిదారీ వ్యవస్థ అంతరంగిక వైరుధ్యాలను సామ్రాజ్యవాద దశ రూపుమాపలేదు. మరింత తీవ్రతరం చేసింది.

'సామ్రాజ్యవాదానికి అత్యంత సంక్షిప్త నిర్వచనం ఇవ్వాలంటే, దాన్ని పెట్టుబడిదారీ వ్యవస్థ గుత్త దశగా చెప్పాలని' లెనిన్ నిర్వచించాడు. 'సరిగ్గా స్వేచ్ఛా పోటీ అను నేల నుండి పుట్టి పెరిగే గుత్తాధిపత్యమది. పెట్టుబడిదారీ వ్యవస్థ నుండి మరింత ఉన్నత సాంఘిక ఆర్థిక వ్యవస్థకు జరిగే పరివర్తనే సామ్రాజ్యవాదం' అని వ్యాఖ్యానించాడు. ఇందులో రెండు వాస్తవాలున్నాయి. 1) స్వేచ్ఛా పోటీకీ, దానికి వ్యతిరేకమైన గుత్తాధిపత్యానికీ ఒకే నేల జన్మనిచ్చింది. 2) స్వేచ్ఛా పోటీ కంటె అందులోని 'స్వేచ్ఛ'ను సైతం కోల్పోయిన గుత్తదశ (అంటే సామ్రాజ్యవాదం) సోషలిజానికి (ఉన్నత సాంఘిక వ్యవస్థ) మరింత దగ్గరగా వుందన్నది. అందుకే ఆయన 'సామ్రాజ్యవాదం అంటే మరణోన్ముఖ పెట్టుబడిదారీ వ్యవస్థే, సోషలిజానికి పరివర్తన చెందుతున్న పెట్టుబడిదారీ వ్యవస్థ' అని 1916 అక్టోబర్‌లో రాసిన మరో వ్యాసం 'సామ్రాజ్యవాదమూ, సోషలిజంలో చీలిక'లో పేర్కొన్నాడు. ఆయన 'సామ్రాజ్యవాదానికి విలక్షణ గుణం పారిశ్రామిక పెట్టుబడి ఆధిపత్యం వహించడం కాదు, ద్రవ్య పెట్టుబడి (ఫైనాన్స్ పెట్టుబడి) ఆధిపత్యమే, అది కేవలం వ్యవసాయిక దేశాలపై కాకుండా అన్నిరకాల దేశాలనూ స్వాధీనపరచుకునేందుకు పూనుకుంటుంది' అని కూడా యిదే వ్యాసంలో పేర్కొన్నాడు.

పెట్టుబడిదారీవ్యవస్థ సామ్రాజ్యవాద దశకు పరివర్తన చెందడానికి లెనిన్, ఐదు లక్షణాలను నిర్వచించాడు. 1) ఉత్పత్తి సాంద్రీకరణ, పెట్టుబడి కేంద్రీకరణలు ఆర్థిక జీవితంలో నిర్ణయాత్మక పాత్రను పోషించే గుత్త సంస్థలను సృష్టిస్తాయి 2) బ్యాంకింగ్ పెట్టుబడి, పారిశ్రామిక పెట్టుబడి విలీనం చెంది ద్రవ్య పెట్టుబడిగా రూపాంతరం చెందుతుంది. 3) అమ్మకపు సరుకుల ఎగుమతి స్థానంలో పెట్టుబడి ఎగుమతి చోటు చేసుకుంటుంది. 4) ప్రపంచాన్ని తమ మధ్య విభజించుకునే అంతర్జాతీయ గుత్త పెట్టబడిదారీ ట్రస్టులు ఏర్పడతాయి. 5) పెద్ద రాజ్యాల మధ్య ప్రపంచమంతా భౌగోళికంగా పంపకం పూర్తి అవుతుంది. మార్క్సు కాలంలో పెట్టుబడిదారీ వ్యవస్థ యీ లక్షణాలను సంతరించుకోలేదు. అందుకే మార్క్సు, ఎంగెల్స్‌లు తమ కాలంలో స్వేచ్ఛా పోటీపై ఆధారపడ్డ పెట్టుబడిదారీ వ్యవస్థనే విశ్లేషణ చేశారు. సామ్రాజ్యవాద దశను వూహించలేకపోయారు. ఇదే విషయాన్ని 'సామ్రాజ్యవాదమూ, సోషలిజంలో చీలిక' అన్న వ్యాసంలో లెనిన్ రాశాడు.

'మార్క్సు, ఎంగెల్స్‌లు ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ సామ్రాజ్యవాద యుగాన్ని చూడకుండానే మరణించారు. అది 1898-1900కు ముందు ప్రారంభం కాలేదు. కాని ఇంగ్లాండు ఒక ప్రత్యేక లక్షణం ఏమిటంటే, 19వ శతాబ్దం మధ్యలో కూడా దానికి అప్పటికే సామ్రాజ్యవాదపు రెండు విలక్షణ గుణాలున్నాయి. 1) విస్తారమైన వలసలు 2) గుత్త లాభాలు (ప్రపంచ మార్కెట్లో దాని గుత్త స్థానం వల్ల). ఈ రెండు విషయాలలోనూ ఆనాటి ఇంగ్లాండు పెట్టుబడిదారీ దేశాలలో ఒక మినహాయింపుగా ఉంది. మార్క్సు, ఎంగెల్స్‌లు యీ మినహాయింపును పరిశీలించారు.'

పాత పెట్టుబడిదార్లు తమ సరుకులను వలసలలో అమ్ముకునే వారు. అప్పటికింకా సరుకులకు బదులు పెట్టుబడిని వలసలలోకి ఎగుమతి చేసే సామ్రాజ్యవాద దశలోకి చేరలేదు. అందువల్ల 'అదనపు విలువ'ను సృష్టించే పారిశ్రామిక ఉత్పత్తి వ్యవస్థ అప్పటికింకా పెట్టుబడిదారీ దేశాలలోనే కేంద్రీకృతమై ఉంది. సహజంగానే అదనపు విలువ కొల్లగొట్టబడే కీలక కార్మికవర్గం పెట్టుబడిదారీ దేశాలలో ప్రధాన స్థానంలో ఉన్న కాలమది. కనుక ప్రధాన వర్గ పోరాటాల క్షేత్రాలుగానే అవి ఆనాటికింకా కొనసాగుతున్నాయి. కానీ సరుకుల ఎగుమతికి బదులు పెట్టుబడి ఎగుమతి చోటుచేసుకోవడంతో పరిస్థితిలో గుణాత్మక మార్పు వచ్చింది. యూరప్ దేశాల నుంచి ఎగుమతి అయ్యే పెట్టుబడిలో అంతకు ముందు కాలపు యూరప్ కార్మికవర్గం నుంచి కొల్లగొట్టిన రక్తమాంసాలుంటాయి. కానీ అది వెనకబడ్డ దేశాలకు ఎగుమతి అయ్యాక వలస దేశాల కార్మికుల శ్రమశక్తిని చౌకగా కొల్లగొడుతుంది (ముడి సరుకులను కూడా కారుచౌకగానే కొల్లగొడుతుంది). ఆ తర్వాత పునరుత్పత్తి క్రమంలో సృష్టించబడే అధిక లాభాలన్నీ వలస దేశ ప్రజల లూటీ సంపద మాత్రమే. దీని వల్ల 'అదనపు విలువ' ను సృష్టించే ప్రధాన కార్యక్షేత్రం పెట్టుబడిదారీ దేశాల నుంచి వెనకబడ్డ దేశాలకు మారుతుంది. దీని ప్రకారం జాతుల విమోచనోద్యమాలకూ, వర్గ పోరాటాలకూ ప్రధాన కేంద్రంగా వలస దేశాలు మారుతాయి. అందుకను గుణంగానే సామ్రాజ్యవాద దశకు

చేరిన తర్వాత పెట్టుబడిదారీ దేశాల కార్మికవర్గం సహజంగానే మొద్దుబారుతుంది. సోషలిజాన్ని సాధించడంలో దాని కర్తవ్య దీక్ష సడలుతుంది అని లెనిన్ పేర్కొన్నాడు. అందుకు వలసల నుంచి వచ్చే అధిక లాభాల నుంచి చిన్న భాగంతో తమ స్వంత దేశాల కార్మికవర్గానికి లంచాలిచ్చి మొద్దుబారుస్తుందన్నాడు. ఇంగ్లాండు కార్మికవర్గం అలాంటి లంచాలకు మరిగిందని మార్క్స్, ఎంగెల్స్‌లు తమ కాలంలోనే గుర్తించారని లెనిన్ చెప్పడంలో అంతర్యమిదే.

సరుకుల ఉత్పత్తి ప్రక్రియ ద్వారా 'అదనపు విలువ' పెట్టుబడిదార్లకు లభిస్తుందని తన 'పెట్టుబడి' గ్రంథం ద్వారా మార్క్స్ నిరూపించాడు. ఆ 'అదనపు విలువ' నుంచి ఒక భాగం వర్తక లాభాలు (వాణిజ్య లాభాలు), వడ్డీ లాభం (రుణ పెట్టుబడి), భూమి కౌలు (గ్రౌండ్ రెంట్) వంటి ఇతర రూపాలలోకి మళ్లుతుంది. తమ స్వంత దేశపు కార్మికవర్గంతో ఉత్పత్తి చేయించిన సరుకును బ్రిటన్ ఒకవేళ ఇండియా వంటి వలస దేశాలకు ఎగుమతి చేసి వర్తకం చేసిందనుకుందాం. 'వర్తక లాభాలు' బ్రిటన్‌కు చేకూరుతాయి. 'వడ్డీ లాభాలు' కూడా లభిస్తాయి. కానీ భారతదేశ కార్మికుల నుంచి అదనపు విలువ సమకూరదు. ఒక చెట్టుకు 'మొదలు' (కాండం) వంటి అదనపు లాభాలు తమ స్వంత దేశ కార్మికవర్గ రక్తమాంసాల నుంచి లభిస్తే, దాని కొమ్మలు, రెమ్మలు వంటి వర్తక లాభాలు లేదా వడ్డీ లాభాలు వలస దేశాల నుంచి లభిస్తాయి. ఆ కాలంలో తమ స్వంత దేశ కార్మికుల నుంచి కొల్లగొట్టిన సొమ్మును తిరిగి వారి సంక్షేమానికే పెట్టుబడిదారీ దేశాల వ్యవస్థలు వెచ్చించడం జరగదు. కానీ సరుకుల ఎగుమతి స్థానంలో పెట్టుబడి ఎగుమతి కొత్తగా ఉనికిలోకి రావడంతో ఇండియా వంటి వలస దేశాలలోనే ఫ్యాక్టరీల స్థాపన జరుగుతుంది. వలస దేశాల కార్మికుల రక్తమాంసాల నుంచి ప్రాథమిక అదనపు విలువ వాటికి లభిస్తుంది. ('మేకిన్ ఇండియా' అందులో భాగమే) అందులో ఒక భాగాన్ని స్వంత దేశాల కార్మికవర్గాన్ని అవినీతిమయం లేదా కలుషితం చేయడానికి వాళ్లు వుపయోగిస్తారని లెనిన్ చెప్పాడు.

'సామ్రాజ్యవాదమూ, సోషలిజంలో చీలిక' వ్యాసంలో లెనిన్ 'సామ్రాజ్యవాద దేశాల కార్మికవర్గంలో అధిక సౌకర్యాలు గల పై పొర 'అనాగరిక' జాతులలోని కోటాను కోట్ల ప్రజల మీద పాక్షికంగా బతుకుతున్నద'ని పేర్కొన్నారు. అందులో ఆయన 'వస్తుగతంగా అవకాశవాదులు ఎవరంటే, పెటీ బూర్జువా వర్గంలో ఒక భాగమూ, సామ్రాజ్యవాదుల అధిక లాభాల నుండి యిచ్చే లంచాలకు లోబడి, పెట్టుబడిదారీ వ్యవస్థ కావలి కుక్కలుగానూ, కార్మికోద్యమంలో వేరు పురుగులుగానూ మారిన కార్మికవర్గంలోని కొన్ని పొరలే' అని పేర్కొన్నాడు.

మార్క్స్, ఎంగెల్స్‌లు (ముఖ్యంగా ఎంగెల్స్) వివిధ సందర్భాలలో ఇంగ్లీషు కార్మికోద్యమంలో, కార్మికవర్గంలో కూడా వ్యాపిస్తున్న తప్పుడు ధోరణుల గూర్చి హెచ్చరికలు చేశారు. ఇంగ్లీషు కార్మికోద్యమం గూర్చి వారు చేసిన హెచ్చరికలను లెనిన్ పై సిద్ధాంత వ్యాసంలో నిర్దిష్టంగా పేర్కొన్నాడు. ఆ లేఖ నుంచి ఉల్లేఖనలను కూడా లెనిన్ ఉదహరించాడు. ఒక ఉల్లేఖనలో 'ఇంగ్లాండులో కార్మికవర్గ పార్టీ అనేది లేదు' అని నిర్ద్వంద్వంగా ఎంగెల్స్ ప్రకటించాడు. ఇంగ్లీషు ట్రేడ్ యూనియన్ నాయకులను ఉద్దేశించి 'వెధవలు' అని కూడా మార్క్స్ ఒక లేఖలో ఆక్షేపించాడు. కార్మిక నాయకులనే కాకుండా ఇంగ్లీషు కార్మికవర్గాన్ని గూర్చి కూడా కాట్స్కీకి రాసిన లేఖలో ఎంగెల్స్ అసహ్యించుకున్నాడు. అందులో ఎంగెల్స్ 'వలస దేశాల మీద, ప్రపంచ మార్కెట్ మీద ఇంగ్లాండుకు గల గుత్తాధిపత్యం అనే విందు భోజనంలో (ఇంగ్లీషు) కార్మికులు ఆనందంగా పాలుపంచుకుంటున్నార'ని ఏవగించుకున్నాడు (ఇది మేడే పోరాటం కంటే నాలుగేళ్ల ముందు, మార్క్స్ మరణానికి సరిగ్గా ఆరు నెలల ముందు రాసింది).

మార్క్స్, ఎంగెల్స్‌లు సోషలిజాన్ని యూరప్ (ముఖ్యంగా ఇంగ్లాండు) కార్మికవర్గం తెస్తుందని మొదట ఆశించారు. ఆనాటికి అక్కడి ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి ఉత్పత్తి సంబంధాలు ఆటంకంగా మారుతున్న భౌతిక పరిస్థితి వుండేది. ఐతే రేపటి గుత్త పెట్టుబడిదారీ (సామ్రాజ్యవాద) యుగ స్వభావం బీజరూపంలో ఇంగ్లాండులో పొడసూపడాన్ని మార్క్స్, ఎంగెల్స్‌లు ఆనాటికే గుర్తించారని లెనిన్ పేర్కొన్నాడు. మార్క్స్, ఎంగెల్స్‌లు సామ్రాజ్యవాద దశను ముందుగా ఎందుకు వూహించలేకపోయారన్న కొన్ని విమర్శలకు లెనిన్ సమాధానమిది. మార్క్స్, ఎంగెల్స్‌లు జీవించి వుంటే ఈ కొత్త సామ్రాజ్యవాద దశను మరింత ముందుగా కనుగొని వుండేవాళ్లు అనే సమర్ధన భావన లెనిన్ రచనలలో గుర్తించగలం.

ఇంగ్లాండులో పారిశ్రామిక గుత్తాధిపత్యం ఎప్పుడో ధ్వంసమై పోయిందనీ, ఇక ధ్వంసం చేయడానికి ఏమీలేదన్న కాట్స్కీ వ్యాఖ్యపై లెనిన్ పై వ్యాసంలో మండిపడ్డాడు. లెనిన్ యిలా వ్యాఖ్యానించాడు. 'కాట్స్కీవాదం అబద్ధం. ఎందుకంటే, ఇంగ్లాండుకు గల గుత్తాధిపత్యాన్ని కాట్స్కీ వాదం మరుగుపరుస్తున్నది. అయినా మనం నేడు గమనిస్తున్న ఈ విషయాన్ని ఎంగెల్స్ 32 ఏళ్ల క్రితమే 1882లో స్పష్టంగా గుర్తుచేశాడు. ఇంగ్లాండు పారిశ్రామిక గుత్తాధిపత్యం ధ్వంసం చేయబడిందను కున్నా, దాని వలస గుత్తాధిపత్యం నిలిచివుంది. పైగా అది మరింత తీవ్రతరమైనది. ఎందుకంటే యిప్పటికే ప్రపంచమంతా పంపకమైపోయింది'.

అదే వ్యాసంలో ఇంగ్లీషు కార్మికవర్గంలో అవకాశవాదం పై చేయి సాధించడానికి బ్రిటిష్ వలస గుత్తాధిపత్యమే కారణమంటూ లెనిన్ ంవ్యాఖ్యానించాడు. 'ఎందుకంటే గుత్తాధిపత్యం అధి లాభాలు (అధిక లాభాలు కాదు, అధి లాభాలు, అంటే సూపర్ ప్రాఫిట్స్) అనగా ప్రపంచమంతటా సహజమూ, సాధారణమూ అయిన పెట్టుబడిదారీ లాభాలను మించిన లాభాలన్నమాట. పెట్టుబడిదార్లు తమ స్వంత కార్మికులకు లంచాలివ్వడానికీ, యితర దేశాలకు వ్యతిరేకంగా తమ దేశాల కార్మికులకూ, తమ పెట్టుబడిదార్లకూ మధ్య పొత్తుకుదర్చడానికీ ఈ అధిలాభాల నుంచి కొంత భాగాన్ని (స్వల్ప భాగాన్ని కూడా కాదు సుమా) వినియోగించగలరు. ఇంగ్లాండు పారిశ్రామిక గుత్తాధిపత్యం 19వ శాతాబ్ది చివరలోనే ధ్వంసం చేయబడింది. ఇది నిర్వివాదాంశం. కానీ ఇదెలా జరిగింది ? గుత్తాధిపత్యం అదృశ్యమైందా ?' ... 'అధిక సౌకర్యాలు గల, ద్రవ్యపరంగా సుసంపన్నమైన ఒక దేశం ఇతర అన్ని దేశాలనూ దోచుకునే స్థితి నిలిచే వుంది. అది ఇంకా తీవ్రతరమైనది'.

పై లెనిన్ వ్యాఖ్యల సారాంశాన్ని అర్థం చేసుకోవాలి. మొదట ప్రపంచ పారిశ్రామిక రంగంలో ఇంగ్లాండుకు అగ్రస్థానం వుంది. ఇంగ్లాండును ప్రపంచ వర్క్‌షాప్‌గా కూడా మొదట మార్క్స్ – ఎంగెల్స్‌లు భావించడం తెలిసిందే. అది తన పూర్వ స్థానాన్ని కోల్పోయిందని కాట్స్కీతో పాటు లెనిన్ కూడా అంగీకరిస్తున్నాడు. కానీ ఇక ధ్వంసించాల్సిన విప్లవ కర్తవ్యం ఏదీ అక్కడ మిగల లేదని కాట్స్కీ సూత్రీకరిస్తున్నాడు. కానీ తద్భిన్నంగా పారిశ్రామిక గుత్తాధిపత్య స్థానం నుంచి ద్రవ్యాధిపత్య స్థానంలోకి ఇంగ్లాండ్ మారిందని లెనిన్ సూత్రీకరిస్తున్నాడు. స్వంత దేశ కార్మికవర్గ శ్రమశక్తిని కొల్లగొట్ట గల పారిశ్రామిక గుత్తాధిపత్య స్థానం నుంచి,

ఇతర వలస, అర్ధవలస దేశాల శ్రమశక్తిని కొల్లగొట్టే స్థానంలోకి అది మారింది. తద్వారా అది అసాధారణ లాభాలతో వర్ధిల్లుతున్న ద్రవ్య రాజ్యంగా మారిందని లెనిన్ సూత్రీకరించడం గమనార్హం. (ఇప్పుడు అమెరికా స్థానం ఇలాంటిదే). ఇంగ్లాండు వ్యతిరేక విప్లవ వర్గం ఇంగ్లాండు నుంచి ప్రపంచస్థాయికి విస్తరిస్తుంది. కాట్స్కీ సూత్రీకరణలో విప్లవ కర్తవ్యాన్ని విసర్జించే లక్ష్యం ఉంది. లెనిన్ సూత్రీకరణలో విప్లవ కర్తవ్యం కొత్త ప్రాంతాలకు మరింత విస్తరించే లక్ష్యం వుంది. అందుకే కాట్స్కీ తదితరులది వర్గ సామరస్య పంథా. లెనిన్‌ది వర్గ విప్లవపంథా.

మార్క్సిజాన్ని పాత పెట్టుబడిదారీ వ్యవస్థకు పరిమితం చేసి, యాంత్రికంగా అన్వయించజూసిన కాట్స్కీయిస్టులది ఒకదారి అయింది. కొత్తగా ముందుకొచ్చిన గుత్త పెట్టుబడిదారీ వ్యవస్థకు అనుగుణంగా దాన్ని అన్వయించ జూసిన లెనిన్‌ది మరో దారి అయింది. నిన్నటి శతాబ్దపు మార్క్సిజాన్ని నేటి కొత్త శతాబ్ది పరిస్థితుల కనుగుణ్యంగా అన్వయించలేని 'పాత మార్క్సిస్టులు' చరిత్రలో రివిజనిస్టులుగా మారారు. అలా అన్వయించిన లెనిన్ సృజనాత్మక సూత్రీకరణల ఆధారంగా రూపొందిన సిద్ధాంతమే 'లెనినిజం'గా పేరొందింది.

పై గ్రంథంలో సామ్రాజ్యవాద దశను పెట్టుబడిదారీ వ్యవస్థ మరణోన్ముఖ దశగా లెనిన్ అభివర్ణించాడు. దానికి అవసాన దశగా కూడా వ్యాఖ్యానించాడు. సోషలిజానికి అది వేకువ వంటిదన్నాడు. ఈ గ్రంథం రచించాక 8 నెలలకే రష్యాలో బూర్జువా ప్రజాతంత్ర విప్లవం విజయవంతమైంది. మరో 8 నెలలకి సోషలిస్టు విప్లవం కూడా విజయవంతమైంది. ఆయన మరణోన్ముఖమైనదిగా వర్ణించిన సామ్రాజ్యవాదానికి రాజకీయ మరణశాసన పత్రం మీద నాటి రష్యన్ కార్మిక వర్గం నెత్తుటి సిరాతో చేవ్రాలు రాసింది. లెనిన్ చారిత్రిక జోస్యం వట్టిభ్రమ మాత్రమేనని రెండవ ఇంటర్నేషనల్ నాయకులు అవహేళన చేశారు. అది వాస్తవమని రష్యన్ కార్మికవర్గం నిరూపించింది. కొందరు నోరు మూశారు.మరికొందరు నోటితో పొగుడుతూ, నొసటితో వెక్కిరించారు. ఇంకొందరు తొలి సోషలిస్టు రాజ్యం మఖలో పుట్టిందనీ, పుబ్బలో అంతమవుతుందనీ గొణిగారు. కానీ అది 14 సామ్రాజ్యవాద రాజ్యాలు రాజేసిన యుద్ధాగ్ని కొలిమిలో నిలబడింది. మహామాంద్యం (1929) ఊబిలో దిగబడక పోగా నిటారుగా లేచి నిలబడింది. రెండో ప్రపంచ యుద్ధ విజేతగా నిలిచింది. ఇంగ్లాండు, జర్మనీలలో తొలుత రావాల్సిన సోషలిస్టు విప్లవం అక్రమ పద్ధతులలో, అడ్డదారిలో రష్యాలో వచ్చిందని వెక్కిరించారు. అది నేలమీద కాకుండా ఇంటి గోడ మీద మొలచిన మొక్కవంటిదని ఎగతాళి చేసారు. దాని అంతం కోసం ఘడియలు లెక్కపెట్టుకున్నారు. కాని లెనినిజం విజయానికి సోవియట్ యూనియన్ తొలి ప్రయోగశాల అయ్యింది. దాని కొనసాగింపుగా చైనా, కొరియా, వియత్నాం, కంపూచియా, లావోస్‌లు కొత్తదారి చూపించాయి.

తొలి విప్లవాలు పశ్చిమ యూరప్‌లో వస్తాయని మార్క్స్, ఎంగెల్స్‌లు ఆశించారు. ఇది స్వీయాత్మక అంచనా కాదు. ఆనాటి భౌతిక పరిస్థితుల కనుగుణ్యమైన వాస్తవిక అంచనా మాత్రమే. ఆ తర్వాత భౌతిక పరిస్థితులలో మార్పు వచ్చింది. విప్లవ ప్రాంగణం యూరప్ నుంచి ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా ఖండాలకి మారింది. పారిశ్రామిక పెట్టుబడి ఆధిపత్య స్థానంలో వుండే పరిస్థితి మారింది. ద్రవ్య పెట్టుబడి ఆధిక్యతలోకి వచ్చింది. ఉత్పత్తి ప్రక్రియ కంటే ద్రవ్యాధారిత సట్టా వ్యాపారాది లాభాలు పెరిగాయి. వలస దేశాలకు సరుకుల ఎగుమతి స్థానం నుంచి పెట్టుబడి ఎగుమతి చేసే స్థితి ఏర్పడింది. ఈ నూతన పరిస్థితులకనుగుణ్యంగా విప్లవాలు పడమర నుంచి తూర్పుకు మారాయి. లేదా ఉత్తరగోళం నుంచి దక్షిణ గోళానికి మారాయి. ఇంకా చెప్పాలంటే, సామ్రాజ్యవాద దేశాల నుంచి వ్యవసాయిక దేశాలకు మారాయి. అందుకు ప్రాతిపదికను కల్పించిన సిద్ధాంతాన్ని లెనిన్ యీ గ్రంథం ద్వారా ప్రపంచ శ్రామిక వర్గానికి అందించాడు.

యూరప్ నేల మీద పుట్టి, క్రమంగా విషవృక్షంగా రూపొందిన పెట్టుబడిదారీ వ్యవస్థను కూల్చివేసే నిర్ణయాత్మక బాధ్యత యూరప్ కార్మికవర్గం మీదే వుంటుంది. ఆనాడు వెనకబడ్డ దేశాల పీడిత ప్రజల అండదండలు యూరప్ కార్మికవర్గానికి సహాయక పాత్ర మాత్రమే. యూరప్ కార్మికవర్గం ఆ విషవృక్షాన్ని నరకడానికి గొడ్డళ్లు ధరిస్తే, వాటి తయారీలో కొలిమి, బొగ్గు, సానరాయి వంటి సాధనాలను బయటి దేశాల పీడిత ప్రజల నుంచి స్వీకరించవచ్చు. కాని సామ్రాజ్యవాద దశకు చేరాక సదరు విషవృక్షం తన ఊడలను యూరప్ నుంచి వెనకబడ్డ దేశాలన్నింటికీ విస్తరించుకోగలిగింది.

గతంలో వలస, అర్ధవలస దేశాల నుంచి గడించిన వర్తక లేదా వడ్డీ లాభాలు యూరప్‌లోని వృక్షాలకు ఎరువుగా మాత్రమే ఉపయోగ పడ్డాయి. కాని సామ్రాజ్యవాద దశలో వలస అర్ధవలస దేశాల నుంచి కొల్లగొట్టిన 'అదనపు విలువ' అక్కడి నేలలో పాతుకుపోయిన ఊడల ద్వారా యూరప్‌కు తరల సాగింది (మొదటిది కండరాలకు ఇంజక్షన్ వంటిది, రెండవది నరాల ఇంజక్షన్ వంటిది). దీనితో యూరప్ నేల మీద ఎదిగిన విషవృక్షానికి అవసరమైన సేంద్రియజలాలను యూరప్ నేల కంటే, వెనకబడ్డ దేశాల నేల ఎక్కువ మొత్తంలో సరఫరా చేసే పరిస్థితి ఏర్పడింది. పైగా వెనకబడ్డ ప్రపంచ ప్రజల నుంచి పిండుకునే అత్యధిక అదనపు లాభాల నుంచి ఒక భాగాన్ని యూరప్ కార్మికవర్గానికి విందు కోసం వెచ్చించే కొత్త పరిస్థితి వచ్చింది. ఫలితంగా యూరప్ కార్మికవర్గం మొద్దుబారింది. దీనితో విషవృక్షాన్ని నరకడానికి గొడ్డళ్లు ధరించే విప్లవకర్తవ్యం యూరప్ కార్మికవర్గం నుంచి వెనకబడ్డ దేశాల కార్మిక, రైతాంగ వర్గాలకు మారింది. పైగా ఊడల మర్రి చెట్టు 'మొదలు' ను నరకాలంటే దాని చుట్టూ దట్టంగా విస్తరించి అలుముకున్న అనేక ఊడలను ముందుగా నరకాల్సి ఉంది.

వందేళ్ల క్రితం నాటి నూతన ప్రాపంచిక పరిస్థితుల కనుగుణంగా మార్క్సిజాన్ని లెనిన్ అన్వయించిన ఫలితమే 'లెనినిజం'. సోషలిస్టు విప్లవాలకు కాలదోషం పట్టిందన్న ఆనాటి యాంత్రిక మార్క్సిస్టుల వక్రభాష్యాలకు లెనిన్ చెల్లుచీటీ పలికాడు. సోషలిస్టు విప్లవాలకు తాత్కాలికంగా కొంత విరామం అవసరమైనది. అట్టి విరామ కాలంలో జనతా ప్రజాతంత్ర విప్లవాలు లేదా జాతీయ విమోచనా విప్లవాలు వెనకబడ్డ దేశాలలో ముందుకొస్తాయని లెనిన్ సూత్రీకరించాడు. అనివార్యంగా చారిత్రికావశ్యకతగా అవి సోషలిస్టు విప్లవాలకు మెట్లుగా సహకరిస్తాయని కూడా లెనిన్ సూత్రీకరించాడు. సోషలిస్టు విప్లవాలకు దొరికిన విరామాన్ని వర్గ పోరాటాల విసర్జనకి 'యాంత్రికవాద మార్క్సిస్టులు' ఉపయోగించ చూసారు. కానీ అలాంటి విప్లవ విరామం లేకుండా విప్లవ పోరాటాల కార్యక్షేత్రాన్ని సృజనాత్మక అవగాహనతో లెనిన్ వెనక బడ్డ దేశాలకు మార్చగలిగాడు. అదే చరిత్రలో 'లెనినిజం'.

సామ్రాజ్యవాద యుగం గూర్చి ఇటీవల రకరకాల వాదనలు ముందుకొస్తున్నాయి. అంతిమ ఘడియలకు చేరిందని లెనిన్ జోస్యం

చెప్పిన సామ్రాజ్యవాదం మరో వందేళ్లు తన జీవితకాలాన్ని పెంచుకో గలిగింది. సోవియట్ రష్యా విప్లవం ద్వారా మరణ శయ్యకు చేరుతుందన్న లెనిన్ జోస్యం ఆనాడు ఆచరణాత్మక వాస్తవంగా మారింది. అయినా ఆ తర్వాత నూరేళ్లు అది ఎలా జీవించిందన్న ఒక చర్చ నేడు కొనసాగు తున్నది. ముఖ్యంగా సోవియట్ యూనియన్ పతనం తర్వాత పెట్టుబడిదారీ వ్యవస్థకు మరణమే లేదంటూ సామ్రాజ్యవాద ప్రచార సాధనాలు విస్తృత ప్రచారం సాగించాయి. సోషలిజానికి కాలం చెల్లిందని కూడా అవి ప్రచారం చేపట్టాయి . ఈ వాదనలేవీ చరిత్రలో నిలబడేవి కావు. వర్తమాన చరిత్ర గమనంకూడా నిరూపిస్తున్న సత్యం ఇదే. ఇలాంటి తప్పొప్పులకు సమీక్షించుకోవాల్సింది అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ, నిర్మాణ వైఫల్యాలను తప్ప లెనినిజాన్ని కాదు.

కేవలం లెనిన్ గ్రంథ రచనకి కారణమైన ఆనాటి చారిత్రిక రాజకీయ పరిస్థితులను గ్రంథ శతవార్షికోత్సవం సందర్భంలో సృజించే ఉద్దేశ్యంతో రాసిన రాజకీయ వ్యాసమిది. ఈ వందేళ్ల పరిణామాలను ఆనాటి గ్రంథం వెలుగులో అన్వయించి ఇంతకంటే పెద్దవ్యాసాన్ని రాయగలిగే అవకాశం ఉంది. ఆనాటి యూరప్ ఆధిపత్యం తదనంతర కాలంలో రెండో స్థానంలోకి వెళ్లింది. అమెరికా ముందుకొచ్చింది. ఆనాడు బ్రిటన్ గూర్చి లెనిన్ చెప్పిన స్థితి నేడు అమెరికాకి వర్తిస్తుంది. అనాడు లెనిన్ చేసిన యూరప్ ప్రస్తావనను నేడు అమెరికా, యూరప్‌లుగా మార్చుకోవాల్సి రావచ్చు. ఆనాడు సామ్రాజ్యవాద అధిక లాభాలకు సాంకేతిక, విజ్ఞాన శాస్త్రాభివృద్ధి ఉపయోగపడిందని లెనిన్ పేర్కొన్నాడు. దాని వెలుగులో ఈ శతాబ్దంలో అభివృద్ధి చెందిన శాస్త్ర, సాంకేతితలకు అన్వయించు కోవాల్సి ఉంది. సట్టా వ్యాపారం పెరుగుదలతో బ్రిటన్ తదితర యూరప్ దేశాలలో ఎలాంటి శ్రమ చేయని ఒక సోమరిపోతు వర్గం పెరుగుతున్నదని లెనిన్ వ్యాఖ్యానించాడు. అదికూడా నేడు అనేక రెట్లు పెరిగింది. పెట్టుబడి ఎగుమతితో వెనుకబడ్డ దేశాల ఆర్థిక వ్యవస్థను కూడా తదనుగుణ్యంగా మారుస్తుందన్న లెనిన్ వ్యాఖ్య కూడా నేటి పరిస్థితులకు అన్వయించి విశ్లేషించాల్సి వుంది. ద్రవ్య పెట్టుబడి స్వతంత్ర దేశాలను సైతం మింగి వేస్తుందని అన్నాడు. పెట్టుబడిదారీ దేశాలను సైతం తన అదుపులోకి తెచ్చుకుంటుందని చెప్పాడు. అందుకు పోర్చుగల్‌ని ఉదాహరించాడు (నేడు గ్రీసుని పోల్చుకోవచ్చు). పాత వలస యుగంలో పెట్టుబడి దేశాలనుంచి ఉద్యోగులు, అధికారులు, ఇతర సిబ్బంది వెనక బడ్డ దేశాలకు తరలిపోతారనీ, సామ్రాజ్యవాద యుగంలో తద్భిన్నంగా వెనకబడ్డ దేశాల నుంచి అభివృద్ధి చెందిన దేశాల నుంచి శ్రామిక శక్తి అధిక సంఖ్యలో తరలుతుందని లెనిన్ పేర్కొన్నాడు. ఇది కూడా నేడు అన్వయించుకోవాల్సి వుంది.

ఈ వ్యాసం పైన పేర్కొన్న వివిధ సమకాలీన చర్చనీయాంశాలలోకి వెళ్లే ఉద్దేశ్యంతో రాసిందికాదు. కేవలం వందేళ్ల క్రితం లెనిన్ యీ గ్రంథ రచనకి దారి తీసిన పరిస్థితులను గుర్తు చేసుకొని, అది చరిత్రలో 'లెనినిజం' ఆవిష్కరణకి కారణమైన పరిస్థితిని వివరించడం యీ వ్యాస లక్ష్యం. అంతవరకే ఈ వ్యాసాన్ని పరిమితం చేస్తున్నాను. మార్క్సిజాన్ని నూతన శకంలో లెనినిజంగా అభివృద్ధి చేసిన లెనిన్ గ్రంథ రచనకు నూరేళ్లు నిండింది. దాన్ని స్మరించుకోవడంతో పాటు అధ్యయనం చేద్దాం. దాన్ని రేపటి విప్లవాలకు కరదీపికగా, రాజకీయాస్త్రంగా, సిద్ధాంత శస్త్రంగా మలుచుకుందాం.

*(రచయిత ఐ.ఎఫ్.టి.యు. జాతీయ కార్యదర్శి)*

వీ

---

*(...4వ పేజీ తరువాయి)*

*అవసరాన్ని గుర్తించడం ఆవశ్యకమే. ఇదిలా ఉండగా, ఒక ప్రత్యామ్నాయ ప్రజారాజ్య నిర్మాణం కోసం జరుగుతున్న విప్లవ వర్గ పోరాటాన్ని గుర్తించక ప్రభుత్వ ప్రచారాలకు బలై, చనిపోయిన రక్షణ బలగాన్ని కులాల వారీగా లెక్కలు తీస్తు అమరులుగా కీర్తిస్తూ, ప్రజా పోరాట శక్తుల్ని విధ్వంసకారులుగా విమర్శించే ధోరణి బలపడుతుంది. అంబేద్కరిస్టులుగా ప్రకటించుకునే శ్రేణుల్లోని ఈ ధోరణికి భీమా కోరేగావ్ యుద్ధ స్థూప కీర్తిగానానికి సంబంధం ఉందనే చెప్పాలి. ఈ ధోరణిని సరిదిద్దడానికి, కేవలం కుల పోరాటాల పరిమితుల్ని అర్థం చేయించడానికి ప్రజాస్వామిక, విప్లవ శక్తులు మరింత జాగరూకత వహించాల్సిన అవసరం ఉంది.*

**– ఆర్. కస్తూరి**

*(ఈమెయిల్‌లో వచ్చిన ఉత్తరం)*

**'కో**రేగావ్ సమరం – కొన్ని సామాజిక కోణాలు' శీర్షికతో 'వీక్షణం' ఏప్రిల్ 2016 సంచికలోని వ్యాసంపై స్పందన ఇది. ఆ వ్యాసంపై ఎం. హరిభూషణ్ రాసిన లేఖ (మే 2016 సంచిక) లో... 'ఎం. కృష్ణ ఆదిత్య వ్యాసం ఏమి చెప్పదలచుకున్నదో అర్థం కాలేదు' అని వ్యాఖ్యానించారు. 'ఆయన ఏమిచెప్పదలచుకున్నారో తెలియకపోయినా' ... 'ఆయన రాసిన చివరిమాటలు బాగున్నాయి ... ఈమాటలు ఆ మూడు పేజీలకు ముందు ఆయనకు గుర్తు వచ్చి ఉంటే బాగుండును' అని కాస్త వ్యంగ్యంగా అన్నారు.

*ఈ వ్యాసాన్ని మొదటిసారి నేను పైపైన గబగబా చదివినప్పుడు 'బాగానే ఉందిలే' అన్పించింది. కానీ ఈ వ్యాసాన్నీ, లేఖనూ కూడా చదివిన ప్రముఖ సామాజిక శాస్త్రవేత్త అయిన ఒక మిత్రుడు ఫోన్ చేసి, ఆ వ్యాసాన్ని చదివావా అంటూ, కొన్ని చిరువ్యాఖ్యలు చేసి, మరోసారి చదువు అన్నారు. (ఆయన పేరు అప్రస్తుతం). 'ఏమి చెప్పదలచుకున్నారో అర్థం కాకపోతే, మరోసారి, కాకపోతే రెండుమూడుసార్లు చదివి అర్థం చేసుకోవాలి' అని నొక్కి చెప్పారాయన. ఆ మిత్రునిపై గౌరవంతోనూ, ఈ లేఖ వల్లనూ వ్యాసాన్ని మళ్లీ రెండుసార్లు చదివాను. నిజంగానే మళ్లీ లోతుగా చదివి, నెమరు వేయాల్సిన వ్యాసం ఇది అన్పించింది.*

*'కుల వ్యవస్థను పడికట్టు పద్ధతులలోనూ, పూర్వ నిశ్చితాభిప్రాయాలతోనూ విశ్లేషిస్తే, దాని సమగ్ర, నిర్దిష్ట, చలన రూపాలు సరిగ్గా బోధపడవు. సిద్ధాంతాలు సాధనాలేకానీ అవరోధాలు కారాదు. వాస్తవాల ఆధారంగా సత్యాన్వేషణ అనే పద్ధతి సరైనది, అవసరం. పాలకవర్గ సిద్ధాంతాలు, దళితవాదాలు, 'మార్క్సిజాలు' (ఇందులోనూ రకాలున్నాయి గనుక), ఇలా ఆయా సిద్ధాంతాల కళ్లద్దాలతో మాత్రమే చూస్తే సత్యాన్వేషణ సరిగ్గా సాగదు. సరైన సత్యాన్వేషణ ఈ సమస్య సమగ్ర పరిష్కారానికి తొలిమెట్టు' అని వ్యాసకర్త ముగింపులో చెప్పిన వాక్యాలు ఎంతో లోతైన భావాన్ని ప్రగాఢంగా చెప్పినట్టనిపించింది. లేఖలో ఈ వాక్యాలని ఉటంకించడం బాగుంది.*

*ఎన్నో విషయాలని బహుముఖంగా, లోతుగా ఆలోచింప చేసిన ఇంత మంచి వ్యాసాన్ని ప్రచురించినందుకు సంపాదకులకు ప్రత్యేక అభినందనలు. అంతేకాదు. మూసపద్ధతులకు భిన్నంగా ఇందులో చేసిన అసాంప్రదాయకమైన కొన్ని ప్రతిపాదనలరీత్యా చూస్తే, ఈ వ్యాస ప్రచురణ ద్వారా సంపాదకులు (విభిన్న భావాల, సంశోధనావేదికగా ఉండాలన్న) తమ లక్ష్య ప్రకటనకు కట్టుబడిన తీరును ప్రశంసించాల్సిందే.*

*మూడుపేజీల ఈ చిన్న వ్యాసంలో అనేక ప్రతిపాదనలున్నాయి. ఆలోచింప చేసే అనేక వాస్తవాలు, అంశాలు, విశ్లేషణలు పొరలుపొరలుగా ఇమిడి*

ఉన్నాయి. మళ్లీ చదివిన మీదట, కొంత పునశ్చరణలాగే అనిపించినా, వాటిని కొంత వివరంగానే విశదం చేయడం అవసరమని, పాఠకులకు ఉపయోగకర మని భావించి కొన్ని అంశాలను ఎత్తి చూపుతూ ఈ స్పందనను రాస్తున్నాను.

*1)* కుల వ్యవస్థ గురించి ఆయా వర్గాల్లో వారివారి నిశ్చితాభిప్రాయాలు కొన్ని వ్యాప్తిలో ఉన్నాయి. కులవ్యవస్థ చాలా సంక్లిష్టమైనది; కొందరు భావిస్తు న్నట్టు అది శిలాసదృశమైనదీ, ఘనీభవించిపోయినదీ కాదు. దానికి గల 'సమగ్ర, నిర్దిష్ట, చలన రూపాలను' మేళవించి అర్థం చేసుకోవాల్సిన అవసరాన్ని ఈ వ్యాసం అనేక చారిత్రక, సామాజిక వాస్తవాల ఆధారంగా నొక్కి చెప్పింది. ముగింపులో పైన పేర్కొన్న అర్థవంతమైన సందేశాన్ని ఇచ్చింది. 'ఓపెన్ మైండ్'తో (పునః) పరిశీలించాల్సిన అనేక అంశాలున్నాయి ఈ వ్యాసంలో.

*2)* 'ఒక కులంలో పుడితే అదే కులవృత్తి తప్పనిసరి అన్నది సామాజిక నియమమేకానీ, రాజులు రాజ్యాలు తలచుకున్నప్పుడు అన్నీ సర్దుకుంటాయి, సర్దుకున్నాయి' అని సూత్రీకరించారు. కాకతీయ, పల్నాడు, శివాజీ రాజ్యాల్లో దళితులు సైనికులుగానేకాక, సేనానులుగా కూడా పనిచేసిన వాస్తవాన్ని ఉదహరించారు. రాజ్యం తలచుకున్నప్పుడు సవర్ణ హిందువులు దళితులతోను, దళితసేనానుల నాయకత్వంలోను కలిసి ఒకేసైన్యంలో పనిచేసినతీరుని గుర్తుచేశారు; 'యుద్ధంలో సైనికులయ్యాక అంటరానితనం అసాధ్యం' అని ఎత్తిచూపారు.

*3)* బ్రిటిష్‌వారి రాకతోనే కులం విషయంలో 'లిబరల్' భావాలు ముందుకు వచ్చాయన్నది వాస్తవం కాదని, వారి వైఖరిలో సూత్రబద్ధత, నిలకడ లేవని తేల్చి చెప్పారు, సోదాహరణంగా. అంతేకాక, బ్రిటిష్ పాలకులు అవకాశవాదం తో దళిత సైనికుల రిక్రూటుమెంట్‌ని జరపడం, ఆపడం, మళ్లీ జరపడం ఎలా చేశారో ఎత్తిచూపారు. అంతేకాక బ్రిటిష్‌వారితో చేతులు కలిపిన ఫ్యూడల్స్ (వారికి చాలాసార్లు బ్రాహ్మణులు మంత్రులుగా, దివాన్‌లుగా, సలహాదారు లుగా, పురోహితులుగా ఉన్నారని గుర్తుచేసుకోవాలి), ఆ రిక్రూట్‌మెంట్‌లో సహకరించారని ఎత్తి చూపారు. శిలాసదృశమైన మనుధర్మం కన్నా, రాజ్యానికి కుటిలమైన, అవకాశవాదంతో కూడిన చాణక్యనీతి ముఖ్యమని చూపెట్టారు. ఒకవైపు దాన్ని చూడనిరాకరిస్తూనే, మరోవైపు బ్రిటిష్‌వారి అవకాశవాద 'లిబరలిజం'ని వెనకేసుకువచ్చే రూపంలో ఆధునిక, ఆధునికానంతర, అభ్యుదయ వాదుల్లో కన్పించే వలసవాద ప్రభావాన్ని పేర్కొన్నారు.

*4)* బ్రిటిష్‌వారి రాకకు ముందూ, తర్వాతా కూడా దళితులు, శూద్రులు, మహిళలు, బ్రాహ్మణ రాజులు, బ్రాహ్మణ రాణులు (ఝాన్సీ) కూడా అనేకసార్లు, అనేక ప్రాంతాల్లో సైన్యాలలో నిర్వహించిన నాయకత్వ పాత్రను పేర్కొన్నారు. రాజ్యం తలచుకొన్నప్పుడు చాతుర్వర్ణ వ్యవస్థ, మనుధర్మశాస్త్రం కూడా ఎలా సర్దుకుపోయాయో ఎత్తి చూపారు. కులీనులు, రాజులు (శివాజీ), సంపన్నులు గోహత్య, బ్రాహ్మణ హత్యలను వారి సేవకుల ద్వారా అమలు చేయించినా మనుధర్మం ఏమీ చేయలేకపోయిందని చెప్పారు. 'సామాజికరంగం, రాజకీయ రంగాల్లోని పరిస్థితులలో తేడా ఉంది, వైరుధ్యాలు కూడా ఉన్నాయి. పాలక వర్గాలు, రాజ్యం తమకు అవసరమైన మేరకు, అవసరమైనచోట్ల కులవివక్షను అదుపు చేయగలుగుతున్నాయి. ఈ పరిస్థితి నేటి రాజ్యాంగం అమల్లోకి రాకముందే ఉన్నది. రాజ్యాంగం వచ్చాకే మార్పువచ్చింది అని చెప్పే స్థితిలేదు' అని సూత్రీకరించారు. 'మనువులను కూడా రాజులే పోషించారు' అని, రాజ్యం నిర్ణాయక పాత్రను ఎత్తిచూపారు. మనుధర్మం శిలాక్షరం కాదని, రాజ్యంతో విడదీయరాని బంధంకలదని చూపించారు. 'ప్రజలు ఓట్లువేసే పశువులు గానూ, ఫిరంగులకు మేతగానూ' ఎలా ఉపయోగించబడ్డారో ఎత్తిచూపారు. (ఓట్లు, ఫిరంగులు రాకముందు ఫ్యూడల్ విధేయతలకు, యుద్ధాల్లో 'వీరోచిత మరణాల'కు ఉపయోగపడ్డారు)

*5)* 'భారత రాజకీయ, సామాజిక వైరుధ్యాల చరిత్ర' శకలాలని చూపెడుతూనే, మరోవైపు బుద్ధుడినుంచి నేటి వరకూ సంస్కర్తలు, సంస్కరణ వాదులు, రాజ్యాంగం కులవ్యవస్థను, కులరక్కసిని రద్దుచేయలేకపోయిన వాస్తవాన్ని ఎత్తిచూపారు. నేడు ఒకవైపు గ్రామీణ సమాజంలో బాహాటంగా కులవ్యవస్థ, కులదౌర్జన్యాలు వుండగా, మరోవైపు దళిత ఛాంబర్ ఆఫ్ కామర్స్ పట్ల ప్రాపకం కూడా సహజీవనం చేస్తున్నాయని, రాజ్యం రెంటినీ కాపాడుతూ, పోషిస్తున్నదని చెప్పారు.

*6)* అంబేద్కర్ బ్రిటిష్‌వారికి అనుకూలంగా వ్యవహరించారు అని చెప్పేవారు (ఉదా: అరుణ్‌శౌరి మొదలైన హిందుత్వ వాదులు) కాంగ్రెసువారు కూడా దళారీపాత్రనే నిర్వహించారన్నదిమాత్రం చెప్పని వాస్తవాన్ని; బ్రిటిష్ వ్యతిరేక అహింసాయుత పోరాటయోధుడుగా చెప్పబడే గాంధీ అదే బ్రిటిష్‌సైన్యంలోకి సైనికులను సమీకరించారన్న వాస్తవాన్ని గుర్తుచేశారు. వీర సావర్కార్ వంటి హిందూ జాతీయవాదులుకూడా బ్రిటిష్ సేనలో దళిత సైనికులు ఉండాలని బలపరిచిన వైనాన్ని ఉదహరించారు.

*7)* గాంధీ, నెహ్రూలతోపాటు పూలే, అంబేద్కర్, పెరియార్, కాన్షీరాంల పలుకుబడిగల రాజకీయశక్తులు ప్రభుత్వాలు నెరపేచోట్ల కూడా కులరక్కసి విలయతాండవం చేస్తున్నదని; ఆయా రాజకీయులుకూడా కుల రాజకీయాలు నెరపుతున్నారని; 'కమ్యూనిస్టుల విప్లవోద్యమాలు లోతుగా సాగిన ప్రాంతాల్లో, శ్రేణుల్లోనే పరిస్థితి చాలా మెరుగ్గా ఉంది' అని చెప్పారు. ఇటీవలికాలంలో 'పాలకవర్గాలు అంబేద్కర్‌ని, దళితవాదాన్ని ప్రయోగించి కమ్యూనిస్టులపై దాడిచేస్తుంటే, వీరు నీళ్లునములుతున్నారు. తాము సాధించింది ఏమిటో, చేయలేకపోయింది ఏమిటో కూడా వాస్తవికంగా పరిశీలించుకోలేక, అన్నింటికీ నేరస్తుల్లాగా తలవంచుతున్నారు. కులవ్యవస్థను విప్లవ దృష్టితో, సూత్రబద్ధంగా కాక , అవకాశవాదంతో, ఎన్నికల ఎత్తుగడగాచూసి నటనలు చేస్తున్నారు. ఎలాగైనాసరే వారికి శాసన సభల్లో సీట్లు కావాలికానీ విప్లవం అక్కర్లేదుకదా!' అని కమ్యూనిస్టు నామధేయుల్ని కూడా విమర్శించారు.

*8)* 'యుద్ధంలో సైనికులయ్యాక అంటరానితనం అసాధ్యం. అది పాలకవర్గాల సైన్యాలైనా, ప్రజాసైన్యాలైనా అంతే. అందువల్లనే విప్లవోద్యమ క్రమంలోనూ, విప్లవ యుద్ధం ద్వారానూ కులవ్యవస్థ రద్దుకై పోరాటం – మాటల్లోనే కాదు, ఆచరణలోనూ – ముందుకు సాగుతోంది. కాగా ఎన్నికల పార్టీలకు ఆ లక్ష్యంతో పని లేదు. కులాన్ని ఎలా వాడుకోవాలన్నదే వారి తాపత్రయం' – అని ఒకవైపు కులానికి – నేటి రాజకీయాలకు వున్న సంబంధాన్ని, మరోవైపు పోరాటమార్గం విశిష్టతను విశ్లేషించారు. వైరుధ్యాల మయమైన విషాద భారత చరిత్రలో 'విభజించి పాలించు' విధానాలు సుదీర్ఘంగా ఎలా కొనసాగుతున్నాయో గుర్తుచేశారు.

*9)* చారిత్రక, సమకాలీన వాస్తవాల ఆధారంగా కొన్ని సామాజిక – రాజకీయ సిద్ధాంతాలను వీక్షించిన పద్ధతి చాలా బాగుంది. 'సిద్ధాంతాలు సాధనాలేకానీ, అవరోధాలు కారాదు. వాస్తవాల ఆధారంగా సత్యాన్వేషణ అనే పద్ధతి సరైనది' అంటూ మంచి 'మెథడ్'ని అనుసరించారు.

*10)* ఆయా సిద్ధాంతాల కళ్లజోళ్లతో, పూర్వ నిశ్చితాభిప్రాయాలతో వాస్తవాలని చూడ నిరాకరిస్తున్న మేధావుల, సిద్ధాంతకారుల పిడివాదాలని, లేదా అవకాశవాదాన్ని వ్యాసకర్త ప్రస్తావించడం సబబే. అలాగే ఆయా పాలకవర్గ సిద్ధాంతాలకు సేవచేస్తున్న మీడియానూ ప్రస్తావించిందీ అందుకే.

ఈ విధంగా మూస, పిడివాదాలకు విరుగుడుగా, చారిత్రక, సామాజిక, రాజకీయ వాస్తవాలు పునాదిగా, ఆలోచింపచేసే ఎన్నో విషయాలున్న విశిష్టమైన వ్యాసం ఇది. దాన్ని మరోసారి చదివి, వివిధ అంశాలను విశ్లేషించుకోటానికి అవకాశం కల్పించిన హరిభూషణ్‌గారికి, ఫోన్‌చేసి పురికొల్పిన సామాజిక శాస్త్రవేత్త అయిన మిత్రుడికి కృతజ్ఞతలు. అందరికన్నా ఎక్కువగా ఈ వ్యాస రచయితకు, దాన్ని ప్రచురించిన సంపాదకులకు అభినందనలు.

**– ఎస్. కృష్ణమూర్తి**

(ఈమెయిల్‌లో వచ్చిన ఉత్తరం) వీ

## కామన్ స్కూల్ విద్యే పరిష్కారం

డెమోక్రటిక్ టీచర్స్ ఫెడరేషన్ (డిటిఎఫ్) కరీంనగర్ జిల్లా శాఖ 'విద్యా సంస్కరణలు–పాఠశాలల మూసివేత' అనే అంశంపై కరీంనగర్‌లో మే 31న రౌండ్ టేబుల్ సమావేశం నిర్వహించింది. సమావేశంలో వివిధ ఉపాధ్యాయ సంఘాల ప్రతినిధులు మాట్లాడుతూ ఇటీవల వెలువడిన సుప్రీం కోర్టు తీర్పుకు వ్యతిరేకంగా 10 మంది లోపు విద్యార్థులున్న 980 పాఠశాలల మూసివేతకు తెలంగాణ ప్రభుత్వం ప్రయత్నిస్తున్నట్లు తెలిపారు. విద్యారంగంలో అసమానతల తొలగింపుకు కామన్ స్కూల్ విధానమే పరిష్కారమన్నారు. రెండంచెల విధానంలో భాగంగా ఉన్నత పాఠశాలల్లోని 6,7 తరగతులను తొలగిస్తూ 3244 పాఠశాలలను స్థాయి తగ్గించబోతుందన్నారు. 100 లోపు విద్యార్థులున్న పాఠశాలలను సమీప ఉన్నత పాఠశాలల్లో విలీనం వైపు ఆలోచిస్తుందన్నారు. ఫలితంగా 13,680 ఉపాధ్యాయ పోస్టులు అదనంగా తేలి భవిష్యత్తులో టీచర్ల ఎంపిక (డిఎస్‌సి) జరపాల్సిన అవసరం లేకుండా పోయే ప్రమాదం ఉందన్నారు. 6,874 పాఠశాలల్లో తాగునీటి సౌకర్యం లేదన్నారు. 17,332 పాఠశాలల్లో మరుగుదొడ్లు లేవన్నారు. 11,334 పాఠశాలలకు ఆట స్థలం లేదన్నారు. 2,415 పాఠశాలలకు విద్యుత్ సౌకర్యం లేదని వీటిని వెంటనే రాష్ట్ర ప్రభుత్వం పరిష్కరించాలన్నారు.

## ప్రజాస్వామిక తెలంగాణ కోసం ఉద్యమించాలి

రాష్ట్రంలో ప్రస్తుతం నిరంకుశ పాలన సాగుతోందని, ప్రజలందరికీ సమాన అవకాశాలు కల్పించే ప్రజాస్వామిక తెలంగాణ కోసం మరోసారి ఉద్యమించాల్సిన అవసరం ఉందని ప్రొ. జి.ఎన్. సాయిబాబా హైదరాబాద్‌లో జూన్ 2న విలేఖరులతో మాట్లాడారు. రెండేళ్ల విజయోత్సవం పాలకులలో తప్ప ప్రజల్లో కనిపించడంలేదని అన్నారు. రాష్ట్ర సాధన కోసం పోరాడి ప్రాణ త్యాగాలు చేసిన ఉస్మానియా విద్యార్థులకు ఉత్సవాలు జరుపుకునే అవకాశం ఇవ్వని పాలన చూస్తున్నామన్నారు. మే 24న తెలంగాణ ప్రజాస్వామిక వేదిక ఏర్పాటు చేసిన బహిరంగ సభను జరగనివ్వకపోగా, నాలుగు గోడల మధ్యన జరుపుకున్న సమావేశంలోనూ మాట్లాడనివ్వకపోవడం ప్రస్తుత పాలకుల అణచివేత ధోరణికి నిదర్శనమన్నారు.

## ఎచ్‌సియు ప్రొఫెసర్‌ల సస్పెన్షన్ ఎత్తివేత

సెంట్రల్ యూనివర్సిటీలో జూన్ 6న విసి అధ్యక్షతన జరిగిన ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ సమావేశంలో అసోసియేట్ ప్రొఫెసర్ ఎ.వై. రత్నం, అసిస్టెంట్ ప్రొఫెసర్ తథాగత్ సేన్ గుప్తాలను సస్పెండ్ చేయాల్సిందిగా తీర్మానించారు. ఈ మేరకు జూన్ 13న విసి ఉత్తర్వులు జారీచేశారు. పరిశోధక విద్యార్థి రోహిత్ వేముల మరణానంతరం క్యాంపస్‌లో జరిగిన నిరసనల్లో పాల్గొని అరెస్ట్ కావడం కారణంగా చూపించారు. విసి నిర్ణయాన్ని వ్యతిరేకిస్తూ విద్యార్థులు ప్రజాస్వామిక వాదులు పెద్దఎత్తున యూనివర్సిటీ గేటు ముందు దీక్ష చేపట్టారు. సస్పెన్షన్‌పై పెద్దఎత్తున నిరసనలు వెల్లువెత్తడంతో ముగ్గురు సభ్యుల రివ్యూ కమిటీ ఇచ్చిన నివేదిక మేరకు సస్పెన్షన్‌ను ఎత్తివేస్తున్నట్టు విసి అప్పారావు జూన్ 17న ఆదేశాలు జారీచేశారు.

## ఎయిర్‌పోర్ట్ భూముల సర్వే భగ్నం

విజయనగరం జిల్లా భోగాపురం మండలం కంచేరు రెవెన్యూ పరిధిలోని బైరెడ్డి పాలెం కళ్లాల వద్ద ఎయిర్‌పోర్టు కోసం అధికారులు జూన్ 6న చేపట్టిన సర్వేను రైతులు అడ్డుకున్నారు. ఎయిర్‌పోర్టుకు ఫైనల్ నోటిఫికేషన్ 2004 ఎకరాలకు కంచెను ఏర్పాటు చేస్తున్నామని, అనుమతించిన రైతుల పొలాల్లోనే సర్వే చేస్తున్నామని రెవెన్యూ అధికారులు తెలిపారు. అయినా రైతులు అడ్డుకోవడంతో సర్వేను నిలిపివేశారు.

## కార్మికుల ఆందోళన

విజయనగరం జిల్లాలో మూతపడిన పరిశ్రమలను వెంటనే తెరిపించాలనే డిమాండ్‌తో కార్మికులు ఆందోళనలు చేపట్టారు. జూన్ 10న జిల్లాలో పలు చోట్ల జెఎసి ఆధ్వర్యాన ధర్నాలు చేపట్టారు. తొమ్మిది నెలలుగా మూసివేసిన పరిశ్రమలను వెంటనే తెరవాలని డిమాండ్ చేశారు. వీరిని అడ్డుకునేందుకు పోలీసులు ప్రయత్నించగా తీవ్ర తోపులాట జరిగింది.

## ప్రొ. కృష్ణారెడ్డి మృతి

దళిత, మార్క్సిస్టు ఉద్యమాల ఆప్తుడు, ఉస్మానియా యూనివర్సిటీ ప్రొఫెసర్ జి. కృష్ణారెడ్డి (52) హైదరాబాద్‌లోని హబ్సిగూడలో జూన్ 11న గుండెపోటుతో మృతిచెందారు. ఆయన 1964 జనవరి 24న కరీంనగర్ జిల్లా మైలారంలో జన్మించారు. 1986లో న్యూఢిల్లీ జెఎన్‌యు నుంచి ఎంఏ పొలిటికల్ సైన్స్ పట్టా పొందారు. ఉస్మానియా యూనివర్సిటీలో 2002లో పొలిటికల్ సైన్స్‌లో పిహెచ్‌డి చేశారు. పారిశుధ్య కార్మికుల పిల్లల విద్యా పరిస్థితులు, రాజకీయ రంగంలో మీడియా పాత్ర, సారా వ్యతిరేక పోరాటం వంటి అనేక సామాజికాంశాలపై పరిశోధనలు చేశారు. ఆయన ప్రస్తుతం ఐసిఎస్ఎస్ఆర్, ఎస్ఆర్‌సి డైరెక్టర్‌గా ఉన్నారు.

## మల్లన్నసాగర్‌కు వ్యతిరేకంగా నిరసనలు

మల్లన్నసాగర్ ప్రాజెక్ట్ కోసం తమ భూములను ఇవ్వమని ఏటిగడ్డ కిష్టాపూర్ గ్రామస్థులు ఏకగ్రీవంగా తీర్మానించారు. ప్రాజెక్ట్ ముంపుకు గురవుతున్న 14 గ్రామాల్లో రిలేదీక్షలు కొనసాగుతున్నాయి. ప్రజలు చేస్తున్న దీక్షలకు ప్రజాస్వామిక వాదులు, హక్కుల సంఘాలు, మేధావులు, ప్రతిపక్ష పార్టీలు వెళ్లి ముంపు గ్రామాల ప్రజలకు మద్దతు ప్రకటిస్తున్నారు. 2013 చట్టం, జిఓ 123 ఏవీ మాకు పని చూపించవని వారు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ముంపు గ్రామాల్లో నూటికి ముప్పై అయిదు శాతం మందికి భూమి లేదని తాము గ్రామంలో కూలి చేసుకొని బతుకుతున్నామని, గ్రామాలు ముంపుకు గురవుతే మేము ఎక్కడికి వెళ్లి బతుకుతాలని అంటున్నారు. వ్యవసాయ ఆధారిత వృత్తులు చేసుకొని బతికేవారు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కోవాల్సి వస్తుందంటున్నారు. రాజకీయ పార్టీలు ముంపు గ్రామల ప్రజల మధ్య చీలిక తెచ్చి ప్రాజెక్టుకు అనుకూలంగా మలుచుకోవడానికి ప్రయత్నిస్తు న్నాయని వాటిని మేము ఎదుర్కోవడానికి సిద్ధంగా ఉన్నామని అంటున్నారు.

## గూడ అంజయ్య కన్నుమూత

ప్రముఖ ప్రజాకవి, రచయిత గూడ అంజయ్య (62) అనారోగ్యంతో జూన్ 21న రంగారెడ్డి జిల్లా హయత్‌నగర్ మండలం తుర్కయాంజాల్‌లోని తన నివాసంలో మృతిచెందారు. ఆయన ఆదిలాబాద్ జిల్లా దండేపల్లి మండలం లింగాపురం గ్రామంలో 1955లో జన్మించారు. ఇరవై ఏళ్లక్రితం హైదరాబాద్‌కొచ్చి స్థిరపడ్డారు. ఆయన ఫార్మసిస్టుగా పనిచేసి 2000లో స్వచ్ఛంద పదవీ విరమణ చేశారు. 1969 తెలంగాణ తొలి దశ ఉద్యమంలో పాల్గొన్నారు. ఎమర్జెన్సీలో జైలుకు వెళ్లారు. తెలంగాణ మలిదశ ఉద్యమం లోనూ క్రియాశీలకంగా పాల్గొన్నారు. ఆయన మొదట 'ఊరిడిసి నేబోదునా' అనే పాట రాశారు. ఈ పాట ప్రజల్లో చైతన్యాన్ని మేల్కొల్పింది. అట్లాగే 'నేను రాను బిడ్డో సర్కారు దవఖానకు' అనే పాట రాశారు. తెలంగాణ మలి దశ ఉద్యమంలో 'అవ్వోడివా నువ్వు అయ్యోడివా తెలంగానోడికి తోటి పాలోనివా' అనే పాట రాసి దూంధాం కార్యక్రమాల్లో పాడి వినిపించారు.

## ముద్రగడ పద్మనాభం నిరాహార దీక్ష

కాపులను బిసిల్లో కలపాలని చేసిన తుని ఆందోళనలో అరెస్ట్ చేసిన 13 మంది నిందితులను విడుదల చేయాలనే డిమాండ్‌తో 14 రోజులుగా నిరాహార దీక్ష చేస్తున్న ముద్రగడ, ఆయన భార్య పద్మావతి జూన్ 22న దీక్షను విరమించారు. జూన్ 21 తుని కేసులో నిర్బంధంలో ఉన్న 13 మంది విడుదల కావడంతో ముద్రగడ తమ దీక్షను జూన్ 22న విరమించుకున్నారు. దీక్షా కాలంలో తమ పట్ల పోలీసులు, ప్రభుత్వం అంతార్జాతీయ ఉగ్రవాది మాదిరిగా వ్యవహరించిందని అన్నారు. కాపు జెఎసి ఆధ్వర్యంలో కాపు ఉద్యమం నిర్వహిస్తానని అన్నారు. వీ

## పుల్‌గావ్ ఆయుధాగారంలో విషాదం

మహారాష్ట్రలోని కేంద్ర ఆయుధాగారంలో మే 31న ఘోర అగ్నిప్రమాదం జరిగింది. ఈ దుర్ఘటనలో 16 మంది మృతిచెందగా 15 మంది గాయపడ్డారు. మృతిచెందిన వారిలో ఇద్దరు సైనికులు కాగా మిగిలిన వారు డిఫెన్స్ సెక్యూరిటీ కార్ప్స్ (డిఎస్‌సి). డిఫెన్స్ సెక్యూరిటీ కార్ప్స్‌లో మాజీ సైనికులు విధులు నిర్వహిస్తుంటారు. అగ్నిప్రమాదం జరిగిన కొద్దిసేపటికే అగ్నిమంటలు శరవేగంగా విస్తరించాయి. ఆయుధాలు, బాంబులు ఇతర పేలుడు పదార్థాలు ఉంచిన గోదాములు పేలిపోయాయి. దీంతో చుట్టుపక్కల ఇల్ల తలుపులు, కిటికీలు, పైకప్పులు ధ్వసమయ్యాయి. ఇది దేశంలోనే అతిపెద్ద ఆయుధాగారం. దేశవ్యాప్తంగా వివిధ కర్మాగారాల్లో తయారయ్యే ఆయుధాలను ఇక్కడికే చేరవేస్తారు. ఇక్కడి నుంచే దేశంలోని ఇతర ప్రాంతాలకు చేరవేస్తారు.

## మథుర ఘర్షణల్లో 24 మంది మృతి

ఉత్తర్‌ప్రదేశ్ మథురలోని జవహర్‌బాగ్ పార్క్‌కు చెందిన 260 ఎకరాల స్థలాన్ని జైగురుదేవ్ అనుచరులుగా ప్రచారం చేసుకొని ధర్నా పేరుతో ఆక్రమించారు. హైకోర్టు ఆదేశాల మేరకు జూన్ 2న ఆక్రమణలను తొలగించేందుకు పోలీసులు వెళ్లారు. పోలీసులు వస్తున్నారన్న సమాచారంతో ఆక్రమణదారులు సుమారు 3 వేల మంది ఆయుధాలతో చెట్లపైనుంచి పోలీసులపై కాల్పులు జరుపుతూ, ఎల్‌పిజి సిలిండర్లు పేలుస్తూ, గ్రెనేడ్లు విసిరారు. దీంతో పోలీసులు ఎదురుకాల్పులు జరిపారు. ఈ ఘటనలో ఎస్‌పి ముకుల్ ద్వివేది, మరో పోలీసు అధికారి మృతి చెందారు. పోలీసులు జరిపిన కాల్పుల్లో 22 మంది ఆక్రమణదారులు మృతిచెందినట్లు పోలీసు ఉన్నతాధికారి జావీద్ అహ్మద్ తెలిపారు.

## ఇందర్ మల్హోత్రా మృతి

ప్రముఖ పాత్రికేయుడు ఇందర్ మల్హోత్రా (86) జూన్11న ఢిల్లీలోని ఆస్పత్రిలో కన్నుమూశారు. ఆయన 1930లో జన్మించారు. ఆయన పంజాబ్ యూనివర్సిటీలో గ్రాడ్యుయేషన్ చేశాక పాత్రికేయ జీవితం యునైటెడ్ ప్రెస్ ఆఫ్ ఇండియాతో ప్రారంభించారు. ది స్టేట్స్‌మెన్ పత్రికకు 1965-81 వరకు రెసిడెంట్ ఎడిటర్‌గాను, టైమ్స్ ఆఫ్ ఇండియాకు 1978-86 వరకు రెసిడెంట్ ఎడిటర్‌గాను, గార్డియన్ పత్రికలో ఇండియన్ కరెస్పాండెంట్‌గా 1965-95 వరకు పనిచేశారు. ఆయన రచనలు ఎ పర్సనల్ అండ్ పొలిటికల్ బయోగ్రఫీ(1989), డైనస్టీస్ ఆఫ్ ఇండియా అండ్ బియెండ్ (2003), ఎ ప్రెష్ బయోగ్రఫీ ఆఫ్ ఇందిరా గాంధీ (2006). 2013లో ఆయనకు రాంనాథ్ గోయెంకా అవార్డు వచ్చింది.

## దభోల్కర్ హత్యకేసు నిందితుని అరెస్ట్

ప్రముఖ హేతువాది నరేంద్ర దభోల్కర్ హత్య కేసుతో సంబంధం ఉన్నట్లు భావిస్తున్న హిందూ జన జాగృతి సమితి సభ్యుడు వీరేంద్ర తవ్డేను సిబిఐ జూన్ 10న అరెస్ట్ చేసింది. జూన్ 11న పూణెలోని ప్రత్యేక న్యాయస్థానంలో సిబిఐ హాజరుపరిచింది. 2013లో దభోల్కర్ దారుణ హత్యకు గురికావడంతో దేశ వ్యాప్తంగా నిరసనలు వెల్లువెత్తడంతో ఆ కేసును విచారించిన బాంబే హైకోర్టు 2014లో దర్యాప్తు బాధ్యతను సిబిఐకి అప్పగించింది.

## గుల్బర్గ్ కేసు తీర్పులో న్యాయం ఎంత?

గోధ్రా అల్లర్ల తదుపరి రోజు చోటుచేసుకున్న 'గుల్బర్గ్ సొసైటీ నరమేధం' కేసు సుప్రీంకోర్టు పర్యవేక్షణలో గతేడాది సెప్టెంబర్ 22న విచారణ పూర్తయింది. ఈ కేసులో మొత్తం 66 మందిని నిందితులుగా ప్రత్యేక దర్యాప్తు బృందం(సిట్) పేర్కొంది. గుజరాత్ రాజధానిలోని గుల్బర్గ్ సొసైటీలో 69 మందిని బలిగొన్న సజీవ దహనకాండ కేసులో జూన్ 17న ప్రత్యేక కోర్టు తుది తీర్పు వెల్లడించింది. దోషులుగా 24 మందిని తేల్చింది. 11 మందికి యావజ్జీవ శిక్ష విధించింది. వీరిని మరణించేదాకా జైల్లోనే ఉంచాలంది. మరో 13 మంది దోషులలో ఒకరికి పదేళ్లు, విహెచ్‌పి నేత అతుల్‌వైద్యతో సహా 12 మందికి ఏడేళ్ల వంతున జైలుశిక్ష విధించింది. అంతకుముందు దోషులందరికీ మరణశిక్ష విధించాలన్న ప్రాసిక్యూషన్ వాదనను తిరస్కరించారు.

## పోలీసు కాల్పుల్లో ముగ్గురు నక్సల్స్ మృతి

తెలంగాణ మహారాష్ట్ర సరిహద్దుల్లో జూన్ 19న జరిగిన ఎన్‌కౌంటర్లో ముగ్గురు మావోయిస్టులు మృతిచెందారు. నక్సలైట్ల కోసం కూంబింగ్ జరుపుతున్న పోలీసులకు వెంకటాపూర్ ప్రాంతంలోని అడవుల్లో నక్సల్స్ తారసపడడంతో కాల్పులు జరిగాయన్నారు. ఈ కాల్పుల్లో మంగీదళ ఇన్‌చార్జ్ శోభన్‌తో పాటు, గడ్చిరోలి జిల్లాకు చెందిన దళ సభ్యులు ముఖేశ్, దినేశ్‌లు అక్కడికక్కడే మృతిచెందారని పోలీసులు చెబుతున్నారు. ఈ ఎన్‌కౌంటర్ బూటకమని మహారాష్ట్రలోని పట్రా దేవులమర్రి గ్రామం మీదుగా కొప్పులోరి గుట్టదిగి వస్తున్న ముగ్గురు మావోయిస్టులను 300 మంది సాయుధ కమాండోలు మాటువేసి కాల్చి చంపారని పౌరహక్కుల సంఘం సేకరించిన నిజ నిర్ధారణలో తేలిందని పౌరహుక్కుల సంఘంవారు కాగజ్‌నగర్‌లో ఏర్పాటు చేసిన విలేఖరుల సమావేశంలో తెలిపారు.

## రక్షణ, ఫార్మా, విమానయాన రంగాల్లో ఎఫ్‌డిఐ

రక్షణ, ఫార్మా, విమానయాన రంగాల్లో వంద శాతం విదేశీ ప్రభుత్వం పెట్టుబడుల (ఎఫ్‌డిఐ)కు కేంద్ర ప్రభుత్వం అనుమతించింది. దేశ ఆర్థిక వ్యవస్థకు కీలకంగా భావించే ఈ రంగాలతో పాటు సింగిల్ బ్రాండ్ రిటైల్ రంగంలోకి కూడా ఎఫ్‌డిఐలను పూర్తిస్థాయిలో ఆహ్వానించాలని జూన్ 20న కేంద్ర ప్రభుత్వం నిర్ణయం తీసుకుంది. ఇప్పటి వరకూ ఈ మూడు కీలక రంగాల్లో 49 శాతంగా ఉన్న ఎఫ్‌డిఐలను ఒక్కసారిగా వంద శాతం చేయడం ద్వారా బిజెపి ప్రభుత్వం విదేశీ కంపెనీలకు తలుపులు బార్లా తెరిచింది.

## బీహార్‌లో పిడుగుల వర్షం - 57 మంది మృతి

బీహార్‌లో జూన్ 22న కురిసిన భారీ వర్షాలకు, పిడుగుపాటుకు 57 మంది ప్రాణాలు కోల్పోయారు. మరో 24 మంది గాయపడ్డారు. పట్నాలో అత్యధికంగా ఆరుగురు మరణించారని విపత్తుల నిర్వహణ శాఖ ముఖ్య కార్యదర్శి వ్యాస్‌జీ వెల్లడించారు. బక్సర్, నలంద, భోజ్‌పూర్, రోహ్‌తాస్, కైమూర్, ఔరంగాబాద్, పూర్ణియా, భాగల్పూర్, ముంగేర్, మదేపురా, ముజఫర్‌పూర్, పశ్చిమ చంపారన్ జిల్లాల్లో కుడా ప్రాణనష్టం సంభవించిందని ఆయన అన్నారు.

## పోలీస్ స్టేషన్లలో పెరుగుతున్న మృతులు

సామాన్యులు పోలీస్ స్టేషన్‌కి వెళ్లి ఫిర్యాదు చేసేందుకు వణికిపోతున్నారని జాతీయ నేర రికార్డుల బ్యూరో (ఎన్‌సిఆర్‌బి) గణాంక వివరాలు తెలుపుతున్నాయి. పోలీసుల ప్రవర్తన ఫిర్యాదుదారులకు ప్రాణసంకటంగా మారిందని స్పష్టం చేసింది. పోలీసుల 'అతి' ప్రవర్తనతో వారి కస్టడీలో ఉన్నవారు ప్రాణాలు కోల్పోతున్నారని వెల్లడించింది. దేశ వ్యాప్తంగా ప్రతి ఏటా వంద మంది వరకు పోలీస్ కస్టడీలో ప్రాణాలు కోల్పోతున్నారని ఇటీవల విడుదల చేసిన నివేదికలో ఎన్‌సిఆర్‌బి వివరించింది. 2001 నుంచి 2013 మధ్య కాలంలో దేశ వ్యాప్తంగా మొత్తం 1,275 మంది వ్యక్తులు పోలీసుల అదుపులో ఉండగా మరణించారని తెలిపింది. ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, గుజరాత్ పోలీస్ స్టేషన్లు ఈ దారుణాల్లో ముందున్నాయని తెలిపింది. జాతీయ మానవ హక్కుల నివేదిక ప్రకారం పోలీస్ కస్టడీలో మృతి చెందుతున్న వారి సంఖ్య మరింత ఎక్కువగా ఉందని తెలుస్తోంది. వీ

## మహమ్మద్ అలీ మృతి

ప్రపంచ ప్రఖ్యాత బాక్సింగ్ చాంపియన్, పీపుల్స్ చాంపియన్ మహమ్మద్ అలీ జూన్ 4న మరణించారు. ఆయన చాలా సంవత్సరాలుగా పర్కిన్సన్ వ్యాధితో బాధపడుతున్నాడు. 1942, జనవరి 17న లూయిస్‌విల్లేలోని ఓ నిరుపేద కుటుంబంలో పుట్టారు. ఆయన స్వస్థలం లూయిస్‌విల్లేలో జూన్ 10న ఆయన అంత్యక్రియలు జరిగాయి. ఆయన అసలు పేరు కాసియస్ మర్సిలస్ క్లే. 1954లో బాక్సర్‌గా అరంగేట్రం చేసిన అలీ 1960 రోమ్ ఒలింపిక్స్‌లో లైట్ హెవీ విభాగంలో స్వర్ణం గెలిచి ప్రపంచ బాక్సింగ్ రంగంలో మెరిశాడు. మొదటి అమెచ్యూర్ బాక్సింగ్ పోటీ లిస్టన్‌తో గెలిచిన తర్వాత అలీ ఇస్లాం మతంలోకి మారి తన పేరును మహమ్మద్ అలీగా మార్చుకున్నాడు. 1964లో వియత్నాంతో యుద్ధం సమయంలో అమెరికా ప్రభుత్వం అలీని సైన్యంలో చేరవలసిందిగా ఆదేశించింది. దీనిని అలీ తిరస్కరించడంతో ఆయన హెవీ వెయిట్ టైటిల్‌ని లాక్కుని బాక్సింగ్ నుంచి నిషేధించింది. 1970లో సుప్రీంకోర్టు తీర్పుతో ఆయన తిరిగి తన టైటిల్‌ను సొంతం చేసుకున్నాడు. అలీ మొత్తం 61 ఫైట్లలో 56 సార్లు విజయం సాధించాడు. ఇందులో 37 సార్లు నాకౌట్లతో గెలిచాడు. ఐదుసార్లు ఓడిపోయాడు.

## పోలెండ్‌లో నిరసనలు

పోలెండ్‌లో అధికార లా అండ్ జస్టిస్ పార్టీ అవలంబిస్తున్న ప్రజా వ్యతిరేక విధానాలు, చేపడుతున్న సంస్కరణలకు వ్యతిరేకంగా ప్రజలు తీవ్ర నిరసన తెలుపుతున్నారు. జూన్ 5న దాదాపు పది వేల మంది పోలాండ్‌లోని నగర వీధుల్లో నిరసన ర్యాలీలు నిర్వహించారు. స్వేచ్ఛ, సమానత్వపు హక్కుల పరిరక్షణను కోరుకుంటున్నామని, ప్రజాస్వామ్య విలువలు దిగజారి పోతున్నాయని అన్నారు. ఈ నిరసనలకు పోలెండ్ మాజీ అధ్యక్షులు లెచ్ వలేసా, అలెక్సాండర్ క్వస్‌నీస్కి, బ్రోనిస్లా కొమొరోస్కీ తదితరులు మద్దతు తెలిపారు.

## యుద్ధ నేరాలకు మరణ శిక్ష

బంగ్లాదేశ్ విముక్తి పోరాటం-1971లో యుద్ధనేరాలకు పాల్పడిన ఆరోపణలు ఎదుర్కొంటున్న జమాతే ఇస్లామీ పార్టీ నేత, మీడియా అధినేత మీర్ కాసి అలీకి బంగ్లాదేశ్ సుప్రీంకోర్టు మరణశిక్షను ఖరారు చేసింది. బంగ్లాదేశ్ విముక్తి పోరులో స్వాతంత్ర్యాన్ని తీవ్రంగా వ్యతిరేకించిన జమాతే పార్టీకి ఆర్థికంగా అండదండలు సమకూర్చి ఉన్నత స్థాయి పాలక మండలిలో సభ్యుడిగా ఉన్న అలీకి పలు వ్యాపారాలు, మీడియా సంస్థలు ఉన్నాయి. మూడు నెలల క్రితం ప్రత్యేక న్యాయస్థానం అలీకి మరణశిక్ష విధిస్తూ ఇచ్చిన ఉత్తర్వులను నిశితంగా పరిశీలించి సుప్రీంకోర్టు దానిని సమర్థించింది.

## అందరికీ ఆదాయం ప్రతిపాదన తిరస్కరణ

స్విట్జర్లాండ్‌లో ప్రభుత్వం అందించే సార్వత్రిక ప్రాథమిక ఆదాయ భృతి (యూనివర్సల్ బేసిక్ ఇన్‌కమ్ గ్రాంట్) ప్రతిపాదనను అక్కడి పౌరులు తిరస్కరించారు. ఈ ప్రతిపాదనపై జూన్ 5న నిర్వహించిన అభిప్రాయ సేకరణలో 78 శాతం పౌరులు ప్రభుత్వ ప్రతిపాదనకు వ్యతిరేకంగా ఓటు వేశారు. అన్‌కండీషనల్ బేసిక్ ఇన్‌కమ్ (యుబిఐ) పేరిట ఈ పథకాన్ని ప్రారంభించాలని స్విట్జర్లాండ్ ప్రభుత్వం భావించింది. ఈ పథకం అమలుకు ప్రతి సంవత్సరం 25.62 బిలియన్ డాలర్లు ఖర్చు చేయాల్సి ఉంటుందని అంచనా.

## ట్రంప్ వర్సెస్ హిల్లరీ

అమెరికా అధ్యక్ష పదవికి పోటీ ఇక ట్రంప్, హిల్లరీ మధ్య జరగడం ఖాయమైంది. డెమోక్రటిక్ పార్టీ అభ్యర్థిత్వం పొందడానికి హిల్లరీ క్లింటన్ అర్హత సాధించారు. దీంతో ప్రధాన రాజకీయ పార్టీ మొట్టమొదటి మహిళా అధ్యక్ష అభ్యర్థిగా హిల్లరీ చరిత్ర సృష్టించారు. హిల్లరీ క్లింటన్‌కు ప్రస్తుత అధ్యక్షుడు బరాక్ ఒబామా మొద్దతు తెలిపారు. ఇప్పటికే డోనాల్డ్ ట్రంప్ రిపబ్లికన్ పార్టీ తరపున అధ్యక్ష అభ్యర్థిగా ఖరారు అయ్యారు. ఈ ఏడాది నవంబర్‌లో జరిగే అమెరికా అధ్యక్ష పోటీ వీరిద్దరి మధ్యే ఖాయమైంది.

## సిరియా స్పీకర్‌గా హదియె అల్ అబ్బాస్

సిరియా పార్లమెంట్‌కు తొలిసారి ఒక మహిళ స్పీకర్‌గా ఎన్నికయ్యారు. హదియె అల్ అబ్బాస్‌ను ఏకగ్రీవంగా ఎన్నుకున్నట్లు జూన్ 7న పీపుల్స్ కౌన్సిల్ ప్రకటించింది. హదియె 1958లో దీర్ అల్ జౌర్ ప్రాంతంలో పుట్టారు. ఉత్తర సిరియాలోని అలెప్పో విశ్వవిద్యాలయం నుంచి అగ్రికల్చర్ ఇంజినీరింగ్‌లో పిఎచ్‌డి పట్టా పొంది, అల్‌పురాత్ యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా పనిచేశారు. 2003-07 వరకు పార్లమెంట్ సభ్యురాలిగా పనిచేశారు. అరబ్ బాత్ సోషలిస్ట్ పార్టీలో దశాబ్ద కాలంపాటు పాలకవర్గంలో పనిచేశారు. ప్రస్తుతం అధికార పార్టీ పార్లమెంట్ సభ్యురాలిగా ఉన్నారు.

## ఇరాక్‌లో బాంబు దాడులు

ఇరాక్ రాజధాని బాగ్దాద్‌లో జూన్ 9న రెండు చోట్ల కారు బాంబు దాడులు జరిగాయి. ఈ దాడుల్లో దాదాపు ఇరవై ఐదు మంది చనిపోయారు. డెబ్బై మందికి పైగా గాయపడ్డారు. బాగ్దాద్‌లోని అల్ జదీదా స్ట్రీట్‌లో కారు బాంబు పేలడంతో 18 మంది మృతి చెందారు. 50 మంది తీవ్రంగా గాయపడ్డారు. మరో పేలుడు తాజీ వద్ద ఉన్న ఆర్మీ చెక్‌పోస్ట్ వద్ద జరిగింది. ఈ దాడిలో ఏడుగురు చనిపోయారు. మరో ఇరవై మంది గాయపడ్డారు.

## ఫ్రాన్స్‌లో కార్మికుల సమ్మె

ఫ్రాన్స్‌లో కార్మికుల సమ్మె ఉధృతమవుతోంది. హొలాండే ప్రభుత్వం ప్రతిపాదిస్తున్న కార్మిక సంస్కరణలను వ్యతిరేకిస్తూ వివిధ రంగాలకు చెందిన కార్మికులు చేస్తున్న ఆందోళన రోజురోజుకూ పెరిగిపోతోంది. ప్రతిపాదిత కార్మిక సంస్కరణల చట్టానికి వ్యతిరేకంగా దేశంలో వివిధ రంగాలకు చెందిన కార్మికులు, విద్యార్థులతో ఏర్పడిన జనరల్ కాన్ఫెడరేషన్ ఆఫ్ లేబర్ (సిజిటి) నిరసన ప్రదర్శనలను చేపట్టింది. జూన్ 14న పారిస్ నగరంలో దాదాపు పది లక్షల మంది భారీ ప్రదర్శన నిర్వహించారు. కార్మికులను, విద్యార్థులను చెదరగొట్టేందుకు ప్రభుత్వం బాష్పవాయుగోళాలు ప్రయోగించింది. సమ్మె బాట పట్టిన కార్మిక సంఘాల నేతలపై ప్రభుత్వం బెదిరింపులకు పాల్పడుతోంది. అత్యవసర అధికారాల చట్టం కింద నిషేధాజ్ఞలు విధించింది.

## ఫ్లోరిడా నైట్‌క్లబ్బులో కాల్పులు

అమెరికాలోని ఫ్లోరిడా నగరంలో ఓ పబ్బులో ఓ వ్యక్తి విచక్షణా రహితంగా కాల్పులు జరపడంతో 49 మంది మరణించారు. యాభై మందికి పైగా గాయపడ్డారు. ఒమర్ మతీన్ అనే యువకుడు జూన్ 12న రాత్రి నైట్‌క్లబ్‌లోకి ప్రవేశించి కొంతమందిని బందీలుగా మార్చుకొని కాల్పులు జరిపాడు. పోలీసులు జరిపిన ఎదురు కాల్పుల్లో మతీన్ మరణించాడు.

## ఇయుకి స్విట్జర్లాండ్ నో

యూరోపియన్ యూనియన్ (ఇయు)లో చేరేందుకు వ్యతిరేంగా స్విట్జర్లాండ్ నిర్ణయం తీసుకుంది. గతంలో చేసిన దరఖాస్తును ఉపసంహరిస్తున్నట్లు ప్రకటించింది. ఈ మేరకు జూన్ 15న పార్లమెంట్ దిగువ సభ సభ్యులు తీసుకున్న నిర్ణయాన్ని ఎగువ సభ సభ్యులు వ్యతిరేకించారు. దీంతో 24 ఏళ్ల నుంచి కొనసాగుతున్న సందిగ్ధతకు తెరపడింది. ఇయులో చేరాలనుకునే నిర్ణయాన్ని రద్దు చేసుకుంది.

## ఇయు నుంచి బ్రిటన్ నిష్క్రమణ

యురోపియన్ యూనియన్ (ఇయు) నుంచి బ్రిటన్ నిష్క్రమించింది. ఇయులో ఉండాలా లేదా అనే దానిపై జూన్ 23న ప్రజాభిప్రాయ సేకరణ జరిగింది. ఈ పోలింగ్‌లో 76 శాతం మంది బ్రిటన్ పౌరులు పాల్గొన్నారు. ఇయు నుంచి బయటికి వచ్చేందుకు 51.9 శాతం మంది సుముఖత తెలుపుగా, 48.1 శాతం మంది వ్యతిరేకించారు. దీంతో బ్రిటన్ ఇయు కూటమి నుంచి వైదొలిగింది. ఇయులో కొనసాగేందుకు తీవ్రంగా కృషి చేసిన బ్రిటన్ ప్రధాని డేవిడ్ కామెరాన్ ఈ ఫలితాల నేపథ్యంలో తన పదవికి రాజీనామా చేశారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(మే 1 నుండి మే 31, 2016 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (1403), ఆంధ్రప్రదేశ్‌లోని 12 జిల్లాలలో (1047) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 2450)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | – | 2 | – | 14 | 11 | 3 | 2 | 1 | 2 | 2 | 1 | 2 | 2 | 2 | 26 | 30 | – | – | – | 3 | 9 |
| హైదరాబాద్ | – | – | – | 4 | 7 | 2 | – | 1 | – | 1 | 6 | 6 | – | 3 | 18 | 9 | – | – | – | 1 | 8 |
| కరీంనగర్ | – | 5 | – | 12 | 13 | 1 | 1 | 2 | 1 | 2 | 2 | 3 | 3 | 6 | 17 | 14 | – | – | – | – | 64 |
| ఖమ్మం | – | – | – | – | 6 | – | 1 | – | – | – | – | 2 | – | 5 | 25 | 16 | – | – | – | – | 140 |
| మహబూబ్‌నగర్ | 1 | 4 | 1 | 19 | 8 | 1 | 4 | – | 2 | 9 | 4 | 9 | 15 | 11 | 42 | 6 | – | – | – | – | 46 |
| మెదక్ | 1 | 14 | 2 | 10 | 14 | 9 | 14 | 11 | 12 | 13 | 14 | 15 | 17 | 9 | 39 | 21 | – | – | – | 6 | 3 |
| నల్గొండ | – | 4 | – | 5 | 4 | – | 1 | – | – | 1 | 3 | 5 | – | 7 | 34 | 11 | – | – | – | – | 78 |
| నిజామాబాద్ | – | 4 | – | 12 | 11 | 3 | 1 | – | 2 | 4 | 4 | 4 | – | 10 | 16 | 12 | – | – | – | – | 24 |
| వరంగల్ | – | 5 | – | 4 | 7 | 1 | 1 | – | – | – | 5 | 1 | – | 5 | 14 | 17 | – | – | – | – | 57 |
| రంగారెడ్డి | – | 5 | – | 6 | 5 | 2 | – | 1 | – | – | 4 | 10 | 1 | 9 | 32 | 11 | – | – | – | – | 15 |
| **తెలంగాణ** | **2** | **43** | **3** | **86** | **86** | **22** | **25** | **16** | **19** | **32** | **43** | **57** | **38** | **37** | **263** | **147** | **-** | **-** | **-** | **10** | **444***|
| అనంతపురం | – | 7 | 2 | 11 | 15 | 1 | – | – | – | – | 1 | 4 | 10 | 7 | 19 | 20 | – | – | – | – | – |
| చిత్తూరు | – | – | – | 6 | 8 | 5 | 11 | – | – | – | 7 | 11 | 18 | – | 32 | – | – | – | – | – | 3 |
| కడప | – | 1 | 1 | – | 4 | – | – | – | 1 | 3 | 2 | – | – | 1 | 4 | 1 | – | – | – | – | 2 |
| గుంటూరు | – | 3 | – | 6 | 7 | 2 | 1 | – | 2 | 4 | 1 | 5 | – | 2 | 21 | 8 | – | – | – | – | 15 |
| కృష్ణా | – | 1 | – | 4 | 2 | – | 6 | – | – | 4 | 1 | 3 | – | 2 | 21 | 9 | – | – | – | – | 14 |
| కర్నూలు | – | 2 | – | 5 | 4 | 6 | 4 | 15 | 4 | 3 | 2 | 5 | 7 | 3 | 20 | 18 | – | – | – | – | 21 |
| తూర్పు గోదావరి | – | – | – | 2 | 3 | – | 13 | – | 1 | 3 | 2 | 1 | 3 | 9 | 28 | 14 | – | – | – | – | 67 |
| ప్రకాశం | – | – | – | 6 | 6 | 3 | 2 | – | – | 3 | 3 | 1 | 1 | 3 | 31 | 11 | – | – | – | – | 3 |
| శ్రీకాకుళం | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| పశ్చిమ గోదావరి | – | 1 | – | 1 | 4 | 4 | 3 | – | 1 | 2 | – | 3 | – | 4 | 24 | 9 | – | – | – | – | 11 |
| నెల్లూరు | – | – | – | 3 | 7 | 1 | 1 | 2 | 1 | 1 | 1 | 2 | 4 | 4 | 27 | 21 | – | – | – | – | 6 |
| విజయనగరం | – | – | – | 8 | 7 | 1 | 1 | – | – | 3 | – | 3 | 1 | 3 | 15 | 17 | – | – | – | – | 29 |
| విశాఖపట్నం | 1 | – | – | 8 | 11 | – | 2 | 1 | – | 1 | – | – | 4 | 3 | 19 | 21 | – | – | – | 11 | 29 |
| **ఆంధ్రప్రదేశ్** | **1** | **15** | **3** | **60** | **78** | **23** | **44** | **18** | **10** | **27** | **20** | **38** | **48** | **41** | **261** | **149** | **-** | **-** | **-** | **11** | **200***|

*వడదెబ్బ, పిడుగుపాటు మృతులు

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

### ఆర్థిక వ్యవస్థ - సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 75 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం - ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| నిత్యజీవితంలో సోషలిజం | భూసారం శివన్న | 100 |
| విధ్వంసక అభివృద్ధి | డిఎస్‌యు | 180 |
| భారతదేశంలో ఉత్పత్తి విధానం- ఉత్పత్తి సంబంధాలు | విరసం | 20 |

### తెలంగాణ

| | | |
|---|---|---|
| తెలంగాణార్థం | ఎన్. వేణుగోపాల్ | 150 |
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 100 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| తెలంగాణ జైత్రయాత్ర | ఘంటా చక్రపాణి | 200 |
| సమగ్ర తెలంగాణ | వీక్షణం ప్రచురణ | 295 |

### శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ - పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం - సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

### కులం-మతం

| | | |
|---|---|---|
| భారతదేశంలో కుల సమస్య | అనురాధ గాంధీ | 120 |
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 30 |
| ఎస్‌సి, ఎస్‌టి నిధులు, విధిలింపు - మళ్లింపు | బొజ్జా తారకం | 40 |
| ఎస్‌సి, ఎస్‌టిలపై అత్యాచారాలు | బొజ్జా తారకం | 50 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా ఫూలే | 40 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 30 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| దళితులు - రాజ్యం | అంబేద్కర్ | 25 |
| శూద్రులు - ఆర్యులు | అంబేద్కర్ | 8 |
| ఆధునిక భారతదేశంలో అంటరానితనం | అంబేద్కర్ | 25 |
| దాస్య విముక్తి కోసం | అంబేద్కర్ | 15 |
| భారతదేశం ప్రజాస్వామ్యం | అంబేద్కర్ | 12 |
| ఆంగ్లేయపాలకులు - అంటరానివాళ్లు | అంబేద్కర్ | 20 |
| రాష్ట్రాలు - మైనారిటీలు | అంబేద్కర్ | 40 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 70 |
| నేను హిందువునెట్లయిత? | కంచె ఐలయ్య | 80 |

### సాహిత్య విమర్శ - వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| స్వేచ్ఛారావం | జి. హరగోపాల్ | 250 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| సాహిత్య వ్యాసాలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ రచనలు | చలసాని ప్రసాద్ | 100 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-2 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-3 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సామాజిక వ్యాసాలు | కె.వి.ఆర్. | 300 |
| కెవిఆర్ డిటెన్యూ డైరీ | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 170 |
| సాహిత్య సమాలోచన | కృష్ణాబాయి | 300 |
| సందిగ్ధ సందర్భం | సి.వి. సుబ్బారావు | 40 |
| సామాజికం | వి. చెంచయ్య | 30 |
| మన ప్రపంచం | దుప్పల రవికుమార్ | 75 |
| దారులేసిన అక్షరాలు | భారతీయ మహిళల రచనలు | 400 |
| కవిత్వంతో ములాఖాత్ | ఎన్. వేణుగోపాల్ | 120 |

### చరిత్ర-జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర అధ్యయానికి ఒక పరిచయం | డి.డి. కోసంబి | రు. 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 40 |
| భగవద్గీత చారిత్రక పరిణామం | డి.డి. కొశాంబి | 10 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 50 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 80 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 100 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్‌సన్ | 150 |
| 24 గంటలు | కె.జి. కన్నబిరాన్ | 200 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 70 |
| చేగువేరా | కాత్యాయని | 80 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| నూరేళ్ల కాళోజీ | వరవరరావు | 60 |
| అలిశెట్టి ప్రభాకర్ కవిత | అలిశెట్టి ప్రభాకర్ | 150 |

### తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | 100 |
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం-లెనినిజం-మావోయిజం | విరసం | 125 |
| లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణలు అన్ని | | |

### విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 30 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| ఏది నేరం?! | బి. అనూరాధ | 75 |
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్-1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్-2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| రివిజనిజం | విరసం ప్రచురణ | 75 |
| అంతర్యుద్ధంలో ఆదివాసులు | విరసం ప్రచురణ | 20 |
| ఆదర్శ జీవులు ఆమరులు | విరసం ప్రచురణ | 30 |
| మావో రచనలు - 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు - 2 | విరసం ప్రచురణ | 220 |
| సంకెళ్ల సవ్వడి | అరుణ్ ఫరేరా | 150 |
| వామపక్ష కమ్యూనిజం - ఒక బాలరిష్టం | లెనిన్ ప్రసిద్ధ రచన | 30 |

### కథ - నవల

| | | |
|---|---|---|
| దండకారణ్య కథలు(2005-2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| రేపు కథ | వెర్నన్ గొంజాల్విస్ | 20 |
| మిగిలేటోళ్లు | బాసిత్ | 50 |
| కాంత పున్నం వెన్నెల | పద్మకుమారి | 20 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 80 |
| కథలగూడు | దేవులపల్లి కృష్ణమూర్తి | 60 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి - మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| పంచతంత్రం | బొజ్జాతారకం | 100 |
| ఇస్మత్ చుగ్తాయి కథలు | ఇస్మత్ చుగ్తాయి | 100 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 80 |
| రేపటి కల | రిచర్డ్ రైట్ | 50 |
| పంచమం | చిలుకూరి దేవపుత్ర | 100 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| మరల సేద్యానికి | శివరామ కారంత్ | 150 |
| హింసపాదు | బమ్మిడి జగదీశ్వరరావు | 180 |

### డివిడి

| | |
|---|---|
| వీక్షణం (2003 - 2012) | 200 |
| సృజన (1966-1992) | 240 |
| అరుణతార (1970-2013) | 125 |
| 'ఓయు'ద్ధకాండ | 100 |

**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com







తెలంగాణ ఆత్మగౌరవ వేదిక ప్రచురణ

ఎవరి కోసం

# మల్లన్న సాగర్?

## నిజానిజాలపై తెలంగాణ ప్రజలకు నివేదిక

మెదక్ జిల్లా తొగుట, కొండపాక మండలాల్లో 14 గ్రామాలను, 7 శివారు గ్రామాలను ముంచి, వేలాది మంది ప్రజలను నిర్వాసితులను చేసి ప్రభుత్వం నిర్మించ తలపెట్టిన శ్రీ కొమరవెల్లి మల్లన్నసాగర్‌కు వ్యతిరేకంగా సాగుతున్న చర్చ, ప్రజాందోళన నేపథ్యంలో నిజానిజాలపై తెలంగాణ ప్రజలకు వివరమైన నివేదిక

వెల : రు. 20







స్వేచ్ఛా సాహితి ప్రచురణ

# తెలంగాణార్థం

## రెండేళ్ల తెలంగాణ పరిణామాలు

## ఎన్. వేణుగోపాల్

ఆర్థిక వ్యవస్థ, అభివృద్ధి పథకాలు, సంక్షేమ పథకాలు, విద్యా విధానం, పౌరహక్కులు, కార్మికులు, రైతులు, దళితులు, నిరుద్యోగం, ఉద్యోగకల్పన వంటి ఎన్నో రంగాలలో గత రెండు సంవత్సరాల తెలంగాణ పాలనా విధానాలపై వివిధ పత్రికలలో రాసిన విమర్శా వ్యాసాల సంకలనం

పేజీలు : 288

వెల : రు. 150

**ప్రతులకు :**

**వీక్షణం, మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నం. 3, హిమాయత్‌నగర్,**

**హైదరాబాద్ - 500 029. ఫోన్: 040 66843495**